# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపఁబడిన

## శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

**పదియువ భాగము**




సంపాదకుఁడు :

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

**ధనకుధరం వరదాచార్యులు**




ప్రకాశకులు :

**శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల**

శ్రీ లక్ష్మీ నారాయణ పురము

**గుంటూరు - 522 006**

[ This book is published with financial assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to publish religious books ]

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

**పదియవ భాగము**

మొదటి ముద్రణము

**వేయి ప్రతులు**

శుక్ల – మకర సంక్రాంతి
**జనవరి – 1990**

రామానుజ శకము ౯౭౩.

**మూల్యము :–**
**ముప్పదియైదు రూపాయలు**

**ముద్రణము :**
వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేటు లిమిటెడ్
బ్రాడీపేట : : గుంటూరు

# సమాలోచన సమితి

మహాకవి - సరస్వతీపుత్ర - కళాప్రపూర్ణ - పద్మశ్రీ
**డాక్టర్: పుట్టపర్తి నారాయణాచార్యులు**
కడప

*

వ్యాకరణ విద్యాప్రవీణ - భాషాప్రవీణ
**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A.**
విశాఖపట్టణము

*

భాషాప్రవీణ - విద్వాన్ - లలితకవి
శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు
*కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు*
ఉలవపాడు

*

న్యాయవిద్యాప్రవీణ
డాక్టర్ యస్. బి రఘునాథాచార్యులు, M A, Ph D.
*సంస్కృత రీడర్: శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము*
తిరుపతి

*

శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు, M A, B Ed
*లెక్చరర్. ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి*
నాగార్జున సాగర్ — విజయపురి సౌత్

*

శ్రీమాన్ శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M A.
*ఉపన్యాసకులు: శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్యకళాశాల*
పాలెమ్

*

కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి
**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**
*సాహిత్య వికాస మండలి అధ్యక్షులు*
సిద్దిపేట

డాక్టర్ : చించావట్టణం శ్రీరంగాచార్యులు, M A, Ph.D
ఆంధ్రోపన్యాసకులు : ప్రభుత్వ ఆర్ట్సు & సైన్సు కళాశాల
ఆర్మూరు
(నిజామాబాదు జిల్లా)

*

మహోపాధ్యాయ - ఉభయవేదాంతశిరోమణి
శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, B O L
సంస్కృతోపన్యాసకులు .
శ్రీ వేంకటేశ్వర వివేకవర్ధినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

కవిశార్దికకేసరి - ఉభయవేదాంతవిద్వాన్
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాధాచార్యులు, B O L
వరంగల్

*

విద్యాప్రవీణ - భాషాప్రవీణ - ఉభయవేదాంతశిరోమణి
శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, M A.
ప్రిన్సిపాల్ . వేద సంస్కృత కళాశాల
నెల్లూరు

*

సాహిత్యవిద్యాప్రవీణ
డాక్టర్ తట్టా విజయరాఘవాచార్యులు, M A; Ph D.
ఉపన్యాసకులు విశిష్టాద్వైత విభాగము
రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము
తిరుపతి



# ప్రముఖులు - ప్రశంసలు

**కొమాండూరు రామానుజాచార్యులు** **ఉలవపాడు**

శ్రీ రామానుజ కీర్తి కౌముది నవమ కళ నిజముగ 'శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సరస్వ' మను మాటను ప్రతి పొరటయు సార్థకపరచుచున్నది ఈ భాగమును పట్టు మని పది పుటలు చదివిన చాలు ఇందు భగవద్రామానుజుల గ్రంథ పరంపర పరిశీలన, వాని విశిష్టత, గీతాభాష్య వైభవమును చూపుచు, రచయితలు చేసిన కృషియు ప్రశంసనీయము

**A V. దేశికాచార్యులు** (*రాజ గురువులు*) **మైసూరు**

శ్రీ రామానుజ కీర్తి కౌముది 8–వ భాగం రమ్యంగా వుంది. అందులో మీరు సాయించిన 'దివ్యప్రబంధ నీరాజనము' అద్భుతంగా వుంది శ్రీమాన్ తట్టా విజయరాఘవాచార్యులవారి– 'రామానుజ దర్శనము', మరియు – శ్రీమాన్ చించా పట్టణం శ్రీరంగాచార్యులవారి 'శ్రీరామానుజులు – యోగవిద్యా రహస్యము' హృదయంగమంగా వున్నవి. ఇవి అమూల్యమైన రచనలు ఇక తొమ్మిదప భాగం మరీ బాగుంది శ్రీమాన్ తట్టా విజయరాఘవాచార్యులవారి 'శ్రీమద్రామానుజులు – వేదార్థ సంగ్రహము', శ్రీమాన్ తెలికిచర్ల కందాడై గోపాలాచార్యుల వారి 'భగవద్గీత–రామానుజ దర్శనము', దేవరవారి 'శ్రీవైష్ణవ మత వైశిష్ట్యము'– ఇవన్నీ రత్నాలు

శ్రీమాన్ డి టి తాతాచార్యులవారి సంస్కృత మాతృకకు అనువాదమైన 'రామానుజీయ మనోభావన'లో – 'రామానుజార్య దివ్యాజ్ఞా' - విషయం మనోహరంగా వుంది మావంటి చాల మంది కిది కనువిప్పు

**డాక్టర్: తట్టా విజయరాఘవాచార్యులు, M.A, Ph.D.** **తిరుపతి**

ఎందరో మహర్షులచే కథితమైన శ్రుతి స్మృతీతిహాస పురాణ ప్రమాణములచే ప్రతిపాదితమై, పరంపరాగతమైన విశిష్టైక్యము రామానుజ దర్శనమై, కీర్తి కౌముదిగా నేడు ప్రకాశించుచున్నది బహు పుష్పరసములు సమ్మిళితమై, మకరంద మైనట్లు, బహు విధ రచనలు సమ్మిళితమై, భక్తిరసాస్వాద తన్మయ

లనుగా జేయుచున్నది. తత్త్వమును మథించి, మన కందించు చున్నది రామానుజ కీర్తి కౌముది.

**వేముగంటి నరసింహాచార్యులు** **సిద్ధిపేట**

విశిష్టాద్వైత మత విశిష్టతను తెలియజేయుచున్న శ్రీ రామానుజ కీర్తి కౌముది – తొమ్మిదవ భాగము – ఉత్తమోత్తమములైన రచనలతో, ఉదాత్త రీతిలో రూపొందించబడినది

**తె. కం. గోపాలాచార్యులు** **నడిగడ్డపాలెము**

శ్రీ రామానుజ కీర్తి కౌముది 19 – వ భాగములో మీరు చాలా మంచి విషయాలను సమకూర్చారు ఈ గ్రంథము లన్నియు - అన్ని విధములుగా, సర్వాంగ సుందరంగా తయారు చేయబడి యున్నవి మేలిమి బంగారము వలె, ఇవి ఎప్పటికైనను విలువ గలవియే.

**శ్రీభాష్యం అప్పలాచార్యులు, M.A.** **విశాఖపట్టణము**

శ్రీ రామానుజ కీర్తి కౌముది 9–వ భాగములో రచనలు అన్ని విధముల చాలా బాగున్నవి.

**కె టి. యల్. నరసింహాచార్యులు** **ముసునూరు**

శ్రీ రామానుజ కీర్తి కౌముది నవమ కళ యెంతో చూడ ముచ్చటగా నుండుటే గాక, పరమ రమణీయంగా భాసించుచున్నది

**శ్రీరంగాచార్యులు, M.A.** **పాలెము**

శ్రీ రామానుజ కీర్తి కౌముది – తొమ్మిదవ సంపుటము – విషయ సమగ్రంగా భాసిస్తున్న దనడంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు.

**డాక్టర్ : S.T.V. రాజగోపాలాచార్యులు, M.A, Ph.D** **భీమవరము**

నేను సమర్పించిన 'తాళ్ళపాక చిన్నన్న సాహిత్య సమీక్ష' పరిశోధన నిబంధానికి ఆంధ్రా యూనివర్సిటీవారు ఇటీవల నాకు డాక్టరేట్ (పి హెచ్ డి.

డిగ్రీ ప్రదానం చేశారు. ఈ వ్యాసంగంలో – మీ 'కౌముది' – చల్లని అమృత కిరణాలను ప్రసరించింది. ఈ సంతోష వార్తను మీకు ఆత్మీయంగా ఎరిగించి, మీ శుభాకాంక్షలు పొందాలని ఆకాంక్షిస్తున్నాను.

**మరింగంటి శ్రీరంగాచార్యులు, B O.L.** **హైదరాబాదు**

శ్రీ రామానుజ కీర్తి కౌముది – నిరంతరాశాంతితో, ప్రతిపద భీతితో, బహు విధ భ్రాంతితో, అశ్రాంత సాంసారిక సంతాపత్రయీ పరిక్రాంతస్వాంతులై, పద భ్రష్టులై, బంధు విశ్లిష్టులై, భావ బహు దుష్టులై, శోక హత దుష్టులై, గాఢ దురదృష్టులై, నుడువరాని కడు ఇడుమల బడు బడుగులను, బ్రతుకు బాటసారులను, సాధ్య సాధన ఇతి కర్తవ్యతా శూన్యులను, అనారతాక్రాంత దేహ వైద్యులను, సంతత త్రివిధాపచార చరణ చణ జన మూర్ధన్యులను, అసమ్మాన్యులను, అనన్యులను, తల్లి యొడిలో చేర్చి, సేద దీర్చి, ముదము గూర్చి, ముద్దు సేసి, బుజ్జగించి, ఆలించి, లాలించి, పాలించి, పసిడి గిన్నెలో – పంచదారతో పాలందించు చక్కని చిక్కని వెన్నెలయే.

ఈ కౌముదిని ప్రకాశింపజేయుటలో చేయూత నిచ్చు ద్రవ్య దాతలు – తమ దానముతో కర్మయోగమును, విద్వాంసులు – తమ వ్యాసములతో జ్ఞాన యోగమును, కవీశ్వరులు – తమ పద్య రచనలతో భక్తియోగమును స్ఫురింపజేయగా, ఈ మూడింటి సత్తకాధారముగా అంతర్లీనమై యున్న తమ కృషి – భగవత్ ప్రపత్తిగా భాసించుచున్నది. ఇది యంతయు అవ్యాజ బంధువు, ఆద్యాచార్యుడు నగు ఆ శ్రియఃపతియొక్క అహైతుకాభిమాన విజృంభణముగా భావించుచు, ఈ తమ వ్యవసాయము సర్వతోముఖముగా సాగి, చక్కని పంటను పండించుగాక యని ఆ సర్వేశ్వరుని అర్థించుచున్నాను.

**C. V. RAGHAVACHARYULU, M.A, B Ed.** **VIJAYAPURI**

**9th Edition of 'Sree Ramanuja Keerthi Koumudi' is really beaming a new light delving from the most meaningful commentary of Bhagavad Ramanuja on 'Brahmasutras'. Sree-bhashyam is the quintessence of the Visishtadwaitha philosophy**

and without it any amount of knowledge relating to any branch of Ramanuja School of thought is incomplete and imperfect. The Nineth part of Koumudi is welldone with its extremely important components of the Visishtadwaitha Philosophy.

Dr. PREMA NANDAKUMAR, M.A; Ph.D. SRIRANGAM

In 9th Volume of 'Sree Ramanuja Keerthi Koumudi' you have brought together eminent scholars on the same platform to explain the salient features of Sri Vaishnavism. Truly a feast to the Scholar as well as the lay student of Sri Ramanuja's vision.



# పత్రికలు - ప్రశంసలు

(తొమ్మిదవ భాగమును గురించి)

గైర్వాణీ ఏప్రిల్, మే 1989

నవమ్యా మస్యాం శ్రీ రామానుజకీర్తి కౌముద్యాం ప్రస్థానత్రయ నామ్నా సంపాదకీయేన సహ సంపాదితైః నవభి ర్వ్యాసైః కవి పండిత పరిచయై స్సచిత్రై శ్చ స్థానం సంపాదిత మస్తి ఆది-మధ్యాన్తా స్సర్వేఽపి విషయా రసకన్దాః స్వాదానుస్వాద పరమ రమణీయాః సంస్కృతి ప్రియాణాం నిరన్త రాధ్యయనానుశీలనయోగ్యా శ్చ భవన్తి జిజ్ఞాసూనా మితి న స్సంవాదః శ్రీ రామానుజ కీర్తి కౌముద్యాకృతే విషయార్పకా స్సర్వేఽపి విద్వన్మూర్ధన్యా ఏవ. త్రై ర్యుక్తం ఏకైకశ స్స్పష్టూక్త మస్తి, "య దుక్తయ స్త్రయీ కంఠే యాన్తి మంగల సూత్రతాం"ఇతి ప్రశస్తి మర్హతి త్రయ్యన్తార్థ నిరూపణపరాణాం పూర్వాచార్యాణాం ప్రతిపాదన కౌశలం, భావనా పాటవం, కావ్యగాన మాధుర్యం చ ప్రకట యన్తీ ఇయం శ్రీ రామానుజ కీర్తి కౌముదీ రామానుజ రాకేంద్రం సకల కలా విశిష్టం ప్రపద్యతా మితి గైర్వాణీ గీర్వాణ శరణ్యం దేవదేవం భగవన్తం శ్రీ శ్రీనివాసం ప్రస్తౌతి

ప్రస్థానత్రయే ప్రధానత మోపనిషదాం, ఉపనిష ద్విద్యానాం 31 ఏక త్రింశ త్సంఖ్యానాం, బ్రహ్మసూత్రభాష్యకరాణాం నామాభి స్సాకం సిద్ధాన్తానాం ఉల్లేఖనం కృతం సంపాదక మహోదయేన 'దేవరహిబాబా విషయం మహా కుతూహల జనకం ప్రస్తువన్, సంపాదక మహాశయః బాబా మహానుభావస్య 900 వర్ష దేశీయతాం శ్రీరామానుజ దేశికవత్తాం చ ప్రఖ్యాపయతిస్మ, య దీదృశీ మహత్తా యోగజ ధర్మ సాధ్యా తర్హి నాఽత్ర కి మపి చిత్రవిచిత్రం వా

అత్ర వేదార్థ సంగ్రహ విషయ వివరణం, శ్రీ భాష్యాధికరణార్థ వివ రణం, భగవద్గీతా – రామానుజ దర్శనం, శ్రీవైష్ణవ మత వైశిష్ట్య మి త్యాదికం జిజ్ఞాసూనాం ఆంధ్రభాషా భాషిణాం అత్యంత ముపకారకం భవతీ త్యత్ర నైవ సంశయః. త దర్థం తద్రచయితారః ఆచార్య స్వామినః సర్వేఽపి భక్తి తతి నమస్సుమాంజలి మర్హన్తి తేషాం మహతాం ప్రత్యుపకారం కథ మితోఽప్యన్యథా

కర్తుం శక్యతే ? అస్మిన్ సందర్భే "సందేహారిణే ద్వారకాతః ప్రతి నివృత్తాయ బ్రాహ్మణాయ రుక్మిణీప్రియ మస్య న్నపశ్యన్తి కేవలం ప్రణనామ సా" ఇతి వ్యాసో భగవాన్ ప్రణామమాత్రాచరణేన తృప్తేతి యత్ వ్యాచష్టే, తత్ స్మర్యతే ఏవ మేవ గైర్వాణ్యతి సర్వేభ్యః శ్రీవైష్ణవ స్వామిభ్యః నమోవాక మధీతే, సంపాదక మహాశయాయ విశిష్య ధన్యవాద శతం సమర్పయతి

**THE HINDU** **20-12-1988**

The volume under review is the SRI RAMANUJA KIRTHI KAUMADI ninth in the series It carries the most important works of Sri Ramanuja Here we have the Gita - Bhashya and the Upanishad-Bhashya and the commentary of Vedanta - Sutras. Ramanuja's philosophy represents the unique pattern of Vedanta thought. The three categories Souls The Lord, and World of matter are each interconnected and inseparable from the Lord The two categories-souls and universe are dependent on th eLord The relationship between them is as that which obtains between the body and the soul. Ramanuja's philosophy is organic The path to salvation is devotion (Bhakthi). The method of devotion involves a little trouble for the average men. A devotee has to be ceremonially pure and ethically sound, before meditating on God. The path of Bhakthi involves some effort on the path of man.

Ramanuja, suggests a supremely easy method of reaching the Lord called Sharanagathi (complete, absolute, willing and total surrender to the Lord) This is called prapatti. This method is opened to one and all who surrender to the greatness of the Lord and have faith in His saving power These series of books on Ramanuja in Telugu is useful.





శ్రీనివాసాయ నమః                                శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవైష్ణవ ధర్మ వ్యాప్తి

(సంపాదకీయము)

శ్రీవైష్ణవ మతమునకు – శ్రీవైష్ణవ ధర్మ మనియు, శ్రీవైష్ణవ సంప్రదాయ మనియు, భాగవత మత మనియు, శ్రీ సంప్రదాయ మనియు అనేక నామాంతరము లున్నవి. ఈ వైష్ణవ ధర్మమునకు శ్రీ పాంచరాత్రాగమమే ప్రధానమైన ఆధారము గనుక, ఇయ్యది – పాంచరాత్ర మత మనియు వ్యవహరింపఁబడుచున్నది

ఈ పాంచరాత్ర మొక మహోపనిషత్తనియు, నాల్గు వేదములు, సాంఖ్య యోగము ఒకటిగా చేరి – 'పాంచరాత్ర' మను పేర వెలయుచున్న దనియు, నారాయణ ముఖోద్గతమైన ఈ పాంచరాత్ర శాస్త్రమును తొలుత – దేవర్షియైన నారదుఁడు శ్రవణము చేసె నవియు – మహా భారతమునందలి శాంతి పర్వము (339-11,12) విశదీకరించుచున్నది

తదనంతరము నారద మహర్షి – ఈ పాంచరాత్రాగమ ప్రాశస్త్యమును – తాను రచించిన 'నారద పాంచరాత్ర' మను గ్రంథమున వివరించుచు –

"రాత్ర శబ్దము జ్ఞాన వాచకము ఈ జ్ఞానము ఐదు విధములుగా నుండును. ఇందుచే, పండితులు దీనిని 'పాంచరాత్ర' మని వ్యవహరింతురు. మొదటిది – జన్మ, జరా, మరణములను నివారించు

పరమ తత్త్వ జ్ఞానము రెండవది - మోక్షార్థులకు ముక్తిదాయకమైన పవిత్ర జ్ఞానము ఇది - శ్రీమన్నారాయణుని పాద పద్మముల సన్నిధికిఁ జేర్చునట్టిది. మూఁడవది - పరిశుద్ధము, శ్రేయస్కరము నగు జ్ఞానము ఇది శ్రీమన్నారాయణునియందు భక్తిభావమును గల్గించునట్టిది. భగవద్దాస్యము నొసంగు ఈ జ్ఞానముకూడ మానవుల కావశ్యకము. నాల్గవది - సమస్త సిద్ధులను ప్రసాదించు యౌగిక జ్ఞానము ఇయ్యది - యోగుల సర్వస్వము, సిద్ధులను సుఖప్రదము లైనది ఐదవది - పరమ జ్ఞానము ఇదియే మాయ. ఇది మానవుల మోహమునకు కారణమై, వారిని సాంసారికము అగు విషయ భోగముల వైపునకు మరల్చును ఇట్టి జ్ఞానముచే మానవుఁడు - తనను, తన కుటుంబమును పోషించుకొనఁగల్గును'' అని ప్రబోధించినాఁడు. (1-1-44 నుండి 53 వఱకు.)

పై పంక్తులనుఁబట్టి తేలిన సారాంశ మే మనఁగా - రాత్ర మనఁగా జ్ఞాన మనియు, అట్టి జ్ఞానము - పరమ తత్త్వము, ముక్తి, భుక్తి, యోగము, విషయము (సంసారము) అను పంచ విధములుగా నుండు ననియు, అదియే 'పాంచరాత్ర' మని వ్యవహరింపఁబడుచున్న దనియు స్పష్ట మగుచున్నది.

ఇట్టి పాంచరాత్రాగమ మహాంబుధినుండి సముద్భవించిన శ్రీవైష్ణవ ధర్మము - భారత దేశమున చిర కాలమునుండియు ప్రచలిత మగుచున్నది. ఈ సంప్రదాయమున శ్రీ మహావిష్ణువే ఉపాస్య దైవము. ఆ దైవమే పరతత్త్వమని భావించి, ఆ జగన్నాథుని అనన్య భక్తితో ఆరాధించువాఁడే వైష్ణవుఁడు సర్వభూత సమతయే వైష్ణవ ధర్మమునకు ముఖ్య లక్షణము. ఇంతియుకాక, ఈ వైష్ణవ ధర్మము జా త్యాంత్యము.

దక్షిణ భారతములో నుదయించిన అట్టి వైష్ణవ ధర్మమును ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో నిక్షేపించిరి.

ఆళ్వారుల యనంతరము - ఆచార్య పరంపరలో ప్రథము లగు నాథమునులు - ద్రావిడ వేద వైశిష్ట్యమును బాగుగా ఆకళించుకొని, అందలి వైష్ణవ ధర్మమును బహుళ ప్రచారము గావించుచు, భక్తి ప్రధానమైన ఈ వైష్ణవ ధర్మ ద్వారములో - ఎల్ల ఆకును ప్రవేశార్హతను కల్పించిరి.

నాథమునుల యనంతరము - వారి పౌత్రు లగు యామునాచార్యులు - నమ్మాళ్వారుల దివ్య ప్రబంధములలో నిక్షిప్తమైన వైష్ణవ ధర్మముచే ప్రభావితులై, ఆళ్వారుల దివ్యప్రబంధములను అధ్యయన - అధ్యాపనల మూలమున ప్రచారము గావించుటేగాక, వైష్ణవ ధర్మ ప్రతిపాదకము లగు కొన్ని గ్రంథములను గీర్వాణ భాషలో రచించిరి.

యామునాచార్యుల యనంతరము భగవద్రామానుజులు వైష్ణవ పీఠాధిపతులై, ఆసేతు శీతాచల పర్యంతము పాదయాత్ర చేసి, వైష్ణవ ధర్మమును దేశమం దంతటను ప్రచారము గావించుటే గాక, వేదార్థ సంగ్రహ - శ్రీభాష్య - గీతాభాష్యాది గ్రంథములను కొన్నింటిని సంస్కృత భాషలో రచించి, వానిలో - వైష్ణవ ధర్మమును సుప్రతిష్ఠితము గావించిరి.

ఈ రీతిగా భగవద్రామానుజులు వైష్ణవ ధర్మమునకు విశేష ప్రాచుర్యమును గల్గించుటే గాక, శ్రీవైష్ణవ ధర్మ ప్రచారార్థమై డెబ్బదినాల్గు సింహాసనములను నెలకొల్పిరి అట్టి వానిలో - ఎనిమిది (8) సింహాసనములు ముఖ్యములు వీనిలో ఆఱు (6) సన్న్యాస సింహాసనములు, రెండు (2) గృహస్థ సింహాసనములు.

1 తోతాద్రి (వానమామలై) .- ఇది మైసూరు రాష్ట్ర ములో - 'మేల్కోట' అనబడు తిరునారాయణపుర క్షేత్రమునకు సమీపమున, తిరునల్వేలికి 19 మైళ్ళ దూరమున గలదు. ఇచట శ్రీ తోతాదినాథస్వామి దేవాలయ మున్నది. 'క్షీరాబ్ధి పుష్కరిణి' యను సరస్సుగూడ కలదు. ఇచ్చట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను - 'రామానుజాచార్యులు' అని యందురు.

2. వేంకటాద్రి (తిరుమల) :- ఇచ్చట శ్రీనివాస భగవానుని దేవాలయ మున్నది. 'స్వామి పుష్కరిణి' యను సరస్సు కూడ కలదు. ఇచట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను 'వేంకటాచార్యులు' అని వ్యవహరింతురు

3 అహోబిలము .- ఇది కడప జిల్లాలో గలదు. ఇచ్చట ప్రహ్లాద వరదుండగు ప్రసన్న నారసింహస్వామి దేవాలయ మున్నది. 'రామ తీర్థ' మను సరస్సుకూడ కలదు. ఇచ్చట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను 'శఠకోపాచార్యులు' అని యందురు

4 బ్రహ్మతంత్ర పరకాలము :- ఇది మైసూరులో గలదు ఇచ్చట శ్రీ చెన్నకేశవస్వామి దేవాలయ మున్నది. పట్టణ పరిసరము లందు - కావేరి, పెన్న, తుంగభద్ర నదులు కలవు ఇచట వేంచేసి యుండు రామానుజ పీఠాధిపతులను 'బ్రహ్మతంత్ర రామానుజాచార్యులు'- అని వ్యవహరింతురు.

5. మునిత్రయము :- ఇది బెంగుళూరుకు సమీపమున గలదు. ఇచ్చట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను 'ముని త్రయాచార్యులు' అని యందురు.

6. శ్రీరంగము :- ఇది తిరుచినాపల్లికి మూఁడు మైళ్ళ దూరమునఁ గలదు. ఇచ్చట శ్రీరంగనాథాలయ మున్నది. ఇది కావేరికి మధ్య ప్రదేశమునఁ గలదు. ఇచ్చట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను 'రంగనాథాచార్యులు' అని వ్యవహరింతురు.

ఇవి యాఱును సన్న్యాస పీఠములు.

7. శ్రీరంగము :- ఇచట ఒక గృహస్థ పీఠము కూడ కలదు. ఇచట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను 'అణ్ణన్ స్వామి' యనియు, 'వరదాచార్యులు' అనియు అందురు

8. కాంచీపురము :- విష్ణు కంచిలో శ్రీ వరదరాజస్వామి దేవాలయము గలదు. దేవాలయ సమీపమున 'కోటి తీర్థము' అను సరస్సు గలదు. పట్టణ పరిసరమున వేగవతీ నది గలదు. ఇచ్చట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను 'ప్రతివాది భయంకరం అణ్ణన్ స్వామి' అని వ్యవహరింతురు.

ఇవి రెండును గృహస్థ పీఠములు.

భగవద్రామానుజులచే ఈరీతిగా బహుళ వ్యాప్తి నందిన శ్రీవైష్ణవ ధర్మము - ముముక్షువులకు మార్గదర్శకమై విలసిల్లినది. కనుకనే - శ్రీరంగ క్షేత్రమున వేంచేసియున్న శ్రీరంగనాథస్వామి - "పరమ వైదిక మగు శ్రీ వైష్ణవ ధర్మము - 'రామానుజ మతి' మను పేర వ్యవహరింపఁబడుగాక"! అని మంగళాశాసనము గావింపఁగా, నాఁటినుండి శ్రీవైష్ణవ ధర్మము - 'రామానుజ మతి' మను పేర ప్రసిద్ధ మయ్యెను.

ఇట్టి రామానుజ మతముచే అనేక సంప్రదాయములు ప్రభావితములై యున్నవి అట్టి వానిలో - మాధ్వ, నింబార్క, వల్లభ, రామానంద, చైతన్యాది సంప్రదాయములు ముఖ్యములు.

ఇట్లు వైష్ణవ ధర్మము దేశమందంతటను బహు ముఖములుగా విస్తరించి, నేటికిని అఖండముగా విరాజిల్లుచున్నది.

"రామానుజాయ మహతే నిగమాంతశాస్త్ర
పారంగతాయ పరమార్థ విశారదాయ
విఖ్యాత లోక గురవే యతిపుంగవాయ
భూయో నమో భువన మంగళ దేశికాయ"



# భగవంతుడు - సృష్టి

"పరమాత్మ హరి తాన బ్రహ్మాండముల జేసి
యందందు బ్రహ్మల నమరజేసి
లోన చతుర్దశ లోకంబులను జేసి
అధికార పురుషుల నం దమర్చి
తిరుగ దేవ మనుష్య తిర్యగాది సమస్త
జంతు జాలము కర్మ సరణి జేసి
భోగ మోక్ష నిదాన పుణ్య పాపక్రియో
పాసన న్యాస ప్రపంచ విధుల
నెఱుగ జెప్పెడు శాస్త్రంబు లిచ్చి, వారు
చనెడి సన్మార్గ దుర్మార్గ సంగతులకు
చిత్ర నమ్ము త్త్యుపేక్షల జేసికొనుచు
నుంచు రని చెప్పె లక్ష్మణ యోగవరుడు."

పరమాత్మయైన విష్ణువు – తాను స్వయముగ బ్రహ్మాండములను సృజించి, ఆ యా బ్రహ్మాండములలో బ్రహ్మల నేర్పఱచి, వానిలో చతుర్దశ భువనములను సృష్టించి, ఆ యా భువనములలో – తగిన అధికారులను నియమించి, దేవ – మనుష్య – పశు – పక్ష్యాది వివిధ జంతువులను సృష్టించి, ఆ యా ప్రాణికోటికి కర్మబంధములను గల్పించి, భోగము – మోక్షము, పుణ్యము – పాపము, భక్తి– ప్రపత్తి ఇత్యాది విషయములను బోధించెడు శాస్త్రములను ప్రసాదించి, వారి వారి ప్రవర్తనముల ననుసరించి ఫలము నొసగుచున్నా డని భగవద్రామానుజులు ప్రవచించియున్నారు

— (ముముక్షు జన కల్పకము)

# సంసార మహా సముద్ర తరణము

"సంసార మతిఘోర సాగర మాశలు
పెనునీరు రాగముల్ పెద్ద సుళ్ళు
మలయు కామ్యా ద్యహం మమతలు గ్రాహంబు
లుక్త తాపత్రయ మూర్మి మాల
చిత్త వికారంబు శీఘ్ర వాయు క్షోభ
మొలికెడు దేహమం దోటి యోడ
పోషక ధారక భోగ్యంబు లందులో
గురుతుగా గొని వేసికొన్న సరుకు

నోడ నెక్కిన శ్రీహరి జాడ నాత్మ
మునుగ కద్దరి జేరు దా మ్రొక్కుకొన్న
దైవ మాచార్యుడై వచ్చి తన్ను గాచు
ననుచు లక్ష్మణదేశికుం డాన తిచ్చె."

సంసార మనెడి సముద్రమునకు ఆశలే జల ప్రవాహము; సంతోషాతిశయములే పెద్ద సుడిగుండములు, కామ క్రోధ మద మాత్సర్యములు, అహంకార మమకారములు – మకర కచ్ఛపాది జలజంతువులు. అందు – తాపత్రయము లనెడి తరంగములు గలవు. దేహ మనెడు ఓటి యోడ – ఆ సముద్రమున నడచుచున్నది ధారక – పోషక – భోగ్యములు తనకు కావలసి, కొని వేసికొన్న సరుకులు. ఓడ నెక్కిన వర్తకుని వంటి చేతనుడు ఆ దరిని జేరుటకు శ్రియఃపతిని శరణించినచో, ఆ దైవమే ఆచార్యుడుగా (గురువుగా) వచ్చి, సంసార సముద్రమునుండి ఆ దరిని జేర్చి, ఆ చేతనుని కాపాడు నని శ్రీమద్రామానుజులు ప్రబోధించియున్నారు.

— (ముముక్షు జన కల్పతరువు)

# వి ష యా ను క్ర మ ణి క


శ్రీ పద్మావతీ శ్రీనివాస స్తుతి 1 - 2

**శ్రీమాన్ ఆసూరి మరింగంటి పురుషోత్తమాచార్యులు**

౨. లక్ష్మీపురుషకార వైభవము 3 - 15

**డాక్టర్ · తట్టా విజయరాఘవాచార్యులు**

అవతారిక

పురుషకార నిర్వచనము

ఉపాయము - ఉపేయము

చేతనులకు లక్ష్మీ పురుషకారమే శరణ్యము

లక్ష్మీ అనుగ్రహము చేతనులకు శ్రేయము

పురుషకార ప్రపత్తి

చేతనుల యెడ లక్ష్మీదేవి కృప

పురుషకారత్వ సిద్ధి

లక్ష్మీప్రసాదావశ్యకత

శ్రీ లక్ష్మీనారాయణులు ఆశ్రయణీయులు

పురుషకారత్వమే లక్ష్మీ తత్త్వము

పురుషకారత్వ వివరణము

లక్ష్మీదేవి చాతుర్యము

సీతావతారమున పురుషకారము

సీతాదేవి శపథము

ముగింపు

3. శ్రీమద్రామానుజులు - వారి కృతి రత్నములు 16 - 29

**శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు**

శ్రీ రామానుజ రచనా వైదుష్యము

వేదార్థ సంగ్రహము

శ్రీభాష్యము

వేదాంత దీపము - వేదాంత సారము

శ్రీ భగవద్గీతా భాష్యము

గద్య త్రయము

నిత్య గ్రంథము

౪. శ్రీమద్రామానుజులు - ఉపనిషత్తులు 30 — 62

శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు

ప్రణామాంజలి
ఉపక్రమము
ఈశోపనిషత్తు
కేనోపనిషత్తు
కఠోపనిషత్తు
ప్రశ్నోపనిషత్తు
ముండకోపనిషత్తు
మాండూక్యోపనిషత్తు
ఐతరీయోపనిషత్తు
తైత్తిరీయోపనిషత్తు
ఛాందోగ్యము
ఛాందోగ్యము - శాండిల్య విద్య
ఛాందోగ్యము - సద్విద్య
ఛాందోగ్యము - భూమాధికరణము
ఛాందోగ్యము - దహర విద్య
బృహదారణ్యకము
బృహదారణ్యకము — మైత్రేయణ బ్రాహ్మణము
కౌషీతకి ఉపనిషత్తు
శ్వేతాశ్వతరోపనిషత్తు
మహోపనిషత్తు
సుబాలోపనిషత్తు
మహా నారాయణోపనిషత్తు
ఉపసంహారము

౫. శ్రీ భగవద్రామానుజులు - శ్రీ భాష్యము 63 - 96
(ద్వితీయాధ్యాయము)

శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

ద్వితీయాధ్యాయ - ప్రథమపాదము

పరిచయము

స్మృత్యధికరణము

యోగప్రత్యుక్త్యధికరణము

విలక్షణాధికరణము

భోక్త్రాపత్త్యధికరణము

ఆరంభణాధికరణము

ఇతర వ్యపదేశాధికరణము

కృత్స్నప్రసక్త్యధికరణము

ఉపసంహార దర్శనాధికరణము

ద్వితీయాధ్యాయ - ద్వితీయ పాదము

రచనానుపపత్త్యధికరణము

మహద్దీర్ఘాధికరణము

సముదాయాధికరణము

నాభావాధికరణము

ఉపలబ్ధ్యధికరణము

ఏకస్మిన్ అసంభవాధికరణము

పశుపత్యధికరణము

ఉత్పత్త్యసంభవాధికరణము

ద్వితీయాధ్యాయ - తృతీయ పాదము

వియదధికరణము

తేజోఽధికరణము

ఆత్మాధికరణము

జ్ఞాధికరణము

కర్త్రధికరణము
సదాయత్తాధికరణము
అంశాధికరణము

ద్వితీయాధ్యాయ - చతుర్థ పాదము
ప్రాణోత్పత్త్యధికరణము
సప్తగత్యధికరణము
ప్రాణాణుత్వాధికరణము
వాయుక్రియాధికరణము
శ్రేష్ఠాణుత్వాధికరణము
జ్యోతిరాద్యధిష్ఠానాధికరణము
ఇంద్రియాధికరణము
సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము
ముగింపు

౬. శ్రీమద్రామానుజులు - గీతా భాష్యము 63 - 160

డాక్టర్ · చించావట్టణం శ్రీరంగాచార్యులు
ప్రవేశిక
గీతా భాష్యము - గీతార్థ సంగ్రహము
గీతా భాష్యము - వ్యాఖ్యాన పరిమళము
గీతా భాష్యము - ఈశ్వర తత్త్వము
గీతా భాష్యము - ఆత్మ స్వరూపము
గీతా భాష్యము - జ్ఞాన యోగము
ముగింపు

౭. గీతా రహస్యము 161 - 170

శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

౮. విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము 171 - 185

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు
వేదాంత శాస్త్రము
విశిష్టాద్వైత తత్త్వము
పరబ్రహ్మము సగుణము

నారాయణుడే పరబ్రహ్మము
సాధన పథము
ఆచార వ్యవహారములు
విధి నిషేధములు
పంచ సంస్కారములు
భక్తి ప్రపత్తులు
శ్రీ రామానుజులు - పంచాచార్యులు
మత ప్రచారము

౯. శ్రీ రామానుజ ప్రశక్తి 186 - 195

**శ్రీ మొవ్వా వేంకట దాసు**

౧౦. శ్రీ పాంచరాత్ర వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము 196 - 216

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

అంజలి
ఆరంభ వాక్యము
పాంచరాత్ర ఉదయ కాలము
సాత్త్వతుల పరిచయము
పాంచరాత్రము – భాగవతము
వైష్ణవాచార్యులు - పాంచరాత్రము
పాంచరాత్ర వాఙ్మయము
విశేషాంశములు
ఉపసంహారము

౧౧. శ్రీ పాంచరాత్ర ప్రాశస్త్యము 296 - 232

**శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు**

ప్రాంజలి
పాంచరాత్ర ప్రవక్త
పాంచరాత్ర ప్రాచీనత

పాంచరాత్ర ప్రశస్తి
పాంచరాత్రము - వివిధ నామములు
పాంచరాత్ర ప్రవర్తకులు
శ్రుతులలో పాంచరాత్రము
పురాణేతిహాసములలో పాంచరాత్రము
కావ్యములలో పాంచరాత్రము
పాంచరాత్ర ప్రశంసలు
పాంచరాత్ర సాహిత్యము
చరిత్ర పుటలలో పాంచరాత్రము

౧౨. వివిధ సంప్రదాయములు - శ్రీవైష్ణవ మతప్రభావము 233 – 255

శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

రామానుజ సంప్రదాయము
మాధ్వ సంప్రదాయము
నింబార్క సంప్రదాయము
వల్లభ సంప్రదాయము
రామానంద సంప్రదాయము
రామ భక్తి - రామానంద సంప్రదాయము
కబీరు దాసు - రామ భక్తి
ములక్ దాస, రాయ్ దాసాదులు
గోస్వామి తులసీ దాసు
శ్రీకృష్ణ చైతన్య స్వామి - గౌడీయ వైష్ణవ సంప్రదాయము
తుకారాము
సమర్థ రామదాసు





శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్.

# శ్రీ పద్మావతీ శ్రీనివాస స్తుతి

'కవిశేఖర'

**శ్రీమాన్ ఆసూరి మరింగంటి పురుషోత్తమాచార్యులు,**

ఎం. ఏ., బి. యిడి



శ్రీ వక్షోరుహ కుంకుమాంకిత లసత్ శ్రీవత్స వక్షస్స్థలా !
భావోన్మీలిత భక్త పాలన కళా భవ్యప్రపన్నోజ్జ్వలా !
గ్రావోగ్రీకృత దుష్టచిత్తజన శిక్షా దక్ష దీక్షాంచలా !
గ్రైవేయ మ్మిది స్వీకరింపుమి శుభాంగా ! శ్రీనివాసప్రభూ !

పారమ్ముం గనలేని స్వాంతమున నస్త ధ్వస్త విధ్వస్త సం
సార మ్మంచున మున్గిపోవు జనులన్ సాకంగ దివ్యత్కృపా
పారమ్యం బగు వీక్షణామృతమునన్ బాధా సహస్రమ్ములన్
పారం ద్రోలెదు తల్లి! గైకొనుము కైవారమ్ము పద్మావతీ !

ఆశాపాశములన్ దగుల్కొని పరుం డత్యంత సమ్మోహనా
వేశాదేశములన్ రగుల్కొని భ్రమల్ వేధింప బాధా నిరా
శా శైథిల్య మనస్స్థితిన్ గనుచు నర్చారూపముం దాల్చితే
శ్రీశా ! ప్రేముడి నుద్ధరింప నిట ధాత్రిన్ శ్రీనివాస ప్రభూ !

పులకింపుల్ తులకింప నీ పద నవాంభోజాత భవ్యార్చనల్
తొలి నే జన్మమునం దొనర్చితినొ - నా దుర్దాంత దుఃఖాన్వితా
ఖిల పాపౌఘ మణంగజేసి యిటు వాగ్గీతిన్ సమర్పించు యీ
కలిమిన్ గూర్చితివమ్మ సౌహృదవతీ ! కైమోడ్పు పద్మావతీ !

ఆకంఠంబుగ దోష దూషిత దురన్యాయానులాపంబులన్
చీకుం జింతయు లేని రీతి జడతన్ చింతా విలుప్తాత్ములై
లోకుల్ పెక్కు వగల్ వడంగ మదిలో లోలానురాగాన నా
వైకుంఠంబును వీడి వచ్చితివె కావన్ శ్రీనివాస ప్రభూ !

జీవన యాత్రలో గలుగు చింతల వంతల ద్రక్కు నెట్టి - నీ
పావన దర్శనార్థమయి వచ్చితి - 'కట్టడి' వాడు తండ్రి ! ఈ
త్రోవను కోవెలన్ 'నిలువు దోపిడి' చేసెను చూడు మమ్మ ప
ద్మావతి ! 'శ్రీనివాసు' డను మాటకు 'సర్థ' మ దేమొ మాతరో !

నీ వొక కన్నతల్లి వలె నిందు మనంబున నుండి బిడ్డలన్
గావగ నండయై నిలువగా - సుడిగుండము లేమి లెక్క త
ల్లీ ! వగదీరదే ! పరిమళించెడు చల్లని నీ కృపా ప్తి ప
ద్మావతి ! చేరదీతువుకదా ! సిరిసంపద లిచ్చి ప్రేమతో !

వెక్కం జెప్పిన దేదొ నీ మనమునన్ వే జొన్పుచున్ నా పయిన్
గిక్కం జూపెద వేమొ తండ్రి ! యిది నీ క్రీడా వినోదంబు - నా
వెక్కన్ ముందట నెవ్వరుం గలరు నీవే తప్ప ! నిన్ గొల్చు నా
పూన్కిం జారగనీకుమయ్య వినుతింపుల్ ! శ్రీనివాసప్రభూ !

నీ పుణ్యాంచిత సత్కథా సురుచిర స్నిగ్ధ ధ్వన ద్గాన గీ
తీ పాండిత్య మహత్వముం గనక వ్యర్థీభూత మ ర్త్యత్వమై
తోపన్ - నీ యెడ నా మనంబు నిడి కాంతున్ సుంత శాంతిన్ - త్రిలో
కీ పుణ్యాంచితరూప ! కావు మనుర క్తిన్ శ్రీనివాసప్రభూ !

* * *

పారావార పరంపరం బరగు మీ ప్రజ్ఞాధురీణత్వమే
ధారావాహిక రూప సంకలిత త త్త్వజ్ఞాన దృక్చారువౌ
సారాచార విచార వైష్ణవ కళా సంపన్న సర్వస్వ మీ
శ్రీ రామానుజ కీర్తి కౌముది కివే శీర్షా నతా భ్యంజలుల్ !



# లక్ష్మీ పురుషకార వైభవము

**'సాహిత్య విద్యా ప్రవీణ'**

**డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు,** ఎం.ఏ; పిహెచ్.డి.



"ప్రపన్నార్తిహరా నిత్యా వేద సౌధ విహారిణే
శ్రీరంగనాధ మాణిక్య మంజరీ మంజుభాషిణీ."

## అవతారిక

శ్రీమన్నారాయణుఁడు సర్వదా సర్వ శరణుఁడు. శ్రియఃపతిత్వ రూప మగు చిహ్నముసుఁబట్టి, నారాయణ శబ్దమునుఁబట్టి - ఇది పరతత్త్వ మని శ్రుతులలో నిర్ణయింపఁబడినది. శరణ్యుఁ డగునపుడు, అనఁగా - చేతనులచే రక్షణార్థము ఆశ్రయింపఁబడునపుడు - లక్ష్మీ విశిష్టుఁడుగానే ఉండును అని, పూర్వమైన శ్రీమచ్ఛబ్దము తెలుపుచున్నది.

"ఆకారిణ స్తు విజ్ఞాన మాకార జ్ఞానపూర్వకమ్
తేనాకార శ్రియం జ్ఞాత్వా జ్ఞాతవ్యో భగవాన్ హరిః."

ఏదేని ఒక ఆకారము గల వస్తువును తెలిసికొనుట - దాని యాకారమునుఁబట్టియే కావున,ఆకారభూతురాలగు లక్ష్మిని తెలిసికొని, తద్వారా భగవంతుని తెలిసికొనవలె' నని, శ్రీ అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్ స్వామి అభిభాషణము.

## పురుషకార నిర్వచనము

ఏదేని ఒక అపేక్ష గల పురుషునిచే, ఆ యపేక్షను నెరవేర్చ గల పురుషుఁడు పొందఁబడుటకై, ఉపాయముగా వరింపఁబడునట్టి

వే రొకరిని 'పురుషకారము' అని వ్యవహరింతురు. ఈ పురుషకారము కాలక్రమమున మోక్షమునకు హేతువగును. పురుషకారమునకు ఆధునిక పదము 'సిఫార్సు' (Recommendation) అని. దీనినే 'మధ్యవర్తిత్వము' అందురు. "పురు సనోతీతి పురుషః. పురుషం కరోతీతి పురుషకారః" అని దీని విగ్రహ వాక్యము. పురు = అధికముగా, సనోతి = ఇచ్చువాఁడు. తం = ఆవిధమైన పురుషునిగా, కరోతీతి = చేయుచున్నది కావున, 'పురుషకారము' అనఁబడుచున్నది. 'అధికముగా ఇప్పించువాఁడు' అని, పురుషకార శబ్దమునకు పిండితార్థము.

## ఉపాయము - ఉపేయము

కఠినముగా పితృత్వ ప్రయుక్తమయిన హితపరత్వము గలవాఁడై, వదిని పదిగా లెక్కబెట్టి, క్రూరదండనములను విధించెడి దేవదేవుఁడైన శ్రీమన్నారాయణుని, ఉచితోపాయములతో సమయానుకూలముగాఁ బల్కుచు, దోషము లన్నిఁటిని సహింపించి, విడిపించున దగుటవలన, అపరాధమే శరీరముగాఁ గల చేతనుఁడు వానినాశ్రయించు తరుణమున, ఈమె పురుషకారము కావలెను. కావున, పరమాత్మను వరించునపుడు, ఉపేయముగా - లక్ష్మి పురుషకారము ఆవశ్యకము.

## చేతనులకు లక్ష్మి పురుషకారమే శరణ్యము

"అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాత్ లక్ష్మీపతి స్స్వయమ్
లక్ష్మి పురుషకారేణ వల్లభా ప్రాప్తి యోగినీ
ఏత స్యాశ్చ విశేషోఽయం నిగమాంతేషు శబ్ద్యతే"

లక్ష్మీపతి యగు నేనే సాక్షాత్తుగా నన్ను పొందుటకు ఉపాయము. నా సహధర్మచారిణియైన లక్ష్మీదేవియొక్క పురుషకారముచే నన్ను పొందించును. ఈమెకు ఈ విశేషము వేదాంతములలో చెప్పఁ

బడుచున్నది. నాకును లక్ష్మికిని ఇదియే విశేషము' అని, భగవానుడు శ్రీ పాంచరాత్ర శాస్త్రమున చెప్పియున్నాడు.

ఈ యంశమునే శ్రీ అళగియ మణవాళ జీయరుస్వామి - తమ 'తత్త్వదీప సంగ్రహము'న, ఇట్లు వక్కాణించుచున్నారు :-

"ఏత త్సాపేక్ష సంబంధా దన్యేషా మమలాత్మనామ్
దేవీ సూరిగురూణాం చ ఘటకత్వం న తు స్వతః"

ఇతర దేవులకును, నిత్యసూరులకును, ఆచార్యులకును లక్ష్మీదేవి ద్వారానే పురుషకారత్వము కలదు. స్వతస్సిద్ధముగా లేదు.'

## లక్ష్మీ యనుగ్రహము చేతనులకు శ్రేయము

శ్రీ యామునాచార్యులు 'కాంతా స్తోత్రము' (చతుశ్శ్లోకి) అను పేర తాము రచించిన లక్ష్మీ స్తవములో - తృతీయ శ్లోకము నందలి ఉత్తరార్థమున ఇట్లు వ్రాకుచ్చియున్నారు :-

"శ్రేయో న హ్యరవిందలోచన మనః కాన్తా ప్రసాదాదృతే
సంసృ త్యక్షర వైష్ణవాధ్వ సునృణాం సంభావ్యతే కర్హిచిత్"

మనుజుల కెప్పుడైనను పుండరీకాక్షుని ప్రియురాలియొక్క అనుగ్రహము తప్ప, సంసారమందును, కైవల్యమందును, పరమపద మునందును, శ్రేష్ఠమైనది ఊహింపఁబడదు.'

## పురుషకార ప్రపత్తి

భగవద్రామానుజులు తమ శరణాగతిగద్య ప్రారంభమున -

"భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణ విభవైశ్వర్యశీలా ద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణ గణాం పద్మావనాలయాం భగ

పతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవ దివ్యమహిషీం అఖిల జగన్మాతరం అస్మ న్మాతరం అశరణ్య శరణ్యాం అనన్యశరణ శ్శరణ మహం ప్రపద్యే ”

అను చూర్ణికచే, మొదట లక్ష్మీవిషయిక ప్రపత్తి చేసినారు. ఇది పురుషకార ప్రపత్తి యని, ఆచార్యు లందఱును స్పష్ట మొనర్చిరి.

## చేతనులయెడ లక్ష్మీదేవి కృప

“అస్తి కర్మార్హఫల దేవత్వా కృత్య ద్వయం శ్రియః
నిగ్రహోద్వారణం కాలే సంధుక్షణ మనుగ్రహే ”

భర్తయైన భగవంతుఁడు కర్మార్హ ఫలము నిచ్చువాఁడు. ఈ సందర్భమున లక్ష్మీదేవికి గల కార్యములు రెండు. ఒకటి :- సమయము చూచి భగవంతుని నిగ్రహమును తప్పించుట. రెండవది :- భగవ దనుగ్రహమును హెచ్చించుట' అని శ్రీ వేదాంతదేశికుల వక్కాణ.

## పురుషకారత్వ సిద్ధి

అదియునుఁ గాక, వేదాంతదేశికులు తమ ‘నిక్షేప రక్ష’ అను గ్రంథమున, పురుషకార భావమునుగుఱించి ఇట్లు తెలియఁజేయుచున్నారు :-

“అర్థస్య భావానుమానేన లోకదృష్టి గురూక్తిభిః
శ్రుత్యా, స్మృత్యా చ సంసిద్ధం ఘటనార్థాపలంబనమ్ ”

అర్థస్వభావము, అనుమానము, లోకదృష్టి, ఆచార్య శ్రీసూక్తి, శ్రుతులు, స్మృతులు - వీనినిఁబట్టి, పురుషకారత్వము సిద్ధ మగుచున్నది.'

## లక్ష్మీప్రసాదావశ్యకత

ప్రపత్తి గావించునపుడు పురుషకారావరణము గావింపవలయును. అందులకే శ్రీ మహాలక్ష్మిని పురస్కరించుకొనుట. సకల శాస్త్రసమ్మతమయిన యీ యంశమునే వ్యాసభట్టరువారు* ఇట్లు చెప్పిరి :- భగవంతుఁడు సౌశీల్య - సౌలభ్య - వాత్సల్య - కారుణ్యాది గుణ విశిష్టుఁ డయినను, ఏదియో యొక సమయమున ప్రతాపోన్ముఖుఁ డగును. కావున, లక్ష్మీదేవి ప్రసాదము ముందుగా పొందకున్నచో — వైష్ణవాధ్వమున శ్రేయోలాభ మసంభవము. కావున, లక్ష్మిని ముం దుంచుకొనితీరవలెను. అప్పుడే భగవంతుని సమాశ్రయణము లభించును. తరువాతనే ఆయన ఫలప్రదుఁ డగును.'

## శ్రీ లక్ష్మీనారాయణులు ఆశ్రయణీయులు

"ఈశానాం జగతా మధిశదయితాం నిత్యానపాయాం శ్రియం
సంశ్రిత్యాశ్రయణోచి తాఖిల గుణ స్యాంఘ్రీ హరే రాశ్రయే
ఇష్టోపాయతయా శ్రియా చ సహితా యాత్మేశ్వరాయార్థయే
కర్తుం దాస్య మశేష మప్రతిహతం నిత్యం త్వహం నిర్మమః "

జగత్తుల కంతటికిని అధిపతియైనట్టియు, సర్వేశ్వరునకు భార్యయైనట్టియు, ఎప్పుడును విడువకుండ ఉన్నటువంటి లక్ష్మిని ఆశ్రయించుటకు ఉచితమైన సమస్తగుణములు గల విష్ణువుయొక్క పాదములను ఆశ్రయించెదను. ఇష్టమైన ఉపాయ మగుటచేతను - లక్ష్మితో కూడుకున్నట్టి, ఆత్మాధిపతియైనట్టి విష్ణువును — నేను మమకారము లేనివాఁడనై, ఎప్పుడును అడ్డు లేని సమస్తమైన దాస్యమును చేయుటకు ప్రార్థించుచున్నా' నని పరాశరభట్టరువారు అష్టశ్లోకిలో తెలిపియున్నారు.

---

* సుదర్శనాచార్యులకు - వ్యాస భట్టరు, వేదవ్యాస భట్టరు, సుదర్శన భట్టరు అను నామాంతరములు గలవు.

## పురుషకారత్వమే లక్ష్మీ తత్త్వము

'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః' అని పూర్వోత్తరములు రెండు భాగములును చేరి, ద్వయముగా సుప్రసిద్ధము. ఈ రెండు భాగములందును 'శ్రీమత్' పద ముండి, నారాయణునకు లక్ష్మీ సంబంధమును చూపుచున్నది. పూర్వ ఖండమునందు లక్ష్మిని ముందుంచుకొని, అనగా - లక్ష్మిని పురుషకారముగాఁ జేసికొని, సర్వేశ్వరుని శ్రీచరణములను ఉపాయముగా ఆశ్రయించుట యనియు, ఉత్తర ఖండమునందు లక్ష్మీనారాయణులకు కైంకర్య మొనర్ప వేడుకొనట యనియు సమ కంఠోక్తి. సర్వేశ్వరుఁ డెప్పుడును పురుషకారకృత్యము చేయఁడు. లక్ష్మియే అట్టి పురుషకారకృత్యమును నిర్వహించుచున్నది అని ప్రసిద్ధము. ఇందువలన, పురుషకారత్వము లక్ష్మీతత్త్వ మని స్పష్టము.

## పురుషకారత్వ వివరణము

పురుషకారత్వ మనఁగా - దాపయిత్రీత్వము. అనఁగా - ఇప్పించుట. ఉపాయత్వ మనఁగా - దాతృత్వము. అనఁగా - తానే యిచ్చుట. ఈ రెండును ఏక విషయికమై, ఏకవ్యక్తి యందు కుదురదు. కావుననే చతుశ్శ్లోకిలో - మూఁడవ శ్లోక భాష్యమున -

"మోక్షప్రదే భగవతి ముముక్షూణాం ఘటకతయా ఏషా తిష్ఠతీతి సర్వసమ్మతమ్"

మోక్షము నొసంగువాఁడు సర్వేశ్వరుఁడే. దానిని లభింపఁజేయు నదిగామాత్రమే లక్ష్మి యుండును' అని, వేదాంతదేశికులచే చెప్పఁబడినది.

"మోక్షప్రదానౌపయిక సంకల్పాశ్రయత్వం ఉపాయత్వమ్"

మోక్ష మొసంగఁజాలుదునని సంకల్పించి, గ్రహించుట ఉపాయత్వము. సర్వేశ్వరుని దయకు లక్ష్యముగా చేయుట పురుషకారత్వము.

"భగవత్కారుణా విషయీకార కారకత్వం పురుషకారత్వమ్"

అని భావము. లక్ష్మియందు పురుషకారము, సర్వేశ్వరునియందు ఉపాయత్వము వ్యవస్థితములు. మనము సర్వేశ్వరుని కృపకు పాత్రుల మగుటకు అవరోధముగాఁ గల క్రూర పాపములను పోగొట్టి రక్షించుటయే పురుషకార మని తాత్పర్యము. కనుకనే మన పూర్వాచార్యు లందఱును భగవన్నారాయణాభిమతము లగు స్వరూప - రూప - గుణ - విభవ - ఐశ్వర్య - శీలా ద్యసంఖ్యేయ కల్యాణ గుణములు కలదియు, నారాయణునితో నిత్య సంశ్లేషము గలదియు, అఖిల జగన్మాతయు శ్రీ మహాలక్ష్మియే యని - ఆమెయందు భక్తి భావములు గలవారై యుండి రన్న విషయము సంప్రదాయజ్ఞుల కెల్లఱకును విశదమే.

## లక్ష్మీదేవి చాతుర్యము

లక్ష్మి తన పురుషకార బలముచే కొందఱు చేతనులను సర్వేశ్వరుఁడు అంగీకరించుట చూచి, 'ఈ యంగీకారము నిర్బంధమునకా ? లేక - తన యుల్లము పల్లవింపఁగనే స్వీకరించుటకా ? అని తెలిసి కొనుటకై, చాతుర్యముతో — చేతన భక్తుల విషయమున దోషములను ఆరోపించును. ఎట్లన, 'నాథా! నేను ఆలోచింపక, వీరికి పురుషకారము చేసితిని. పిదప బాగుగా పరిశీలనము చేసినమీఁదట, వీరు దోషు లని తేలినది. కనుక, వీరిని వదలుట మంచిది' అని చెప్పును. అప్పుడు భగవానుఁడు - 'లక్ష్మి ! వీరు నీ దాసులుగా నున్న కాలమున ఒకప్పుడు దోషులుగా నుండినను, నా దాసు లయిన పిదప, ఎప్పుడును దోషులు కారు' అని బదులు చెప్పును. పరమాత్ముని అభిప్రాయమును ఇంకను ఎఱుఁగఁ దలచి, లక్ష్మి మఱల - 'వారు

అపరాధులే' యని దృఢముగాఁ జెప్పెను. అప్పుడు పరమాత్మ - 'నా దాసులు అట్లు చేయరు అని నేను ముందే చెప్పితిని. కాని, చేసినా రనినచో - అది మంచి పనియే గాని, చెడు పని కాదు' అనును. అది విని లక్ష్మి ఆనందించి, ఈ వార్తను మీ నోటినుండి వినుటకే నేను ఆ రీతిగా అడిగితిని; అది సఫలమైనది' అని హర్షము నొందును.

## సీతావతారమున పురుషకారము

రామాయణములో - సీతావతారమున లక్ష్మి తన పురుష కారమును ప్రకాశింపఁజేసెను.

"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్."

- (శ్రీమద్రామాయణము - బాలకాండ)

కావ్య మయిన రామాయణమున అంతటను సీతాదేవియొక్క చరితమే ప్రధానముగా చెప్పఁబడినది' అని వాల్మీకి మహర్షియే స్వయముగా ఉద్ఘాటించియున్నాఁడు.

"దేవత్వే దేవ దేహేయం మనుష్యత్వే చ మానుషీ
విష్ణో ర్దేహానురూపాం వై కరో త్యేషాత్మని స్తనుమ్"

- (విష్ణు పురాణము . 1-9-145)

దేవతగా అవతరించినప్పుడు దేవశరీరిగాను, మానవ జన్మను ధరించినపుడు మనుష్య శరీరిగాను - ఇట్లు విష్ణువుయొక్క దేహము నకు అనుగుణముగా లక్ష్మి శరీరమును ధరించును' అని చెప్పుటవలన -

"రాఘవత్వే భవే త్సీతా, రుక్మిణీ కృష్ణ జన్మని"

(విష్ణు పురాణము . 1-9-144)

అన్నట్లు, పరమాత్మ శ్రీరాముఁడుగా అవతరించినంతనే, తదనుగుణ ముగా లక్ష్మి - సీతగా అవతరించి, ముమ్మారు వియోగమును

పొంది, కృప, పారతంత్ర్యము, అనన్యార్హము అను గుణత్రయమును స్పష్టము గావించెను.

కృప :-

ఇతరుల దుఃఖములను సహింపలేకుండుటయే కృప. అజ్ఞానముతో చేతనులు సంసారమున అనుభవించు దుఃఖములను చూచి, సహింపఁజాలక, ఆ చేతనులను పరమాత్మతో చేర్చుటకు చేయు యత్నమునకు కృప ఆవశ్యకము. దండకారణ్యమున వాసము చేయుచున్న సమయమున - రావణునిచే అపహరింపఁబడిన దన్న మిషచే, సీతాదేవి - శ్రీరామచంద్రుని వీడి, లంక కేఁగినది. అచ్చట చెఱలో నున్న దేవతా స్త్రీలను విడిపించుటకుగాను తాను ఆ చెఱకు చేరినది. తనను హింసించిన రాక్షసస్త్రీలు కూడ, త్రిజటా స్వప్న వృత్తాంతమును విని భీతి చెందగా –

"భవేయం శరణం హి వః" –(రామాయణము – సుందర కాండ : 58-80) వారి యపరాధములను సైరించి, వారియెడ సీత ప్రసన్నురాలగును. రావణ వధానంతరము వారిని వధించుటకు ఆంజనేయుఁడు ఉద్యమించగా - "రాజసంశ్రయ వశ్యానాం." (రా : యు : కాం: 116-38) ఒక రాజాశ్రయమున అధీనులగువారు వారని, హనుమంతుని వారించి, వారిని రక్షించెను. అపరాధలైన రాక్షస స్త్రీలను రక్షించుటవలన, సీత తన కృపను వెలువరించెను.

పారతంత్ర్యము :-

స్వతంత్రుని వశీకరించునపుడు - అనువర్తనమువలన, వశీకరింపఁబడియుండుటవలన పారతంత్ర్యము ఆవశ్యకము. శ్రీరామచంద్రునితోకూడ అయోధ్యకు వచ్చి, గర్భవతిగా నున్న సమయమున – లోకాపవాదపరిహారార్థము శ్రీరామునిచే పంపఁబడిన దను

మిమచే, శ్రీరామచంద్రుని వీడి, అంతఃపురమునం దుంచినను, అడ
విలో నుంచినను — తారతమ్యము లేక, వారి తలపును అనుసరింప
వలసియున్న తన పత్నీత్వ ప్రయుక్తమయిన పారతంత్ర్యమును సీత
ప్రకాశింపఁజేసెను.

"న ఖ ల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీ జలే
త్యజేయం రాఘవం వంశే భర్తు ర్మా పరిహాస్యతి"
- (రామాయణము - ఉత్తర కాండ . 48 - 8.)

ఓ లక్ష్మణా! నా భర్త యగు శ్రీరామచంద్రునినుండి వచ్చిన
రఘు సంతానము - నా భర్తవంశము కొనసాగుచుండగనే ముగియ
రాదని తలచి, ఇప్పుడే గంగలో పడి, ప్రాణములను వీడకున్నాను'
అని, శ్రీరామచంద్రుని ఆశయముకొఱకు జీవించి, సహించి, సీత తన
పారతంత్ర్యమును ప్రకాశింపఁజేసెను. ఇచ్చట శ్రీరామచంద్రుని
ఆశయ మే మనఁగా - 'అపత్యలాభ స్సంప్రాప్తః' అను శ్లోకమున -
శ్రీరాముఁడు పుత్ర సంతానము కావలెనని తన కోరికను తెలియఁ
జేసెను. కనుక, వానిని నెరవేర్చుటకు సీత తన పారతంత్ర్యమును
స్పష్టముఁ జేసెను.

"పతి ర్హి దైవతం నార్యాః పతి ర్బంధుః పతి ర్గతిః
ప్రాణై రపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యం విశేషతః"
- (రామాయణము - ఉత్తర కాండ . 48 - 17)

స్త్రీలకు పతియే దైవము; పతియే బంధువు, పతియే గతి.
ప్రాణములతోనైనను పతికి ఇష్టమయిన పనినే చేయవలయును' అని
తాను చెప్పిన రీతిగా — తన పతియొక్క ఇచ్ఛకు అనుగుణముగా
ప్రవర్తించుటయే తన కర్తవ్యముగా భావించి, సీత తన పారతంత్ర్య
మును స్పష్టము చేసెను.

**అనన్యార్హత్వము :-**

"అనన్యా భాస్కరేణాహం భాస్కరేణ ప్రభా యదా"
- (రామాయణము - సుందర కాండ 21 - 16)

ప్రకాశము సూర్యుని విడిచి యుండనట్లు, నేను ఎన్నడును రాముని వీడి యుండను' అని సీతయు _

"అనన్యా హి మయా సీతా" - (రామాయణము - యుద్ధకాండ . 121 - 19)
సీత నాకు వేఱుకా దని రాముఁడును సమ్మతించినను _ లోకాపవాదము పోగొట్టుకొనుటకుగాను నిదర్శనము కావలయు నను శ్రీరాముని ఆజ్ఞ ప్రకారము సీతాదేవి శపథము చేసి, శ్రీరామచంద్రుని నుండి వియోగమును పొంది, తన అనన్యార్హత్వమును స్పష్టము చేసెను.

## సీతాదేవి శపథము

అనన్యార్హత్వమును స్పష్టము చేసిన సీతాదేవి శపథమును వాల్మీకిమహర్షి - రామాయణమున ఇట్లు వివరించుచున్నాఁడు :-

"సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా సీతా కాషాయ వాసినీ
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్య మధో దృష్టి రవాఙ్ముఖీ
యథాఽహం రాఘవా దన్యం మనసాఽపి న చింతయే
తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి
మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే
తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి"
- (రామాయణము - ఉత్తర కాండ : 97 - 14, 15, 16)

కాషాయ వస్త్రమును ధరించియున్న సీతాదేవి - అచ్చటకు వచ్చినవారి నందఱను చూచి, చేతులు జోడించి, తల వంచుకొని, భూమివంక చూచుచు, ఇట్లు పలికెను :- 'శ్రీరామచంద్రునికంటెను

వే రొక పురుషుని నేను మనస్సునం దేని తలపకున్నచో, ఈ భూమి నాకు దారి నిచ్చుగాక ! నేను మనో వా క్కాయములను శ్రీరామ చంద్రుని విషయమునసే వినియోగపరచుచుంటినేని, భూదేవి నాకు దారి నిచ్చుగాక !'

"తధా శపత్యాం వైదేహ్యాం ప్రాదు రాసీ న్మహాద్భుతమ్
భూతలా దుత్థితం దివ్యం సింహాసన మను త్తమమ్
ధ్రియమాణం శిరోభిస్తు నాగై రమిత విక్రమైః
దివ్యం దివ్యేన వపుషా సర్వరత్న విభూషితమ్
తస్మింస్తు ధరణీదేవీ బాహుభ్యాం గృహ్య మైథిలీమ్
స్వాగతేనాభినంద్యైనా మాసనే చోపవేశయేత్
తా మాసనగతాం దృష్ట్వా ప్రవిశంతీం రసాతలమ్
పుష్పవృష్టి రవిచ్ఛిన్నా దివ్యా సీతా మవాకిరత్ "

– (రామాయణము - ఉత్తరకాండ . 97 – 17, 18, 19, 20)

ఈవిధముగా సీతాదేవి శపథము చేయఁగా - అచ్చట ఒక అద్భుతమైన, దివ్యమైన సింహాసనము భూమిలోనుండి పైకి వచ్చెను. అది పరాక్రమము గల నాగులచే శిరస్సున ధరింపఁబడిన దివ్యరూప ముతో రత్నాలంకృతమైనది అంతట భూదేవి సీతాదేవిని కౌగలించు కొని, స్వాగతముచేత ఆమెను అభినందించి, ఆ సింహాసనమున కూర్చుండబెట్టుకొనెను. ఆ సింహాసనమును సీత అధిష్ఠించి, రసాతల మున ప్రవేశించుచున్న ఆమెను చూచి, అవిచ్ఛిన్నముగా పుష్ప వృష్టి కురిసెను' అని ఈ రీతిగా మూఁడవ వియోగమునందు - సీత తన అనన్యార్హత్వమును స్పష్టము చేసెను. విష్ణువును వీడియుండని దియు, అకర్మవశయై యుండెడిదియు అగు లక్ష్మీదేవికి, కర్మవశ్యులకు వలె - ఇట్లు వియోగము అనివార్యమైనను, తన పురుషకారత్వోప యుక్తములైన గుణములను, పురుషకారత్వమును ప్రకాశింపఁజేయు టకై ఆ లక్ష్మియే ఇట్లు సీతగా అవతరింపవలసివచ్చెను.

"శ్రీరంగధామ్ని యదుతాన్య దుదాహరంతి
సీతావతారముఖ మేత దముష్య యోగ్యా"

– (శ్రీగుణరత్నకోశము 57)

ఏ కారుణ్యాది గుణము లన్నియు సీతావతారమున గలవిగా పెద్దలు చెప్పుచున్నారో, అవి యన్నియు ఈ యర్చావతారి యగు శ్రీరంగనాయకియందు గలవని శ్రీ పరాశరభట్టరువారు ప్రవచించి యున్నారు.

## ముగింపు

ఏవంగుణ విశేషణ విశిష్టమయిన లక్ష్మీ పురుషకారత్వము అనుష్ఠాన పర్యంతము తెలియుటవలన, ఆమెను ఆశ్రయించి, ఆమె పురుషకారముచేత, అనగా – సిఫార్సుచేత చేతనులు పరమాత్మ యొక్క అనుగ్రహమునకు పాత్రులై, మోక్షమును పొందుటయే పరమ పురుషార్థము.

"లక్ష్మ్యా సహ హృషీకేశో, దేవ్యా కారుణ్య రూపయా
రక్షక స్సర్వ సిద్ధాంతే, వేదాంతేషు చ గీయతే"



# శ్రీమద్రామానుజులు - వారి కృతిరత్నములు

'సుధీమణి'


శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు,

ఎం. ఏ; బి యిడి


—✿—

శ్రీసంప్రదాయ సాహిత్య వినీలాకాశములో - మహోజ్జ్వల ధ్రువనక్షత్రము శ్రీరామానుజ యతిసార్వభౌముల మహో వాఙ్మయము. సర్వజన హితముగ శ్రీ రామానుజాచార్యుల వారు లోకమునకు అనుగ్రహించిన భక్తితత్త్వ సాహిత్యము అజరామరమై, ఆచంద్ర తారార్కము ప్రకాశింపగల ఆలోచనామృతము, ఆర్ష భారతికి అక్షర నీరాజనము, అనుభవైక వేద్యము, శ్రియఃపతి సాయుజ్యమునకు సోపాన పథము.

## శ్రీ రామానుజ రచనా వైశిష్ట్యము

భారతదేశమునంతటి శ్రీవైష్ణవ సంప్రదాయేతరులు, పాశ్చాత్యులు పెక్కుమంది శ్రీ రామానుజ స్వామివారిని కేవలము వేదాంత సూత్రములకు విశిష్ట వ్యాఖ్యాన మగు 'శ్రీభాష్యము' అను ఒక్క గ్రంథమునకు మాత్రమే రచయితగా ఎరుంగుదురు. అట్టివారు - వాస్తవముగ శ్రీరామానుజులు బ్రహ్మసూత్రములలోని ప్రథమ సూత్రమునకు ఒసంగిన దీర్ఘ వ్యాఖ్యానమును మాత్రమే చదివి యుందురు. ఎందువలన ననగా : ప్రథమసూత్ర వ్యాఖ్యానమే ఒక సమగ్ర వ్యాఖ్యానముగ భాసిల్లుచు, శ్రీ రామానుజుల తత్త్వసారముగ మిక్కిలి వివరణాత్మకముగ పఠనోత్సుకతను కలిగించుచున్నది. మరి కొందరికి - శ్రీమద్భగవద్గీతాభాష్యకర్తగా శ్రీరామానుజుల వారు పరిచితులు. చాల కొలది మందికి 'వేదార్థ సంగ్రహము' అను



యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయ మేనే
అస్మ ద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే.

పేర ఉపనిషత్తులకు అర్థ తాత్పర్యములను వ్రాసిన మహా సాహితీ మూర్తిగా ఆ యతిసార్వభౌములు ప్రసిద్ధులు.

శ్రీవైష్ణవులలోని వడగళ్, తెంగళ్ అని వ్యవహరింపబడు ఉభయ సంప్రదాయస్థులు - సంస్కృత భాషలో శ్రీరామానుజుల వారు మొత్తము తొమ్మిది గ్రంథములను రచించినట్లు అంగీకరింతురు. శ్రీభాష్యము, వేదార్థ సంగ్రహము, గీతాభాష్యములనే గాక, శ్రీ రామానుజులవారు — వేదాంతసార, వేదాంత దీపములను, గద్య త్రయమును, నిత్యగ్రంథమును రచించియున్నారు.

మరి శ్రీరామానుజాచార్యులవారు తమిళ భాషలో ఏమియు వ్రాయలేదా? అను ప్రశ్న ఇట సహజముగా నుదయించును. వడగళ, తెంగళ సంప్రదాయములకు చెందిన శ్రీవైష్ణవాచార్యుల జీవిత చరిత్రలనుబట్టి, శ్రీరామానుజులవారు - ఆళ్వారులచే రచింపబడిన నాలాయిర దివ్యప్రబంధములోని సంప్రదాయ విశేషములను గూర్చియు, అందును ముఖ్యముగా - నమ్మాళ్వారుల తిరువాయిమొళిపై సను తమిళ భాషలో ఉపన్యాసము లొసంగియున్నట్లు తెలియవచ్చు చున్నది. శ్రీ రామానుజులవారి కోరికపై వారి శిష్యు లగు 'తిరుక్కురుగై పిరాన్ పిళ్ళాన్' అనువారు - తిరువాయిమొళికి మొట్ట మొదట మణిప్రవాళ భాషలో 'ఆరాయిరప్పడి' అను పేర నొక భాష్యమును రచించిరి. ఈ భాష్యమునందలి పదములు, సమానములు శ్రీరామానుజులవారి శైలిని పోలియున్నవి. ఈ ఆరాయిరప్పడి వ్యాఖ్యానము శ్రీరామానుజులవారి సిద్ధాంతములకు దర్పణము బట్టును. శ్రీరామానుజులవారి భాష్యములు పెక్కు దేశ విదేశ భాషలలోని కనువదింపబడినవి.

శ్రీరామానుజాచార్యులవారు తమ శిష్యుల కుపదేశించిన నిగూఢ విషయములు, సిద్ధాంతములు కొన్ని వారి స్వతంత్ర రచనలను ప్రతిబింబించుచు, తమిళభాషలో అచ్చటచ్చట మనకు దర్శనమిచ్చుచున్నవి. కాని, శ్రీ రామానుజాచార్యులవారు సంస్కృత భాషలో స్వయముగా రచించిన గ్రంథములు మాత్రము మన ప్రకృత పరిశీలనమునకు ప్రధాన విషయములు.

## వేదార్థ సంగ్రహము

'వేదార్థ సంగ్రహము' శ్రీరామానుజాచార్యులవారి తొలి కృతియై యుండవచ్చును. 'శ్రీభాష్యము'లో దీనిని గురించి వారు పెక్కుమారులు ప్రస్తావించియున్నారు. ఈ వేదార్థ సంగ్రహమును శ్రీరామానుజులవారు తిరుమలలో శ్రీనివాస భగవానుని సన్నిధిలో రచించినట్లు, సుప్రసిద్ధ విశిష్టాద్వైత సిద్ధాంత వ్యాఖ్యాత శ్రీ సుదర్శన సూరి పేర్కొనినారు. వేదార్థ సంగ్రహమును కడకు తిరువేంకటాచలాధీశుడైన శ్రీనివాసమూర్తికే అంకిత మిచ్చుట యొక విశేషము. సిద్ధాంత రాద్ధాంతములకు అతీతమైన తిరుపతి మహాక్షేత్రమును శ్రీ రామానుజాచార్యులవారు ఎంపిక చేసికొనుటకు గల కారణము - అచ్చటి వివిధ సంప్రదాయస్థులను మెప్పించుటకై యుండవచ్చును. భక్తిప్రపత్తులతో - వేదార్థ సంగ్రహము'ను శ్రీ శ్రీనివాసమూర్తికి సమర్పణ చేయుటలో ఔచిత్యము గనిపించును. భక్తి సంప్రదాయము ననుసరించి ఇది తాత్త్విక జ్ఞానకోశముగను, ఆరాధన భావ దీపముగను దర్శన మిచ్చును. తాత్త్విక జ్ఞానముయొక్క పరమావధి భక్తి యగుటవలనను, సర్వ ఆధ్యాత్మిక సాధనలు, వేదాంత పరిశోధనలు భక్తిమార్గముచే సూచించుట వలనను శ్రీ రామానుజులు తమ తొలి కృతిప్రసూనమును జగత్పతియైన శ్రీనివాసునకే సమర్పించిరి.

శ్రీ సుదర్శనసూరి పేర్కొనినట్లు, తిరుపతిలో - శ్రీరామానుజాచార్యులవారు తమ జీవితములో ఏ సమయమునందు 'వేదార్థ సంగ్రహము'ను తొలుత రచించినదియు, మరియు - పరంపరగా దాని విషయమై ప్రసంగము లొనర్చినదియు స్పష్టముగ బోధపడదు. కాని, యామునాచార్యులవారి శిష్యాదేశముపై శ్రీరంగములో - శ్రీరంగనాథస్వామివారి దేవాలయ పాలనమును సంస్కరించిన తరువాతనే తిరుపతిని దర్శించి, దీర్ఘ కాలము తిరుమలేశ్వరుని సన్నిధిలో వారు గడిపిన సమయమందు 'వేదార్థ సంగ్రహము'ను వ్రాసియుండ వచ్చును.

వేదార్థ సంగ్రహ మనగా - వేదములయొక్క అర్థ, వివరణాత్మక మగు ఉపనిష త్సార మని తాత్పర్యము. ఉపనిషత్తులను చక్కగా, నిర్ద్వంద్వముగ అవగాహనము చేసికొనుటకు ఉద్దేశించబడిన శ్రీరామానుజులవారి భావ విశ్లేషణ మిది. ఇందలి ఉపోద్ఘాతమునందు శ్రీరామానుజులు - తమ ప్రత్యర్థుల వాదములను, తమ భావములను మొదట స్పష్టము చేసిరి. అనంతరము తమ ప్రత్యర్థుల వాదములకు ముఖ్య ఆధారమైన ఛాందోగ్యోపనిషత్తునందలి 'సద్విద్య' యను ప్రకరణము నుదహరించుచు, ప్రతివాద ఖండనమున కుపక్రమించిరి. 'సద్విద్య' ప్రకరణమునందు 'తత్ - త్వమ్ - అసి' అనబడు జీవాత్మ - పరమాత్మల మధ్య గల సారూప్యము వివరింపబడినది.

శ్రీరామానుజులు మౌలికమైన ద్వైత సంబంధము లగు ఆధిభౌతిక తత్త్వములను ప్రతిపాదించిరి. నిశ్చలమైన బ్రహ్మము జగత్తునందు ప్రవేశించి, అంతర్యామిగను, శరీరిగను అవధరించును. ఈ సిద్ధాంత ప్రాతిపదికగ శ్రీ రామానుజులు ద్వైతాద్వైత వాదముల యందలి ఆంతరికమైన ఏకత్వమును, అంతర్భావమును విశదీకరించిరి వేదములను సక్రమముగ అవగాహన చేసికొనినప్పుడు, శ్రీమన్నారా

యణుడే జగన్నాథు డనియు, సర్వాధికు డనియు స్పష్ట మగును. ప్రత్యర్థులుగా చెప్పబడు బ్రహ్మ, శంకరుడు - కేవలము సృష్టిక్రమములో తొలిప్రాణులుగా తెలియబడుదురని శ్రీరామానుజులు సిద్ధాంతీకరించిరి.

ప్రభాకరుని సిద్ధాంత మగు 'కర్మ మీమాంస' - మత కర్మలను వివరించు వేద భాగము. ఈ 'కర్మ మీమాంస' ననుసరించి, భవిష్య త్ఫలితములను కర్మలు అతిమానుషమైన జగచ్ఛక్తి వలన సృష్టించును. ఈ వాదనను శ్రీ రామానుజులు ఖండించిరి. తత్సంబంధము లగు చర్యలను నిర్దేశించుటనుబట్టి, శబ్దములకు - లేక, పదములకు అర్థమును గ్రహింపవలెను. పదములు - చేయవలసిన కర్మలను వ్యక్తపరచును. ఆ యా కర్మలద్వారా - నిత్యము, సత్యము అయిన బ్రహ్మమును మెప్పించుటవలనగాని, లేక - నొప్పించుటవలనగాని కలిగెడి శుభాశుభ ఫలములను కర్త అనుభవించును. వేదార్థ సంగ్రహామునందు చివరి మూడు భాగములు భగవంతుని యొక్క మనుష్యరూపమునకు, వేదముల దివ్య మానవ నిర్మాణమునకు సంబంధించినవి. భగవంతుని పొందించు విలక్షణ జ్ఞానము భక్తి. భక్తి యనగా - 'భగవత్సేవ' యనియు, అదియే భగవద్ధ్యాన' మనియు 'వేదార్థ సంగ్రహ' సారాంశము.

'వేదార్థ సంగ్రహము' శ్రీరామానుజులవారి బృహత్తర రచనలలో ఒకటియైనను, అది వ్యాఖ్యానముగ గాక, వేదతత్త్వ స్వరూప సారములను ఆవిష్కరించుచు, మహా గ్రంథముగా భాసించును. ఇందు రామానుజులవారు ప్రధానమైన ఉపనిషత్తులపై వ్యాఖ్యానములు చేసిరి. ఆనాటి సమకాలికమైన వివిధ వాదములను వేదాంత వ్యాఖ్యానములతో, నిశిత వాదనాబలముతో ఖండించి, సిద్ధాంతీకరించిరి. యథార్థ భావములకు ఆమోదమును తెలుపుచు, తద్వారా - విషయ

ములను సుస్పష్టము గావించుచు, వారి రచన అలవోకగా సాగినది. వీని పర్యవసానముగ ఆవిష్కరింపబడినదే శ్రీ వైష్ణవ సిద్ధాంతము.

## శ్రీభాష్యము

శ్రీభాష్యము శ్రీ రామానుజ యతిసార్వభౌములకు జగదాచార్యత్వమును, అఖండ కీర్తి ప్రతిష్ఠలను సర్వత్ర సముపార్జించి పెట్టిన మహోన్నత బృహత్ గ్రంథరాజము.

వేదాంత సూత్రములు ఉపనిషత్తులకు ఆధారభూతములు. ఇవి సంక్షిప్తముగను, నిగూఢముగను గల క్లిష్టమైన వాక్య పరంపర. శ్రీ రామానుజులవారికి కొన్ని శతాబ్దముల పూర్వమునుండి 'వేదాంత సూత్రములు' ప్రమాణ గ్రంథములకు మూలాధారముగా గలవు. వాని సంక్షిప్తత వలన ధారణ చేయుటకు తగిన సౌలభ్యము కలిగియున్నవి. అనాదిగా అవి వ్యాఖ్యానింపబడుచుండుటవలన, అవగాహనకు శ్రమ కలుగుటలేదు. భిన్న సంప్రదాయస్థులు వీనిని యథోచితముగా వ్యాఖ్యానించియున్నారు.

వేదాంతమునకు సంబంధించి వేదాంత సూత్రములను వ్యాఖ్యాతలు వానికి గల ఉపనిషత్ జ్ఞానము ననుసరించి వివరించిరి. శంకరాచార్యులవారికి పూర్వమే వేదాంత సూత్ర వ్యాఖ్యానములలో ఏక రూపమైన బ్రహ్మమునుగురించి భిన్న వాదము లున్నవి. శంకరాచార్యులవారి బ్రహ్మసూత్రభాష్యము వీ నన్నింటిని ఛేదించి, ఒక నూతన సిద్ధాంతమును నెలకొల్పినది. తరువాత వచ్చిన శ్రీరామానుజ, నింబార్క, వల్లభ, మధ్వ అనబడు నల్వురు వైష్ణవ భాష్యకారులు - శంకర భాష్యమందలి వైపరీత్యమును వెల్లడించుచు, శంకరాచార్యులను ప్రచ్ఛన్న బౌద్ధునిగ చిత్రించిరి. నాటికే ప్రబలముగా గల బౌద్ధుల ప్రాచుర్యమును నిరోధించుటకు తమ పూర్వీకుడగు గౌడ

పాదునివలె శంకరాచార్యులుకూడ బౌద్ధులు ప్రయోగించిన హేతు వాదమునే స్వీకరించి రనుటలో సందేహము లేదు. అయితే, బౌద్ధుల సిద్ధాంతమైన శూన్యవాదము, దానికి వ్యతిరిక్తమైన సత్యజ్ఞానము ఎంతవరకు శంకరాద్వైతమునందు ప్రవేశించినవియో తెలుపుట కష్టమైనప్పటికిని - శ్రీరామానుజాచార్యులు, వారి తరువాత వచ్చిన శ్రీవైష్ణవ వ్యాఖ్యాతలు వర్ణించినట్లు, శంకరాద్వైతము వేదాంత సూత్రముల యథార్థ భావములకు విపరీత వాఖ్యానము లొసంగిన దనుటకు తగిన ఆధారము లున్నవి.

అద్వైతుల ప్రచారమువలన, వారి అనుయాయులవలన పాశ్చాత్య ప్రపంచమున — శంకరాచార్యులవా రొక్కరే ఉపనిషత్తులకు, వేదాంత సూత్రములకు భాష్యములు వ్రాసినా రను విశ్వాస మున్నది. అందువలన, విస్పష్టమైన ఉభయాధ్యయనములనుబట్టి, శంకర భాష్యము వేదాంత సూత్రముల వాస్తవ భావములను ధిక్కరించిన దను రామానుజ వాదమును బలపరచుచున్నది.

సనాతనులైన శ్రీవైష్ణవులు వేదాంత సూత్రములకు మధ్యగల సారూప్యము, అట్లే - వేదాంత సూత్రములకును, శ్రీభాష్యమునకు మధ్య గల ఏకరూపములను పరమ ప్రామాణికములుగా భావింతురు. శ్రీ రామానుజులవారి దృష్టిలో ఉపనిషత్సారమే వేదాంత సూత్రములు కనుక, వేదాంత సూత్రముల వాస్తవ తత్త్వమును తమ సిద్ధాంతమున యథాతథముగా ఆవిష్కరించిరి. శ్రీరామానుజులు ఒక నిర్దిష్ట సంప్రదాయ ప్రతినిధులుగా గాక, శంకరులకంటెను యోగ్యముగా, సమర్థముగా సూత్రభాష్యమును రచించుటలో కృతకృత్యులైనట్లు థిబాట్, ఘూట్ పండితుల అభిప్రాయము.

వేదాంత సూత్రములకు అర్థమును వివరించుటలో రామానుజులు - తాము భావించిన రీతి, ప్రతిసూత్రమునకు ప్రతిపదార్థమును

చెప్పుటయేగాక, సూత్ర సంతతికి యథార్థ సారమును కూడ ప్రవచించియున్నారు. వేదాంత విషయమును తత్త్వము, హితము, పురుషార్థము అని మూడు భాగములుగా విడదీయుట పరిపాటి. 'తత్త్వ' మనగా - బ్రహ్మముయొక్క స్వభావమును వివరించునది. హితమనగా - బ్రహ్మమును పొందు సాధనము. 'పురుషార్థ' మనగా - జీవుని పరమావధి.

శ్రీభాష్యకారులు మొదట బ్రహ్మము పదార్థమనియు, సమర్థమగు కారణ మనియు నిరూపించును. అనంతరము దీనికి విరుద్ధముగా చెప్పబడిన ఇతరవాదములను, ఆక్షేపణములను ఖండించుచు, తమ వాదమును ప్రమాణీకరింతురు.

ద్వితీయాధ్యాయమునందలి మొదటి, రెండు పాదములు విరుద్ధ వాదములను ఒకటి తరువాత ఒకటిగా తిరస్కరించి వైచినవి మూడు నాలుగు పాదములు — సృష్టి నిర్మాణ నిర్వహణమునకు సంబంధించినవి. తృతీయాధ్యాయారంభములో - ఇంతవరకు బ్రహ్మముయొక్క స్వభావమును సూత్రములు ప్రమాణీకరించినట్లు రామానుజులవారు పేర్కొనియున్నారు. తృతీయాధ్యాయము ధ్యాన సాధనములను, భక్తి — ధ్యాన మార్గములను వివరించును. నాలుగవ అధ్యాయము విముక్తి మార్గమును, ఆత్మగత శక్తులను, పరబ్రహ్మ సమైక్యమునకు మూలమైన ధ్యాన మార్గమును విశదపరచును.

శ్రీమద్రామానుజులు తమ శ్రీభాష్యమునందు మొదటి సూత్రమునకు బహు విస్తృతమైన వ్యాఖ్యానమును సమకూర్చిరి. అది రామానుజులవారి మహా సిద్ధాంతముగా భాసిల్లుచున్నది. శ్రీ రామానుజులవారి సిద్ధాంతమునకు ఇది సారాంశముగాను, స్వతంత్ర భాష్యముగను లోకమునందు ప్రసిద్ధమైనది. ఈ ప్రథమ సూత్ర భాష్యము గ్రహించి, జర్మన్ భాషలోనికి 'రామానుజ సిద్ధాంత' మను

పేర అనువదింపబడినది. 'డాక్టర్ హోహెన్ బెర్గర్' అను జర్మన్ దార్శనికుడు దీనిని 'వేదాంత దీప' మను పేర జర్మన్ భాషలోనికి అనువదించెను. 'రుడాల్ఫ్ అట్టో' పండితుని భావనలో - శ్రీ రామానుజుల దివ్య హ స్తములో - సాధారణమైన ప్రారంభ సూత్రము ఒక సమగ్ర విస్తృతిని పొంది, ఒక మహా మందిర సింహద్వారమై, తత్త్వ సారమైన విశిష్ట గ్రంథముగా రాణించుచున్నది.

## వేదాంత దీపము - వేదాంత సారము

భగవద్రామానుజులవారి కృతు లగు తొమ్మిది గ్రంథములలో - ప్రధానమైనది, విస్తృతమైనదియు వేదాంత సూత్రభాష్యము కాగా, మరి రెండు లఘు భాష్యములుగూడ ఉన్నవి. అవియే 'వేదాంత దీపము' 'వేదాంత సారము.'

వేదాంత దీపము శ్రీభాష్యమువలె పరిమాణమునను, క్లిష్టతయందును ప్రామాణికముగా గన్పట్టును.

శ్రీ రామానుజులు ఉపనిషత్తులకు విడివిడిగా వ్యాఖ్యానములు వ్రాయకుండుటకు వ్యవధి లేకుండుట కారణము కాబోదు. శ్రీ రామానుజులు ఉపనిషత్తులను భిన్నత్వము కలిగిన మహా విషయములుగా భావింపలేదనియు, మహావిషయములను వివరించు తత్త్వ సముదాయముగా విశ్వసించినట్లును 'వేదార్థ సంగ్రహము', 'శ్రీభాష్యము' అను రెండు కృతులను బట్టి - తెలియవచ్చుచున్నది. అయితే ఈ ఉపనిషత్తులను యథార్థ వ్యాఖ్యానముతో సమన్వయపరచవలసిన ఆవశ్యమును వారు గుర్తించిరి. 'వేదాంత సూత్రములు' అట్టి సమన్వయమును సాధించినవి. సర్వ ఉపనిషత్తులను అర్థము చేసికొనుటకు ఈ గ్రంథమే మూలము. అందువలననే ఉపనిషత్తులపై రామానుజులు చేసిన ఉపన్యాసము లన్నియు దాదాపు వేదాంతసూత్రము

లను ఆధారము చేసికొన్నట్టివే. 'వేదాంత దీపము'ను శ్రీభాష్య రచనానంతరమే రచించినట్లు కన్పించును.

శ్రీభాష్యమును సన్నిహితముగా అనుసరించినను, 'వేదాంత దీపము' శ్రీభాష్యమునకు లఘు టీక కానేరదు. వేదాంత దీపము నందు మహా విషయము లనేకము లున్నవి. ప్రథమ సూత్రమునకు పూర్వము ఉపోద్ఘాతమునందు విశిష్టాద్వైత సిద్ధాంతము ముచ్చటగా సంగ్రహింపబడినది. శ్రీభాష్యమునందలి ప్రథమ సూత్రమువలె దీనియందు విస్తృతమైన వ్యాఖ్యానము లేదు. అచ్చటచట కొన్ని దృష్టాంతములు మినహాయించినచో - శ్రీభాష్యమునకు, వేదాంత దీపమునకును అధికరణముల మధ్య అంతగా వైవిధ్యము కన్పట్టదు. అటులనే, అదియే వ్యాఖ్యానము అదియే సూత్రమునకు మరి యొకచోట పునరుక్తము కాలేదు.

'వేదాంత సారము' శ్రీ రామానుజుల మొదటి కృతి యనుటకు విశ్వసనీయమైన ఆధారము లున్నవి. శ్రీభాష్యమునందువలె వేదాంత సారము'నందు ప్రథమ సూత్రమునకు విపులమైన వ్యాఖ్యానము లేదు. 'వేదాంత దీపము'లోవలె వ్యాఖ్యకు తొలుత ఉపోద్ఘాతము లేదు. కాని, రెండవ సూత్రమునకు వ్యాఖ్యానము చేయబడినది. అది - "జన్మాద్యస్య యతః" (ఎవరినుండి ఈ జగత్తు ఉద్భవించినది?) వేదాంత శాస్త్ర మంతటికి సారమైన భగవంతుడు జగత్కారణుడుగ పురుషుడు, సృష్టి స్థితి లయ కారకుడు అను మహా సత్యమును ఈ ద్వితీయ సూత్రము వివరించుచున్నందున, సూత్రము లన్నింటిలో ఇయ్యది అతి ముఖ్యమైనది కావున, 'వేదాంత సారము' సనాతనమైన వేదాంత తత్త్వమునే వివరించుచున్నందున, శ్రీభాష్యమునందుకంటె స్వతంత్ర వ్యాఖ్యాన మిందు స్వల్పముగ కానవచ్చును.

వేదాంత శాస్త్రముసగు సంబంధించిన సిద్ధాంతము లన్నియు - జీవాత్మ, పరమాత్మ, ప్రకృతి అను తత్త్వముల నడుమ భేద మున్నట్లు అంగీకరించినవి. దృశ్య జగత్తు లయ మగునపుడు ఈ భేదము - వ్యవహార, అనర్ఘ, సూక్ష్మము లను భేదములతో భావింప నగును. అద్వైతులు బ్రహ్మమునకు అవిద్యను ఆపాదించుటవలనను, భేదాభేదవాదులు బ్రహ్మమును పరిమిత మొనర్చుటవలనను - లౌక, ఉపాధులవలనను బ్రహ్మతత్త్వమునకు అసంపూర్ణత్వమును ఆపాదించిరి. 'వేదాంత దీపము', 'వేదాంత సారము' అను రెండు కృతుల ఉపక్రమమునందును ఈ యంశము స్పష్టము చేయబడినది.

శ్రీ రామానుజులు ప్రత్యర్థులైన అద్వైతులను, భేదవాదులను ఆక్షేపించుటకు మూలకారణ మిదియే భగవంతుని ఔన్నత్యమునకు, మహోత్కృష్టమైన పూర్ణప్రజ్ఞకు ప్రత్యర్థుల వ్యాఖ్యానములు మిక్కిలి ఆక్షేపణీయములు. భగవంతుని పూర్ణప్రజ్ఞను, మహోత్కృష్టతను రామానుజులవారికంటె నిర్ద్వంద్వముగా నొక్కి వక్కాణించినవారు మరి యొకరు లేరు.

## శ్రీ భగవద్గీతా భాష్యము

శ్రీభాష్యమునకు పిమ్మట పరిమాణములో విస్తృతమైనది - శ్రీ రామానుజార్యులవారి మహా వ్యాఖ్యాన రూప మైన శ్రీమద్భగవద్గీతా భాష్యము. శ్రీభాష్యము నందలి ప్రధాన విషయములు యథా యోగ్యములుగా, సందర్భానుసారము శ్రీమద్భగవద్గీతా భాష్యమునందును కన్పట్టును బ్రహ్మసూత్రములవలె నిగూఢము గాక, భగవద్గీతా శ్లోకములు కొంత సౌలభ్యముగా నుండును గావున, శ్రీ రామానుజులు గీతా భాష్యమున అచ్చటచట ప్రధాన విషయములను కొంత విపులముగా వ్యాఖ్యానించినను, మొత్తముమీద కొన్ని విశేష తాత్పర్యములతో శ్రీభాష్యమును సమన్వయపరచి రచించిరి. ఈ విషయమునందును శ్రీ రామానుజులు కేవలము గీతాశ్లోకములకు

యథాతథముగా మాత్రమె గాక, పూర్వాచార్యుల వ్యాఖ్యానమును సైతము జోడించి గీతాభాష్యమును రచించిరి.

తమ పూర్వాచార్యులైన యామునాచార్యులవారు ఇంతకు మున్నే 'గీతార్థ సంగ్రహ' మను పేర భగవద్గీతకు సంగ్రహ భాష్యమును వ్రాసియుండుటనుబట్టి, గీతయందలి ప్రతి అధ్యాయమునకు ఆ శ్రీ యామునాచార్యులవారి సంగ్రహ వ్యాఖ్యానమును ఆధారము గావించుకొనియే శ్రీ రామానుజాచార్యులవారు గీతాభాష్యమునకు విపుల వ్యాఖ్యానమును రచించెనని 'వాన్ బెటెనెన్' అభిప్రాయము.

శ్రీ యామున రామానుజులు కర్మ జ్ఞాన యోగములను వాని పరస్పర సంబంధ మెట్లున్నను, ఆత్మ విచారమునకు ఆలక్ష్యక మగు పరిణామ దశలో అవి భగవంతుని సాన్నిధ్యమునకు చేర్చజాలవని భావించిరి. భక్తి యొక్కటియే ముక్తికి సులభ మార్గమనియు, జ్ఞాన కర్మలు భక్తిమార్గమునకు అంగము లనియు, ఇదియే భగవద్గీతా సార మనియు ఇరువురును నొక్కి వక్కాణించిరి.

వేదప్రచోదిత కర్మ లన్నియు భగవత్ప్రీతికరము లే. భగవంతుని పొందుటకు ఆత్మవిచార మావశ్యకము.

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ !
తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ... .. "

అనునట్లు, అర్థకామపరులు, కైవల్యపరులు, జ్ఞానులు అని భక్తులు ముత్తెరంగులుగా నుందురు. అట్టివారిలో జ్ఞాని మాత్రమే భగవంతుని పొందగలడని యామున — రామానుజు లిరువురును స్పష్టము గావించిరి.

భగవద్గీతాభాష్యము బహుశః శ్రీ రామానుజాచార్యులవారి కడపటి విశిష్టకృతి కావచ్చును. సిద్ధాంత వాదములను భగవంతుని స్మరణమునకు అధీన మొనర్చబడిననాటి రామానుజులవారి చరమ

కాల పరిస్థితులను ఇయ్యది చక్కగా ప్రతిబింబించును ముఖ్యముగా వేదాంత సూత్రములవంటి వేదాంత శాస్త్ర రచనకు సంప్రదాయ గ్రంథ వ్యాఖ్యానములకు నడుమ - గీతాభాష్యము సమన్వయ స్వరూప మగు ఒక వారధిగా గన్పట్టును.

భగవద్గీతా భాష్యము శ్రీ రామానుజులవారి పరిపూర్ణమైన పాండిత్య ప్రకర్షకు, వేదాంత విద్యా విశేషమునకు ఒక మచ్చుతునుకగా మనము భావింపవచ్చును.

భగవత్ప్రిపన్నులుగా, భగవత్పరతంత్రులుగా, ఉభయ వేదాంత ప్రవర్తకులుగా, జ్ఞానాధికులుగా, మహా మనీషులుగా శ్రీ రామానుజ యతిసార్వభౌములను గీతాభాష్యము ఆవిష్కరించి యున్నది.

## గద్యత్రయము

శరణాగతి గద్యము, రంగనాథ గద్యము, వైకుంఠ గద్యము అనునవి మూడును శ్రీ రామానుజుల వచన స్తోత్రములు. ఇందలి శరణాగతి గద్యము శ్రీ రామానుజ యుగమునందును, అనంతర కాలమునందును ప్రపత్తి యనబడు శరణాగతి తత్త్వమును ప్రబోధించుటలో మిక్కిలి ప్రాశస్త్యము వహించినది.

భక్తుడు భగవంతునకు సర్వాత్మనా సమర్పణము గావించుకొనుటయే శరణాగతి ఇట్టి శరణాగతి సారమును శరణాగతి గద్యము ప్రబోధించును.

గద్యత్రయములో రెండవది శ్రీరంగనాథ గద్యము. ఇది శరణాగతి గద్యముకంటె చిన్నది. శ్రీరంగనాథుని దివ్య చరణ సన్నిధిలో కృతికర్త యగు శ్రీరామానుజులు ప్రపత్తిని సమర్పణ జేసి, తమను నిత్యకింకరులనుగా తలంచుకొనుచు, కటాక్షింపవలసిన దని శ్రీ రంగనాథస్వామికి చేసిన ప్రార్థనము.

శరణాగతి చేసిన భక్తుడు ధారణ చేయవలసిన నిత్య ధ్యాన పాఠ మిది. ఆధ్యాత్మిక సాధనకు ధ్యానము అత్యావశ్యకము. భక్తుడు తనను భగవంతునకు సర్వ సమర్పణము గావించుకొనిన పిమ్మట, మోక్షసాధనకై భగవంతుని కటాక్షమును ఆకాంక్షించుచు అనుష్ఠింపవలసిన నిత్యానుసంధేయము శ్రీ వైకుంఠ గద్యము.

## నిత్యగ్రంథము

ఇక నిత్యగ్రంథము శ్రీవైష్ణవ గృహములలో తిరువారాధన మునకై ఉద్దేశింపబడిన నిత్యానుసంధాన గ్రంథము. ఇందు గద్య త్రయమునందలి భావములు పొందుపరుపబడి, సందర్భోచితముగా అచ్చటచట విశిష్టాద్వైత సిద్ధాంత విషయములు వివరింపబడినవి. భక్త ప్రపన్నులకు నిత్యప్రార్థనా గ్రంథముగ ఇది భావింపబడు చున్నది.

ఈ నిత్యగ్రంథము తమ తమ గృహములలో ప్రాతఃకాలమున తమ తమ ఇష్టదైవములను అర్చించు విధానమును వివరించును. భగవ ద్ధ్యాన సమయమునందు భగవదర్చామూర్తిపై మనస్సును లగ్నము గావించి ఉపాసించు విధానమును ఈ నిత్య గ్రంథము బోధించును.

ఈ రీతిగా - శ్రీ భగవద్రామానుజ యతి సార్వభౌముల గ్రంథరాజము లన్నియు - జ్ఞాన - విజ్ఞానదాయకములై, భక్తి - ప్రపత్తి ప్రబోధకములై విరాజిల్లుచున్నవి.

"యదక్షర పదభ్రష్టం మాత్రాహీనంతు య ద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ నమోఽస్తుతే."



('The Thelogy of Ramanuja' అను గ్రంథమునందలి "The Sanskrit writing Attributed Ramanuja" అను ప్రకరణమునకు స్వేచ్ఛానువాద మిది

— (వ్యాసకర్త)

# శ్రీమద్రామానుజులు - ఉపనిషత్తులు

'సహజ కవి - విద్యా రత్న'

## శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు

—❖—

### ప్రణామాంజలి

"శ్రీమాధవాంఘ్రి జలజద్వయ నిత్యసేవా
ప్రేమావిలాశయ పరాంకుశ పాదదాసమ్
కామాదిదోష హరమాత్మ పదాశ్రితానాం
రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా.

### ఉపక్రమము

ప్రస్థాన త్రయములో - ప్రప్రథమమైన ఉపనిష న్మహా హిమవ న్నగమునుండి బ్రహ్మసూత్రము లను బ్రహ్మపుత్రా నదియు, భగవద్గీత యను పావన భాగీరథియు ప్రవహించినవి. ఉపనిషత్తు లెనిమిది :-

(1) ఈశోపనిషత్తు (2) కేనోపనిషత్తు (3) కఠోపనిషత్తు (4) ప్రశ్నోపనిషత్తు (5) ముండకోపనిషత్తు (6) మాండూక్యోపనిషత్తు (7) ఐతరేయోపనిషత్తు (8) తైత్తిరీయోపనిషత్తు.

ఇవిగాక, ఉపనిషత్తులకు సంబంధించిన (1) ఛాందోగ్యము (2) బృహదారణ్యకము (3) కౌషీతకి (4) శ్వేతాశ్వతరము 5) మహోపనిషత్తు (6) నారాయణోపనిషత్తు అనునవి కలవు.

ప్రస్థాన త్రయములో ఉపనిషత్తులు ప్రథమ స్థానము నాక్రమించియున్నవి. బ్రహ్మసూత్రములు వానికి సహాయకరములై యున్నవి. భగవద్గీత ఉపనిషత్తుల సారాంశము. గీతా సందేశము

సంపూర్ణ భక్తిప్రపత్తులు - బ్రహ్మసూత్రములును, భగవద్గీతయు ఉపనిషత్ క్షీరాబ్ధిని మథించిన బాదరాయణ వచస్సుధ.

శ్రీ రామానుజులు ఉపనిషత్తులకు ప్రత్యేక వ్యాఖ్యానము వ్రాయలేదను విచారమవసరము లేదు. శ్రీ భాష్యములోను, వేదార్థ సంగ్రహము నందును శ్రీరామానుజుల అభిప్రాయములు విశదీకరింపఁ బడియున్నవి.

## ఈశోపనిషత్తు

శ్రీరామానుజులు తమ శ్రీభాష్యమున, ఈ యుపనిషత్తునుండి నాలుఁగు వాక్యములను ప్రమాణములుగాఁ జేర్కొనియున్నారు :-

(1) ఈశావాస్య మిదం సర్వమ్

(2) కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే.

(3) సపర్యగా చ్ఛుక్రమకాయ మవ్రణ - మస్నావిరంగ్ శుద్ధ మపాపవిద్ధమ్.

(4) విద్యాంచావిద్యాం చ - యస్తద్వేదో భయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా - విద్యయా అమృత మశ్నుతే

**తాత్పర్యము :**

(౧) ఈశ్వరుఁడీ విశ్వ మంతయు వ్యాపించియున్నాఁడు. అతఁడు సర్వాంతర్యామి, సర్వపరిపాలకుఁడు.

(౨) ఇక్కడనే కర్మల నాచరించుచు నూరేండ్లు జీవింప వాంఛింపుము. నీ కీ మార్గమే ధర్మసూత్రము. దీనికంటెను అన్యము శూన్యము. నిష్కామియైన మానవుని కర్మలు కళంకితముఁ జేయఁ జాలవు.

(3) కర్మయోగి పరమాత్మను తేజోవంతునిగాను, అశరీరునిగాను, చెఱుపు, పాని కలనివానిగను, వంపులేని, స్వచ్ఛమైన, దోషములు అంటని వ్యక్తిగను గ్రహించును.

(4) విద్యను (జ్ఞానమును), అవిద్యను (కర్మను) ఎవఁడు మిళితముగా నెఱుంగునో, అతఁడు విద్యచేత మృత్యువును (ప్రారబ్ధ కర్మల పరిణామమైన ఆధ్యాత్మిక స్తబ్ధతను) నశింపఁజేయును. అనంతరము విద్యవలన అమరత్వము సాధించును.

దీనికి రామానుజుల వ్యాఖ్యానము :-

మోక్షసాధనకు ఈశ్వర ధ్యానమే ముఖ్యమైన ఉపాయమైనను, యావజ్జీవితము కర్మల నాచరించుచునే యుండవలెను. కర్మ జ్ఞానములు రెండును సాయుజ్య మూలములే. అవిద్య యనఁగా - కర్మ. అది ప్రారబ్ధ కర్మల నశింపఁజేసి, విద్యా నిర్గమనమును సుకరముఁ జేయును. తత్ఫలితము బ్రహ్మానుభూతి.

వేదార్థ సంగ్రహములో ఈ చర్చయందు - 'కల్యాణతమం రూపమ్' అను ప్రయోగమువలన, ఉపనిషదుక్తి రామానుజులచే స్పష్టముగా వాడఁబడియున్నది

## కేనోపనిషత్తు

శ్రీ రామానుజులు పై విషయము నింకను శ్రీభాష్యములో - ఈ క్రింది వాక్యములను గైకొని వివరించియున్నారు :-

(1) యస్యామతం తస్య మతం, యస్య న వేద సః.
అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాత మవిజానతామ్ ॥

(2) నేదం యదిద ముపాసతే.

(3) ప్రాణస్య ప్రాణః.

**తాత్పర్యము :-**

(౧) ఎవనికి బ్రహ్మము అగోచరము అను అభిప్రాయమో, వానికది గోచరము. ఎవనికది గోచరము అను ఉద్దేశమో, వానికది యగోచరము.

(౨) అదియే బ్రహ్మము. వారు పూజ సేయునది కాదు.

(౩) బ్రహ్మము (పరమాత్మ) ప్రాణమునకు ప్రాణము.

**వీనిని గూర్చి రామానుజుల యభిప్రాయములు -**

మొదటి వాక్యమును గూర్చి వారి యుద్దేశ మే మన :- బ్రహ్మము అపారమైనది. కావున, ఏ కారణముచేతనైనను అజ్ఞానము కాదు కాని, సంపూర్ణమైన అశేషమైన అవగాహ్యమనుట కల్ల అంతరిక్ష లక్ష్యముగా ప్రయోగింపబడిన మార్గణము అంతయంతు అవనీతలమునకే మఱలి వచ్చును. కాని, హేతువు ఆ బాణము సంచరించుటకును ఇక ఏ యవకాశము లేక కాదు. మఱి యెందు కన, వాని యూర్ధ్వ గమనమునకు నిమిత్తమైన శక్తి - వ్యయమైపోయినది. ఆ అప్రమేయమును గ్రహింప సమర్థత లేమిని వినయపూర్వకముగా అంగీకరించుటయే వివేక - పరిజ్ఞానముల లక్షణము.

రెండవ వాక్యము వేదాంత జ్ఞానముకంటె ఉపాసనాభ్యాసమును అల్పముగా నెంచుట కాదు. పునరుద్ధారణ లేని మానవ సమూహాపు టభినివేశముకంటెను ఇతరమైన దని వక్కాణించుటయే. అది భక్తిమార్గములో మార్పునొ నంతరించుటయేగాని, దాని పరిత్యాగము కాదు.

మూఁడవ వాక్యము బ్రహ్మము బీజము, పోషకము అధికారి అనుటయే.

## కఠోపనిషత్తు

శ్రీ రామానుజుల యుద్దేశములో నచికేతుని వృత్తాంతము వలన, చరమ విమోచన సందర్భము – పరిమితాత్మగతిజ్ఞానము దెలిసి కొను ప్రార్థన గానఁబడుచున్నది. యముని ప్రత్యుత్తరమున – మానవ దైవములఁ గూర్చియు, మానవుని దైవసాన్నిధ్య సంపాదన మును గుఱించియు సంపూర్ణ తత్త్వ మున్నది.

ఈ యుపనిషత్తులో – పరమాత్మ సాన్నిధ్య పురోగమనమునకు జీవితావస్థలలో క్రమపఱచు ప్రాధాన్య కర్మల వివరణములు ప్రతిపా దింపఁబడియున్నవి. వీని కడపటి యద్భుత క్రియ – దేవదేవుని యధీ నమై, ఆ బ్రహ్మమునే సాధనముగా నుపయోగించుకొనుట.

'తస్య చ వశీకరణం త చ్ఛరణాగతి రేవ.'

— (శ్రీభాష్యము)

"నాయమాత్మా ప్రవచనే న లభ్యః
న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వామ్."

— (కఠోపనిషత్తు)

**తాత్పర్యము** –

ప్రవచనముచేతను, వేదబోధనాలోచనలచేతను ఆత్మావ బోధము లభింపదు. నిశ్చల ధ్యానముచేతఁగాని, శ్రుతిశ్రవణము వలనఁగాని చేకూఱదు. ఎవనిని ఈ యాత్మ యెన్నుకొనునో, వాని చేతనే పరమాత్మ గమ్య మగును. ఆత్మ తన స్వస్వరూపమును వానికే బహిరంగము సేయును. ఇదియే శ్రీ రామానుజుల వ్యాఖ్యానము.

## ప్రశ్నోపనిషత్తు

ఇం దొక చిన్న కథ గలదు :– ఆర్గురు బ్రహ్మ జిజ్ఞాసువు లైన మునులు – పిప్పలాచార్యుని సన్నిధిఁ జేరి, సంపూర్ణ జ్ఞానమును

ప్రసాదింపవేడిరి. అందులకు పిప్పలాచార్యుఁడు వారు తన యొద్ద ఒక సంవత్సరము సరియైన ఆధ్యాత్మిక నియమములను పాటించి వసింపవలె ననియు, తదనంతరము వా రడిగిన ప్రశ్నములకు సదుత్తరముల నొసంగెద ననియు సెలవిచ్చెను. ఆ ప్రకారమే వారు ప్రవర్తించి, సంవత్సరాంతమున - ఒక్కొక్కరును ఒక్కొక్క ప్రశ్న వేసిరి. ఆ యాఱును సంప్రదాయ సిద్ధములే కాని, నాలుగవది, ఐదవది దక్క, తక్కినవి వాస్తవికముగా - వేదాంత ఆధ్యాత్మిక పరములు కావు.

నాల్గవదియైన గార్గ్యేయుని ప్రశ్న :- జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకుఁ జెందిన మన చైతన్యమును గుఱించియు, చరాచర ప్రత్యక్ష జగత్తంతయు దేనిమీఁద ఆధారపడి యున్నదో, ఆ విషయమునకు సంబంధించినదియు చేయఁబడినది. శ్రీ రామానుజు లెందువలననో యిందలి వేదాంతపరమైన గుణ గ్రహణమును జేఁబట్టలేదు.

మానవుని చైతన్యవంతమైనది విజ్ఞానాత్మ పరబ్రహ్మ యాలంబనముగా నుండునని, విద్యమానమైనది (ఉండునది) అంతయు - పక్షులు తమ గూండ్లలో విశ్రమించురీతిని నిలచియుండుననియు, దానిని ఆకట్టుట (గ్రహించుట) విశిష్టాద్వైత - నిరవధిక విశిష్టాద్వైత సిద్ధాంతము. ఇది నిర్వివాదాంశమే కాన, శ్రీ రామానుజులు దీనిని బహుశః ప్రత్యేకించి వ్యాఖ్యానముఁ జేసియుండలేదు.

సత్యకామునిదైన అయిదవ ప్రశ్నయు, దానికి పిప్పలాచార్యుని సమాధానమును శ్రీ రామానుజుల బ్రహ్మసూత్ర వ్యాఖ్యానమున చర్చింపఁబడియున్నది. 'ప్రణవము (ఓమ్)లోని సంపూర్ణ ధ్యానము శాంతమై, అజరమై, అభయమై, అమృతమై, జ్ఞాన గోచరమైన పర్యవసాన పరమానంద ప్రదమైన పరబ్రహ్మమే' యని శ్రీ రామానుజుల భావన. ఈ భావము - భగవద్గీతలోని విశ్వరూప సందర్శన యోగమునఁ గానవచ్చును

## ముండకోపనిషత్తు

ఈ యుపనిషత్తులోని రెండు పరిచ్ఛేదముల మూలమునసే శ్రీమద్రామానుజులు సర్వోపనిషత్సారమును వ్యక్తీకరింపఁగల్గిరి. 'దేని నెఱింగినచో సర్వముఁ దెలియును?' అను శౌనక నామక గృహస్థుఁడు అంగిరస ఋషి నడిగిన ప్రశ్నకు - అతఁడొసంగిన సమాధానమున - ఉద్దాలకుఁడు శ్వేతకేతునకుఁ జేసిన బోధనమును, యాజ్ఞవల్క్య మైత్రేయికొసర్చిన యుపదేశమును క్రోడీకరించి, శ్రీ రామానుజులు యథార్థ వివరణమును ప్రసాదించి, ఏకత్వమును సిద్ధాంతీకరించి, అనేకత్వమును నిరాకరించిరి. బ్రహ్మముయొక్క స్వభావమైన - ఆధిభూతమైన - ఆదిమమైన బాహ్యదృష్టిని శ్రీమద్రామానుజులు చాలవఱకు ఖండించి, కర్మప్రాధాన్యమై, ఆచార కర్మకాండ సంయుక్తమై యున్న జీవిత పరిగణనములో విశ్వాధారమైన ఆత్మ యున్నదని నిరూపించియున్నారు.

## మాండూక్యోపనిషత్తు

ఈ యుపనిషత్తు - సకలోపనిషత్తులయందును అనిశ్చియమైన స్థానములో నున్నది. ఏ వ్యాఖ్యాతయు బ్రహ్మసూత్రములలో దీనిని ప్రస్తావింపలేదు. ఇయ్యది - ప్రణవముయొక్క మహాత్మ్యమును గూర్చియు, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను గుఱించియు చర్చించును. బ్రహ్మసూత్రములలోని 'న స్థానతోఽపి పరస్య ఉభయలింగమ్ సర్వత్ర హి' అనఁగా - బ్రహ్మమునకు స్థాన విచక్షత లేదు. అతఁడు శాస్త్రములకును, అనుమానాస్పద లక్షణములకును 'సుదూరుఁడు' అని శ్రీ రామానుజుల సందేశము.

## ఐతరేయోపనిషత్తు

ఈ యుపనిషత్తు - తొన ఆరంభ ప్రకటనలోను, దివ్యమైన ఉపసంహారములోను ప్రసిద్ధిఁ జెందినది.

"ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్. నాన్యత్ కించన మిషత్
స ఈక్షత లోకాన్ను సృజా ఇతి"

అనఁగా - జగత్తంతయున్ను మొదట ఆత్మయే. మఱి యేదియు లేదు. కావున, భగవంతుఁడు లోకములను సృజించెదను' అని నిశ్చయించుకొనెను.

శ్రీమద్రామానుజు లీ వాక్యమును తమ వేదార్థ సంగ్రహము నందు - ఒక ముఖ్యమైన వాదమునందును, బ్రహ్మసూత్ర వ్యాఖ్యానమునందును, అనేక పర్యాయములు పేర్కొనియున్నారు.

ఉపనిషత్తు లన్నిటియందును, బ్రహ్మము - 'జ్ఞానము, విజ్ఞానము' మున్నగు పదజాలముచే నిర్వహింపఁబడినది. అయ్యది ఈ యుపనిషత్తు ముగింపునకుఁ జెందును. శ్రీమద్రామానుజులు వీని యన్నింటికిని వివరణములను సాధారణ వైఖరిలో నొసంగియే యున్నారు. అవి ఈ వాక్య తాత్పర్యమును విశదీకరించును. కావున, దీనికి వారి ప్రత్యేక వ్యాఖ్యాన మావశ్యకము కాదు.

## తైత్తిరీయోపనిషత్తు

తైత్తిరీయోపనిషత్తు ఒక అద్భుత రచన. అది తన మధుర నాదముతో - పఠితలను, శ్రోతలను ఆకట్టివేయును. పరమ సత్యము యొక్క సవ్యమైన భావనను సిద్ధము సేయును. ఆ భావన తక్కిన యుపనిషత్తులలో దృఢముగా నణగియున్నదియేకాని, ఇందే స్పష్టమైన, యుక్తమైన సూత్ర నిర్దేశము ననుగ్రహించును. రామానుజుల యుపనిషదన్వయములను సర్వమును గనఁబఱచుట అసాధ్యము వారి రచనలలో - ఉపనిషత్తుల మూల గ్రంథాన్వయములను తఱచుగా వినియోగించుట గన్పట్టుచున్నది. ఆ ఆచార్యుల అత్యంత భావ గర్భితములైన తైత్తిరీయ వ్యాఖ్యానమును మాత్రమే మనము గమనింపఁ గలము.

ఈ యుపనిషత్తు బ్రహ్మమునకు నిర్వచన ద్వయమును ప్రతిపాదించుచున్నది. అందు మొదటిది -

"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ."

దీని భావము రామానుజుల అభిప్రాయము ప్రకారము - బ్రహము సత్యము. అనఁగా - నిబంధన రహితముగా విద్యమానమై, సకల విధములుగా నున్న అపారమైన తేజస్సు. జ్ఞాన మనఁగా - కేవలము ఎఱుకయే కాదు, దాని యర్థము ఆత్మను తెలిసికొనుట. ఆ తెలిసికొనుటకు హద్దులు లేవు. 'అనంతం' అనఁగా - అంతరిక్ష రహితమైనది, ఎల్లలు లేనిది. 'ఆత్మైక నివాసము గల బ్రహ్మము. నిర్వహించలేనిది ఉనికిలో మఱి యేదియు లేదు' అని దాని యర్థమును అది సూచించును. సంపూర్ణత్వముయొక్క గుణ సంబంధమైన యనంతత్వమునుగూడ అది కనఁబఱచును. నిర్వచన ప్రతిపాదనము బ్రహ్మముయొక్క స్వాభావికమైన ఏకైకోత్కృష్టతను తెలుపును. బ్రహ్మము నిర్గుణముగా ఈ నిర్వచనము ప్రతిపాదించుట రామానుజులచే ఖండింపఁబడినది.

రెండవ నిర్వచనము :-

"యతో వా ఇమాని భూతాని జాయన్తే ఎన జాతాని జీవన్తి
యత్ప్రయం త్యభిసంవిశ న్తి"

తాత్పర్యము :-

దేనినుండి అఖిల భూతములు జనించునో, జనించిన యనంతరము దేనిలో నివసించునో, నశించిన పిమ్మట ఎందు ప్రవేశించునో - అదియే బ్రహ్మము.

జగత్తుయొక్క సృష్టి స్థితి లయోత్పాదక కార్యములు మూలాధారము గల సత్యములు.

మొదటి నిర్వచనము పరమాత్మయొక్క ప్రామాణికమైన పర బ్రహ్మ స్వభావమును తెలుపగా, రెండవది తదన్వయముతోఁ గూడి నదై, పరమాత్మయొక్క విశ్వ స్వయంప్రత్యక్షీ కరణమును తెలియఁ జేయును. సూత్రకారులును, శ్రీమద్భాగవత కర్తలును ఈ రెండవ నిర్వచనమును భగవత్స్వభావము యొక్క ప్రథమ ప్రకటనముగా అవలంబింతురు.

(2) బ్రహ్మముయొక్క జగత్సంబంధమైన స్వరూపము తుదకు తొలఁగింపఁదగిన బాహ్యవిధి కాదని 'బ్రహ్మానందవల్లి' అను భాగమున నిర్ణయింపఁబడినది.

"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః, సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి, ఇదం సర్వ మసృజతః, తదాత్మానం స్వయ మకురుత"

**తాత్పర్యము :-**

నిశ్చయముగా పరమాత్మనుండియే అంతరిక్ష వైహాయస ముద్భవించినది 'నేను అనేకమై జనింతును' అని పరబ్రహ్మము సంకల్పించెను. ఆ పరమాత్మ అన్నింటిని సృజించెను. కావున, తాను తన్నే అనేకముగాఁ జేసికొనెను.

(3) బ్రహ్మ మనఁగా - ప్రపంచమును క్రమపఱచి, అస్తిత్వములోనికి వన్నునది' అని మాత్రమే కాదు — బ్రహ్మము చరాచర వస్తువులలో ప్రవేశించి, తా నవియే యున్నట్లుండును. అప్రత్యక్ష లోకములో - బ్రహ్మముయొక్క స్వయం సంభూతియే సృష్టి. బ్రహ్మము ప్రపంచము సృకీతము. అనఁగా - దేవుఁడు వానిని తన రూపముగాఁ గైకొనెను. ఈ జగత్తుగా ఈశ్వరుఁడు పరిణమించుట వలన, బ్రహ్మముయొక్క సర్వోత్కృష్ట పరిపూర్ణత్వమునకు ఏ హానియు లేదు. ఇదియే ——

"సత్యం చా నృతం చ సత్య మభవత్."

అను వాక్యమునకు అర్థము. సర్వోత్కృష్టత సర్వాంతర్యామి యయ్యును, తన యౌన్నత్యమును, బోఁగొట్టుకొనదు. బ్రహ్మము సకల సృష్టియొక్క అంతరాత్మ మాత్రమే కాదు. దాని మూలముననే జగత్తుయొక్క సర్వశక్తులును —

"భీషాస్మా ద్వాతః పవతే. భీషోదేతి సూర్యః. భీషాస్మా దగ్నిశ్చేంద్రశ్చ మృత్యు ర్ధావతి పంచమః ."

అనఁగా - 'భగవ దాజ్ఞ చేతనే అన్ని శక్తులును నడచును' అను విశ్వ సూత్రములను పాటించుచున్న అది జగన్నిర్మాణ క్రమము లైన శక్తియొక్క ప్రకటనయే.

(4) ఈ యుపనిషత్తు - భగవంతుని శారీరకాత్మగా వర్ణిం చును. నిజమునకు బ్రహ్మయే ఆత్మ. పరిమిత జీవితము గల స్మృతియుత స్మృతి రహిత జీవభూయిష్ఠమైన విశ్వమును అతని శరీరము. ఈ సత్యమే బ్రహ్మసూత్రముల శారీరక సూత్రములను సంజ్ఞ యుండుటకు అంతరార్థము.

(5) శారీరక మగు ఆత్మాన్వేషణలో - అన్నమయ పురుష, ప్రాణమయ పురుష, మనోమయ పురుషములు అడ్డు వచ్చును. ఇవి అట్టి మహోన్నత స్థితి నందుకొనఁజాలవు. విజ్ఞానమయము వ్యక్తిగత మగు ఆత్మయే గాని, బుద్ధి కాదు. అది ఉనికియొక్క ఉత్సాహ కేంద్రము. దానివలన, కర్మ త్యాగములకు నైతిక ప్రారంభయత్నము చేకొనఁబడును. రసమును - లేక, బ్రహ్మమును గ్రహించునప్పుడు వ్యక్తిగతమగు ఆనందమును పొందును. అనఁగా - బ్రహ్మము తన కును, తన్ను గ్రహించు - ఆనందమును గ్రహించు శక్తికిని గల వ్యత్యాసమును నిర్ణయించును,

(6) బ్రహ్మోపాసకుఁడు అది ఆనందమయ మని కనిపట్టినపుడు కృతార్థుఁ డగును. ఆనందమయమన్నను, ఆనంద మన్నను ఒక్కటే. ఆనందమయ మనఁగా - ఎంత మాత్రము బాధ, కీడు లేనిది. బ్రహ్మా నంద పరిమిత మైనది. దానితోఁ బోల్చిన - ఇతరానందములు అల్ప ములు, నిస్సారములు. ఆనంద మయములోఁ జేర్కొనఁబడిన ప్రమో దాదులు, అనఁగా - కోరిన వస్తువు లభించుట, దానిని వినియోగించుట మున్నగునవి ఆనంద మయము మిశ్రమ పదార్థ మని నిరూపించవు. అలంకారికము యథార్థము కాదు. బ్రహ్మము ఆనందమునకు పుచ్ఛ మనుట - అది దానిని, దానినుండి వేఱు నేయు బీజ మనియే అర్థము. బ్రహ్మము ఆనంద మయముయొక్క స్థిరమైన సారము. ఆనందము దాని నిర్వచన లక్షణము. పరమానందమయమైన బ్రహ్మముయొక్క లక్షణమును ప్రదర్శించుటయే తైత్తిరీయోపనిషత్తు యొక్క ప్రధా నాశయము. తనలోనే, తనకొఱకే బ్రహ్మము ఆనందమయ మనియు, అది తన భక్తులకు ఆనంద మొసంగు ననియు ఉపదేశింపఁబడు చున్నది.

"రసో వై సః. రసగ్గు హ్యేవాయం లబ్ధ్వాఽనందమయీ భవతి.
.. ఏషా హ్యేవానందయతి ... ."

**తాత్పర్యము :-**

అతఁడే వాస్తవముగా ఆనందము. ఆ ఆనందమును పొంది, ఆతఁడే ఆనందమయుఁ డగును. ఏల ననఁగా - ఆతఁడే ఆనం దమును గలుగఁజేయును. జగత్తు ఆనందమయ మగుటచేత, జీవులు దానిలో నుండుట, ఆనందము ననుభవించుట సాధ్య మగుచున్నది.

"కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్, యదేశ ఆకాశ ఆనందో న స్యాత్ "

**తాత్పర్యము -**

ఈ ఆకాశము బ్రహ్మము (ఆనందము) గానిచో, నిశ్చయ

6 )

ముగా జీవింపఁగల్గినవాఁ డెవ్వఁడు ? ఎవఁ డానందముఁ జెందఁ గలఁడు ?

**సారాంశము :-**

భగవ ద్రహితమైన ప్రపంచము ఆత్మనిర్వాణము కనుమ కాఁజాలదు. అప్రమేయమైన వైదికానందమును క్రమక్రమముగా సమకూర్చుకొనవలెను.

"యతోవాచో నివర్తన్తే. అప్రాప్య మనసా సహ."

పరమాత్మను పొంద లేక, మనసుతో వాక్కుతో మఱలి వచ్చును.

మనో వాక్కుల విఫలతగొక్క యీ యున్నతమైన నివేదన మునకు కారణము బ్రహ్మానుభవ సిద్ధికి సంబంధించిన అపరమితా నందమే. బ్రహ్మము కేవలము వాఙ్మనమ్ములకు అతీతమైన దని దాని భావము కాదు. మానవ యోచనమున కందెడి ఆ యునికిని గూర్చిన జాడ లేనిచో, అట్టి తత్త్వము శూన్యమైనది. కావున, అది అన్ని యాలోచనల వ్యాప్తిని మించినది యెట్లగును ?

7. అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్. అస్తి బ్రహ్మేతిచే ద్వేద సన్తమేనం తతో విదుః."

బ్రహ్మమునకు ఉనికి లేదనువానికి నిజముగా ఉనికి లేదు. బ్రహ్మ మునకు ఉనికి గల దనువానికి ఉనికి గలదు.

అనఁగా - 'ఆనందమయమైన బ్రహ్మము కలదు' అని నమ్ము వాఁడు - ఉనికి గలవాఁడే. 'లేదు' అను వాఁడు లేనివాఁడే.

భగవంతునియందు తదేకధ్యానము, అవిచ్ఛిన్న మయినచో భయ రాహిత్యము, పశ్చాత్తాప విమోచనము, పరమ శాంతిఁ గల్గించును. అది యగాధముగా వేళ్ళు పాతుకొనియుండి, అంతరాయ

విరహితము కావలెను. అది త్రుంగిపోయి, నిలుకడ లేని ద్వైనచో - ఎడ నెడ భయాందోళనలు తప్పవు.

"యదా హ్యే వైష ఏతస్మి న్నదృశ్యేఽ నాత్మ్యే ఽ నిరుక్తే నిలయనే ఽభయం ప్రతిష్ఠాం విన్దతే. అధ సోఽభయం గతో భవతి యదా హ్యే వైష ఏతస్మిన్నుదర మన్తరం కురుతే. అధ తస్య భయం భవతి."

రామానుజ వ్యాఖ్య :

వీల పన, నిశ్చయముగా అదృశ్యమైన దానిలో - నిర్భయమైన ఏకీకరింపఁబడిన, అనిర్వచనీయమైన, కలుష రహితమైన ఆధారమును అతడు సంపాదించినపుడు - భయమునుండి విముక్తుఁ డగును. కావున, భగవత్పరమగు ధ్యానమున కతఁడు ఈషణ్మాత్రమేని అంతరాయము కలిగించినపుడు భయ మందును.

"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సః. బ్రహ్మణా విపశ్చిత్."

(8) ఈ ఉపసంక్రమణ శ్రుతికి రామానుజ వ్యాఖ్య :

పరమాత్మ సిద్ధి వలన గలిగెడు పరమానందము అది యొక మాత్ర ; వ్యక్తిగత మగు ఆత్మయొక్క శాశ్వత జీవస్థానముపకుం దరలు సోపాన మాత్రము. సర్వజ్ఞ మగు బ్రహ్మముయొక్క సందర్శనమును సాధించును. అతఁడు బ్రహ్మములో నుండు సకల వాంఛనీయ గుణములను పొందును.

ఇవియే - రామానుజుల తైత్తిరీయ వ్యాఖ్యాన విశేషములు.

## ఛాందోగ్యము

శిష్యుఁడు గురువునకు చాలినంత సేవ సేసి, శిక్షానంతరము శక్తి వంచన లేకుండ దక్షిణ సమర్పించుకొనవలెనని రామానుజుల యభిప్రాయము.

బ్రహ్మసాయుజ్యమును పొందుటకు ఆశ్రమము లన్నియు అర్హత గల్గిన వనియు రామానుజులు స్పష్టముగా వక్కాణించిరి.

"అథ య ఏషోన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్య శ్మశ్రు ర్హిరణ్యకేశ ఆప్రణఖా త్సర్వ ఏవ సువర్ణః తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ. తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదిత ఉదేతి హవై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద"

**తాత్పర్యము :**

సూర్యబింబములోఁ గనఁబడు పురుషుఁడు కాంచనమువలె సందీప్తుఁడు. అతనికి బంగారు వన్నె గల గడ్డ మున్నది. సువర్ణ మయములైన వెండ్రుకలు కలవు. గోళ్ళ కొనల వఱకు సర్వత్ర పసిడి రంగే. ఆ మహామహుని రెండు నేత్రములు సూర్యకిరణములచే ప్రఫుల్ల పద్మసంకాశములు. ఆయన నామధేయము 'ఉత్' అని. ఇతఁడే పైనఁ జేర్కొనఁబడిన పురుషుఁడు, సకల దోషములకును అతీతుఁడు. ఆ పరమజ్యోతి నెఱుంగువాఁడు సర్వపాపముల నధిగమించును.

ఈ శ్రుతియొక్క ప్రాముఖ్యమును గ్రహించుటకు అవసరమైన వివేకోన్నతికి, ఆధ్యాత్మికావగాహన శక్తికి తమ గురువైన యాదవప్రకాశకులు వర్ధిల్లలేకపోయెనని ఆయన ఆ ఉపనిషద్వాక్యమునకు గావించిన వివరణము - మనోవేదనతో రామానుజులను తెలిసికొనఁజేసెను.

ఈ వాక్యము రామానులవారికి అత్యంత భావ సమన్వితము. ఎందు కనఁగా - అది పరబ్రహ్మముయొక్క సౌందర్య తత్త్వమును స్పష్టముగా నిర్ధారీకరించును. వారి యుద్దేశ ప్రకార మది యంతిమ సూత్రములలోనికి ప్రవేశింపవలెను - 'కపి' అన్నది - విష్ణుసహస్ర నామములలో నొకటి గదా!

శ్రీ రామానుజులవారు దీనిని శ్రీ భాష్యమునందును, ఇంకను విస్తారముగా వేదార్థసంగ్రహమునందును చర్చించియున్నారు.

దైవశక్తి సూర్యబింబమందు గలదనుట ఉపనిషత్తులలో మాటి మాటికిఁ జెప్పఁబడు విషయమే. ఆ శక్తియే సూర్యుని యందేగాక, ఆ భగవానునిలో దానిని గమనింపఁగల నేత్రములలోను గలదు. అదియునుఁగాక, అది చూడఁదగిన జగత్తులోను, కన్గొన సమర్థమైన స్థితి - ప్రస్తుత ఛాందోగ్యమున, ప్రధాన ప్రకరణమున ప్రదర్శింపఁ బడినది.

ఈ పరమపురుషుని నేత్రములు కమలములవలె నుండునని ఉప నిషద్వాక్యము తెలుపును. అది యొక 'కప్యాసము.' యాదవప్రకాశు లద్ది వానర పుచ్ఛ భాగము వలె నున్న దని విపరీతార్థముఁ జెప్పెను. వైదిక వాఙ్మయములో 'కపి' యనఁగా - సూర్యుఁడు. 'కప్యాసమ్' అనఁగా - రామానుజుల భావమే మన, సూర్యుని రంజకమైన వెలుఁగు నందలి వైభవ మంతయు ప్రదర్శించు వికసించిన పద్మము, స్థిరముగా తన కాడమీఁద నిలఁబడిన లోతైన నీటిలో విస్తారముగా పెరుఁగు చున్న అరవిందము.

"గంభీరాంభ స్సముద్భూత సుమృష్టనాళ రవికర వికసత పుండరీక దళా మలాయతేక్షణః."

అను వేదార్థసంగ్రహములోని శ్రీ రామానుజుల దీర్ఘసమాసము - పరమాత్మకు రూపించిన సౌందర్యము సత్యమైనది. వారి అప్రమేయ పరిపూర్ణత్వము, భువనములద్వారా వారి స్వయంప్రత్యక్షీకరణము.

## ఛాందోగ్యము - శాండిల్య విద్య

శాండిల్యుఁ డొక ఋషి. ఆయన గోత్రీకు లిప్పటికిని గలరు. భర్తృహరి మధుర వ్యాఖ్యాత - రామచంద్ర బుధేంద్రుఁడు శాండిల్యగోత్రుఁడే.

శాండిల్య విద్య – బ్రహ్మము సగుణ మనియు, జగద్వ్యాపార ములో నిబిడీకృతమై యుండుననియు తెలుపును. ఈ విభాగమును రామానుజులవా రెట్లు విశదీకరించినారో చూతము. : –

"సర్వం ఖ ల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత"

అనఁగా – విశ్వ మంతయు బ్రహ్మమే. ఏల ననఁగా – సర్వము బ్రహ్మమునుండియే ఉద్భవించును, పోషింపఁబడును, అంతముఁ జెందును. కావున, పెడ మార్గమున నడిపించు వ్యసనముల జయించి, బ్రహ్మమునే ఉపాసింపవలెను.

"ఏషమ ఆత్మాంత ర్హృదయ ఏత ద్బ్రహ్మైత మితః ప్రేత్యాభిసంభవితా స్మీతి యస్య స్యా దద్ధాన విచికిత్సాస్తి"

అని శాండిల్యుఁడు నుడివెను. దీని తాత్పర్య మే మనఁగా : – బ్రహ్మము నేనే; అతఁడు నా హృదయములో నున్నాఁడు. లోకమును విడిన తర్వాత ఈ విశ్వాస మెవనికిఁ గలదో – వానికి సందేహము లేదు' అని.

## ఛాందోగ్యము – సద్విద్య

ఉద్దాలకుఁ డను ఋషి – తన కుమారుఁ డగు శ్వేతకేతునకుఁ జేసిన ఉపదేశమే ఈ విభాగము. దీనిలో – 'తత్త్వ మసి' అను ముఖ్యమైన సిద్ధాంత మున్నది. శ్రీభాష్యమునందును, వేదార్థ సంగ్రహమునందును ఇది బాగుగా చర్చింపఁబడి యున్నది. శ్రుతి వాక్యములను వివరించుటకు కావలసిన ఆఱు ప్రమాణములు, ఉపక్రమ – ఉపసంహార – అభ్యాస – అపూర్వ – ఉపపత్తి – అర్థవాద వరస ములు ఆఱును చర్చలోఁ గలవు.

శ్వేతకేతుఁడు జ్ఞానము లభించినదని యుప్పొంగిపోగా, ఉద్దాలకుఁ డిట్లు ప్రశ్నించెను :–

"తమాదేశం ప్రత్యక్షః. ఏన అశ్రుతం శ్రుతం భవతి, అమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతమ్."

రామానుజుల యుద్దేశ ప్రకారము దీని భావ మే మన :- 'వినినది వినినదిగాను, తలంచనిది తలంచినదిగాను, బోధపడనిది బోధపడినది గాను ఏ ఆదేశముచేత నగునో - దానిని గూర్చి యోచించితివా ?' అని. ఇచట 'ఆదేశ' మనగా - రామానుజుల అభిప్రాయము లోక పాలకుఁ డగు పరమాత్మయే. 'తత్త్వ మసి'లో - 'త్వమ్' అనగా - పరమాత్మ. అది 'తత్' అనగా - జీవాత్మలో అంతర్యామియై యుండును.

శ్వేతకేతుఁడు విషయము తెలియక కలవర పడెను. అప్పుడు ఉద్దాలకుఁడు కార్య కారణ సిద్ధాంతమును ప్రవేశ పెట్టెను. ఉదాహరణకు - రేగడిమట్టి లక్షణము దానితో తయారయిన వస్తు సముదాయమునకు ఉండును.

"వాచారంభణం వికార నామధేయం మృత్తికే త్యేవ సత్యమ్."
అనఁగా - పదార్థముయొక్క మార్పు క్రొత్తగా కారణమువలననే వాస్తవమైనది. రామానుజుల అభిప్రాయానుసారము కారణమే నూతనోపయోగములకై నెఱవేర్చుచు - నూతన నామము, నూతన రూపము వహించును.

ఇంకొక్క ప్రవచనమువలన, కావలసిన విశదీకరణము లభించును :-

"స దేవ సౌమ్య ఇద మగ్ర ఆసీత్. ఏక మేవాద్వితీయమ్"

ఈ వాక్యభాగమునకు రామానుజుల యర్థ మేమనఁగా - సత్కార్యవాదమును సూత్రీకరించుట సృష్టికి పూర్వము స్థితి లేదనుట అసత్యము. కార్యములేని కారణమునుండి కార్యము రాఁజాలదు ఆ ఆదిమస్థితికి ఇచ్ఛా శక్తి కలదు.

"తత్తేజో అసృజత తత్తేజ ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి. తదప అసృజత. తా అప ఐక్షన్త. బహ్వ్యస్స్యామ ప్రజాయే మహితివా అన్న మసృజంత."

ఆ ఉనికియే వెలుఁగును సృజించెను. వెలుఁగు, నేను అనేకమై విస్తరించెదనుగాక! అని నిశ్చయించెను. ఈ విధముగా ఈ శక్తులు 'అన్నము' లేక - పృథ్విని సృజియించెను. ఈ విధముగా - వెలుఁగు, నీరు, పుడమి అను మూల పదార్థముల యుత్పత్తి వివరింపఁబడెను.

ఈ యుపనిషత్తు ఇంకను ముందుకు సాగి, ఇట్లనును :-

"సేఽయం దేవ తైక్షత హంతాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవే నాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి తాసాం త్రివృత మైకాకార కరవాణీతి సేయం దేవతే మా స్తిస్రో దేవతా అనేన జీవే నాత్మనాఽనుప్రవిశ్య, నామరూపే వ్యాకరోత్."

**తాత్పర్యము :**

పైనఁ జేర్కొనఁబడిన దేవత యిట్లు నిర్ణయించుకొనెను. 'ఆ మూఁడు భూతములలో (అగ్ని, జలము, భూమి) నాలో భాగమైన జీవాత్మగా ప్రవేశించి, వాని నామ రూప విభేదములను విస్తరింపఁ జేసెను. ఈ మూఁడు భాగములను మఱల మూఁడేసి భాగములుగా నొనర్చెదను. ఆ దేవతయే వ్యక్తిగతాత్మగా ఈ మూఁడు దేవతలలో ప్రవేశించి, అదియే జీవాత్మ - నామ రూప విభాగములను విస్తరింపఁ జేసెను.

అనఁగా - సృష్టిబీజము భూతములలో నివసించి, నామరూపములు ధరించుటకుఁ దగిన ఉనికినిఁ గలుగఁజేయును. పర్యవసానమేమన, నామ రూపము లన్నియు జీవాత్మ రూపములే.

పరదేవత వ్యక్తిగతాత్మలో మూర్తీభవించిన భౌతికప్రపంచములోఁ జేరును. ఇది రామానుజుల వివరణ, పరమాత్మ జీవుని తన శరీరముగనే స్వీకరించి ప్రవేశించును. అనఁగా - జీవుఁడు పరమాత్మనే

తన యాత్మగాఁ గైకొని ప్రవేశింప నిర్దేశింపఁబడును. ఆత్మలు ప్రత్యేక క్రియలచే, లోకములో ప్రవేశింపవు. పరమాత్మయే ప్రవేశించును. కాని, అవి జీవాత్మలో ప్రవేశించి, దానిని తన శరీరముగా వినియోగించుకొనును. తరువాత, అనేకవిధ ముగా - భౌతిక ప్రపంచములోఁ జేరును.

వివిధ సూత్రములను ఈ యుపనిషత్తు ఈ - క్రింది వాక్యములో సంగ్రహించుచున్నది :-

"సన్మూలా సోమ్యేమా స్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః"

ఈ భూతముల కన్నిటికి మూలము సత్తు అదియే అది నిలిచి యున్నంతకాలము పోషకము. బాహ్య ప్రపంచమునుండి తొలఁగి వచ్చాడు - దానిలోనే విశ్రమించును' అని దీని తాత్పర్యము.

సత్తు సాధారణ జ్ఞానముచేత జ్ఞాతమైనను, దాని లక్షణము నకుఁ దగిన పద్ధతిచేత దెలియ నగును. రహస్యముగా నపహరింపఁబడి, ఏదో తెలియని దేశములో కన్నులకు గంతలు కట్టి విడువఁబడిన వ్యక్తి - కాల పరిణామమున, తెలిసినవారిచేత - తన జన్మభూమి మార్గము కనుగొని తిరిగివచ్చినట్లు - 'సత్' అన నేమో తెలియనివారు ఆచార్యులచే తెలిసికొందురు.

శ్రీ రామానుజుల అభిప్రాయము చొప్పున ఈ యుపనిషత్తు ప్రతిపాదించునది - బ్రహ్మముయొక్క ఆత్మైకత్వమే కాదు. ముఖ్యముగా - పరమాత్మయొక్క అనంతమైన వైభవమును ప్రకటించుటయే.

# ఛాందోగ్యము - భూమాధికరణము

సనత్కుమారుఁడు 'భూమము'ను ఈ విధముగా నిర్వచించును :-

"యత్ర నాన్య త్పశ్యతి, నాన్య చ్ఛృణోతి, నాన్య ద్విజానాతి - స భూమా.
అథ యత్రాన్య త్పశ్య చ్ఛృణో త్యన్య ద్విజానాతి త దల్పమ్"

అనఁగా - 'దేనియందు వేఱైనది కనఁబడదో, వినఁబడదో, ఎఱుకఁబడదో - అది భూమము. వేఱైనది కనఁబడునో, వినఁబడునో, ఎఱుకఁబడునో - అది అల్పము.' ఇది రామానుజుల వ్యాఖ్య.

బ్రహ్మము అపరిమిత సుఖదాయకముగాన, బ్రహ్మధ్యానములో నున్నవానికి దుఃఖము లేదు.

వేదపారంగతుఁడైన నారదుఁడు దుఃఖమగ్నుఁడై, సనత్కుమారునితో - తనకు ఆత్మ యనఁగా నేమియో తెలియ దని తెలిపి - దుఃఖ జలధిని దాటింపు మనియు వేఁడెను. అపుడా నారదునకు సనత్కుమారుఁ డిట్లు బోధించెను :- ఎవఁడు ఆత్మను దలచుకొని యోచించునో, అతనికి సకల విధములైన ఆనందములు చేకూరును. అతఁడు - 'ఆత్మరతుఁడు, ఆత్మక్రీడుఁడు, ఆత్మమిథునుఁడు, ఆత్మానందస్వరతుఁడు అగును' అనెను. అనఁగా - ఆత్మను తన తృప్తికి, తన కేళికి, తన భోగమునకు, తన పరవశతకు గ్రహించును. అతఁడు తనకు తానే నియామకుఁడు, స్వతంత్రుఁడు. ఈ సంవాదమింకను కొనసాగి, సనత్కుమారుఁడు ఈ ఉపయోగకరమైన, ఆదరణయోగ్యమైన సూచనఁ జేసెను :-

"ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః
స్మృతి లబ్ధే సర్వగ్రంథీనాం విప్ర మోక్షః."

**తాత్పర్యము :-**

ఆహారము శుద్ధమైనచో - మనసు శుద్ధము. మనస్సు శుద్ధమైనచో జ్ఞప్తి నిగాఢము. అట్టి స్మృతి నిగాఢమైనపుడు సకల బంధములు సడలిపోవును."

దీనినిగూర్చి రామానుజుల భావ మే మనఁగా 'భక్తి పరిపక్వమైనపుడు సకల బంధములు సడలిపోవును.' ఇదియే రామానుజుల భూమ విద్యా సారాంశము.

## 1. ఛాందోగ్యము - దహర విద్య

ఛాందోగ్యములోని 8 - వ అధ్యాయము దహర విద్య. అది చాల ముఖ్యమైనది. దాని ముఖ్యభావము పరమాత్మ వ్యక్తిగతాత్మలో నివసించియుండు ననుట. సర్వోత్కృష్టమైన ఆత్మ - వ్యక్తిగతాత్మ కేంద్రములో నివసించియుండు ననునది ఉపనిషత్తుల ప్రాథమిక సిద్ధాంతమే. ఉపనిష ద్వాఙ్మయములో దహరవిద్య కేంద్ర రచన యనుట పొరపాటు గాదు.

శ్రీభాష్య మీ ప్రకరణమును విపులముగా చర్చించును. వేదార్థ సంగ్రహముగూడ దీనిలోని ముఖ్యాంశములను విశదీకరించును. కావున, దీనినిఁగూర్చి రామానుజుల గ్రంథములలో వారి వివరణ మున్నదని పాఠకులు భావింపవచ్చును. మానవ శరీరము బ్రహ్మము యొక్క నగరము. దానిలోని పద్మసంకాశమైన హృదయము ఆ నగరములోని మహా సౌధము - లేక - దేవాలయము - 'దహ రాకాశ' మందులో సూక్ష్మమైన, చమత్కారమైన స్థలము. ఆ సూక్ష్మావకాశమును,అం దుండు సంపూర్ణాకాశమును పరిశోధింపఁదగినవని రామానుజులు నిర్వచింతురు.కర్మమూలమున బ్రహ్మస్వభావము మన కెఱుకఁ బడక యుండునని రామానుజుల అభిప్రాయము. పరమోత్తమత్వము

విముక్తి సంఘాతదేగాని, ముక్తునిది కాదు. ఉత్తమ పురుషుఁడే విశ్వవ్యాప్తమైన, సర్వోత్కృష్టమైన ఆత్మగా రామానుజులను ప్రేరేపించెను. ఉత్తమ పురుషుని సర్వోత్కృష్టత వ్యక్త్యంతర్వర్తిత్వమును ఏమాత్రము అడ్డగించ దనుట దహరవిద్యలో ప్రీత్యుత్సాహములతో చిత్రీకరింపఁబడి యున్నది. గీతలోని 'పురుషోత్తముఁడు' జగదవథిలో వర్ణింపఁబడెనుగాన, అందుచే రామానుజులకు ఏ యిబ్బందియు లేదు. దహరవిద్య సగుణబ్రహ్మమునకు అప్పగించినచో - బ్రహ్మమునకుఁ గల గుణము లన్నియు విముక్త జీవికిఁ గల వను ప్రసక్తికి తావుండకు.

రామానుజుల యుద్దేశము ప్రకారము – ధ్యాన మొనర్చు ఆత్మను పరిపూర్ణముగాను, స్వయంసిద్ధియుక్తముగాను చేయునది భగవ దనుగ్రహమే యని గుర్తించని భక్తి - హీన భక్తియే.

## 2. బృహదారణ్యకము

గ్రంథ విస్తీర్ణమునందును, విషయ వివరణమునందును బృహదారణ్యకము- ఉపనిషత్తులలో అత్యంతాధికమై, వేదాంతముయొక్క పరమ ప్రవచనముగా నున్నది. వేదాంతావిష్కరణమునందును, ఆధ్యాత్మికానుభవమునందును రామానుజులు ఈ యుపనిష ద్వివరణమున ప్రత్యేకమైన అస్థ చూపిరి. కాని, వేదాంతేతర విషయములను వారు మానియుండవచ్చును.

బృహదారణ్యకము ఉపనిషత్తులలోని ప్రధాన బోధనల నన్నిఁటిని చేర్చి కూర్చిన ట్లున్నది.

ఈ యుపనిషత్తునందలి ముఖ్య విషయముల నవలోకించ్చి, వానిపై శ్రీ రామానుజులు వివరణములను గ్రహింతము.

1. "అహం బ్రహ్మాఽస్మి."

ఇది యీ యుపనిషత్తులో ముఖ్యమైనది. రామానుజులు దీనిని మాటి మాటికి చర్చింతురు. దీనిని తాత్పర్యముగాఁ గైకొన్న ఒకా నొక సందర్భమును గమనింతము. పై వాక్యమునకు ప్రోద్బలకముగా ఈ క్రింది కథన మున్నది :—

"సయత ఏకైకం ఉపాస్తే న స వేద కృత్స్నో హ్యేషోత ...
ఆత్మే త్యేవోపాసితా అత్ర హ్యేతే సర్వ ఏకం భవన్తి."

తాత్పర్యము :—

ఎవఁడు జీవాత్మనే ప్రత్యేకముగా - ఒక్కటే నామము, రూపము గలవానిగా - అఖిల నామములను, రూపములును గల బ్రహ్మమునకు వ్యత్యాసముగా ధ్యాన మొనర్చునో, అతఁడు ధ్యానము సేయనివాఁడే. కావున, ప్రత్యేక నామ రూపములతో ధ్యానింపఁబడిన ఆత్మ - సర్వాత్మ కాదు. బ్రహ్మమును ఆత్మగానే ధ్యానింపవలెను వానిలో నివి యన్నియు ఏకముగా పరమాత్మ శరీర ముగా నగును.

దీనికి రామానుజుల వివరణము :— వివిధ విషయములను వేత్వే రుగా ఎవఁ డెఱుంగునో — అతఁడు దానిఁగూర్చి యెఱుంగనివాఁడే. వానిని ఆ రీతిగా భావించుట, వానిని అసమగ్రముగా గ్రహించుటయే. సత్తును దేహి శరీరముగాఁ గల ఆత్మగా ధ్యానించుట — నిర్ణయింపఁ బడిన సరి యగు ప్రవర్తన. ఎల్ల భూతములును పరమాత్మలో ఐక్య మగును. ఆ ఏకీకరణములోనే వానిఁగూర్చి మన గ్రహణశక్తి యొక్క సంపూర్ణత్వము పరిఢవిల్లును.

పూర్వ ఋషియైన వామదేవుని వచనము :—

"యో అన్యాం దేవతాం ఉపాస్తే,
అన్యోఽసౌ అన్యోఽహం అస్మీతి న స వేద."

**తాత్పర్యము :-**

పరమాత్మను - 'అతఁడు వేఱు, నేను వేఱు' అని తలఁచుచు ఎవఁడు పూజ సేయునో, అతఁడు తెలియనివాఁడే. ఈ ఐక్య జ్ఞానము జనించినపుడు, దానిని దెలిసికొన్న వ్యక్తిగతమగు ఆత్మధ్యానాదర్శ తాంతర్యాతమని గుర్తించి, 'నేను బ్రహ్మమును' అను అనుభవమును స్వీకరించును.

శ్రీ రామానుజుల అభిప్రాయము :- అనేకత్వగ్రహణమునకు అంటఁగట్టఁబడిన, అగౌరవకరమైన 'అకృత్స్న' అను పదము - ఆదర్శానుభవమైన ఏకత్వముయొక్క భావము. అనేకత్వ నిర్ధారణకు పూరకమేగాని, నిషేధము కాదు. అనేకత్వము కేవలము కట్టు కత కాదు. గ్రహింపఁబూనునట్టి పూర్ణీకరణములో సమాప్తికొఱకు మొఱపెట్టుకొను సత్యమునందలి యొక తునుక. 'అహం బ్రహ్మాస్మి' లోని అహం (నేను) అనునది ఆ యనుభవమును హీనపఱచుటగాక, 'బ్రహ్మముతో సమవ్యాప్తము' అనుటగాని, వేఱు గాదు. అప్రమేయమైన ఆ సీమలో అవిభాజ్యముగా బస చేసినట్లు కనుగొనుచున్నది.

2. "నేతి నేతి"

ఇది బ్రహ్మముయొక్క విశేషమైన స్వభావ నిర్ణయము. శ్రీ రామానుజులు వేదార్థసంగ్రహమున దీనినిఁగూర్చి కూలంకషముగా చర్చించిరి. ఉపనిషత్సారాంశము బ్రహ్మముయొక్క సౌందర్య తత్త్వము. పురుషసూక్తములోని 'ఆదిత్య వర్ణం' జ్ఞానజ్యోతిగనే గాని, దైహికప్రకాశము కాదని తలంచినను, ఛాందోగ్యమునందలి 'సర్వవర్ణ', 'కప్యాసం పుండరీక మేవ మక్షిణీ', తైత్తిరీయములోని

'నీల తోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా' (మహానారాయణము) ఈశోపనిషత్తునందలి 'కల్యాణతమం రూపం' అను ప్రయోగము అట్లు త్రోసివేయ వీలు లేదని నిరూపించుచున్నవి.విష్ణుసహస్రనామము లోని 'వృష్టహాస' అను పేరు ఉపనిష దౌన్నత్యమును విడనాడ లేదు.

రామానుజులు – 'నేతి నేతి' అనునది – 'బ్రహ్మముయొక్క రూపము అన్నియుం జెరొక్కసంబడ లేదని వచించును' అని వక్కాణింతురు. పరిమితమైన ప్రస్తుత స్థిరీకరణములో ఏది వచించలేదో, దానిని కాదనుటయేగాని, 'వక్కాణించుట తప్పు' అనుట గాదు.

## బృహదారణ్యకము - మైత్రేయీ బ్రాహ్మణము

ఇది యుపనిషత్తులలోని యొక మూలాధారమైన భాగము ఇది మైత్రేయీ యాజ్ఞవల్క్యుల సంవాదముగా నున్నది. రామానుజులు తమ శ్రీభాష్యమున ఇందలి వేదాంత విషయమును ప్రస్తావించి యున్నారు.

దీనిలోని మొదటి ప్రధానాంశము :-

"న వా రేపత్యుః కామాయ పతిః ప్రియో భవతి ఆత్మన స్తు కామాయ పతిః ప్రియో భవతి"

**తాత్పర్యము :**

మగండు నిశ్చయముగా ప్రియమైనవాండే. కాని, అట్లగుట – మగని కామము కొఱకు కాదు, ఆత్మయొక్క వాంఛకు.

అనంగా – ప్రియమైన యే వస్తువును దాని వాంఛకొఱకే ప్రియమైనది కాదు. ఆత్మయొక్క వాంఛా నిమిత్తమే.

రామానుజుల యుద్దేశ మే మనంగా–దీని యుపసంహారము ఆత్మనే అపేక్షింపవలెనని ప్రేరణ సేయుట. వాంఛించునట్టి ఆత్మ – హీన

మైన ఆత్మ - దాని నపేక్షించుట ముఖ్యాంశము గాదు. దానిని పరిపూర్ణము సేయు పరాత్మ నపేక్షించుట కర్తవ్యము.

శ్రీ రామానుజులు తమ వ్యాఖ్యానము నింకను ఇట్లు కొనసాగించుచున్నారు :- ఈ సందర్భములో ఆత్మ యనఁగా- పరమాత్మయే. వస్తువులపై మన కుండు ఆశ కనుగుణముగాఁ గాక, పరమాత్మపై మన కుండు భక్తికి (ప్రేమకు, ఆశకు) అనురూపముగా మనకు ప్రీతి గలిగిన వస్తువులయందు ఆకర్షణను, వాంఛను గలిగించు మన ప్రమేయమునకు ప్రత్యుత్తరముగా - పరమాత్మయొక్క 'సంకల్పము' లేక - 'ఇచ్ఛ' - అని గ్రహింపఁదగును. పరమాత్మకు వేఱుగా వస్తువుల నపేక్షించిన మనము - ప్రేమించినది మనలను పరిత్యాగ మొనర్చును. వానిని పరమాత్మలోఁ గన్గొనుటయందు మన కోరికల ననువర్తించును కావున, పరమాత్మయందు మనకు సంపూర్ణ భక్తి ప్రపత్తులు గలవేని, తక్కిన వన్నియు కరతలామలకములై, సౌందర్యానందమును సమకూర్చునని చెప్పనక్కఱలేదు. పరమాత్మ ననుసరించి ప్రవర్తించువానికి జగత్తు ఆనంద భవనమే.

యాజ్ఞవల్క్యుని వక్కాణ :-

"ఆత్మావా దర్శనేన శ్రవణేన మత్యా, విజ్ఞానేన ఇదం సర్వం విదితమ్"

తాత్పర్యము :-

నిజముగా ఆత్మ చూచుటచేతను, వినుటచేతను, చింతన - ధ్యానములమూలముననను తెలియ నగును. వీనిలో రెండు భావములున్నవి.

మొదటి భావము :-

ఆత్మ క్రమరీతిని - శ్రవణ, మనన, నిధి నిధ్యాసములచే గోచరించును. నిధి నిధ్యాస మనఁగా - తదేక ధ్యానము. అది ప్రేమపూరిత

మైనది. దీనికి మాఱుపేరు భక్తి. ఆత్మ తెలిసినయెడల, అన్నియు తెలిసినట్లే. ఏకము అనేకమునకు కారణము. ఏకము నెఱింగిన, అనేకము నెఱింగినట్లే.

రెండవ భావము :-

రామానుజుల యభిప్రాయము :- యాజ్ఞవల్క్యుని తదుపరి వాక్యములో అది తేటతెల్ల మగునని.

"సర్వం తం పరాతాత్ య అన్యత్ర - ఆత్మనః సర్వం వేద .. ఇదం సర్వం యదయ మాత్మా."

అనఁగా - ఆత్మకు భిన్నముగా అనుభవైక ప్రామాణ్యము గల భువిలోని విభాగముల నెవఁ డెంచునో, వాని నవి తిరస్కరించును. కావున, ఈ విశ్వ మంతటిని ఆత్మలో దర్శింపనగును. ఆత్మ నెఱుంగుటకు అత్యంతమైన సాధన కావలెను. డోలు, శంఖము, వీణ అనునవి - నిజమైన ధ్యానపరుని చలింపఁజేయజాలవు. బాహ్యేంద్రియ, అంతరింద్రియముల వశీకరణము ఆవశ్యకము.

రామానుజు లింకను ఇట్లు తెలుపుచున్నారు :-

"పరమ పురుష విభూతి భూతస్య ప్రాప్తు రాత్మన స్వరూప యాథాత్మ్యం అపవర్గసాధన పరమపురుష వేదనోపయోగిత యావత్ గన్తవ్యం న స్వత ఏవ ఉపాయత్వేన." – (శ్రీభాష్యము)

అనఁగా - పరమ పురుషుని వైభవమును ఏర్పఱచునట్టి దానిని సంపాదించు వ్యక్తిగతాత్మ - విజ్ఞాన ఘనమైన జీవాత్మ, బంధముల నెడబాసి, పరమాత్మయొక్క సత్యమును గ్రహించును.

యాజ్ఞవల్క్య మఱి యిట్లు వచించెను :-

"అగృహ్యో న గృహ్యతే, అశీర్యో న శీర్యతే, అసంగో న సజ్జతే"

అనఁగా — ఆత్మ గ్రహించుటకు శక్యము గానిది. చీల్చుటకు కలవి గానిది. భౌతిక వస్తువులు సంపర్కము లేనిది. సంపర్కము దానికి సోకదు. దానికి బంధ బాధా వినాశములు లేవు

దీనినిఁగూర్చి రామానుజుల భావ మేమనఁగా :- ఇందలి ధ్యాన సూత్రములను పాటించినఁగాని సిద్ధి కలుగదు.

## 3. కౌషీతకీ ఉపనిషత్తు

ఇది ఛాందోగ్యము, బృహదారణ్యకము మున్నగు పూర్వో పనిషత్తుల లక్షణములనే కలిగియున్నది రామానుజులు దీనిలోని వేదాంతపరమైన వాస్తవ వివరణ నొసఁగియున్నారు. బ్రహ్మసూత్రి ములో ఈ యుపనిషత్తు పేర్కొనఁబడియున్నది. దానినిఁగూర్చి రామానుజులు బహు విచారణ సలిపినారు.

దీనినిఁగూర్చి ఒక ఉదంతము గలదు. 'దివోదాసు'ని తనయుఁ డగు ప్రతర్దనుఁడు కొన్ని యసాధారణ సత్కార్యములఁ జేసెను. అందుకు ప్రతిఫలము గా - అతఁ డింద్రలోకమున కేగెను. ఇంద్రుఁ డాతనిని తగిన వరమును కోరు మనెను. ప్రతర్దనుఁడు మానవున కేది యత్యంత శ్రేయమును చేకూర్చునని యింద్రుఁ డెంచునో, దానిని ప్రసాదించు మనెను. ఇంద్రుఁ డాతనిని తనయందే భక్తి నిగుడ్చు మనెను. దాని కనుగుణముగా - తన యద్భుత కృత్యముల వివ రించెను. తానే మూలప్రాణ మని వర్ణింపఁదొడఁగెను. క్రమముగా నతఁడు - ఉన్నత తత్త్వారూఢ మండలమునకు పురోగమించెను.

ఇంద్రు డిట్లనెను :- 'మానవుని అంతర్గతమైన ఆత్మ ఆతని వ్యాపారముల నన్నిటిని మించును. ప్రజ్ఞామాత్రమైన, ఆత్మభూత మైన బాహ్య ప్రపంచమునకు సంబంధించియుండును. అనఁగా - భూతమాత్రము ప్రజ్ఞామాత్రములో ఇమిడి యున్నది. అట్లే, ప్రజ్ఞా మాత్రము సర్వోత్కృష్టమైన పరమాత్మలో నెలకొని యున్నది' అని.

చక్రముయొక్క అంచు - దాని ఆకులపై ఆధారపడియున్నది. భౌతిక మూలపదార్థములు ఆత్మ కధీనమై యుండును. ఆత్మ చక్రవు టిరుసుచే బిగబట్టుకొని యుండును. అటులనే, ఆత్మలు ప్రాణముచే పోషింపఁబడును. ప్రాణ మనగా - పరమాత్మ అతఁడే విశ్వమును రక్షించి పరిపాలించును. అతఁడే విశ్వమును రక్షించి పరిపాలించును. అతఁడే సర్వేశ్వరుఁడు. భౌతిక ప్రపంచము జీవాత్మల సహాయముఁ జెందుచున్నది. జీవాత్మలకు పరమాత్మ ఆధారము. అట్టి యతఁడే నా యాత్మగా ప్రతి వ్యక్తియు ధ్యానించవలె' నని ఇంద్రుని వక్కాణ.

ఇందు అకర్తృకమైన నిర్గుణ పరమాత్మయొక్క అనుమానము లేదు. అనేకత్వముయొక్క మిథ్యాత్వము లేదు. పరమాత్మయొక్క జీవాంతర్యామిత్వము సంబంధించి కాక, జీవాత్మ పరమాత్మల ఏకత్వము కానరాదు. ఇదియే విశిష్టాద్వైత సిద్ధాంతము.

## 4. శ్వేతాశ్వతరము

ఇది ముఖ్యముగా ఈశ్వర లక్షణ వైభవములను ప్రస్తావించును. జీవుఁడు ఈశ్వరునికంటె వే ఱని రామానుజు లనేక పర్యాయములు వక్కాణించియున్నారు. ప్రకృతి శాశ్వతమైన తత్త్వము. అదియే మాయ. దానిని ఈశ్వరుడు తన స్వాధీనములో నుంచుకొని నిర్వహించును. ఆ యీశ్వర చింతనయే భక్తి ప్రపత్తులకు దారి తీయును. 'చరణౌ శరణం ప్రపద్యే' అనఁగా అదియే. రామానుజు

లకు ఈ యుపనిషత్తు - యోచనా విధానమునకు కావలసిన మిక్కిలి యనుకూల వాతావరణమును సమకూర్చును.

"ఏతత్ జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం, నాతః పరం వేదితవ్యం హి కించిత్ భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా, సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్."

ఈ వాక్యములోని రెండవ భాగము వేదార్థసంగ్రహములో చక్కగా బోధింపఁబడియున్నది.

**తాత్పర్యము :-**

బ్రహ్మము జీవాత్మలో శాశ్వతముగా నెలకొని యున్నది. ఇంతకంటెను తెలియవలసినది ఏమియు లేదు. 'భోక్త, భోగ్యము, ప్రేరేపకుఁడు' అనుదానిలో - బ్రహ్మము చక్కగా వివరింపఁబడి యున్నది. భోక్త యనఁగా - అనిత్యమైన యునికిలో భోగించువాఁడు, బాధపడువాఁడు. భోగ్య మనఁగా - సంసారియైన జీవుఁడు - సుఖములను, కష్టములను పొందునట్టి ఈశ్వరుఁడు ధరించు భౌతిక ప్రపంచము. ప్రేరేపకుఁ డనుటకు - ప్రోద్బలము సేయు నరుఁ డని యర్థము.

ఈ మూఁడునుఁ జేర్చిన, బ్రహ్మధ్యానము బాహ్యగోచరమైన అనేకత్వమును నిషేధించును.

ఇది అంతర్యామి భావ సంబంధ మగు దివ్యమైన విశదీకరణము.

## 5. మహోపనిషత్తు

రామానుజులు ఈ ముఖ్యమైన, ప్రాచీనమైన ఉపనిషత్తును తమ వేదాంత నిర్మాణములో పరిగణింపకుండ నుండలేదని మనము నొక్కి వక్కాణింపవచ్చును. 'సత్, బ్రహ్మ, ఆత్మ, నారాయణ'

అనునవి ఆరోహణ క్రమముగా అధికతరములై నవి. కావున, వానిలో అత్యంత గూఢమైన 'నారాయణ' అను దానిని మనము స్వీకరింప వలెను.

## సుబాలోపనిషత్తు

ఈ యుపనిషత్తు బృహదారణ్యములోని అంతర్యామి బ్రాహ్మణమును, దాని వివిధాకారములను రసవంతముగా చిత్రించి, నారాయణునితో ఏకీకృత మొనర్చెను. శంకరాచార్యులును దీనిని అంగీకరించి యున్నారు.

## 6. మహానారాయణోపనిషత్తు

పరమోన్నత సత్యముయొక్క అనన్యత్వము 'నారాయణయే' యని నిశ్చయించుట ఈ యుపనిషత్తు ముఖ్యాంశయము. ఇది స్పష్టముగా పురుషసూక్తమునకు సంబంధించి యున్నది. ఈ 'నారాయణ' వ్యాఖ్యానము వేదార్థ సంగ్రహములో విపులముగాను, శ్రీభాష్యములో సంగ్రహముగాను గనఁబడుచున్నది. నారాయణుఁడు పరమోన్నత దైవ మని ఉపనిష ద్విశదీకరణమునుండియే గ్రహించునుగాని, ఇతరాధారములవలనఁ గాదు. కావున, వైష్ణవ మతము ఉపనిష న్మూలకముగాని, అన్య నిర్బంధము కాదు.

"వేదవి త్ప్రవరప్రోక్త వాక్యన్యాయోపబృంహితః
వేదా స్సాంగ హరిం ప్రాహుః జగ జ్జన్మాది కారణమ్."

వేదములు వేదవిద్వాంసుల వాక్యములలోని వాదములచే సమర్థింపఁబడియు, విపులీకరింపఁబడియు ప్రపంచ సృష్టికి హరియే (నారాయణుఁడే) కారణ మని శ్రీరామానుజులు వేదార్థ సంగ్రహమున వివరించియున్నారు.

## ఉపసంహారము

సర్వ సంపూర్ణతలు గూడిన బ్రహ్మమును ప్రకటించుటయే ఉపనిషత్సార మని రామానుజుల అభిప్రాయము. వేదార్థసంగ్రహములోని యొక దివ్య వాక్యములో వరుస - భేద, భేదాభేద అభేదములను మూటిని సమర్థింతురు. ఎందు కనఁగా - అదియే సంధానాత్మకమైన ఉపనిషత్ స్థానము. ఆ మూఁడు భాగములను సవ్యముగా అన్వయించుకొనవలెను.

ఉపనిషత్తులు కూలంకష జ్ఞానాకర్షముతో వివరింపఁబడిన యెడల, ముఖ్య భాగమును సమగ్రముగా వ్యాఖ్యానింపఁగల్గినచో, పొందిక గల యావ దవగాహనయే యగును. రామానుజులు వివిధ భాగములను చేర్చుకొని, వివరించి, ప్రతిదానికిని అర్హమగు ప్రాముఖ్యము నొసంగి, పరిణామమైనవాని యేకీభావమును నిరూపింతురు. అవాఙ్మనసగోచరమైన పరమాత్మయొక్క అంతర్యామిత్వమును సిద్ధాంతీకరించుట - నాస్తిక స్వభావమును సమక్షమున సంపూర్ణ పరివర్తనమే. రామానుజుల ఉపనిషద్వివరణము - మత తాత్త్వికాతిశయముల పరిపూర్ణత్వము.

శ్రీ రామానుజుల యుద్దేశము సగుణబ్రహ్మయొక్క పరమాన్నత్వమును గ్రహించుట, జగత్తుయొక్క వాస్తవ్యమును స్థిరీకరించుటయే కాదు, బ్రహ్మప్రకారమును (పద్ధతిని), లేక - ఆ పరమాత్మ విశేష గ్రహణమును నిరూపించు ఆత్మ - స్థూల పదార్థముల మూలమునసే ఆ సత్యమును వివరించుట యగును. పరమాత్మ అఖిల జీవులను తనలో నుంచుకొని, సర్వ జీవుల యందును తాను స్థిరముగా నుండుననియు, ఇదియే ఉపనిషత్తుల సారాంశము, సందేశము అనియు రామానుజుల అభిప్రాయము.



# భగవద్రామానుజులు - శ్రీ భాష్యము

## ద్వితీయాధ్యాయ ప్రథమ పాదము

## ( స్మృతి పాదము )

' ఉభయ వేదాంత శిరోమణి '

శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, ఎం. ఏ

—❖—

### 1. పరిచయము

బ్రహ్మసూత్రములయందలి ద్వితీయాధ్యాయమునకు అవరోధాధ్యాయ మని పేరు. ప్రథమాధ్యాయమున నిరూపింపబడిన బ్రహ్మకారణతా వాదమునకు సాంఖ్య, వైశేషికాది మతములవలన ఎట్టి బాధయు కలుగదని ఇందు నిరూపింపబడుచున్నది. ఈ అధ్యాయమున నాలుగు పాదములు కలవు. వీనిలో - మొదటి రెండు పాదములచే - సాంఖ్య, యోగ, వైశేషిక, జైన, బౌద్ధ, పాశుపత మతములను నిరసించి, పాంచరాత్ర మతము బ్రహ్మకారణతా వాదమునకు అనుకూలమగుటచే, దాని ప్రామాణ్యము స్థిరీకరింపబడినది. తక్కిన రెండు పాదములచేతను బ్రహ్మేతరమైన దంతయు బ్రహ్మకార్యమే అని నిర్ణయింపబడినది. జీవునికి అచేతనమునకువలె, స్వరూపాన్యథాభావరూప బ్రహ్మకార్యత్వము లేకున్నను, స్వభావాన్యథా భావ రూప కార్యత్వము సంభవించుటచే, జీవుడును బ్రహ్మకార్యమే అగుచున్నది. స్వరూపాన్యథా భావము లేనందువలన, జీవుడు అనిత్యుడు కాడు. ఇది ఈ అధ్యాయమున గల ప్రధాన ప్రమేయము.

### 2. స్మృత్యధికరణము

ఉపనిషత్ప్రతిపాదితమైన తత్త్వమును తెలిసికొనుట కష్టసాధ్యము. కావున, కపిల మహర్షిచే ప్రవర్తితమైన సాంఖ్య మతము

ననుసరించి, ఉపనిష ద్వాక్యములకు అర్థములను నిర్ణయింపవలెను. ఈ విధముగ సాంఖ్యమతమును ఉపనిషత్తులకు ఉపబృంహకముగ గ్రహింపనిచో, ఆ శాస్త్రము నిరవకాశమై, నిష్ప్రయోజనము కాగలదు' అని పూర్వపక్షము. ఇక సిద్ధాంతము. ఉపనిషత్తులు సర్వజ్ఞము, సర్వశక్తి యుక్తము అయిన బ్రహ్మము జగత్కారణ మని బోధించుచుండ, సాంఖ్య మతము జ్ఞానశూన్యమైన ప్రకృతి జగత్కారణము అని ప్రవచించుచున్నది. కావున, ఈ మతము ఔపనిషద మతమునకు విరుద్ధమై, అప్రమాణ మగుచున్నది. మన్వాది స్మృతుల, ఉపనిషత్తులు బోధించిన బ్రహ్మకారణతా వాదమును ప్రతిపాదించుటచే, అవి ప్రామాణికములై యలరారుచున్నవి.

"యద్వై మను రవదత్, త ద్భేషజమ్"

'మనువు ఏది చెప్పిన, అది హితకరమైనది' అని శ్రుతియే మనువును ప్రశంసించియున్నది. కావున, అట్టి మన్వాది స్మృతుల ననుసరించి ఉపనిషద్వాక్యములకు అర్థ నిర్ణయము గావింపవలయునే గాని, సాంఖ్యాది మతములను బట్టి కాదు. కేవల ప్రకృతి జగత్కారణము అను వాదమును వైదిక స్మృతు లేవియు ప్రతిపాదించి యుండలేదు.

## 3. యోగప్రత్యుక్త్యధికరణము

యోగ మతస్థులు సాంఖ్య మతము ననుసరించి ప్రకృతి జగత్కారణ మని చెప్పుచు, నిమిత్త కారణముగ ఈశ్వరుని అంగీకరింతురు. అనగా - వీరి మతమున జగత్సృష్టికి ప్రకృతి ఉపాదాన కారణము కాగా, ఈశ్వరుడు నిమిత్త కారణు డగుచున్నాడు. కాని, వైదిక మతమున జగత్తునకు నిమిత్తోపాదాన కారణములు రెండును పరబ్రహ్మమే.

## 4. విలక్షణత్వాధికరణము

ఈ ప్రపంచమునకు సర్వజ్ఞత్వాది గుణములు గల పర బ్రహ్మము కారణము' అను ఉపనిష త్సిద్ధాంతము అసంగతము. బ్రహ్మము సర్వజ్ఞము కాగా, దాని కార్యమైన ప్రపంచము జ్ఞానాజ్ఞానరూప విరుద్ధ స్వభావములు కలిగి యున్నది కావున, బ్రహ్మము కంటె విలక్షణమైన ఈ ప్రపంచము బ్రహ్మకార్యము కాజాలదు.

"తం పృథి వ్యబ్రవీత్" — (యజుర్వేదము 5-5-2)

'అతనినిగూర్చి పృథివి పలికినది' మున్నగు వైదిక వాక్యములయందు 'పృథివీ' మున్నగు పదములకు 'పృథి వ్యధిష్ఠాన దేవత' అను అర్థమును గ్రహింపవలయును. లేనిచో, అచేతనమైన పృథివి పలుకుట అసంభవముగదా! కావున నే,

"సాన్తాహ మిమా స్తిస్రో దేవతాః." — (ఛాందోగ్యము : 6-32)

అను వాక్యమున - తేజస్సు, జలము, భూమి అనువానిని దేవతలనుగా శ్రుతి పేర్కొనుచున్నది. ఇట్లే,

"అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్." — (ఐతరేయము . 2 -4)

'అగ్ని వాగ్రూపమున - అనగా, వాక్కును అధిష్ఠించి, ముఖమున ప్రవేశించినది' మొదలైన శ్రుతివాక్యములయందును అగ్ని వాగ్దేవతగా పేర్కొనబడినది. కావున, పృథివ్యాదులు అచేతనములు. ఇట్టి అచేతనములు సర్వజ్ఞమగు బ్రహ్మమునుండి ఏర్పడుట అసంభవము గదా! యని సాంఖ్యుని పూర్వపక్షము.

ఇక సిద్ధాంతము. కార్య కారణములు అన్యోన్య విలక్షణములైనవి లోకమున అనేకములు చూపట్టుచున్నవి. భ్రమర కీటకము

మొదలైనవి ఇట్టివేగదా! కావున, సర్వజ్ఞ మగు బ్రహ్మమునుండి దానికంటె విలక్షణమైన జగత్తు జనింపవచ్చును. ఇట్లు కార్య కారణములు పరస్పర విలక్షణము లగు పక్షమున అసత్కార్య వాదమును అంగీకరింపవలసివచ్చును - అని సందేహింప నవసరము లేదు. కార్య కారణములలో వైరూప్య మున్నంత మాత్రమున, అవి భిన్నములు కావు. కారణముగ నున్న వస్తువులే విలక్షణమగు మరియొక రూపముతో కార్య మగుచున్నది. కావున, బ్రహ్మకారణతావాదము నిరాబాధము. జగత్తునకు బ్రహ్మము కారణ మగు పక్షమున ప్రళయ సమయమునందు జగత్తు తనకు కారణమైన బ్రహ్మమున లీన మగును గదా! అపుడు జగత్తునందలి దోషములు బ్రహ్మమున సంక్రమింపవా? అని శంకించుటయు తగదు. చిదచిదాత్మకమైన ప్రపంచము బ్రహ్మమునకు శరీరము. బ్రహ్మము చిదచిత్తులయందు అంతర్యామిగ వ్యాపించియున్నది. కారణ దశయందును, కార్య దశయందును ఈ శరీరాత్మ భావము ఇట్లే కొనసాగును. బాల్య యౌవనాది దశల వలన గలుగు పరిణామములు శరీరమాత్ర నియములై, ఆత్మకు ఏ విధముగ సంభవింపవో, అట్లే - బ్రహ్మ శరీరముపైన చేతనాచేతనముల దోషములు ఎట్టి దశయందును బ్రహ్మమున సంక్రమింపజాలవు. మరియు - 'ప్రకృతి జగత్కారణము' అను వారి మతముననే ప్రకృతి అతని ధర్మమును అధ్యయనము చేసికొని, జగన్నాటకమును నడపుచున్నదికదా సాంఖ్యుల మతము! అచేతనమైన ప్రకృతి తనయందు చేతన ధర్మమును ఎట్లు ఆరోపించుకొనును? ఇది అసంగతము కాదా! మరియు - సాంఖ్యులు తర్క బలముతో ప్రధాన కారణ వాదమును ప్రవచించిరి. దానిని తమ తర్క బలముతో బౌద్ధులు నిరసించిరి. బౌద్ధ తర్కమును వైదికులు వేదానుకూలమైన తర్కమునే గ్రహించిరి. ఇట్లే, కేవలము అనుమాన ప్రమాణముతో ప్రకృతి కారణ వాదమును సాధింపజాలుటయు అసంగతము. కావున, వేద శాస్త్రములను కాదని,

ఇతర ప్రమాణములచే ప్రకృతి-లేక, అణువులు జగత్కారణ మని వాదించు గౌతమ - కణాదాది మతములును అప్రామాణ్యములే యగుచున్నవి. కావున, ఇవి యేవియు శిష్టులచే పరిగ్రహింపబడలేదు.

## 5. భోక్త్రాపత్త్యధికరణము

బ్రహ్మము చేతనాచేతన శరీరము అని అంగీకరించు పక్షమున, సుఖ దుఃఖాది భోగము జీవునికి వలె బ్రహ్మమునకు సంభవించును గదా! కావున, జీవునకును, బ్రహ్మమునకును అభేదమును అంగీకరింప వలసినవచ్చును - అనియు తలంపరాదు. లోకమున దండించువాడు, దండింపబడువాడు ఇద్దరు శరీరవంతులైనంతమాత్రమున, దండింప బడువానికి కలుగు బాధలు దండించువానికి కలుగవుగదా! ఇట్లే, బ్రహ్మము చేతనాచేతన శరీరము అయినను, ప్రకృతి గుణములవలె జీవగుణములును బ్రహ్మమునందు సంక్రమింపవు. బ్రహ్మము అకర్మ వశ్యమగుటచే, జీవేశ్వర విభాగమునకు బాధ కలుగదు.

## 6. ఆరంభణాధికరణము

ఈ ప్రపంచము తనకు కారణమైన బ్రహ్మమునకంటె అభిన్నమైనది.

"వాచారంభణం వికారో నామధేయం మృత్తికే త్యేవ సత్యమ్."

--(ఛాందోగ్యోపనిషత్ : 6-1-5.)

మట్టికుండ మట్టిరూపముననే సత్యమగుచున్నది. దానికి కారణ రూపమైన మట్టి - ఘటాకారమును, ఘట మను నామధేయమును పొందుట - 'నీళ్ళు తెమ్ము' మొదలగు వ్యవహారములకై ఏర్పడినట్టివి. అనగా - ఘటము కార్య దశ యందును, కారణ దశ యందును

మట్టియే గాని, వేరుగాదు. కాని, కార్య దశ యందు 'ఘటము' అను నామమును, దానికి అనువైన ఆకార విశేషమును సంతరించుకొని, జలాహరణాది వ్యాపారములకు ఉపయోగపడుచున్నది. కారణ దశ యందు ఈ అవకాశము ఉండదు ఇదియే కారణ దశ కంటెను కార్య దశ యందలి వైలక్షణ్యము. ఇట్లే, బ్రహ్మకార్యమైన ఈ ప్రపంచము కనుక కారణమైన, బ్రహ్మముకంటె అభిన్నమైనది.

ఘట రూప కార్యమునందు మట్టిని చూచుచున్నాము. ఇట్లే, మట్టియందును ఘటాది కార్యములు లీనములై యున్నవి.

"అస దే వేద మగ్ర ఆసీత్." — (ఛాందోగ్యము - 4-2-1)

అను ఛాందోగ్య వాక్యమున, 'ఈ ప్రపంచము సృష్టికి పూర్వము అసత్తుగ నుండెను' అని చెప్పబడుటచే, 'వేదాంతుల మతమునను బ్రహ్మము జగత్కారణము కాజాలదు' - అని తలంపరాదు. 'ఇది యిట్లున్నది' అని స్పష్టముగ నిరూపించుటకు సాధ్యము కాని కారణ దశను 'అసత్తు' అని పై ఉపనిషత్తు పేర్కొనినది. ఇంతియే కాని, వాస్తవమున లేనిది అని బోధించుటకు కాదు.

"త దసదేవ సన్మనో ఒకురుతస్యా మితి"

ఆ 'అసత్తైన' తత్త్వము తాను 'సత్తు' కావలయునని తలంచినది' అనుచు, తరువాతి వాక్యము - ఆ అసత్తు సత్తుగ (వ్యక్తముగ) మారిన విధమును వర్ణించి చెప్పినది. మరియు - 'ఘటము ఉన్నది' 'ఘటము లేదు' అను రెండు విధములైన వ్యవహారములయందును అట్టి నామ రూపములు గల పదార్థము ఉన్నది - లేక, లేదు - అని యర్థమే గాని, ఆ ఘటమునకు కారణమైన 'మట్టి లేదు' అని అర్థము కాదు కదా ! మట్టి యున్నను - దాని కార్యమైన ఘటము ఇంకను ఏర్పడని కారణముగ, 'ఘటము లేదు' అని వ్యవహరించుచున్నాము.

ఇట్లే, ఘటము తయారైనంతనే ఘటము ఉన్నది – అని వ్యవహరించుచున్నాము. కావున ఇచట 'ఉండుట', 'లేకుండుట' అనునది కార్యమునకేగాని, కారణమునకు కాదు. కారణము సర్వదా ఉన్నట్టిదే. ఈ హేతువు చేతనే –

"స దేవ సోమ్యే ఇద మగ్ర ఆసీత్."

అను పై ఛాందోగ్య వాక్యము జగత్కారణమైన బ్రహ్మమును 'సత్' అని వ్యవహరించినది. ఇదే విధముగ నూలు - వస్త్రముగ నేయబడినపుడే 'వస్త్రము' ఉన్నది అను వ్యవహారము ఏర్పడుచున్నది. నేయబడుటకు ముందు 'నూలు' ఉన్నను, దాని కార్యమైన వస్త్రము లేనందువలన, 'వస్త్రము లేదు' అనియే వ్యవహరించుచున్నాము. మరియు - శరీరమునందు ప్రవేశించిన వాయువు - ప్రాణాపానాది దశలను పొంది, ప్రాణాపానాది శబ్దములచే ఎట్లు వ్యవహరింపబడు చున్నదో, అట్లే, బ్రహ్మము కార్యదశయందు నానావిధ నామ రూప విభాగములను పొందుచున్నది. కార్యదశయందు అది ఒక్కటిగనే భాసించును. కావున, అది 'సత్' అని పేర్కొనబడినది.

## 7. ఇతర వ్యపదేశాధికరణము

జగత్కారణమైన బ్రహ్మము, జీవుడును అభిన్నులని, 'అయమాత్మా బ్రహ్మ' (బృ : 6-4-5) ఈ ఆత్మ బ్రహ్మము' ఈ మొదలైన ఉపనిషద్వాక్యములు బోధించుచున్నవి. జీవునికంటె భిన్నము కాని బ్రహ్మమే జగత్కారణ మగుచో, ప్రపంచ సృష్టి జీవునికి హితముగనే ఉండియుండును. కాని, ఇది సుఖదుఃఖాత్మకమై యున్నది. ఎవ్వడును తనకు తానుగ దుఃఖమును కొని తెచ్చుకొనడుగదా! కావున, బ్రహ్మము జగత్కారణ మను వాదము యుక్తము కాదు - అని ఆక్షేపింపరాదు. బ్రహ్మము జీవుని కంటెను, ప్రకృతికంటెను భిన్నమైనది. కావున, పై ఆక్షేపణకు అవకాశము లేదు. జీవబ్రహ్మభేద

మును "ప్రధాన క్షేత్రజ్ఞ పతిః గుణేశః" (శ్వేతా : 6-16.) 'ప్రకృతికి, జీవునికి అధిపతియైనవాడు, గుణములతో శోభిల్లువాడు' అని ఈ మొదలగు ఉపనిషద్వాక్యములు బోధించుచున్నవి గదా! అచేతనమైన ప్రకృతి తత్త్వము కంటెను, చేతనమైన జీవ తత్త్వము కంటెను బ్రహ్మము విలక్షణమైనందువలన, జీవాత్మ పరమాత్మలు పరస్పరము భిన్నాలు.

## 8 కృత్స్నప్రసక్త్యధికరణము

బ్రహ్మము అవయవములు లేనిదికదా! ఇట్టిది జగత్కారణమగు పక్షమున బ్రహ్మము సంపూర్ణముగ జగద్రూపమున పరిణమింపవలయును. లేనిచో, బ్రహ్మము నిరవయవము అను వేదాంత సిద్ధాంతమునకు భంగ మేర్పడుచున్నది అని మరి యొక ఆశంక. కాని, ఇదియును యుక్తము కాదు. విచిత్ర శక్తి యుక్తమైన బ్రహ్మము జగత్కారణ మని శ్రుతి చెప్పుచున్నది. ఇట్టి విచిత్ర శక్తులు గల బ్రహ్మము తన సంకల్ప వశమున ఏ విధముగనైనను పరిణమింపవచ్చును. బ్రహ్మమునందే కాక, ఆ లోకమున గల చేతనాచేతనములయందును విలక్షణ శక్తులు చూపట్టుచునే యున్నవి. ప్రకృతిలోని పంచ భూతములు పరస్పర విలక్షణములైన స్వరూప స్వభావములను కలిగి యుండుటను చూచుచునే యున్నాము. కావున, బ్రహ్మము జగత్కారణ మగుట సంభవమే. మఱియు - వేదాంతుల బ్రహ్మమువలె సాంఖ్యుల సిద్ధాంతమునకు ఈ దోషము అనివార్య మగుచున్నది.

"పరాశక్తిః వివిధైవ శ్రూయతే." — (శ్వేత : ఉ · 2-16)

'ఈ బ్రహ్మముయొక్క ఉత్తమమైన శక్తి వివిధ రూపముల చూపట్టుచున్నది' - అనుటచే, 'బ్రహ్మము జగత్కారణత్వమునకు కావలసిన శక్తులను అన్నింటిని కలిగియున్నది' అనుట స్పష్టము ఇంద్రియములు

లేకున్నను, బ్రహ్మము జగత్కారణము కావచ్చును. అట్టి విచిత్ర శక్తులు దానికి కలవని ముందే తెలిసికొంటిమి కదా!

## 9. ఉపసంహార దర్శనాధికరణము

ఒక కార్యమును నెరవేర్చుటకు అనేక సాధనములు ఆవశ్యకములై యున్నవి. అట్టియెడ, ఇంతటి విచిత్ర జగత్సృష్టికి బ్రహ్మమొక్కటియే కారణము అనుట యెట్లు పొసగును? అనియు శంకింపనవసరము లేదు. పాలు పెరుగుగ మారునట్లే, బ్రహ్మము ప్రపంచముగ పరిణమించుటలో ఎట్టి ఆటంకము ఉండదు. దేవతలు తమ విచిత్ర శక్తియోగముచే అనేక రూపములు దాల్చినట్లు - అనంత శక్తియుక్తమైన బ్రహ్మము సంకల్ప మాత్రముననే జగత్సృష్టి గావించుచున్నది.

## 10. ప్రయోజనవత్త్వాధికరణము

ప్రయోజనమును అపేక్షించి ఏవేనియు ఒక కార్యమును చేయుట లోక సహజము. ఎట్టి కోరికలు లేని బ్రహ్మము ఏ ప్రయోజనము నాశించి జగత్సృష్టి గావించుచున్నది? అనుచో, ఈ జగత్సృష్టి బ్రహ్మమునకు లీలా విలాసము. లీలకై చేయు పనులకు ప్రయోజనమును వెదుక నవసరము లేదు.

ఓయీ! సర్వజ్ఞము, సర్వశక్తియుక్తము అయిన బ్రహ్మము జగత్కారణమైనచో, కొందఱిని దేవతలనుగ, కొందఱిని మానవులనుగ, మఱి కొందఱిని నరక లోకస్థులనుగ, ఏల సృజించుచున్నది? అందఱిని ఉత్తమోత్తములనుగ సృజింపవచ్చును గదా! అనుచో - బ్రహ్మము జీవులు చేసికొను కర్మలనుబట్టి, ఇట్టి విషమ సృష్టి గావించుచున్నందువలన, బ్రహ్మము నిర్దయమనిగాని, పక్షపాతము గలదనిగాని తలపనక్కరలేదు. కర్మలు అనాదిగ ఉన్నవే. సృష్టికి పూర్వదశ

యగు ప్రళయమునందును జీవుల పుణ్య పాపరూప కర్మము కలదనుట నిశ్చితము.

"సూర్యా చంద్ర మసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్."

— (తైత్తిరీయ నారాయణము : 1-14)

బ్రహ్మ సూర్య చంద్రులను పూర్వకల్పమునందువలెనే ఈ కల్పమునను సృజించెను' మున్నగు వేద వాక్యములవలన, పై విషయము స్పష్ట మగుచున్నది. కావున, బ్రహ్మమే జగత్కారణము ; ప్రకృతి కాదు.

ఈ విధముగ ఈ పాదమునందు వేదాంత మతమున సాంఖ్యులు చూపించునట్టి దోషములు పరిహరింపబడినవి.

## ద్వితీయాధ్యాయము - ద్వితీయ పాదము
## ( తర్క పాదము )

### 1. రచనానుపపత్త్యధికరణము

వేదాంత మతమున సాంఖ్యాదులు చెప్పిన అనుపపత్తులను ద్వితీయాధ్యాయ ప్రథమ పాదమున పరిహరించి, రెండవ పాదమైన ఈ తర్క పాదమున సాంఖ్యాది మతములయందు దోషములను సూత్రకారులు ప్రదర్శించుచున్నారు.

సత్త్వరజస్తమోమయమైన ఈ జగత్తునకు సత్త్వ రజ స్తమస్సుల సామ్యావస్థ గల ప్రకృతి కారణము' అను సాంఖ్యుల వాదము అనుపపన్నము. చేతనాధిష్ఠితముకాని కేవలాచేతన ప్రకృతి — విచిత్ర జగత్సృష్టిని చేయజాలదు. రథాదులను కేవల దార్వాదులు వడ్రంగి సహాయము లేక తయారు చేయలేవు గదా ! వడ్రంగియే కొయ్య మొదలగువానితో రథాదులనునిర్మించుటను మనము చూచుచున్నాము పాలు పెరుగుగ పరిణమించునపుడును — నీరు, కొబ్బరి,

మామిడి, నిమ్మ మొదలగు ఫలములయందు వివిధ రసములు గలుగ పరిణమించునపుడును చేతనాధిష్ఠితము కాకున్నను, ఆ కార్యము నెరవేరుచున్నదిగదా ! అట్లే, కేవల ప్రధానము జగదాకారముగ పరిణమించుటలో అనుపపత్తి యేల ? అని అనరాదు. ఆ పాల యందును, ఆ జలమునందును బ్రహ్మము గలదని 'యోఽప్సు తిష్ఠన్' (బృ : ఉ : 5-7-4.) అను శ్రుతి తెలుపుచున్నది. కావున, అవి అట్లు పరిణమించుటలో ఆక్షేపణము లేదు.

ప్రాజ్ఞాధిష్ఠితము కాని ప్రధానమే జగత్కారణ మగు పక్షమున, జగత్సృష్టి జరుగుచునే యుండవలయును. ప్రళయమునకు అవకాశ ముండదు. ప్రాజ్ఞాధిష్ఠితమైనపుడు, అతని సంకల్పమువలన సృష్టిసంహార వ్యవస్థ ఉపపన్నము కాగలదు. పశువులు మేసిన గడ్డి క్షీరముగ పరిణమించుచున్నది గదా ! అనుటయు తగదు. ఆ గడ్డినే వృషభము మేసినపుడు, అది పాలుగ మారుటలేదు. కావున, కేవలము గడ్డి మొదలైనవి క్షీరముగ పరిణమింపజాలవు. అవియు ప్రాజ్ఞాధిష్ఠితములై, అతని సంకల్ప వశమున ఆవులయందుమాత్రమే అట్లు అవి పరిణమించుచున్నవి. గ్రుడ్డివాడు, కుంటివాడు పరస్పర సహకారముతో ప్రయాణము సాగించునట్లును, అయస్కాంత సాన్నిధ్యమున ఇనుము చలించునట్లును జీవుని సాన్నిధ్యమున ప్రకృతి జగత్సృష్టిని గావింపవచ్చునుగదా అనియు శంకింపరాదు. కుంటి గ్రుడ్డివారు కలిసినప్పుడు ఒకడు చెప్పుట, మరియొకడు వానిని తెలిసికొని నడచుట అను చేతన ధర్మములు కలవు. ఇనుమునకు అయస్కాంత సాన్నిధ్యము కాదాచిత్కము. అనగా - అది యెల్లప్పుడు ఉండునది కాదు. కాని, ప్రకృతి పురుష సాన్నిధ్యము నిత్య మగుటచే, నిత్యము సృష్టి జరుగుచుండవలయును. ప్రళయమునకు, మోక్షమునకు అవకాశమే ఉండదు. ప్రధానమునందలి సత్త్వ రజ స్తమస్సులకు సమ

విషమావస్థలు ఏర్పడుటకు కారణ మేమి? ఏదియో ఒక్క అవస్థయే కదా ఉండవలసినది! ప్రధానమునకు జ్ఞాతృత్వము లేనందువలన, స్వేచ్ఛానుసారముగ అది పరిణమించుటకు అవకాశము ఉండదు. ఇంతకును ప్రకృతి ఎవరి కొరకు పరిణమించుచున్నది? జీవుని భోగము కొఱకు అని కదా చెప్పవలయును! సాంఖ్య మతమున జీవుడు చైతన్య మాత్రస్వరూపుడు, నిష్క్రియుడు అని అంగీకరింపబడినాడు. అట్టి అతనికి భోగాపవర్గములు సంభవింపవు. మఱియు, అచేతన మగు ప్రకృతి - పురుష నిరిష్టమైన చైతన్యమును తనయందును, తన యందలి కర్తృత్వమును జీవునియందును ఆరోపించి, జగత్సృష్టిగావించు నని చెప్పుటయు అసంగతము. అచేతనమున చేతనాధ్యాసము సాధ్యము కాదు. కావున, సాంఖ్య మతము అత్యంతము అసంగతము.

## 2. మహద్దీర్ఘాధికరణము

ఈ అధికరణమున పరమాణు కారణవాదమును నిరాకరించు చున్నారు. కణాద మతమున అణువులు జగత్కారణములు. ఆ అణు వులు అవయవ విరహితములు. అట్టి రెండు అణువుల కలయికచే ద్వ్యణుకము ఏర్పడును. ఇవి యిట్లు కలియుటకు అణువులలోని చలన క్రియ కారణము. ఇవి అదృష్టమునుబట్టి ఏర్పడుచున్నవి' - అని వారి మతము ఈ మతమున కారణ గుణములు కార్యమున సంక్రమింపవల యును. అవయవ విరహితములైన అణువులు ఎట్లు కలియగలవు? రెండు వస్తువులు పరస్పరము కలియవలె నన్నచో, ఆరు పార్శ్వము లుండవలెగదా! అవయవములు ఉన్నగాని, పార్శ్వములు సంభవిం పవు. హ్రస్వమైన ద్వ్యణుకము దీర్ఘమైన త్ర్యణుకముగ ఏర్పడు నపుడు, కారణమున లేని దీర్ఘత్వరూప గుణము కార్యముగ ఏర్పడు చున్నది. ఇది స్వసిద్ధాంతమునకు విరుద్ధము. 'అణువులు అదృష్టవశ మున పరస్పరము కలియుచున్నవి' అనుటయు తగదు. ఈ అదృష్టము

అణువులయం దున్నచో, ఎల్లప్పుడును జగత్సృష్టి జరుగుచునే యుండవలయును. జీవునియం దున్నది అన్నచో, జీవులయందు గల అదృష్టము అణువుల చలనమునకు ఎట్లు కారణ మగును ? జాతిగుణ క్రియలు ద్రవ్యమునందు సమవాయ సంబంధముతో నుండునని కణాదుల సిద్ధాంతము. 'సమవాయము' అనగా - రెండు వస్తువులను కలిపి యుంచునట్టి ఒక నిత్యమైన సంబంధము. ఇది విడదీయుటకు వీలు గానిది. జాతిగుణ క్రియలవలె సమవాయ సంబంధము సైతము ద్రవ్యమున నున్నదిగదా ! ఆ సంబంధము ఆ ద్రవ్యమును ఏ సంబంధముతో నున్నది ? అని ప్రశ్నించినచో, సమాధానము దొరుకదు. కావున, వీరు సమవాయ సంబంధము నంగీకరించుట అసంగతము. సమవాయ సంబంధము నిత్య మగు పక్షమున, కార్య కారణములు రెండును నిత్యము లనుట లోకవిరుద్ధము. మఱియు - పరమాణువులు పార్థివ, ఆప్య, తైజస, వాయవీయము లను నాల్గువిధములై, క్రమముగ అవి - రూప, రస, గంధ, స్పర్శములు అను గుణములను కల్గి యుండునట్లు అంగీకరించుటయు అసంగతము. అణువులు నిత్యములు, అవయవ రహితములుగదా! రూపాది గుణములు గల ఘట పటాదులు సావయవములు, అనిత్యములునై యున్నవి. ఈ దోషమును పరిహరించుకొనుటకై, పరమాణువులు రూపాది గుణ రహితములు అని అంగీకరించినను, రూపాది గుణ రహితములైన పరమాణువులనుండి ఆ గుణములు గల ద్వ్యణుక - త్ర్యణుకాదులు ఏర్పడుట అసంగత మగును. కారణమున లేని గుణములు కార్యమున సంక్రమింపవుగదా! వైదికులు ఈ సిద్ధాంతమును స్వీకరింపనందువలన, ఇది పూర్తిగ ఉపేక్షింపదగియున్నది. సాంఖ్య మతమున గల సత్కార్య వాదము మొదలైన కొన్ని అంశములైనను వైదికులచే పరిగ్రహింపబడినవి.

## 3. సముదాయాధికరణము

వైభాషికులు, సౌత్రాంతికులు, యోగాచారులు, మాధ్యమికులు అని బౌద్ధులు నాలుగు శాఖలుగ ఏర్పడియున్నారు.

వైభాషికులు అణువులద్వారా జగత్సృష్టి జరుగుచున్నదని చెప్పుచు, ప్రత్యక్ష సిద్ధములైన పృథివ్యాదులను అంగీకరింతురు. సౌత్రాంతికులు ఆ పృథివ్యాదులు అనుమేయములు అని యందురు. యోగాచారులు బాహ్యములైన పృథివ్యాది భూతములు వాస్తవమున లేవని వానిని భాసింపజేయు విజ్ఞానముమాత్రమే సత్యమైనదని అంగీకరింతురు. ఈ మూడు శాఖలవారును తాము అంగీకరించిన అణువులు లేక విజ్ఞానము క్షణిక మని తలంతురు. మాధ్యమికుడు సర్వశూన్యవాది. బాహ్యములైన పదార్థములు కాని, ఆంతరమైన జ్ఞానము కాని ఏదియు లేదని ఈతని వాదము.

వీనిలో - మొదటి మూడు మతముల వాదము అసంగతము. పుట్టిన క్షణముననే నశించునట్టి అణువులనుండిగాని, జ్ఞానమునుండిగాని మఱియొకటి ఎట్లు పుట్టును? కావున, క్షణికములైన అణువులనుండి పృథివ్యాది సముదాయములనుండి శరీరేంద్రియ సముదాయము ఏర్పడు ననియు చెప్పునటువంటి బౌద్ధుల సిద్ధాంతము అసంగతము. పదార్థములు క్షణికములే అయినను, అట్టివానియందు స్థిరత్వ బుద్ధిని కలిగించు అవిద్యచే రాగద్వేషము లేర్పడి, వానినుండి మరల పృథివ్యాదులు వానివలన అవిద్య ఏర్పడుచు, ఒకదానికి ఒకటి కారణ మగుటవలన, అణువులనుండి పృథివ్యాది సముదాయము, దానినుండి శరీరేంద్రియ సముదాయము ఏర్పడుట యుక్తమేగదా అనియు అనరాదు.

అస్థిరములను స్థిరములనుగా భాసింపజేయు అవిద్య వాస్తవమున స్థిరములైన కార్యములను జనింప జేయుజాలదు. అవిద్యావంతుడైన

ఆత్మయు వారి మతమున క్షణికుడే అగుటవలన, రాగద్వేషాదులు
అతనియందు ఎట్లు కలుగును? కావున, సర్వము క్షణికము అను వాదము
అసంగతము. కారణ వస్తువు నశించినను, కార్యము ఏర్పడు పక్ష
మున, సర్వదా కార్యోత్పత్తి జరుగుచుండవలయును. మఱియు,
జ్ఞానము ఏర్పడుటకు నాలుగు అంశములు ముఖ్యములు. (1) జ్ఞానేం
ద్రియములు (2) వెలుతురు మొదలైన సహకారి కారణములు (3)
ఆలంబనమైన పదార్థము (4) సమనంతర ప్రత్యయము. అనగా -
కనువెంటనే గుర్తించుట. క్షణిక వాదమున, పైన చెప్పిన నాలుగు
అంశములు క్షణికములై నశించుట వలన, జ్ఞానోత్పత్తి కలుగుటకు
అవకాశము లేదు. ఇవి స్థిరము లని అంగీకరించుచో, కార్య కారణ
ములు ఏక కాలముననే గోచరింపవలసి వచ్చును. మఱియు, బౌద్ధులు -
'త్రయ భిన్నం క్షణికమ్' మూడు తప్ప, మిగిలిన దంతయు క్షణికము
అని తలంతురు. (1) ప్రతిసంఖ్యా నిరోధము = స్పష్టమైన వినాశము.
(2) అప్రతిసంఖ్యా నిరోధము = స్పష్టముగ కన్పింపని వినాశము.
(3) ఆకాశము, ఈ మూడును వారి మతమున నిత్యములు. తక్కిన
దంతయు క్షణికమే.

'అసత్తునుండి కార్యము ఏర్పడును' అని చెప్పినను, 'ఏర్పడిన
కార్యము అసత్తు అగును' అని చెప్పినను దోషము తప్పదు. అసత్తు
నుండి సత్తు ఏర్పడజాలదు గదా! సువర్ణాభరణములు సువర్ణము
నుండియే ఏర్పడుచున్నవి ఇట్లే, కార్యము సంపూర్ణముగ నశించు నను
టయు అసంగతము. కార్యము నశించుట అనగా - తన కారణ రూప
మును పొందుట - లేదా, తన స్వరూపమును కోల్పోవుట అని
మాత్రమే అర్థము. ఇట్లే, ఆకాశము శూన్యము అని క్షణికవాదుల
మతము. కాని, 'ఆత్మన ఆకాశ స్సంభూతః' - (తైత్తిరీయోపనిషత్తు:
2.1.) 'ఆత్మనుండి ఆకాశము ఏర్పడినది' అను శ్రుతివలనను, 'అత్ర
గృధ్రః పతతి' ఇచట గ్రద్ద ఎగురుచున్నది.' ఈ మొదలగు వ్యవహా
రమువలనను, ఆకాశము శూన్యము గాదు అని తెలియుచున్నది.

ఒక వ్యక్తిని మొదట చూచి, కొంతకాలమైన తరువాత, తిరిగి అతనిని చూచినపుడు, అతడే ఇతడు అను జ్ఞానము కలుగుచున్నది. దీనిని 'అనుస్మరణము' అని అందురు క్షణిక వాదమున నేటి ఈ వ్యక్తి ఆనాటివాడు కానందువలన, ఈ అనుస్మరణము కలుగ జాలదు. జ్ఞానము విచిత్రములైన శక్తులు గలది. పదార్థములు నశించినను, వాని రూప గుణ క్రియాదులు జ్ఞానమున సంక్రమించుచున్నవి. దానివలన నశించిన వస్తువులను గుర్తుకు తెచ్చుకొనుట సంభవించు వచ్చును అని వాదించుటయు తగదు. వస్తువు నశించిన పిదప, దాని ధర్మములు మఱియొకదానియందు ఎట్లు సంక్రమించును ? 'సర్వము క్షణికము' అను పక్షమున, కృషి చేసినవానికి, కృషి చేయనివానికి ఫలితము సమానముగ ఉండవలసివచ్చును

## 4. నాభావాధికరణము

యోగాచారులు బాహ్య పదార్థములను అంగీకరింపక, క్షణికమైన విజ్ఞానము మాత్రమే కలదని అంగీకరింతురు కాని, జ్ఞానమువలె బాహ్య పదార్థములును జ్ఞాన గోచరములై, సత్యములే యగుచున్నందువలన, ఈ వాదము అసంగతము. బాహ్య పదార్థములు లేకున్నను, స్వాప్నిక జ్ఞానమునందు అవి గోచరించుచున్న విధముగ, జాగ్రద్దశయందును బాహ్య పదార్థములు లేకున్నను అవి జ్ఞానమునందు భాసింపవచ్చును అనుట యుక్తము గాదు. స్వప్నమునందు గోచరించిన పదార్థములు జాగ్రద్దశయందు కనిపించుటలేదు. కాని, జాగ్రద్దశయందు అట్టి బాధ లేవియు లేవు కావున, స్వప్న దృష్టాంతముతో బాహ్యపదార్థముల సత్యత్వమును నిరాకరింపరాదు. మఱియు, విషయ శూన్యమైన జ్ఞాన ముండుటకు అవకాశము లేదు.

## 5. సర్వథానుపపత్త్యధికరణము

బౌద్ధులలో మాధ్యమికులు సర్వశూన్య వాదులు. బాహ్య పదార్థములే గాక, జ్ఞానము సయితము శూన్యమే అని వీరి మతము.

ఉదాహరణమునకు - మట్టిముద్దను చిదిపినగాని ఘటము ఏర్పడదు. కావున, ఘటము అభవమునుండి ఏర్పడుచున్నదని అంగీకరింపవల యును. అభావమునుండి ఏర్పడిన ఘటము సయితము అభావమేకదా! ఆద్యంతములయందు లేక, మధ్యలో మాత్రము గోచరించునది సత్యము కాదు అని మాధ్యమికుల వాదము. 'ఏదియు లేదు' అను వాక్యమున - 'లేదు' అను నిషేధమునకు విషయమైన వస్తువును ఒకే దానిని అంగీకరింపక తప్పదు. అట్టివానిని అంగీకరించిన పక్షమున, సర్వము శూన్యము అనుట ఎట్లు పొసగును?

## 6. ఏకస్మిన్ అసంభవాధికరణము

ఈ అధికరణమున జైన మతమును వివరించుచున్నారు. జైనులు పదార్థములయందు సత్త్వము, అసత్త్వము, నిత్యత్వము, అనిత్య త్వము, భేదము, అభేదము మొదలైన పరస్పర విరుద్ధములు ఒకే సమయమున ఉండవచ్చునని వాదింతురు. కాని, ఈ వాదము అను భవ విరుద్ధము. దేశకాల భేదములచే ఒకే వస్తువున పరస్పర విరుద్ధ ధర్మములు ఉండవచ్చును కాని, ఒకే సమయమున ఒకే వస్తువున ఇవి యుండుట అసంగతము. ఇట్లే వీరు - జీవుడు మధ్యమ పరిమాణము గలవాడు. అనగా, ఆ యా శరీరముల పరిమాణము గలవాడు అని తలంతురు. ఇదియు అసంగతము. ఏనుగు శరీరములోని జీవుడు దోమ శరీరమును ధరింపవలసినపుడు, ఆ శరీరమునందు అంతట ఎట్లు వ్యాపింపగలడు? కావున, 'జీవుడును మధ్యమ పరిమాణముగలవాడు' అను వాదము అసంగతము. 'ఆత్మ - శరీరములు అను ఉపాధులను బట్టి, తన పరిమాణమును మార్చుకొనుచుండును' - అని తలంచినచో, ఘటపటాదులవలె ఆత్మయు అనిత్యుడగును. మఱియు, జీవుడు మోక్షదశయందు ఏదో ఒక స్థిరమైన పరిమాణమును కలిగి యుండునుగదా! ఆ పరిమాణమే సంసార దశయందును ఉండును

అంగీకరించుటయు యుక్తము. ఈ విధముగ జైనసిద్ధాంతము యుక్తి విహీనమై, అప్రామాణిక మగుచున్నది.

## 7. పశుపత్యధికరణము

ఈ అధికరణమున పాశుపత మతము నిరాకరింపబడుచున్నది. పాశుపతులు పశువు = జీవుడు, పాశము = సంసారము, పతి = ఈశ్వరుడు అను మూడు తత్త్వములను అంగీకరింతురు. వీరి మతమున ఈశ్వరుడు జగత్తునకు నిమిత్త కారణము మాత్రమే అగుచున్నాడు. వైదిక మతమున - ప్రపంచమునకు నిమిత్తోపాదానకారణములు రెండును బ్రహ్మమే కావున, పాశుపత మతము వేదవిరుద్ధమైనది. మఱియు, పాశుపత మతమున, శ్మశాన భస్మధారణ, కపాల భోజనాదికములు విహితములై యున్నవి. అవియు అవైదికములే. పాశుపతులు ఈశ్వరుని అస్తిత్వమును వేద ప్రమాణముద్వారా కాక, అనుమాన ప్రమాణము ద్వారా అంగీకరింతురు. అట్టి ఈశ్వరుడు ప్రకృతిని అధిష్ఠించి, జగత్సృష్టిని గావించునని తలంతురు శరీరములేని ఈశ్వరుడు ప్రకృతిని ఎట్లు అధిష్ఠించియుండును ? జీవునకు శరీరము లేకున్నను - అతడు శరీరేంద్రియములను అధిష్ఠించుచున్నాడుగదా ! అట్లే, ఈశ్వరుడును ప్రకృతిని అధిష్ఠింపవచ్చును అని వాదించు పక్షమున, జీవునివలె ఈశ్వరుడును కర్మఫలములైన సుఖదుఃఖములను అనుభవింపవలసివచ్చును. ఈశ్వరునికి సుఖ దుఃఖ భోగములను అంగీకరించినచో, జనన మరణాదికములు, అసర్వజ్ఞత్వము మొదలగు దోషములు ఏర్పడగలవు. కావున, పాశుపత మతము అవైదికమై, అప్రామాణిక మగుచున్నది.

## 8. ఉత్పత్త్యసంభవాధికరణము

ఈ అధికరణమున శ్రీ పాంచరాత్రాగమముయొక్క అప్రామాణ్యము నాశంకించి, పరిహరించుచున్నారు.

పాంచరాత్ర మతమున వాసుదేవునినుండి సంకర్షణుడు అను జీవుడు పుట్టును. అతనినుండి ప్రద్యుమ్నుడు అను మనస్సు, వానినుండి అనిరుద్ధుడు అను అహంకారము పుట్టుచున్నట్లు చెప్పబడినది. ఉపనిషత్తులు - 'జీవుడు చావు పుట్టుకలు లేనివాడు' అని ఘోషించుచుండుటచే, జీవోత్పత్తిని అంగీకరించు పాంచరాత్ర మతము అప్రామాణికము. ఇట్లే, కర్తయగు జీవునినుండి, కరణమైన మనస్సు ప్రద్యుమ్నడను పేర పుట్టుచున్నది అనుటయు అసంగతము. కర్తనుండి కరణము పుట్టుటయు అవిరుద్ధముగదా! కావున, పాంచరాత్ర మతము పరిగ్రాహ్యముకాదు అని పూర్వపక్షము. ఇక దీనికి సమాధానము. 'పరబ్రహ్మమైన వాసుదేవునినుండి సంకర్షణుడు అను జీవుడు పుట్టుచున్నాడు' అను వాక్యమున, సంకర్షణుడు వాసుదేవునికంటె భిన్నమైనవాడు కాదు. అతడు జీవాధిష్ఠాతయైన వాసుదేవుడే. ఇట్లే, మనస్సునకు అధిష్ఠాతయైన వాసుదేవుని ప్రద్యుమ్నుడని, అహంకారమునకు అధిష్ఠాతయైన వాసుదేవుని ప్రద్యుమ్నుడని, అహంకారమునకు అధిష్ఠాతయైన వాసుదేవుడు అనిరుద్ధుడని వ్యవహరించబడుచున్నాడు. కావుననే ఈ నాలుగు రూపములను చతుర్వ్యూహములని పేర్కొనిరి. పాంచరాత్ర శాస్త్రమున జీవోత్పత్తి స్పష్టముగ నిషేధింపబడినది. చూడుడు :—

"సహ్యనాది రనన్త శ్చ పరమార్థేన నిశ్చితః"

కావున, పాంచరాత్ర మతము ప్రామాణికమే.

ఈ పాదమునందు సాంఖ్య - వైశేషికాది మతముల యందలి దోషములను ప్రదర్శించి, వేదాన్త సిద్ధాంతము నంగీకరించిన పాంచరాత్రము యొక్క ప్రామాణ్యము చివరికి స్థిరీకరింపబడినది.

# ద్వితీయాధ్యాయ తృతీయ పాదము
## (వియత్పాదము)
### 1. వియదధికరణము

శ్రుతియందు ఆకాశోత్పత్తి చెప్పబడినందున, ఆకాశమునకు ఉత్పత్తియే లేదు అని పూర్వపక్షము. కాని, "ఆత్మన ఆకాశ స్సంభూతః." (తైత్తి : 2 - 1) 'బ్రహ్మము నుండి ఆకాశము పుట్టినది' అని శ్రుతి - ఆకాశోత్పత్తిని స్పష్టముగ చెప్పుచుండుటచే, ఆకాశమునకును ఉత్పత్తి గలదు. "త త్తేజోఽసృజత." (ఛాందో : 6 - 2 - 3.) 'ఆ బ్రహ్మము తేజమును సృజించినది' అని మొదట తేజస్సు యొక్క సృష్టిని చెప్పుటచే, 'ఆకాశము పుట్టినది' అను వాక్యమును గౌణార్థముగ గ్రహింపవలయును. ఇంతియేగాక, "వాయు శ్చాంతరిక్షం చ ఏత దమృతమ్" (బృ : ఉ : 4 - 33) 'వాయువు, ఆకాశము మరణము లేనివి' అనగ, 'నిత్యములు' అనుటచే, ఆకాశమునకు ఉత్పత్తి సంభవింపదు. మఱియు - బ్రహ్మ శబ్దమునకు ఆ యా ప్రకరణములనుబట్టి, పరబ్రహ్మము - ప్రకృతి మొదలగు అర్థములను గ్రహించు రీతిని - "ఆత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః" (తైత్తి : 2 - 1.) అను వాక్యమున, సంభూత శబ్దమునకు - 'పుట్టినది' అని ఒకచోట ముఖ్యార్థమును, వాయు - ఆకాశముల విషయమున ప్రకటమైనది అను గౌణార్థమును గ్రహింపవలయును అని అనరాదు. బ్రహ్మమును తెలిసికొనినచో, బ్రహ్మకార్యమగు విశ్వ మంతయు తెలియబడగలదని మృత్తికా దృష్టాంతముతో ఛాందోగ్యోపనిష త్తు వివరించుచున్నది. ఆకాశము బ్రహ్మము నుండి జనింపకున్నచో, బ్రహ్మజ్ఞానముచే ఆకాశము ఎట్లు తెలియబడును ? కావున, ఆకాశము సయితము పుట్టుచున్నదని అంగీకరింపవలయును. మఱియు, సృష్టికి పూర్వము 'సత్' అనబడు బ్రహ్మము మాత్రమే

ఉన్నట్లును, తద్భిన్నమైనది ఏదియు లేనట్లును శ్రుతి చెప్పుచున్నది. సృష్టికి పూర్వము లేని ఆకాశము సృష్టి సమయమున జనించినది అను టయే యుక్తము 'ప్రపంచ మంతయు బ్రహ్మకార్యము' అని పలికి, వానిలో కొన్నింటిని మాత్రమే వివరించినను, తక్కిన వన్నియు బ్రహ్మకార్యములే యగుచున్నవి.

ఈ విధముగ ఆకాశోత్పత్తిని సాధించిన యుక్తులచేతనే వాయువునకు ఉత్పత్తి కలదని గ్రహింపవలెయును. సృష్టింపబడనిది జగత్కారణమైన బ్రహ్మము మాత్రమే.

## 2. తేజోఽధికరణము

'వాయో రగ్నిః' (తైత్తి : 2 - 1.) వాయువునుండి అగ్ని జనించుచున్నది' అనుటచే, అగ్ని సృష్టికి కారణము వాయువు. ఇట్లే 'అగ్నే రాపః' (తైత్తి : 2 - 1.) అగ్నినుండి ఉదకములు జనించు చున్నవి' అను శ్రుతివలన, ఉదకముల సృష్టికి తేజస్సు కారణ మగు చున్నది. ఇదే విధముగ - 'అద్భ్యః పృథివీ' - (తైత్తి : 2 - 1.) ఉదకమునుండి భూమి జన్మించుచున్నది' అను శ్రుతివలన, భూసృష్టికి ఉదకము కారణమని తెలియుచున్నది.

ఛాందోగ్యమున "తా అన్న మసృజన్త" ఆ ఉదకములు అన్నమును సృజించినవి' అని, సృష్టిప్రకరణమునందు చెప్పబడి యున్నవి. ఇచట అన్నశబ్దమునకు - 'భూమి' అనియే అర్థము. కావు ననే, "యత్ కృష్ణం త దన్నస్య" (ఛాందో : 6 - 4 - 1) అను వాక్యమున, భూమియొక్క కృష్ణవర్ణమునే అన్నమునకు చెప్పి యున్నాడు. కావున, ఇచట అన్నశబ్దము భూమిని బోధించుచున్నది.

సృష్టిప్రకరణమున బ్రహ్మము ఆకాశమును, ఆకాశము వాయు వును, వాయువు తేజస్సును, తేజస్సు ఉదకములను, ఉదకము భూమిని

సృష్టించినట్లు చెప్పబడియున్నను, అచేతనములైన ఆకాశాదులు స్వతంత్రముగ మఱియొక దానిని సృజింపజాలక పోవుటవలనను, "త త్తేజ ఐక్షత, తా ఆప ఐక్షన్త." (ఛాందో : 6 _ 2 _ 3.) ఆ తేజస్సు సంకల్పించినది, ఆ ఉదకములు సంకల్పించినవి' అని చెప్పబడిన సంకల్పము తేజస్సు మొదలైనవానికి సంభవింపకపోవుటవలనను, ఆకాశాది శరీరకమై, తత్తదంతర్యామిగా నున్న బ్రహ్మమే ఈ సృష్టిని కావించుచున్నదని గ్రహింపవలయును. ఇట్లే, సృష్టిక్రమమును చెప్పినపుడు, ఆకాశమునుండి, తేజస్సునుండి సృష్టి ప్రారంభమైనట్లే, వేరు వేరు రీతులలో బోధింపబడుచున్నను, 'ఇది యంతయు బ్రహ్మమువలననే సృజింపబడుచున్నది' అని గ్రహించినపుడు ఎట్టి బాధయు ఉండదు.

"ఆత్మన ఆకాశ స్సంభూతః." — (తైత్తి . 2.1)

"ఏతస్మాత్ జాయతే ప్రాణః, మన స్సర్వేంద్రియాణి చ, ఖం వాయుః జ్యోతి రాపః పృధివీ విశ్వస్య ధారిణీ."

— (కఠోపనిషత్తు : 2-1-3)

అను శ్రుతివాక్యములలో _ ఒకదానియందు బ్రహ్మమునుండి తొలుత ఆకాశోత్పత్తి చెప్పబడగా, రెండవదానియందు _ ప్రాణము, మనస్సు ఇంద్రియములయొక్క ఉత్పత్తి తరువాత, ఆకాశాది సృష్టి చెప్పబడియున్నది. ఇవి యన్నియు బ్రహ్మకార్యము లగుటచే, వీని పౌర్వాపర్యక్రమము మారినను, బాధకము కాదు. ఆకాశాది శబ్దములు ప్రసిద్ధములైన భూతాకాశాదులను వలెనే, తదంతర్యామియైన బ్రహ్మమును సయితము బోధించుచున్నది. ఆకాశాదులు బ్రహ్మమునకు శరీరములు కాగా, బ్రహ్మము దానికి అంతర్యామి. శరీర వాచక శబ్దములు శరీరి పర్యంతము బోధకము లగుట లోక వ్యవహారసిద్ధమే గదా !

## 3. ఆత్మాధికరణము

పై అధికరణములయందు అచిద్విశేషములైన ఆకాశాదులకు స్వరూపాన్యథాభావరూపమైన ఉత్పత్తి కలదని ప్రదర్శింపబడినది. ఈ అధికరణమున, జీవాత్మలకు స్వరూపాన్యథాభావరూపమైన బ్రహ్మకార్యత్వము లేకున్నను, స్వభావాన్యథాభావ రూపమైన బ్రహ్మకార్యత్వము కలదని నిరూపింపబడుచున్నది.

"న జాయతే మ్రియతే వా విపశ్చిత్" — (కఠోపనిషత్తు. 2 - 18)

'జీవుడు పుట్టడు, గిట్టడు' అను శ్రుతివాక్యమువలన, జీవాత్మకు ఉత్పత్తి లేదు. అతడు నిత్యుడు.

## 4. జ్ఞాధికరణము

"అథ యో వేద ఇదం జిఘ్రాణీతి స ఆత్మా."
—(ఛాందోగ్యోపనిషత్ : 8-12,4)

ఎవడు దీనిని 'వాసన చూచుచున్నాను' అని తలంచుచున్నాడో, అతడు ఆత్మ అను శ్రుతివాక్యములవలన జీవుడు జ్ఞాత యని తెలియుచున్నది. ఇట్లే, జీవుడు శరీరమునుండి ఉత్క్రమించుటచేతను, మఱియొక శరీరమున ప్రవేశించుటచేతను ఆ సమయములందు ఎవ్వరికి గోచరింపకున్నందువలనను ఇతడు అణు పరిమాణుడు అని అంగీకరింపవలయును.

"స వా ఏష మహాన్ అజ ఆత్మా." —(ఛాం.ఉ. . 8-12-4.)

ఈ ఆత్మ 'మహత్తైనవాడు, పుట్టుక లేనివాడు' అను శ్రుతివాక్యము వలన, జీవాత్మ మహత్పరిమాణము కలవాడుగాదా అని శంకింపరాదు. ఈ మంత్రమునందు - మహాన్' అని విశేషింపబడినది

బ్రహ్మతత్వమే గాని, జీవాత్మ కాదు. కావున, జీవుడు అణుపరిమాణుడే. మఱియు —

"ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః" — (ముం. ఉ. 3-1-9)

అణువైన ఈ ఆత్మ - 'మనస్సుచే తెలిసికొనదగినవాడు' అని స్పష్టముగ జీవుడు అణుపరిమాణుడు అని శ్రుతియు తెలిపియున్నదిగదా! ఇదేవిధముగ —

"ఆరాగ్రమాత్రో హ్యవరః." — (శ్వేత: ఉ. 5-8.)

'సూది మొనవలె సూక్ష్మమైనవాడు' అని జీవిత పరిమాణమును ఉపమానముతో శ్రుతి తెలిపియున్నందువలనను ఇతడు అణుపరిమాణము గలవాడే. 'జీవాత్మ అణువైనచో, శరీరమునందు నఖ శిఖ పర్యంతము జ్ఞానము ఎట్లు కలుగుచున్నది?' అని సందేహింప నవసరము లేదు. చందనపు ముద్దను హృదయము మీద నుంచినచో, అది శరీరమున కంతటికిని ఆహ్లాదమును కలిగించు విధముగ, జీవుడు అణుపరిమాణుడైనను, నఖ శిఖ పర్యంతము జ్ఞానమును కలిగింపవచ్చును. లేదా, దీపము ఒక ప్రదేశమున నున్నను, తన చుట్టు కాంతిని ప్రసరింపజేయు విధముగ - జీవుడు హృదయమునందు ఉండి, శరీరము నంతట తన జ్ఞాన గుణముచే వ్యాపింపవచ్చును. పుష్పముకంటె దాని గుణమైన గంధము ఎట్లు వేరగుచున్నదో, అట్లే, ఆత్మను ఆశ్రయించి యుండు జ్ఞానము అను గుణము ఆత్మకంటె భిన్నమై, శరీరమున వ్యాపింపవచ్చును.

"జానత్యేవాయం పురుషః." — (బృ. ఉ 6-3-30)

'పురుషుడు తెలిసికొనుచునే యున్నాడు' అను శ్రుతివాక్యము జ్ఞానము జీవుని గుణ మని తెలుపుచున్నది.

"న హి విజ్ఞాతుః విజ్ఞాతేః విపరిలోపో విద్యతే." — (బృ. ఉ 6-3-30)

'విజ్ఞాత యగు జీవునియొక్క విజ్ఞానమునకు ఎన్నడును లోపము లేదు గదా!' అను శ్రుతి - జీవునికంటె భిన్నముగ అతనికి గుణభూతమైన జ్ఞానమును కలదని, అది సత్యము అని తెల్పుచున్నది. దీనినే ధర్మభూతజ్ఞానమని అందురు వాస్తవమున జీవాత్మ పరమాత్మలు జ్ఞాతలే అయినను, వీరిని జ్ఞానశబ్దముచేతను అచ్చటచ్చట శ్రుతి వ్యవహరించుచున్నది.

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ." — (తై. ఉ. : 2-1)

ఇచటి విజ్ఞాన శబ్దము బ్రహ్మబోధకము.

"విజ్ఞానం యజ్ఞం తనుతే" — (తై. ఉ : 2-5-1)

ఇచటి జ్ఞాన శబ్దము జీవాత్మవాచకము. వీరియొక్క స్వరూపము, గుణము రెండును జ్ఞానాత్మకములే యగుటవలన, జ్ఞాన శబ్దముచే వీ రిట్లు పేర్కొనబడిరి. జ్ఞాన గుణము ఆత్మ స్వరూపమువలె నిత్యమైనది. గోవునందు ఎన్ని ధర్మములు మారినను, గోత్వము అను ధర్మము మారదు గదా! అది నిత్యమైనది. ఆ గోత్వమును పురస్కరించుకొనియే గోవు అని వ్యవహరించుచున్నాము. ఇదే విధముగ జ్ఞాన శబ్దముచే జీవుడు పేర్కొనబడుచున్నాడు. జీవాత్మకు జ్ఞానము నిత్యమైన గుణ మగుచో, నిద్రయందును అది భాసింపవలయునుగదా అని శంకింపరాదు. పుంస్త్వాదులు బాల్యదశయందు భాసింపక, యౌవన దశయందు మాత్రమే భాసించునట్లు, జ్ఞానము జాగ్రద్దశయందు మాత్రమే భాసించును. నిద్రావస్థలో అది భాసింపదు. కావుననే కేవల జ్ఞానము ఆత్మ అను వాదము అసంగత మగుచున్నది కేవల జ్ఞానమే ఆత్మ యగు పక్షమున, దానిద్వారా జ్ఞానము ఎల్లప్పుడు కలుగుచుండవలయును. లేక, దానివలన జ్ఞానము ఏర్పడకనే యుండవలయును

## 5. కర్త్రధికరణము

నిత్యుడు, జ్ఞాత, అణుపరిమాణుడు, జ్ఞాన గుణకుడు (జ్ఞానమును గుణముగ గలవాడు) అయిన జీవుడు — కర్తయు అగుచున్నాడు' అని ఈ అధికరణమున నిరూపింపబడుచున్నది. వేదము జీవాత్మల నుద్దేశించి, 'ఇది చేయుము, ఇది చేయకుము' అనుచు, విధి నిషేధములను బోధించుచున్నది. జీవుడు ఇట్లు విహితములైన కర్మలయందు ప్రవర్తించుచున్నాడు. నిషిద్ధములైన కర్మలనుండి నివర్తించుచున్నాడు. జ్యోతిష్టోమాది యజ్ఞములను గావించి, స్వర్గాది ఫలముల ననుభవించుచున్నాడు. కావున, ఇతడు సుకృత దుష్కృతములకు కర్త. కావుననే పుణ్యపాప ఫలములకు భోక్తయు అగుచున్నాడు. జీవుడు కర్త కానిచో, విధి నిషేధ శాస్త్రములు వ్యర్థము లగును గదా!

"ఏవ మేవ ఏష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా" —(బృ ఉ : 4-1-18)

'ఇట్లే, ఇతడు ఈ ప్రాణములను తీసికొని' అను వాక్యమున ప్రాణ గ్రహీతగా —

"స్వే శరీరే యథా కామం పరివర్తతే" — (బృ. ఉ. 4-1-18)

'తన శరీరమున యథేచ్ఛగా విహరించును' అను వాక్యమున విహర్తగా జీవుడు ప్రస్తావింపబడినాడు. కావున, ఇతడు కర్త. జీవుడు కర్త కానియెడల —

"విజ్ఞానం యజ్ఞం తనుతే" — (తై. ఉ. 2-5-1)

అను వాక్యమున - 'విజ్ఞానం' అని కాక, విజ్ఞానేన, = విజ్ఞానముతో అని విభక్తి మార్చబడి యుండును. యజ్ఞాచరణమున విజ్ఞాన శబ్ద వాచ్యుడైన జీవుడు కర్త యగుటచేతనే, అది ప్రథమాంతముగ నిర్దేశింపబడినది. ప్రకృతి కర్త, జీవుడు భోక్త అను వాదము ఒకటి

కలదు. ప్రకృతియే కర్తయగు పక్షమున, ఎల్లవేళల అతడు భోక్త గనే యుండవలయును. కావున, కర్తృత్వ - భోక్తృత్వ ధర్మములు రెండును జీవాత్మయందే ఉన్నవి. అదియే భోక్త కావలసి వచ్చును. కర్త యొకరు, భోక్త మరి యొకరు అనుట అసంగతము. 'ప్రకృతి కంటె నేను అన్యుడను' అను సమాధి దశయందు ప్రకృతి కర్త కాజాలదుకదా! వడ్రంగి తన ఇచ్ఛానుసారము వడ్రంగము చేయును. అతడు చేసినను, చేయకున్నను వడ్రంగియే కదా! ఇట్లే, జీవాత్మ తన ఇచ్ఛానుసారము కర్మలను జేయుచుండును. లేదా - విశ్రాంతి గైకొనును. అన్ని వేళలయందును అతడు కర్తయే.

## 6. పరాయత్తాధికరణము

### జీవుని ఈ కర్తృత్వము పరమాత్మ సంకల్పాధీనము.

"అంతః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా."—(తైత్తి . అరణ్య 3-11-10) 'జనులయొక్క లోపల ప్రవేశించి శాసించునట్టివాడు, సర్వపదార్థములయందును ఆత్మగా నుండువాడు పరమాత్మ' అని ఈ విషయమును శ్రుతి స్పష్టముగా బోధించుచున్నది. జీవుని కర్తృత్వము పరమాత్మ సంకల్పాధీనమైనయెడల, జీవుడు చేయు పుణ్య పాప రూప ఫలములకు అతడు బాధ్యుడు కాడుకదా' అను సందేహము కలుగవచ్చును. ఇందులకు సమాధానము : - పరమాత్మయొక్క ఆదేశముతో జీవుడు మొదట కర్మలతో ప్రవేశించును. తరువాత అతని పుణ్య పాప కర్మలను బట్టి ఆ తరువాతి కర్మలలో పరమాత్మ ప్రవర్తింపజేయును. కావుననే, వేదమున గల విధి నిషేధములు వ్యర్థములు కాక, సార్థకములగుచున్నవి.

## 7. అంశాధికరణము

"పృథ గాత్మానం ప్రేరితారం చ మత్వా" — (శ్వేత: ఉ: 1-6.)

ఆత్మను, ఆ యాత్మను ప్రేరేపించు పరమాత్మను భిన్నులనుగా ధ్యానించి' అనుచు శ్రుతి ఒకచోట - జీవాత్మ పరమాత్మల భేదమును తెలుపుచున్నది.

"తత్త్వమసి" — (ఛాం : ఉ : 8-12-4.)

'నీవు ఆ పరబ్రహ్మము అయి వున్నావు' ఈ మొదలగు శ్రుతి వాక్యములు - జీవాత్మ పరమాత్మలు అభిన్నులని బోధించుచున్నవి. వీనిలో దేనిని గ్రహింపవలయును? అనినచో, బ్రహ్మముయొక్క అంశము జీవుడు. అనగా - పరమాత్మ జీవులయందు అంతర్యామిగా నుండుటచే, అతనికి శరీరభూతుడై, అతని అంశ మగుచున్నాడు. ఈ శరీరభావ సంబంధమును బట్టియే ఉపనిషత్తులయందలి భేదాభేద వాక్యములను సమన్వయింపవలయును.

"పాదోఽస్య విశ్వా భూతాని". — (పురుష సూక్తము)

సమస్త భూతములు బ్రహ్మముయొక్క పాదము' అను శ్రుతి - జీవాత్మ పరమాత్మల అంశాంశి భావమును స్పష్టముగ బోధించుచున్నది.

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః."

నాయొక్క అంశమే జీవలోకమున నిత్యమైన జీవుడై తెలుగొందుచున్నది' అని భగవద్గీతయు (17 - 7.) తెలుపుచున్నది. జీవుడు బ్రహ్మముయొక్క అంశ మగు పక్షమున, జీవుని దోషము లన్నియు బ్రహ్మమున సంక్రమించునుగదా యని శంకింపరాదు. జీవాత్మ పర

మాత్మల అంశాంశి భావము ప్రభా - ప్రభావంతుల, వ్యక్తి-జాతుల, అంశాంశి భావము వంటిది. కావున, జీవ దోషములు బ్రహ్మమున సంక్రమింపవు. ప్రభ-ప్రభవ దృష్టాంతమును విష్ణుపురాణ మిట్లు వివరించుచున్నది :—

"ఏక దేశ స్థిత స్యాగ్నేః జ్యోత్స్నా విస్తారిణీ యథా
పరస్య బ్రహ్మణ శ్శక్తిః తథేద మఖిలం జగత్,"

— (విష్ణు పురాణము : 1-22-56)

ఒకచోట ఉన్న అగ్నియొక్క కాంతి నలువైపుల ఎట్లు ప్రసరించుచున్నదో, అట్లే - ఈ ప్రపంచ మంతయు బ్రహ్మముయొక్క శక్తి - విస్తారమై యొప్పుచున్నది."

జీవు లందరు బ్రహ్మమే యైనచో - వేదాధ్యయనాదులయందు కొందరిని మాత్రమే అనుమతించుచు, మరికొందరిని అనుమతింపకుండుట ఎట్లు సంభవించును? అని సందేహింపనవసరము లేదు. జీవునికి ఆ విధి నిషేధములు ఆ యా దేహముల సంబంధము వలన సంభవించుచున్నవి. పవిత్రమైన స్థలమున అగ్నిని స్వీకరించుచు, స్మశానాదులయందున్న అగ్నిని పరిహరించుచున్నాముగదా! అగ్నికి పరిగ్రాహ్యత్వము, పరిత్యాజ్యత్వము అనునవి ఆ యా దేశములతోడి సంబంధమునుబట్టి, జీవునికి విధి నిషేధ శాస్త్రములు ప్రవర్తిల్లుచున్నవి. జీవులు బ్రహ్మముయొక్క అంశము లగుటచే పరస్పరము భిన్నులై యుందురు. కావుననే ఒకరి సుఖదుఃఖములు మరి యొకరికి సంక్రమింపకున్నవి. సత్యము - లేక, అసత్యమైన ఉపాధి వశమున బ్రహ్మమే జీవుడుగా వ్యవహరించుచున్నది అనుటకు చూపబడిన హేతువులు కేవలము అభ్యాసములు. ఈ ఉపాధికి కారణము అదృష్టము అనుటయు అసంగతము. అదృష్టము గాని దానివలన ఏర్పడిన ఉపాధిగాని బ్రహ్మమును భేదింపజాలవు. ఇట్లే, బ్రహ్మ సంకల్పాదులులు వీనికి కారణము కాజాలవు.

బ్రహ్మమున కొంత భాగము ఉపాధితో కూడి యుండదు అనుటయు అసంగతము. బ్రహ్మము అఖండముగదా! ఈ పాదమునందు పృథివ్యాది పంచభూత జీవులు బ్రహ్మకార్యములే కావున, బ్రహ్మకారణతావాదము నిరాబాధము అని నిరూపించబడినది.

# ద్వితీయాధ్యాయ - తృతీయ పాదము
# ( ప్రాణ పాదము )

## 1. ప్రాణోత్పత్త్యధికరణము

"అసద్వా ఇద మగ్ర ఆసీత్ .. ఋషయోవావతేఽగ్రే
సదాసీత్ ప్రాణావావ ఋషయః"

— (శతపథ బ్రాహ్మణము . 6–1–6)

ఈ ప్రపంచము సృష్టికి పూర్వము అసత్తున నుండినది. ఆ దశలో ఉన్నది 'సత్' తత్త్వము మాత్రమే. 'సత్' అనగా - ఋషులు ఋషులు అనగా - ప్రాణములు అని చెప్పుటచే, సృష్టికి పూర్వమునందే ప్రాణములు (ఇంద్రియములు) జీవుని వలె నిత్యములు' అని పూర్వ పక్షము. ఇందులకు సమాధానము :- పై శ్రుతి వాక్యమున గల ఋషి - ప్రాణ శబ్దములు పరమాత్మ బోధకములు. ఇచట బహు వచనము అవివక్షితము. ఆకాశాది సృష్టికి పూర్వము వాక్కు ఏర్పడుటవలన, దానికి ముందున్నవాడు పరమాత్మయే అగుచున్నాడు. కావున, ఇచట ప్రాణ శబ్దము పరబ్రహ్మవాచకమే గాని, ఇంద్రియ వాచకము కాదు.

## 2. సప్తగత్యధికరణము

"సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్." — (ముం. ఉ. 2–1–8.)

జీవునితో ఏడు ఇంద్రియములు సంచరించుచున్నవి' అనుట వలనను -

"యదా పఞ్చావ తిష్ఠన్తే జ్ఞానేన మనసా సహ." — (2 - 6 - 10)

యోగదశయందు పంచేంద్రియములు, మనస్సు, బుద్ధి అను ఈ ఏడును స్థిరముగ నున్నచో, యోగము సిద్ధించు ననుచు ఏడు ఇంద్రియములను పేర్కొనుటవలనను - ఇంద్రియములు ఏడు అనుట సిద్ధించుచున్నది అని పూర్వపక్షము. కాని, ఈ వాదము సరియైనది కాదు.

త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు - అను పంచ జ్ఞానేంద్రియములు, వాక్ పాణి పాద పాయూపస్థలు - అను పంచ కర్మేంద్రియములు, మనస్సు కలిసి ఇంద్రియములు పదునొకటి. వీనిలో - జ్ఞానేంద్రియములు, మనస్సు - జీవునితోపాటు వేరు వేరు శరీరములలోనికి ప్రవేశించుచుండును. కర్మేంద్రియములు మాత్రము ఆ యా శరీరములతోనే నశించును

## 3. ప్రాణాఽణుత్వాధికరణము

"ప్రాణ మనూత్క్రామన్తం సర్వే ప్రాణాః అనూత్క్రామన్తి"
— (బృహదారణ్యకోపనిషత్తు 6-4-2)

ఉత్క్రమించుచున్న ముఖ్యప్రాణము ననుసరించి తక్కిన ప్రాణములును బయలువెడలుచున్నవి' అను వాక్యమున, జీవునితోపాటు ప్రాణములకును అనగా - ఇంద్రియములకును ఉత్క్రాన్తి తెలుపబడినది. ఉత్క్రమించునపుడు ఈ ప్రాణములను ఎవ్వరును గుర్తింపలేకున్నారు. కావున, ఇవి అణుపరిమాణములు అని గ్రహింపవలయును.

"ఏతస్మాజ్జాయతే ప్రాణః" — (ముం : ఉ : 2-1-3)

ఈ పరమాత్మనుండి ప్రాణము పుట్టుచున్నది' అను శ్రుతివాక్యము వలన, ముఖ్యప్రాణము సయితము పరబ్రహ్మమునుండి పుట్టుచున్నదని స్పష్ట మగుచున్నది.

## 4. వాయుక్రియాధికరణము

"ఏతస్మాజ్జాయతే ప్రాణః ఖం వాయుః." — (ముం : ఉ . 2-1-3)

ఈ పరమాత్మనుండి ప్రాణము, ఆకాశము, వాయువు పుట్టుచున్నవి' అనుటవలన, ప్రాణములతోబాటు వాయువును ప్రత్యేకించి పేర్కొనుటవలన, ఇవి రెండును భిన్నములు. ప్రాణము కేవల వాయుమాత్రము కాక, దేహధారణ సమర్థమైన వాయు విశేషము అని సిద్ధాంతము. చక్షురాదీంద్రియములతోబాటు ప్రాణమునుకూడ పేర్కొనుటచే, ఇవియు జీవునికి ఉపకరణ మగుచున్నది. వీని యన్నింటిలో - ఈ ప్రాణము ముఖ్యమైనది. ఒకవేళ జీవునికి ఇది ఉపకరణముగాదు అని తలంచినను, చక్షురాదీంద్రియములకు ఇవి ధారక మగుటచే, ప్రాణము జీవునికి ఉపకరణ మగుచున్నది. వీని యన్నింటిలో ఈ ప్రాణము ముఖ్యమైనది. ఒకవేళ జీవునికి ఇది ఉపకరణము కాదు అని తలంచినను, చక్షురాదీంద్రియములకు ఇది ధారక మగుటచే, ప్రాణము జీవునికి ఉపకారక మగుచున్నది. ఈ ముఖ్య ప్రాణము ప్రాణాపానాది రూపమైన పంచవిధప్రవృత్తులు కలిగి, ప్రాణాపానాది నామములతో వ్యవహరింపబడుచున్నది.

## 5, శ్రేష్ఠాణత్వాధికరణము

ఈ ప్రాణము సయితము ఉత్క్రాంతి సమయమున గుర్తింపబడుచున్నందువలన, అణుపరిమాణముగలది అని అంగీకరింపవలయును.

## 6. జ్యోతిరాద్యధిష్ఠానాధికరణము

వాక్కు మొదలగు ఇంద్రియములకు జీవునితోబాటు అగ్న్యా దులును అధిష్ఠాన దేవత లగుచున్నారు. ఇందులకు పరమాత్మ సంకల్పమే కారణము.

## 7. ఇంద్రియాధికరణము

ప్రాణ శబ్దము ప్రాణములతోబాటు ఇంద్రియములనుకూడ బోధించుచున్నది. ప్రాణాధీనమైన ప్రవృత్తి కలవి యగుటచే, ఇంద్రియములు, ప్రాణము - వేరు వేరుగ అనేక స్థలములయందు పేర్కొనబడు చున్నవి. ఇంద్రియములు శ్రమించినను, ప్రాణము విశ్రమింకదు కావున, ప్రాణము, ఇంద్రియములు భిన్నములు.

## 8. సంజ్ఞామూర్తి క్ల్పప్త్యధికరము

తేజస్సు, జలము, పృథివి - అను ఈ మూడింటిని పరమాత్మ తన సంకల్పముచే సృజించి, వీనిని త్రివృత్కరణము గావించు చున్నాడు. అనగా - పై మూడు తత్త్వములను తొలుత రెండేసి భాగములుగ విభజించి, అం దొక భాగమును తక్కిన తత్త్వములతో మిశ్రణ మొనర్చుచున్నాడు ఈ మిశ్రణమువలననే ఈ జగత్తు ఏర్పడు చున్నది. ఇట్లే, త్రివృత్కరణము గావించిన పరమాత్మయే చతుర్ముఖునియందు అంతర్యామిగ నుండి, అతనిద్వారా నామరూపాత్మకమైన వ్యష్టిసృష్టిని గావించుచున్నాడు.

"అన్న మశితం త్రేధా విధియతే," — ఛాం : ఉ : — (6-5-1)

అను శ్రుతి - భాగము మలముగను, మధ్యమమైనది మాంస ముగను, సూక్ష్మమైనది మనస్సుగను పరిణమించుచున్నది. మనము త్రాగిన నీటిలోని ఘనిష్ఠమైన భాగము మూత్రముగను పరిణమించు చున్నది. ఇట్లే, మనము భుజించిన తేజస్సునందలి ఘనిష్ఠమైన భాగము ఎముకలుగను, మధ్యభాగము మజ్జా రూపముగను, సూక్ష్మమైనది వాక్కుగను పరిణమించుచున్నది' అని తెలుపుచున్నది. వీనిలో - ప్రతి భూతమునందును ఇతర భూతముల అంశ మున్నను, తన దైన యంశము అధికముగా నుండుటచే, పృథివి యని, జల మని, తేజస్సు అని వ్యవహరించుచున్నాము. కావున, ఈ విశ్వము త్రివృత్కృత భూతముల యందు అంతర్యామియై యుండు పరమాత్మకు కార్య మగుచున్నది.

## 9. ముగింపు

బ్రహ్మకారణతావాదమున ఇతరులు చూపునట్టి దోషములను పరిహరించుటచే, ఈ అధ్యాయము అవిరోధాధ్యాయమని వ్యవహ రింపబడినది.



# శ్రీమద్రామానుజులు - గీతా భాష్యము

'విశిష్టాద్వైత వేదాంత విశారద'

డాక్టర్: చించావట్టుణం శ్రీరంగాచార్యులు, ఎం.ఏ; పిహెచ్.డి.

"విజ్ఞాపనం యదిద మద్యతు మామకీన
మఙ్గీకురుష్వ యతిరాజదయాంబురాశే
అజ్ఞోయ మాత్మ గుణవేశ వివర్జిత శ్చ
తస్మా దనన్య శరణో భవతీతి మత్వా"

## 1. ప్రవేశిక

శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు సంసార బంధమున చిక్కుకొని కొట్టు మిట్టాడు జీవుల నుజ్జీవింపజేయుటకై భగవన్నియమ నానుసానుసారముగ అవతరించిన కారణ జన్ములు. పూర్వాచార్యుల అభిప్రాయము వలె శ్రీమద్రామానుజ యతిచంద్రుల దృష్టియందును శ్రీమ ద్భగవద్గీతాశాస్త్ర మొక పరమ ప్రామాణికమైన వేదాన్త శాస్త్రమై, భగవ త్పరతత్త్వ ప్రతిపాదకములు, ప్రబల విశ్వసనీయ ములు, జీవిత విధాయక ప్రబోధకములు నగు సిద్ధాంతముల నియమ బద్ధముగ విధించుచున్నది. ఉదయవరులు దానిని స్వరూప స్వభావ ములచేత సుసంపన్నమైనది, సర్వోత్కృష్టమైన దైవ విశిష్టాద్వైత వేదాంత సిద్ధాంత ప్రాతిపదికపై వ్యాఖ్యానించి యున్నారు.

పరమాత్మ, జీవాత్మలు, జడపదార్థము ఒక విధ మగు మిశ్ర మముగ నేర్పడి యుండు నని, జీవాత్మలు, అచేతనప దార్థము రెండును, పరమాత్మకు శరీరభూత మని, ఆయన వాని కాత్మయై యలరారు

వనియు, సిద్ధాంత విశేషము. అందువలన ఈ ప్రపంచము భ్రమను కలిగించునది కాక, యదార్థమైనదని తెలియజెప్పబడినది. పరమాత్మ దోషరహితుడని, వాత్సల్యాద్యుభతశ్శక్తి సౌందర్యాది సమస్త కల్యాణ గుణగణ పరిశోభితుడని వివరింపబడినది. ఈ ప్రపంచమున జీవులకు గలుగు ఆమోద ప్రమోదములు, విషాద దుఃఖములు వారి వారి పురాకృత కర్మము వలననే సంభవించునని విశదీకరింపబడినది. జీవులకు ప్రకృతి సంబంధమైన అన్ని బంధములు తొలగుటయే మోక్ష మనియు విప్పి చెప్పబడినది. మోక్షదశయందు, ఆత్మ భగవత్సాన్నిధ్యమున, సర్వజ్ఞత్వాది గుణగణముల నెన్నిటినో పొంది, నిష్కల్మషమైన, అపరిమితమైన ఆనందము ననుభవించుననియు విస్పష్ట మొనర్పబడినది. శ్రీమద్రామానుజ యతిశేఖరుల వేదాంతసూత్ర వ్యాఖ్యానములందు, గీతా భాష్యమునందును భక్తియే సులభ మోక్షోపాయ మని ప్రతిపాదింపబడినది. 'శరణాగతి' అను నామాంతరము గల 'ప్రపత్తి' యును కొన్ని కొన్ని సందర్భములందు మోక్ష సాధన మని సూచించబడినది.

ఈ విధమగు సంప్రదాయ విశేషము శ్రీమద్రామానుజ యతిపతులకు పరంపరాగతముగ సంక్రమించి యున్నది. వీరికంటె పూర్వీకు లగు బోధాయన, టంక, ద్రమిడాచార్య లాదిగా గల సిద్ధాంత ప్రవర్తకాచార్య మహనీయులనుగూర్చి, ఎంబెరుమానారులు తమ సుప్రసిద్ధ శ్రీభాష్య, వేదార్థ సంగ్రహ గ్రంథములందు పేర్కొని యున్నారు. ముఖ్యముగ శ్రీమద్రామానుజ యతిచంద్రులు తత్త్వజ్ఞాన విశేషములను, శ్రీమన్నాథమునుల శిష్యులవలన ప్రభావితుడైన వారి మనుమడు — తమకు పరమాచార్యు లయిన శ్రీమద్యామునమున శిష్యులవలన గ్రహించి యుండిరి. గీతాభాష్యమునకు సంబంధించినంతవరకు శ్రీమద్రామానుజ యతిచూడామణులు, శ్రీమ

ద్యామునముని గీతార్థ సంగ్రహమునే ప్రాతిపదికగ గైకొని యున్నారు.

## 2. గీతా భాష్యము - గీతార్థసంగ్రహము

గీతార్థ సంగ్రహము 32 శ్లోకముల ఛందోబద్ధ గ్రంథము. ఇందు శ్రీమద్భగవద్గీతలోని ఒక్కొక్క అధ్యాయమందలి అంశములు సంక్షేపముగ విశదీకరింపబడి, అటు పిమ్మట గీతా సారాంశము మొత్తము సంగ్రహించి చెప్పబడి యున్నది. శ్రీ విశిష్టాద్వైత వేదాంత ప్రవర్తకాచార్యులు తరచుగా తత్త్వజ్ఞాన విశేషములను అర్థపంచకము ననుసరించియే విశదీకరించుచుందురు. పరస్వరూపము, స్వస్వరూపము, ప్రాప్తిస్వరూపము, విరోధిస్వరూప మనున వీ విశేషాంశములు. శ్రీమద్రామానుజ యతిశేఖరులు పాయించిన గీతాశాస్త్ర ప్రబోధము లీ అర్థపంచక జ్ఞాన విశేషాంశముల ననుసరించియే విస్తృత రూపమున విరాజిల్లి యున్నవి.

గీతార్థ సంగ్రహము మొదటి శ్లోకమున పరమాత్మ తత్త్వమును వివరించి, తరువాతి మూడు శ్లోకములతో వరుసగా మూడు షట్కముల అర్థమును సంగ్రహించుట జరిగినది. తరువాత పదునెనిమిది శ్లోకములలో వరుసగా ఒక్కొక్క అధ్యాయమునందలి అర్థమును సంగ్రహముగా చెప్పబడినది. పిమ్మట చివరి పది శ్లోకములలో కర్మ, జ్ఞాన, భక్తి యోగముల స్వరూపాదులనుగూర్చి వివేచింపబడినది.

సకలోపనిషత్సారభరితమైన గీతాశాస్త్ర గ్రంథమున పరబ్రహ్మవాచ్యుడు, పరమప్రాప్యుడగు శ్రీమన్నారాయణుడు, స్వవర్ణాశ్రమోచిత ధర్మ కర్మానుష్ఠానముచేతను, పరమాత్మవ్యతిరిక్త

సర్వవస్తు పరిత్యాగముచేతను, పరమాత్మదర్శన సమానాకారమైన
స్మృతిసంతాన విశేష మగు భక్తియోగముచేతను లభ్యు డని చెప్ప
బడినది. తరువాత చెప్పబడిన మూడు శ్లోకములందు వరుసగా,
ఆత్మానుభవసిద్ధికై చక్కగా సంస్కరింపబడి విలసిల్లు జ్ఞాన కర్మ నిష్ఠ
లను గూర్చి ప్రథమ షట్కమున, పరబ్రహ్మ వాచ్యు డగు పురుషో
త్తముని స్వరూపమునుగూర్చి, ఆ పరతత్త్వముయొక్క యాథాత్మ్య
ప్రాప్తిసిద్ధికై జ్ఞాన కర్మ యోగములచే నిర్వర్తింపబడు భక్తి యోగ
మునుగూర్చి మధ్యమ షట్కమున, ప్రకృతి పురుషులనుగూర్చి,
తత్సంసర్గ రూపమైన ప్రపంచమును గూర్చి, పరమాత్మనుగూర్చి,
పరమాత్మ యాథాత్మ్య సిద్ధికై నిర్దేశింపబడిన కర్మ జ్ఞాన భక్తియోగ
ములనుగూర్చి, వాని నాచరించు పద్ధతులనుగూర్చి తృతీయ షట్క
మున విస్తరింపబడినది. అటు పిమ్మట చెప్పబడిన పదునెనిమిది శ్లోక
ములలో గీతాశాస్త్ర గ్రంథమునందలి పదునెనిమిది అధ్యాయముల
లోని అర్థ విశేషము సంగ్రహముగా చెప్పబడినది.

ప్రథమాధ్యాయమున — అనుచితమైన బంధు స్నేహము, కరుణ
గలిగి, ధర్మాధర్మ ధియాకులుడై (ధర్మ యుద్ధమును అధర్మ
యుద్ధముగా తలచి కలత నొందినవాడై), పరమపురుషు డగు
శ్రీకృష్ణభగవానునకు శరణాగతుడైన పార్థునిగూర్చి గీతా
శాస్త్రమునకు ఉపోద్ఘాతము చేయబడినది.

ద్వితీయాధ్యాయమున — యుద్ధ విముఖుడైన అర్జునుని మోహమును
బోగొట్టుటకై ఆత్మ నిత్యత్వమును గూర్చిన సాంఖ్య జ్ఞాన
మును, ఫలాపేక్ష రహిత కర్మానుష్ఠానరూపమైన కర్మయోగ
మును, స్థితప్రజ్ఞత యను జ్ఞాన నిష్ఠను, తద్ద్వారా సాధ్యమగు
ఆత్మదర్శనమును వివరింపబడినవి.

తృతీయాధ్యాయమున — ప్రకృతి సంసృష్టులై (సంసారులై) మోక్షార్థులైనవారు వెంటనే జ్ఞానయోగమున కనధికారులైనందున వారికి కర్మయోగమే కార్యము. జ్ఞానయోగాధికారులకును అకర్తృత్వానుసంధానపూర్వక కర్మయోగమే శ్రేయస్కరమైన దని సహేతుకముగ జెప్పబడినది.

చతుర్థాధ్యాయమున — ప్రసంగ వశమున భగవ దవతారాది అసాధారణ స్వభావమును గూర్చియు, కర్మము జ్ఞానాకార మగుటను గూర్చియు, కర్మముయొక్క భేదములను గూర్చి, కర్మయోగమున జ్ఞానాంశయొక్క ప్రాధాన్యతను గూర్చియు, జ్ఞాన మాహాత్మ్యమును గూర్చియు వివరింపబడినది.

పంచమాధ్యాయమున—ఆత్మప్రాప్తిని సాధించుటలో కర్మయోగము జ్ఞానయోగముకంటె సుకరమై శీఘ్రమై యుండుటయు, కర్మయోగి ఏ ప్రకారముగ నడచుకొన్నచో శుద్ధాత్మపరమైన సమదర్శన రూప జ్ఞాన విపాకము కలుగునో - దానిని గూర్చి చెప్పబడినది.

షష్ఠాధ్యాయమున — యోగాభ్యాస విధియు, (ఆత్మసాక్షాత్కార గతియు) యోగి నాలుగు విధము లగుటయు, అభ్యాస వైరాగ్యము లనెడు యోగ సాధనలను, యోగము సిద్ధించురీతియు, భక్తి యోగ పారమ్యమును జెప్పబడినది.

సప్తమాధ్యాయమున — సర్వశేషి, సమస్తమునకు కారణభూతుడు, సకలజగత్తునకు ఆధారమైనవాడు, ఈ సమస్తమునకు శరీరియై సర్వశబ్ద వాచ్యుడును, నియంతయు, పరతరుడును, ఉపాస్యభూతుడగు పరమపురుషుని స్వరూప యాథాత్మ్యమును, అది ప్రకృతిచే మరుగుపరచబడి యుండుటయు, తన్నివృత్తి

సాధన మగు శరణాగతియు, భగవద్భక్తుల తారతమ్యమును, అందు జ్ఞానియొక్క శ్రేష్ఠత్వమును జెప్పబడినది.

అష్టమాధ్యాయమున — ఐశ్వర్యమును, శుద్ధాత్మ స్వరూపమును, భగవచ్చరణమును గోరువారు ప్రత్యేకముగ దెలియదగినవాని యొక్కయు, ఉపాదేయములైనవాని (ఆచరింపదగినవాని) యొక్కయు, వారి వారి అధికారానుగుణముగ భగవదైశ్వర్యము, శుద్ధాత్మ స్వరూపము, పరమ పురుష స్వరూపము, అర్చిరాది మార్గములను దెలియుట, మొదలుగాగలవాని యొక్క భేదము చెప్పబడినది.

నవమాధ్యాయమున — ఉపాస్య డగు పరమ పురుషుని మాహాత్మ్యములు, మహాత్ములగు భక్తుల గొప్పతనమును, భక్తియోగ స్వరూపమునుగూర్చి చెప్పబడినది.

దశమాధ్యాయమున — భగవంతునియందు భక్తి జనియించి అభివృద్ధి నొందుటకు గాను ఆయన నిరంకుశైశ్వర్యాది కల్యాణ గుణములు అనంతములుగాను, చేతనాచేతనాత్మక సమస్త జగత్స్వరూప స్థితి ప్రవృత్తులు ఆయనకు లోనైయున్నవనెడు బుద్ధినిగూర్చి విస్తరించి చెప్పబడినది.

ఏకాదశాధ్యాయమున — భక్తియోగ నిష్ఠులకు పరమప్రాప్యభూతు డగు శ్రీమన్నారాయణుని నిరంకుశైశ్వర్యమును సాక్షాత్కరింపగోరిన అర్జునుని కొఱకు విశ్వరూపమును ఉన్న దున్నట్లుగ జూపుట, భగవంతుని బాగుగ నెఱుగుటకు, పొందుటకును భక్తియే ముఖ్య సాధన మని చెప్పబడినది.

ద్వాదశాధ్యాయమున — ఆత్మప్రాప్తి సాధనమైన ఆత్మోపాసన కంటె భగవదుపాసన మగు భక్తి స్వసాధ్యమైన ఫలమును కలిగించుటయందు శీఘ్రమై, సుకరమై, శ్రేష్ఠమైనదై యుండుటచేత భక్త్యుపాయమును, దానికి శక్తి లేనివారికి ఆత్మనిష్ఠయు వానికుపాదేయములైన గుణప్రకారములును, భక్తుని యందు భగవంతునికి గల ప్రీతియు చెప్పబడినది.

త్రయోదశాధ్యాయమున — దేహస్వరూపమును, తద్భిన్నమైన ఆత్మను బొందుటకు ఉపాయమును, వివిక్తాత్మ స్వరూప పరిశోధనమును, అట్టి ఆత్మకు శరీర సంబంధము కలుగుటకు కారణమును, ఆత్మను శరీరముకంటె భిన్నముగా తలచు విధమును జెప్పబడినది.

చతుర్దశాధ్యాయమున — శుద్ధాత్మకు గుణములు బంధహేతువులైన ప్రకారమును, ఆ గుణములకు కర్తృత్వము కలుగు విధానము, అది నివర్తించు ప్రకారము, ఐశ్వర్యము, కైవల్యము, భగవత్ప్రాప్తి అను గతిత్రయమునకు భగవంతుడే కారణమగుట చెప్పబడినది.

పంచదశాధ్యాయమున — అచిత్తుతో గూడియున్న బద్ధచేతనుని కంటెను, శుద్ధచేతనుని కంటెను పురుషోత్తము డగు శ్రీమన్నారాయణుడు వ్యాపకుడు, భర్తయు, స్వామియు నగుటచేత, వానికంటె వేరైనవాడని చెప్పబడినది.

షోడశాధ్యాయమున — శాస్త్రవశ్యులైనవారు దేవత లనియు, శాస్త్రవశ్యులు కానివారు అసురు లనియు, మానవులను విభజించి చెప్పి, ప్రాప్య మగు తత్త్వజ్ఞాన సంపదయు ప్రాప్య

మున కుపాయ మగు కర్మానుష్ఠాన జ్ఞానమును దృఢముగా కలిగి యుండుటకు మనుష్యులు శాస్త్రమునకు వశ్యులై యుండవలయునని చెప్పబడినది.

సప్తదశాధ్యాయమున — అశాస్త్ర విహితము లగు కర్మ లన్నియు అసురము లగుటవలన నిష్ఫలము లని, శాస్త్రవిహిత కర్మలు సత్త్వాదిగుణముల ననుసరించి మూడువిధములని అవి 'ఓం తత్సత్' అని త్రివిధ లక్షణములు గల వని చెప్పబడినది.

అష్టాదశాధ్యాయమున — సర్వేశ్వరుడే సమస్త కర్మములకు కర్త యని అనుసంధించుకొనవలయునని, సత్త్వ గుణమే ఆదరముతో పెంపొందించుకొన దగిన దని, భగవ దారాధన రూపము లుగా జేయబడు స్వ వర్ణోచిత కర్మలు పరమపురుష ప్రాప్తికి ఉపాయములుగా పరిణమించుచునని, గీతాశాస్త్రమునకు సార భూత మగు అర్థము 'భక్తియే - ప్రపత్తియే' అని చెప్పబడినది.

శ్రీమద్యామున మునులు తరువాతి పది శ్లోకములలో కర్మ జ్ఞాన భక్తి యోగములను గూర్చి, వాని పరస్పర సంబంధమును గూర్చి, తత్సంబంధ వివిధ విశేషముల గూర్చి చర్చించి యున్నారు.

కర్మయోగమును గూర్చి — తపస్సు, తీర్థము, దానము, యజ్ఞము, మొదలగు వానిని శ్రద్ధతో నాచరించుట కర్మయోగ మనిరి.

జ్ఞానయోగమునుగూర్చి — మనస్సును జయించి, నిరంతరము పరి శుద్ధాత్మను ధ్యానించుచుండుటయే జ్ఞానయోగ మనిరి.

భక్తియోగమును గూర్చి — సర్వేశ్వరునియం దత్యంత ప్రీతిచే ధ్యానార్చనాదుల మిక్కిలి శ్రద్ధాసక్తులతో నొనర్చుట భక్తి యోగ మని చెప్పిరి.

ఈ కర్మ జ్ఞాన భక్తి యోగములు మూడును పరస్పరము కలిసి యుండుట కలదు. ఒకటి ప్రధానమై యున్నప్పుడు మిగిలినవి దాని కంగ భూతములై యొప్పును. ఏది ప్రధానమై యుండునో - దాని కా పేరు కలిగి యుండును. ఈ మూడు యోగములందును సర్వేశ్వ రారాధనా రూపములైన నిత్య నైమిత్తిక కర్మ లవశ్య కర్తవ్యములు. ఈ మూడు యోగములును (యోగ ద్వారమున ఆత్మావలోకనమును) చిత్త సమాధి రూపమైన యోగము ద్వారా శుద్ధాత్మ స్వరూప సాక్షాత్కారమునకు సాధకము లగును. కర్మాది యోగములచే సమస్త అజ్ఞానములను దొలగించుకొనినవాడు భగవచ్ఛేషతైక రస మగు శుద్ధాత్మ స్వరూప సాక్షాత్కారము నొంది, దానిచే పరమాత్మవలన పరభక్తిని బొంది, అది పరమ భక్తిగా పరిణమించిన తరువాత, దానిచే, అప్రాకృత దివ్య వైకుంఠధామమున భగవత్సాయుజ్యమును బడసి, భగవచ్చరణారవింద నిరంతర సేవాభాగ్యమును బొందగలు గును" అని విశదీకరింపబడినది.

ఐశ్వర్యార్థియై భగవంతు నుపాసించువారికి భక్తియోగము నిరతిశయైశ్వర్య సాధన మగు ననియు, శుద్ధాత్మ స్వరూప ప్రాప్తి గోరి, కర్మ జ్ఞానాది యోగము లంగములుగా గలిగి, భక్తియోగము నవలంబించువారికి శుద్ధాత్మప్రాప్తి గలుగు ననియు, కర్మ జ్ఞాన భక్తి యోగ నిష్ఠాపరులకు శ్రియఃపతియందు ఐకాంత్యము (అనన్య దేవతా కత్వము) అనగా - ఇతర దేవతలను గురించి కాక, శ్రియఃపతిని గురిం చిన కరణత్రయ సంబంధము సమాన మనియు, ఫలాంతరములం దాసక్తి లేక, భగవత్ప్రాప్తి పర్యంతము భగవంతునే కోరువాడేని ఆ భగవత్పాదమునే బొందు ననియు విప్పి చెప్పబడినది.

ఇతర దేవతలను కన్నెత్తి చూడనివారు ఏకాంతులనియు, 'చతుర్విధా భజన్తే మాం' అను సూక్తి ననుసరించి వారు నాలుగు తరగతులుగ విభజింపబడి యున్నారని, అట్టి ఏకాంతు లయినవారిలో నెల్ల జ్ఞాని శ్రేష్ఠుడై, పరమైకాంతి యని పిలువబడునని, అతడు భగవదాయత్తమైన జీవనము కలవాడై, భగవత్సంశ్లేషణమున సుఖమును, వియోగమున దుఃఖము ననుభవించుచు, నిరంతరము భగవచ్చింతన కలిగియుండునని వివరింపబడినది. భగవంతుని ధ్యానించుట, భగవద్దివ్యదేశముల సందర్శించుట, భగవత్స్వరూపాదుల నుపదేశించుట, భగవంతునికి వందన మొనర్చుట, ఆయనను స్తుతించుట, ఆయన గుణకీర్తనము గావించుట ఇత్యాదులవలన ఆత్మను బొంది, తన ప్రాణ, మనో బుద్ధీంద్రియ వ్యాపారము లన్నిటిని భగవదధీన మొనర్చి జ్ఞాని, వర్ణాశ్రమోచిత కర్మలు విధికృతము లని కాక, భగవదాజ్ఞలని, భగవత్ప్రీతికరములని పరులు సన్మార్గప్రవర్తకు లగుదు రను తలంపు కలిగి, ప్రీతితో నాచరించుచు, భక్తి పర్యంతము నెఱపుచుండవలయు నని తెలియజెప్పబడినది. కర్మాదులయందు ఉపాయత్వమును వదలి, భగవంతుడే ఉపాయ మని నమ్మి, నిర్భరుడై నిర్భయముగా నుండును. ఈ విధముగా గీతార్థ సంగ్రహము పరమపురుషార్థోపాయములను, భక్తిప్రపత్తులను, పరమైకాంతులను, పరమపదస్థు డగు శ్రీమన్నారాయణునిగూర్చి వర్ణించుచున్నట్టిదని వివరింపబడినది.

ఇంకను జ్ఞాని యొక్క అనన్య సాధారణ విశేషములను చివరి నాలుగు శ్లోకములలో విస్తరించి చెప్పి, గీతాశాస్త్రము మోక్షమార్గమును ప్రబోధించు నొక అధికారిక మత గ్రంథరాజ మని శ్రీమద్యామునమునులు ఈ గ్రంథరాజమును పరిసమాప్తి నొందించి యున్నారు.

శ్రీ వేదాంత దేశికులు తమ గీతార్థసంగ్రహ వ్యాఖ్యానములో శ్రీమన్నాథమునులు శ్రీమద్భగవద్గీతపై గలిగియున్న అభిప్రాయములను శ్రీరామమిశ్రులు శ్రీమద్యామున మునులకు బోధించిరని విశదీకరించియున్నారు. గీతార్థసంగ్రహములోని చక్కని విశ్లేషణతో కూడిన ఒక్కొక్క శ్లోకము పూర్వభావనారూపమై, నిశ్చయాత్మకమై, దృఢ వ్యాఖ్యయై సముచితమైనదిగా గోచరించును. శ్రీమన్నాథమునులు సంప్రదాయానుగుణ్య మగు యోగవిద్యా పారంగతులు. దురదృష్టవశమున సంప్రదాయానుగుణ్యముగ సాగి వచ్చు శ్రీమన్నాథమునుల యోగ రహస్యము వారి మనుమలు — శ్రీమద్యాములకు బోధింపబడలేదని విజ్ఞుల అభిప్రాయము.

శ్రీమద్రామానుజ యతి చూడామణుల దృష్టియందు గీతాశాస్త్రము పరమాత్మునిని సమస్త కల్యాణ గుణములనుగూర్చి ప్రబోధించు నట్టిది. విశిష్టాద్వైత సంప్రదాయానువర్తులు ప్రతిపాదించిన ఒక వాదమే మన - గీతాశాస్త్రములో సంస్కృతవ్యాకరణానుగుణ్యమైన ఎనిమిది విభక్తులలో భగవంతునిగూర్చి ప్రస్తావింపబడినదని. ఈ క్రింది ఉదాహరణముల వలన దానిని గమనింపవచ్చును. "భగవంతుడు హృదయమం దధివసించి, ప్రతిప్రాణి, శరీరయంత్రముపై కెక్కుటకు ప్రకృతియొక్క గుణముల ద్వారా కర్మిష్ఠియై పురోగమించుటకు కారణభూతు డగును. (18_61). "మాయను (ప్రకృతిని) దాటుటకు నన్నే (భగవంతునే) ఉపాయముగా నమ్మియుండుము."(7_14) "సుఖదుఃఖముల నొసగునట్టి బంధహేతువు లగు కర్మ లన్నిటిచేతను విడువబడి నన్నే పొందుదువు" (9_28). "నాచేత ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నది" (9_4). "నీవు నాకు మిక్కిలి ఇష్టుడ వగుటచే, నీవు నాయం దత్యంత ప్రీతి కలవాడవై, నా యందు మనస్సు నుంచి, నన్నారాధించువాడవు కమ్ము" (18_65). "నాకంటె గొప్పది యగు

పదార్థము మఱి యొకటేదియును లేదు" (7-7). "నాకును నీకును పెక్కు జన్మలు గడచినవి, వాని నన్నిటి నే నెఱుగుదును; నీ వెఱుగవు" (4-5). "నాయందే మనస్సును లగింపజేయుము, బుద్ధిని నాయందే ప్రవేశింపజేయుము, అటుపై నాయందే నివసింతువు" (12-8). శ్రీమద్భగవద్గీత యందలి శాస్త్ర సంబంధమైన ఈ వాక్యములు భగవంతుడు సర్వవ్యాపియై, ప్రపంచములోని సమస్త వస్తువులతో అవినాభావ సంబంధమును గలిగియున్నాడని విశదీకరించుచున్నవి. భగవంతుడు విశ్వాత్మకుడై తనరారుచున్నాడను ప్రధానాంశము శ్రీమద్భగవద్గీతలోని ప్రధాన ప్రబోధకమని శ్రీమద్రామానుజ యతిసార్వభౌముల ఉద్దేశ్యము. అందుల కీక్రింది వాక్యములు ప్రబల దృష్టాంతములు :—

> "సకల ప్రాణుల హృదయములందును నేనాత్మగా నున్నాను. నేనే వాని యన్నిటి యొక్క పుట్టుకకు, పోషణకు, వినాశమునకు కారణ మగుచున్నాను" (10-20). "హారము నందలి మాణిక్యములు దారముపై ఆధారపడి యున్నట్లు, నిఖిల చేతనాచేతన ప్రపంచ మంతయు అంతర్యామిగా నున్న నాపై ఆధారపడియుండును"(7-7) ఈ విశేషమును మరింత వివరముగా పరమాత్ముడు — "భూమి, నీరు, నిప్పు, వాయువు, అకాశము" అను పంచభూతముల రూపమున – మనస్సు, బుద్ధి, అహంకారము – అను ఎనిమది విధము లగు తత్త్వములతో మూల ప్రకృతి నా అధీనమైనది. ఈ ప్రకృతికంటె వేరైన జీవస్వరూపమగు ప్రకృతి నా యొక్క ప్రధానమైన దానినిగా తెలిసికొనుము నాచేతనే అచేతన ప్రకృతి యగు జగత్తంతయు ధరింపబడుచున్నది" (7-4,5).

అని వివరించియున్నాడు.

స్వాభావికమైన ఈ విశిష్టాద్వైత సిద్ధాంత విశ్వైక్య భావమునకు ప్రోద్బలకముగ భగవంతుని విశ్వరూప సందర్భమున అర్జునుని ఈ వర్ణనను చిత్రగించవచ్చును.

"నీకు శరీరమైన ఈ ప్రపంచమున కంతటికిని ఆత్మరూపమున పరమాధార భూతుడవు నీవే అయి ఉన్నావు ఈ జగత్తున తెలిసికొనువారు, తెలియబడునవి అన్నియు నీవే! పరమ ప్రాప్య స్థానమును నీవే. ప్రపంచ మంతయు నీచేతనే వ్యాపింపబడి యున్నది" (11-38).

## 3. గీతా భాష్యము - వ్యాఖ్యాన పరిమళము

శ్రీభాష్యకారులు అవలంబించిన గీతాశాస్త్ర వ్యాఖ్యాన పద్ధతి, పవిత్ర గ్రంథములను వ్యాఖ్యానించు భారతీయ దార్శనికాచార్యులు సర్వసాధారణముగ గలిగియుండు కొన్ని భావములపైన ఆధారపడి యున్నది ఇందు వివరింపబడిన శ్రుతులు స్వయం సంగతమైన వని వారి విశ్వాసము. ఏ స్పష్టమైన అసంగతములైనను, పొందిక గల సుసంగతమైన ముఖ్యసూత్రములతో శ్రద్ధగ ప్రయత్నించువారు సమాధానపరుపగలరని వారి దివ్య చితము శ్రీమద్భగవద్గీత, ఉపనిషత్తులలోని ప్రబోధములను విపులీకరించి బలపరచు ద్వితీయ అధికారిక గ్రంథముగా తలపబడినది శ్రీభాష్యకారులు శ్రుతి సూత్రములను పరామర్శించు పద్ధతి, గీతాశాస్త్రమునకు సమానార్థకములై వర్తించు వాని చక్కని వివరణ, పదమూడవ అధ్యాయము 2 వ శ్లోకమున కాన నగును. శ్వేతాశ్వతర ఉపనిషత్సూత్రము ఆత్మల అనేకత్వమును నిర్ధారించుచున్నది దీనిని శ్రీభాష్యకారులు రెండవ అధ్యాయము 12 వ శ్లోకమున వివరించియున్నారు. అదే విధముగా బృహదారణ్యకోపనిషత్తు అంతర్యామి బ్రాహ్మణము - గీతాశాస్త్రము పదవ అధ్యాయమునందలి 20 వ శ్లోకమును బలపరచుచున్నది. గీతాశాస్త్రమునందలి పెక్కు విశేషములను విపులీకరించి, నిర్ధారించి చెప్పుటకు శ్రీభాష్యకారులు తరచుగా విష్ణుపురాణమునొక ప్రధాన స్మృతి గ్రంథముగా గైకొనియున్నారు.

శ్రీభాష్యకారులు గీతాశాస్త్రమునకు ఉపనిషత్తులకు మధ్య కేవలము ఏకతను మాత్రమే సంభావించినవారు కారు. వారు గీతా

శాస్త్రమొక సుసంగతమైన, నిరుత్తరమైన వేదాంత గ్రంథముగ తలచియున్నారు. నేటి పాండిత్యము ప్రాచీన గ్రంథములలోని విపరీతములను, విరుద్ధములను కనుగొనుటలోనే సంతసించును. పూర్వకాలపు రచయితలు సుసంగతముగా వ్రాయుట కసమర్థులను భావమును కొందరిలో తొలగించలేకపోలేరు. గీతాశాస్త్ర సంకలనమును, ఏకతను దృష్టియందుంచుకొని, ఓపికతో అధ్యయనము చేయలేనివారు మాత్రమే తరచుగా ఈ భావమును వ్యక్తీకరించుచుందురు. గీతాశాస్త్ర విశేషములను పరిపూర్ణముగా దృష్టియందుంచుకొనిన శ్రీభాష్యకారులు, గీతాశాస్త్రమునకు సార్థకమైన, నిదర్శన పూర్వకమైన వ్యాఖ్యానమును సాయించియున్నారు.

గీతాశాస్త్రము సమర్థుడగు దేశికునకు ఆతురుడగు శిష్యునికి మధ్య సంభావనా రూపమున విస్తరిల్లిన వేదాంత విశేషమని శ్రీభాష్యకారులు చిత్రగించియే యున్నారు. అందలి ఆలోచనా సరళి అంతయు ప్రశ్నోత్తర రూపముననే నిర్ధారింపబడియున్నది. ఆ సమాధానమైనను - ప్రధాన సూత్రములను వ్యాఖ్యానించి, ప్రస్తుతాంశమునకెట్లనువర్తించునో రుజువు చేయవలసి యుండును. అందువలన, మనము తరచుగా వారి వివరణములు విశదమైన వ్యాఖ్యానములతో, దీర్ఘమైన ప్రసంగములతో, నిశ్చయాభిప్రాయ సారాంశములతో ముగియుట చూచుదుము. ఈ సహజ పారిభాషిక వాగ్రూప ప్రబోధము గీతాశాస్త్రమున కాధారమని, పరిశీలించినచో - అందలి నిగూఢ విశేషములు, అసంగతముగా తోచు విషయములు, మూల గ్రంథమునందున్నవానికి ముందు వెనుకల, ఇతర సందర్భములందును ఉదాహరించి నిర్ధారించుకొనవచ్చునని తెలియుచున్నది.

శ్రీభాష్యకారుల వ్యాఖ్యాన పద్ధతిని దృష్టియం దుంచుకొని నప్పుడు, వారు విపులీకరించిన కొన్ని విశేషాంశములను ఉదాహరణ పూర్వకముగ మనము గమనింపవచ్చును. సందర్భము నవగతము చేసి కొననివారికి వారి వివరణలు కొన్ని విచిత్రమైనవిగ, అసంగతమైన విగా కనుపట్టవచ్చును. "అవినాశియైన ఈ ఆత్మను ఏదియు నాశన మొనర్పజాలదు" (2-17). అను అంశమును వ్యాఖ్యానించి చెప్పుచు - 'ఏదియు నాశన మొనర్పజాలదు' అను వాక్యమునకు శ్రీభాష్యకారులు వివరణ నిచ్చుచు, 23 వ శ్లోకములోని వినాశ మొనర్చు సాధనములు - ఆయుధములు, నీరు, గాలి, అగ్ని మొదలగువానిని దృష్టియందుంచు కొనియే పై విశేషమును వివరించియున్నారు. మరొక సందర్భమున - "కర్మములకు, వానిఫలములకు హేతువు కాకుండుము" (2-47) అను విశేషము మూడవ అధ్యాయములోని 27, 28, 30 శ్లోకముల, పదునెనిమిదవ అధ్యాయములోని 14, 15 శ్లోకములలోని అంశముల ఆధారముపై వ్యాఖ్యానింపబడినది. ఇదే విధముగా నాల్గవ అధ్యాయములో 17-వ శ్లోకమున - అకర్మ - వికర్మలను గూర్చి ఏడవ అధ్యాయము 17-19 శ్లోకములలో, భక్తులలో జ్ఞాని ప్రశంసను గూర్చి విశదీకరింపబడినది. వేరొకచోట - "బుద్ధికంటె కామమే గొప్పది" (3 - 42) అను వాక్యము అనుగతమైనదిగా విమర్శింపబడవచ్చును. కాని, సందర్భము సూక్ష్మముగా పరికించినచో, శ్రీభాష్యకారుల సముచితాభిప్రాయము స్పష్టమగును. "జ్ఞానమునకు విరోధము చేయుటలో బుద్ధికంటె ముఖ్యమైనది కామమే అగును" అని అర్థము చెప్పబడినది.

గీతాశాస్త్రమును అన్వయించి చెప్పుటకు శ్రీభాష్యకారులు శ్రుతి స్మృతులనేకాక, వేదాంత సూత్రములనుగూడ పేర్కొని యున్నారు. శ్రీకృష్ణ పరమాత్ముడు పదమూడవ అధ్యాయము 4 వ శ్లోకమున, ఈ సూత్రములను ఉదాహరించినట్లుగ వారి అభిప్రాయము.

ఏ దెట్లున్నను, శ్రీభాష్యకారులు శ్రీకృష్ణపరమాత్మునిప్రబోధము లకు వేదాంత సూత్రములకు మధ్య, చక్కని పొందికను కనుగొని యున్నారు. నిరుపమమైన ఆధారమును కల్పింపబూనినప్పుడు, ప్రతి యొక్కటి వాని వాని ప్రత్యేక పరిధిని కలిగియుండును. గీతా శాస్త్ర మున భగవ దవతార సిద్ధాంతమునకు సముచితాదరణ లభించు చున్నది. మూర్త్యర్చనకును గీతాశాస్త్రము కొంత ఆధారమును కల్పించుచున్నది.

శ్రీభాష్యకారులు వేదాంత వాదమునకు సుదూరముగ గీతాశాస్త్రమును వ్యాఖ్యానింపవలయునని తలచియున్నారు. ఒండు రెండు సందర్భములందు మాత్రము – రెండవ అధ్యాయము 12 వ శ్లోక సందర్భమున, పదమూడవ అధ్యాయము 2 వ శ్లోక సందర్భ మున, పదమూడవ అధ్యాయము 2 వ శ్లోక సందర్భమున – అద్వై తులతో, భాస్కర, యాదవ ప్రకాశానుయాయులతో వేదాంత చర్చకు బూనుకొనియున్నారు. ఈ రెండు సందర్భములందు తప్ప, వారి వ్యాఖ్యానము చివరివరకు శ్రీకృష్ణపరమాత్మునిప్రబోధములను నిస్వార్థతను ప్రేరేపించుటను, తోటి మానవులకు సేవ చేయుటను, భగవంతుని యెడ భక్తి గలిగి యుండుటను - విశదీకరించుచు విస రిల్లినది. భగవంతుని పరమభక్తాగ్రేసరులుగ, తమ దివ్య ప్రబో ధములచేత శిష్యకోటి తరింప వర్తింపజేయు పరమకారుణికులు, సమ ర్థులు నగు దేశికోత్తములుగ, శ్రీభాష్యకారుల దివ్యకీర్తి అజరా మరమై నిలచియున్నది

## 4. గీతా భాష్యము - అవతారిక

శ్రీమద్రామానుజ యతిశేఖరులు గీతార్థసంగ్రహ యోజన ననుసరించియే అందలి సంక్షేప వివరణములకు, సమర్థవంతమైన,

సుసంగతమైన, సమృద్ధమైన విపుల వర్ణనలతో గీతా భాష్యమును సాయించియున్నారు. వారి వ్యాఖ్యానము ప్రామాణికమైన విశేష శ్లోక పరంపరతో, అశేష పద సంయుత ఆధికారిక వాక్య సారాంశముతో విస్తరించి యున్నది. సర్వసాధారణముగ వారి వ్యాఖ్యానమున గీతార్థ సంగ్రహమునుండి వేరైన అంశ మేదియును కానరాదు. అక్కడక్కడ ఊహామాత్రముగ వారు నొక్కి చెప్పు మార్పు లన్నియును, వాస్తవమైన ఊహలై నిలిచి యున్నవి. శ్రీమద్రామానుజ యోగిపుంగవుల వ్యాఖ్యానము ఆవలంబనమై తనరారకున్నచో గీతార్థసంగ్రహము లోని శ్లోకములు నిగూఢమై తోచు ననుటలో సందేహము లేదు.

శ్రీమద్రామానుజ యతిపతుల వ్యాఖ్యానమున కాధారమై యున్న గీతార్థ సంగ్రహము, శ్రీమద్భగవద్గీతపై ఇప్పటికినిలిచి యున్న పెక్కు వ్యాఖ్యానములతో భేదించును. శ్రీ శంకరులు స్వయముగ పెక్కు వ్యాఖ్యానముల నుదాహరించి యున్నారు. గీతాశాస్త్రముపై ప్రత్యేకముగ వృత్తికారుల అభిప్రాయములను వా రక్కడక్కడ వ్యతిరేకించి వాదించిరి. శ్రీ వేదాంతదేశికులు పైశాచుని, రంతిదేవుని, గుప్తుని, శంకరుని, భాస్కరుని, నారాయణార్యుని, యజ్ఞస్వామిని గీతాశాస్త్ర వ్యాఖ్యాత రచయితలుగ పేరుపేరున పేర్కొని యున్నారు. వీని సరసన శ్రీమద్రామానుజ యతిచంద్రుల గీతా భాష్యమును ప్రత్యేక మార్గము ననుసరించి విశదమై, విఖ్యాతమై ఒప్పారుచున్నది. మీదు మిక్కిలి గీతాభాష్యము వేదాంతవాద (తార్కిక)యుతము కాక, వ్యాఖ్యానాత్మకమై విరాజిల్లుచున్నది. గీతాశాస్త్రముపై శ్రీమద్యామునమునుల ఉద్దేశ్యమును మాత్రమే శ్రీమద్రామానుజ సంయమీంద్రులు ఉదాహరించి యున్నారు.

శ్రీమద్రామానుజ యతిశేఖరుల పెక్కు గ్రంథములు మంగళ శ్లోకముతో ప్రారంభింపబడినవి. గీతాభాష్యమును వారి పరమాచార్యులగు శ్రీమద్యామున మునిచంద్రుల స్తుతి శ్లోకముతో ప్రారంభింపబడినది. తాము ప్రారంభింపదలచిన గ్రంథము నిర్విఘ్నముగ కొనసాగి వర్ధిల్లుటకుగాను మంగళమాచరించు టావశ్యకమని యెంచి, శ్రీమద్రామానుజ యోగిపుంగవులు, గీతార్థసంగ్రహ మను గ్రంథమునురచించి, తద్వారా స్వాచార్యులకుగీతార్థములనుపదేశించిన వారగుటచేతను, వారికి ప్రీతికరమని సంభావించి, మొదట స్వాచార్య సంస్తుతి చేసి, పిమ్మట తాము గీతార్థసంగ్రహ గ్రంథ ప్రాతిపదికపైననే గీతాభాష్యమును వ్రాయింపబూనిరి కావున, పరమాచార్య స్తుతి రూపముగ గ్రంథారంభమున జేయు మంగళము నాచరించి యున్నారు.

"ఏ మహాపురుషుని పదాంభోరుహముల నిరంతర ధ్యానముచేతనే సమస్త పాపములు నిర్మూలనము గావింపబడి, నేను వ్యక్తిత్వమును బొందితినో-అట్టి శ్రీ యామునాచార్యులను గూర్చి నమస్కరించుచున్నాను."

అని వారి మంగళశ్లోక తాత్పర్యము.

స్వగురు ప్రణామము - గురు పరంపరా ప్రణామమును ఎల్లప్పుడు మంగళకరమైనది. అస్మద్గురుభ్యో నమః – అస్మత్పరమగురుభ్యోనమః అస్మత్సర్వగురుభ్యోనమః – పూర్వాచార్యేభ్యో నమః" – అను గురుపరంపరానుసంధానము ననుసరించి స్వాచార్యులవలెనే, ఆచార్య పరంపరయును అత్యంతాదరణీయమైనందున, ప్రీతిపూర్వకముగ భజింపదగినట్టిదని పెద్దలు వ్రాయించి యున్నారు. శ్లోకమున 'పదాంభోరుహములు' అనుపదమునకు అర్థమును విప్పిచెప్పుచు- పాదపద్మములు భోగ్యములుగా నుండు నని, అందువలన వానియందు ప్రీతి కలుగు నని, ఆ కారణము చేత, ఆ పాదపద్మముల గూర్చిన

ధ్యానము ప్రీతిపూర్వకమైన దని వివరించి యున్నారు. అంతే కాక, ధ్యాన మను శబ్దమునకు గల వివరణమును బట్టి, శ్రీమద్రామానుజ యతికులపతి, ద్రోణాచార్యులను ఒక్కగ నుపాసింపక ధ్యానముచేతనే సిద్ధిని బొందిన ఏకలవ్యుని వలె, తాము శ్రీ యామునాచార్యులకు శిష్యు లయినట్లు తెలియజేసి యున్నారు. 'వస్తుత్వమును' బొందు టనగా - 'వ్యక్తిత్వమును' బొందు టని విశదీకరింపబడినది.

## 5. గీతా భాష్యము - ఈశ్వర తత్త్వము

శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు సాయించిన సుప్రసిద్ధ వ్యాఖ్యాన గ్రంథములలో గీతా భాష్యము రెండవది. అది శ్రీభాష్య గ్రంథరచన తరువాత వెలసిల్లినట్టి దని విజ్ఞుల నిశ్చితాభిప్రాయము. ఇందలి కొన్ని ప్రత్యేక శ్లోక వ్యాఖ్యానములు ఇదివరకే నిర్ధారింపబడి, శ్రీభాష్యమునం దవతరించినట్టివి. శ్రీభాష్యగ్రంథములోని సూత్రముల వలె నిగూఢము కాకపోవుటచేత, గీతాభాష్యము సాధారణ వ్యాఖ్యాన రూపమున విస్తరించియున్నది. కొన్ని యెడల శ్రీభాష్యకారులు గీతా శాస్త్ర శ్లోకములకు కించిత్ విశేష వివరణ గల వ్యాఖ్యానమును గూర్చుట గాంచవచ్చును. అయినను, శ్రీభాష్యకారులు కేవలము మూలము ననుసరించి అర్థ వివరణ మొనర్చుట కాక, శిష్టాచార సంప్రదాయము ననుసరించియే వ్యాఖ్యానించి యున్నారు.

గీతా శాస్త్రమునం దెల్ల ప్రతిపాద్యుడైనవాడు నారాయణుడని శ్రీమద్యామునులు గీతార్థసంగ్రహ ప్రథమ శ్లోకమున చెప్పి యున్నారు. (నారాయణః పరబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః" గీతార్థ సం. 1) శ్రీభాష్యకారులు గీతాభాష్యమున కుపోద్ఘాతముగ, ఈ శ్లోకమున గూఢార్థమును విపులీకరించి వ్యాఖ్యానించి యున్నారు. శ్రీ భాష్యకారులును గీతార్థసంగ్రహములోవలె నారాయణుని ప్రతిపా

దింపబూనినవారై, మొదట శ్రీమన్నారాయణుని దివ్య స్వరూప మును నిర్ధారించి తెలియజేసి యున్నారు. శ్రియఃపతియు — "శ్రీదేవికి భర్తయైనవా డగు నారాయణుడు" అని నారాయణునికి శ్రీదేవితో దివ్య దాంపత్యము చెప్పబడినది దయా స్వరూపిణియైన శ్రీదేవి పురుషకారభూతురాలై, భగవంతుడు చేతనుని అనుగ్రహించి ముక్తి నొసగునట్లు సహకరించును. అందువలన, శబ్దార్థములకు వలె నారాయణుడు శ్రీదేవితోడ నిత్య సంబంధమువలన స్వరూప సిద్ధముగ శ్రియఃపతి అయ్యెనని, శ్రియఃపతిత్వము నారాయణుని స్వరూప విశేషములలో నొకటి యని పెద్దలు వివరించి యున్నారు. (అర్థో విష్ణురియం వాణీ విష్ణుః పు: ప్రథమాం 8-18-విష్ణువు అర్థము. ఈమె (శ్రీదేవి) వాక్కు (శబ్దము) అని శబ్దార్థములకు వలె విష్ణువునకును, శ్రీదేవికిని నిత్యసంబంధము చెప్పబడినది.) అట్టి శ్రియఃపతి –

"నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణైకతానుడు - స్వేతర సమస్త వస్తు విలక్షణానన్త జ్ఞానానందైక స్వరూపుడు - స్వాభావికానధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజః ప్రభృత్యసంఖ్యేయ కల్యాణ గుణగణ మహోదధి - స్వాభిమతానురూపైక రూపాచింత్య దివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనా ద్యనంత గుణనిధి దివ్యరూపుడు - స్వోచిత వివిధ విచిత్రా నంతాశ్చర్య నిత్య నిరవద్యాపరిమిత దివ్యభూషణుడు - స్వానురూపాసంఖ్యేయాచింత్య శక్తి నిత్య నిరవద్య నిరతిశయ కల్యాణ దివ్యాయుధుడు-స్వాభిమతానురూప నిత్య నిరవద్య స్వరూప రూప గుణ విభవైశ్వర్య శీలా ద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణగణ శ్రీవల్లభుడు - స్వసంకల్పానువిధాయి స్వరూప స్థితి ప్రవృత్తిభేదాశేష శేషతైకరతిరూప నిత్య నిరవద్య నిరతిశయ జ్ఞాన శక్తి క్రియైశ్వర్యా ద్యనంత గుణగణాపరిమిత సూరులచేత ననవరతము స్తుతింపబడుచుండు చరణ యుగళము

గలవాడు. వాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూప స్వభావుండును - స్వోచిత వివిధ విచిత్రానంత భోగ్య భోగోపకరణ భోగస్థాన సమృద్ధానంతాశ్చర్యానంత మహా విభవానంత పరిమాణ నిత్య నిరవద్యాక్షర పరమ వ్యోమ నిలయుడు - వివిధ మహావిభవానంత భోగ్య భోక్తృ వర్గ భోగోపకరణ భోగస్థాన సమృద్ధానంతాశ్చర్యానంత మహావిభవానంత పరిమాణ నిత్య నిరవద్యాక్షర పరమ వ్యోమ నిలయుడు - వివిధ విచిత్రానంత భోగ్య భోక్తృవర్గ పరిపూర్ణ నిఖిల జగ దుదయ విభవ లయ లీలుండును, పర బ్రహ్మ, పురుషోత్తముడు నగు నారాయణుడు - అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యమహోదధి - సర్వేశ్వరేశ్వరుడు - జగదుపకృతిమర్త్యుడు- ఆశ్రిత వాత్సల్య వివశుడు .. —(గీతా భాష్యము - అవతారిక)

ఇచట, నిఖిల ... కల్యాణైకతానుడు' అనగా—సమస్త త్యాజ్యములైనవానికి విరోధి యగునట్టి కల్యాణ గుణములకే ముఖ్యస్థాన మైన వాడని; 'స్వేతర ... జ్ఞానానందైక స్వరూపుడు 'అనగా — సర్వవిధ చేతనాచేతనములకు వేరు లక్షణములు గలదియై, అంతము లేని జ్ఞానమును, ఆనందమును స్వరూపముగా గలవా డని, 'స్వాభావిక ... గుణగణమహోదధి' అనగా - పరాధీనములు కానివి, మేర లేని అతిశయములు గలదియైన జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజస్సు (స్వయముగ సర్వమును సర్వవిధములచేతను, సర్వకాలములందును ప్రత్యక్షముగా తెలియునట్టి జ్ఞానమును, అట్లు ప్రత్యక్షముగా తెలిసిన సర్వమును ధరించునట్టి బలమును, ధరించుచునే నియమించునట్టి ఐశ్వర్యమును, ధరించుచును, నియమించుచును, పటుత్వము సడలకుండునట్టి వీర్యమును, అఘటితములను ఘటింపజేయు శక్తియు, అట్లు ఘటించునపుడు ఒకరి సహాయ మపేక్షింపక, ఎవ్వరికిని తనను క్రిందు పరుప శక్యము కాకయు, తానే అందరికిని క్రిందు పరచునట్టి తేజస్సు) మొదలుగా గల లెక్కింపరాని కల్యాణ గుణ సమూహములకు మహా సముద్రమువంటివాడని, 'స్వాభిమతానురూపైక ... దివ్యరూపుడు' అనగా - తనకు అభిమతమైనది, అనురూపమైనది, ఎల్లప్పుడు ఒకే రీతిన నుండునది, చింతింప తరము కానిది, పరమాకాశమందు వర్తిం

చునది, వటపత్ర శయన విశ్వరూపాదులచే ఆశ్చర్యమైనది, నిత్యమైనది, జర మొదలగు దోషములు లేనిది, తనకంటె ఉత్కృష్టమైనవి లేనట్టివైన నిగనిగ కాంతి, అవయవ శోభ, యౌవనము మొదలయిన లెక్కలేని గుణములకు గనియై, అప్రాకృతమైన విగ్రహము గలవాడని, 'స్వానురూప ... దివ్యాయుధుడు' అనగా — అట్టి విగ్రహమునకు దగిన హార కిరీటాది రూపముచే నానా విధములైనవి, బంగారు మణులు మొదలగువానిచే విచిత్రములైనవి, అంతులేని ఆశ్చర్యమును కలుగజేయునవి, నిత్యములు, నిరవద్యములైనవి, లెక్కలేనివి, అప్రాకృతములైన భూషణములు గలవాడని, తనకు తగినట్టివి, లెక్కింప వీలు కానివి, ఊహింప నలవికానివి, నిత్యములైనవి, నిరవద్యములైనవి, నిరతిశయానందమును గూర్చునట్టివి, దివ్యమైన వైన ఆయుధములు గలవాడని, 'స్వాభిమతానురూప ... శ్రీవల్లభుడు' అనగా - తన ఇష్టమునకు అనురూపమైన నిత్యములైనవి, నిరవద్యములైనవగు దివ్యాత్మస్వరూపమును, దివ్య విగ్రహమును నిరతిశయౌజ్జ్వల్య సౌందర్యాదులగు విగ్రహ గుణములును పరిజనమాదిగా గల విభవమును, ఐశ్వర్యము - శీలము మొదలుగా గలవి, మితి లేని అతిశయముగలవి, లెక్కింపరానివి, మంగళకరమైన వైనగుణ సమూహము గల లక్ష్మీదేవికి భర్తయైనవాడని, - స్వసంకల్పాను ... చరణ యుగళము గలవాడు అనగా — తన సంకల్పము ననుసరించి నడచునట్టి స్వరూపస్థితి ప్రవృత్తి భేదములు కలవారును, సమస్తమైన శేషవృత్తియందే ప్రధానముగ అవలంబించియున్న ప్రీతియే స్వభావముగా గలవారును, నిత్యులును, క్లేశము కర్మము స్వాతంత్ర్యము అభిమానము ఇత్యాది దోషములు లేనివారును, నిరతిశయములైన జ్ఞాన శక్తి క్రియా ఐశ్వర్యాది అనంత గుణములు కలవారును, అపరిమితులును అగు సూరులచేత ఎల్లప్పుడును తన చరణ యుగమును స్తుతింపబడువాడని; 'వాఙ్మనసా ... స్వభావుండును'

అనగా — వాక్కునకు మనస్సునకు కొలత ఇడరానివాడని ; 'స్వోచిత ...వ్యోమనిలయుడు' అనగా - తనకు తగినవియు, వివిధ విచిత్రములైన శబ్దాది విషయములు భోగమునకు సాధనములైన దేహేంద్రియాదులు సౌధారామ ప్రదేశాదులచేత నిండినది, అనంతాశ్చర్యకరమైనది, అనంత మహావిభవము గలది, ప్రాకృతాకాశము వలె లయము లేనిది, శుద్ధ సత్త్వ మయ మగుటచేత రజ స్తమస్సులు వాని కార్యములు లేనిది, అక్షరమైన దగు పరమ పదము వాస స్థానముగా గలవాడని ; 'వివిధ ... లయ లీలుండును' అనగా — వివిధ విచిత్రములును అనంతములు నగు భోగ్య భోక్తృవర్గములచే పరిపూర్ణమైన సమస్త జగముయొక్క ఉత్పత్తి స్థితి లయము లనెడి లీలలు గలవాడని, పరబ్రహ్మ మని ; పురుషోత్తము డని ; అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్య మహోదధి యని, నారాయణుడే సర్వేశ్వరుడు, జగదుపకృతి మర్త్యుడు, ఆశ్రిత వాత్సల్య వివశు డని విశదీకరింపబడినది. ఈ విధముగా భగవంతుని అనంత కల్యాణ గుణములు, సౌందర్యాతిశయము, అపారవారమైన కరుణా కటాక్షములు, మహాద్భుత శక్తి యుక్తులు మొదలుగా గల ప్రధానాంశ విశేషములన్నియు శ్రీభాష్యకారులు గీతాభాష్యమున మరల మరల విస్తరించి చెప్పియున్నారు. వేరొక చోట —

> "జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులకు నిధివంటివానిని, స్వసంకల్పము చేత జగ దుదయ విభవ లయ లీలా విలాసుని, సమస్తేంద్రియముల కధిపతియైనవానిని, నిఖిల జనాంతర బాహ్యకరణములను సర్వప్రకారముల నియమనమునందు మునిగియున్నవానిని, ఆశ్రిత వాత్సల్య వివశుడైనవానిని..........." — (గీతాభాష్యము : 1-24)

హృషీకేశు డను పదమునకు - సమస్త జనుల బాహ్యాంతః కరణములను సర్వప్రకారముల నియమించువాడని శ్రీభాష్యకారులు వివరణ నిచ్చియున్నారు. 'సహ యజ్ఞైః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః' అను శ్లోకము ననుసరించి —

> "సృష్ట్యాది కాలమున భగవంతు డగు ప్రజాపతి - అనాది కాలమునుండి ప్రవర్తించుచున్న ప్రకృతి సంసర్గము వలన స్వాధీనత తప్పి, నామ రూప విభాగము ఉపసంహృతమై, తన యందు లీనులై, సమస్త పురుషార్థములకు దగనివారును, అచేతన ప్రాయులైయున్న ప్రజలను జూచి, పరమ కారుణికుడు గాన, వారి నుజ్జీవింపజేయగోరినవాడై, స్వారాధనభూతము లైన యజ్ఞములను నిర్వర్తించుకొఱకు, యజ్ఞములతోసహా ప్రజలను బుట్టించి, వారితో - ఈ యజ్ఞములచేతనే మీ వృద్ధిని జేసికొనుడు 'ఈ యజ్ఞము పరమపురుషార్థ లక్షణమైన మోక్షమనెడి కామమును, దాని కనుగుణములుగా కామములనుగూడ పూరించునది యగుగాక - అని చెప్పెను"
>
> —(గీతాభాష్యము 3–10)

సృష్టికి పూర్వము ప్రజలు అనాదికాల ప్రవృత్తమయిన అచిత్సంసర్గము చేత వివశులై, అచేతన ప్రాయులై, తనయందు లీనులై యుండ నారాయణు డొక్కడే యుండునట్లు (ఏకో హ వై నారాయణ ఆసీత్. న బ్రహ్మ నేశానః - మహో. 1-1) తోచుచుండెను ఇట్లు ఒక్కడై తోచుచున్న సర్వేశ్వరుడు, తన యందు లీనులై యున్న ప్రజలకు వేరు వేరు నామ రూపములు కల్పించి, దాని వలన తాను పెక్కురగుటకు సంకల్పించి, ఆ విధముగ నొనర్ప హిరణ్యగర్భుడు, శివుడు మొదలగు ప్రజలను (తత్ర బ్రహ్మ చతుర్ముఖోఽజాయత, తస్య ధ్యానాన్తః స్థస్య లలాటా ద్వ్యక్షః శూలపాణిః పురుషోఽజాయత - మహో : 1-1, సోభిధ్యాయ శరీరాత్స్వాత్సిసృక్షుర్వివిధాః ప్రజాః. మను. 1 - 8) సృజించె నని శాస్త్రము చెప్పుచున్నది. అందువలన ఇచ్చట ప్రజాపతి శబ్దము చతుర్ముఖుని గాక, అనవచ్ఛిన్నుడు, సర్వేశ్వరుడు, విశ్వసృష్టికర్త, విశ్వాత్ముడు, పరాయణుడును అయిన నారాయణుని చెప్పుచున్నదని శ్రీభాష్యకారులు వివరించిరి. అంతే కాక, దేవతారాధనారూపమైన సర్వయజ్ఞములకు భగవంతుడే ప్రభువును, భోక్తయు నైనందున, భగవంతుడే యజ్ఞ ఫలము నిచ్చువాడనియు, యజ్ఞములు మోక్షప్రదములే యనియు తెలియజేయబడినది.

కర్మవశ్యుడుగాని ఈశ్వరుడు కర్మనివృత్తికై చేయవలసిన కార్యములుగాని, వర్ణాశ్రమములుగాని లేవు. అయినను, లోకసంగ్రహణ ఆయా వర్ణములకు ఆయా కర్మము లుచితములని తెలియజేయుటకై, తన అప్రాకృత దివ్యదేహమును ఆయా జాతీయ రూపముగ పరిణమింపజేసి, ఆయా వర్ణాదుల కుచిత కార్యముల నాచరించుచున్నాడు. శిష్టజనులు ఆయనను ఆయా జాతివానినిగా, ఆయన అనుష్ఠించినవానిని చూచి, తాము అనువర్తించి చరితార్థులగుదురని విశదీకరింపబడినది.

" సర్వేశ్వరుడును సత్యసంకల్పుడనైన నేను, నా సంకల్పమాత్రమున జగదుదయ విభవ లయ లీలల జేయు శక్తి కలవాడనైనను, నా ఇచ్ఛచేతనే జగదుపకారార్థము - మనుష్యుడుగా నవతరించినవాడనై యుండి, శిష్టజనాగ్రేసరుడైన వసుదేవుని ఇంటియందు పుట్టి, ఆ పుట్టిన కులమునకు దగిన కర్మమునందు నుదాసీనుడనై వ్యవహరింపకపోతినేని, శిష్టజనాగ్రేసరు డగు వసుదేవునికి బుత్రుడనైన నా మార్గమునే అంతంత మాత్రమగు జ్ఞానముకలవారైన శిష్టజనులు సర్వవిధముల దానినే ధర్మ మని తలచి అనుసరింతురు. ఆ విధముగా వారు నన్ను జూచి, తా మాచరింపదగినదాని నాచరింపక ప్రత్యవాయము నొంది, ఆత్మప్రాప్తి నొందక, నరకమును బొందుదురు. నేను కులోచిత కర్మము చేయనైతినేని, శిష్టజనులు నన్ను చూచి, నా ఆచారమునే అనుసరించి, అదే ధర్మ మని నిశ్చయించుకొని, తా మాచరించవలసిన కర్మల నాచరింపకయే నాశము బొందుదురు. శాస్త్రీయాచారములను పాలింపనందున శిష్ట కులముల కన్నిటికి సంకరము కలిగించు కర్తను నేనే అగుదును. అందువలన, ఈ ప్రజలకు నేనే కర్మల కనర్హు లగునట్లు చెడగొట్టినవాడ నగుదును. ఈ విధముగ నీవుకూడ శిష్టజనాగ్రణి యగు పాండురాజుతనయుడవై యుండి, ధర్మజునకు తమ్ముడవైన అర్జునుడవై యుండి, జ్ఞాన నిష్ఠను బూనితివేని, పరిపూర్ణ జ్ఞానవిహీనులగు ముముక్షువులైన శిష్టజనులు,నీ యాచారమునే అనుసరించు

> వారై, తా మాచరింపదగిన కర్మనిష్ఠ నాచరింపక నశింతురు అందువలన, విశిష్టు డగు విద్వాంసుడు లోక రక్షణకై కర్మమునే చేయవలయు నని భావము." — (గీతా భాష్యము - 3–24,25)

అవాప్త సమస్త కాముడు, సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, సర్వేశ్వరేశ్వరుడైన పరమాత్ముడు మూడు లోకములందు దేవ మనుష్యాది రూపములందు వర్తించుచున్నవాడైనను, లోకసంగ్రహార్థము కర్మము నందు వర్తించుచున్నా డను విశేషమును శ్రీభాష్యకారులు పైన విపులీకరించియున్నారు.

సమస్త దోషములకు ప్రతివిరోధియైనవాడు, అఖండ మంగళ స్వరూపుడును, సమస్తమునకు నియామకుడును, సమస్తము తెలిసినవాడును, తలచినది తప్పక సిద్ధించునట్టివాడును, సమస్తమైన కోరికలను బడసినవాడును అగు భగవంతుడు, దేవ మనుష్యాదులు కర్మవశమున నెత్తు జన్మలవంటి జన్మలు తా నెత్తుటకు కారణ మేమి? ఆదిగా గల ప్రశ్నలకు సమాధానరూపమున భగవంతుడు చెప్పిన అవతార ప్రకారము, దేహ స్వరూపము, జన్మహేతువు మొదలగు విశేషములను శ్రీభాష్యకారు లెంతో యుక్తియుక్తముగ విశదీకరించి యున్నారు.

> అజత్వము, అవ్యయత్వము, సర్వేశ్వరత్వ మాదిగా గలవి నా పరమేశ్వరత్వ విశేషణములు. వీని నన్నిటిని విడువక, నాదైన ప్రకృతి (స్వభావము) నధిష్ఠించి, దివ్య విగ్రహముతో, నా సంకల్పమున, నా రూపముచేతనే పుట్టుచున్నాను" —(గీతా భాష్యము . 4–6)

పరమాత్మదేహము త్రిగుణాత్మకమైన ప్రకృతిచే గలిగినది కా దని, ఈ ప్రకృతిని తా నధిష్ఠించి యుండుటవలన స్వతంత్రుడై, తన ఇచ్ఛ చేతనే, తన రూపముచేతనే ఉదయించుచున్నా డని వివరింపబడినది. భగవంతుని స్వరూపమునుగూర్చి 'ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' అని చెప్పబడిన పురుషసూక్త వాక్యానుసారముగ, భగవంతుడు అప్రాకృ

కృత నిరతిశయ దీప్తిమంతు డని తెలియజేయబడినది. అంతే కాక, సూర్యమండల మధ్యవర్తి యగు పరమాత్మ హిరణ్మయుడని, ఆదిత్య వర్ణు డని, హృదయాంతర్వర్తి యని, శుద్ధ మనస్సుచేత గ్రహింపదగినవా డని, మృత్యువు లేనివా డని, భాస్వర రూపు డని సత్యసంకల్పు డని. అప్రాకృత నిరతిశయ కల్యాణ దివ్యరూపు డని, ఆకాశమువలె స్వచ్ఛ మైన స్వరూపము గలవా డని, సర్వజగత్తు తన కర్మ అయినవా డని, స్వచ్ఛములైన సర్వవిధ భోగ్య భోగోపకరణ వాంఛిత పదార్థములు గలవా డని, విలక్షణమైన పరమపద స్థానము గలిగియుండువా డని, శ్రుతులవలన అట్టి పరమపురుషుడు తెలియవచ్చుచున్నా డని విశదీక రింపబడినది. అందువలన, అపహత పాప్మత్వమాదిగా గల సమస్త కల్యాణ గుణమయుడై, పరమాత్మ సంబంధమైన స్వభావమును వద లక, తన రూపమునే ఆ యా దేవ మనుష్యాది జాతులకు సజాతీయ మగు అవయవాకృతులు గల్పించుకొని, తన సంకల్పముచేత భగవం తుడు దేవ మనుష్యాది రూపములతో ఏ తరుణమందైన అవతరించు చున్నట్లు తెలియజేయబడినది.

> " యజ్ఞములకు - తపస్సులకును భోక్తగాను, సర్వలోకేశ్వరులకు యీశ్వ రునిగాను, సమస్త భూతములకు పరమ మిత్రునిగా నన్ను తెలిసికొని, శాంతిని బొందుచున్నాడు. కర్మయోగమునందే సుఖమును పొందుచు న్నాడు. సర్వలోక మహేశ్వరుడు సమస్త లోకేశ్వరులకుగూడ యీశ్వరు డైనవాడు సర్వలోక మహేశ్వరునిగాను, సమస్త భూతములకు నన్ను హితునిగాను తెలిసికొని, కర్మయోగము నా ఆరాధన రూప మని దాని యందు సుఖముగా వర్తింతువు. సుహృదారాధనకు సర్వులు ప్రయత్నిం తురుకదా !" — (గీతా భాష్యము. 5-29)

ఇట యజ్ఞ రూపియైనవాడు భగవంతుడని (యజ్ఞోవై విష్ణుః) భగవం తుడే యజ్ఞాదులకు భోక్తయైనందున, యజ్ఞరూపమైన కర్మయోగము

భగవ దారాధనమే యని చెప్పబడినది. మహేశ్వర శబ్దార్థమును వివరించుచు, 'ఈశ్వరాణాం పరమం మహేశ్వరమ్-దైవతానాం పరమంచ దైవతమ్' అను శ్రుతి వాక్యముల వలన, సర్వలోక మహేశ్వరుడను పదము పరమాత్ముని పరముగనే వాడబడిన దని గ్రహింపవలయునని వివరించిరి. అందువలన, పరమాత్ముడు యజ్ఞరూపిగ, యజ్ఞభోక్తగ, సర్వజగత్సార్వభౌముడుగ, సర్వేశ్వరేశ్వరుడుగ, సర్వభూత హితుడుగ చెప్పబడియున్నాడు. మరొక సందర్భమున శ్రీభాష్యకారులు - భజనీయు డగు భగవంతుని ఉపాసనోపయుక్తములైన ఆకార విశేషముల నిట్లు వర్ణించియున్నారు :-

"ఎవడు నాయందలి ప్రీత్యతిశయముచేత, నేను కాక, మరొకటి ధారకముగా లేని స్వభావము కలవాడై, నా యందే మనస్సు నుంచి, అత్యంత ప్రియుడ నగు నన్నెడబాసి, క్షణ మాత్రము ఓర్వజాలకుండుటచే, మత్ప్రాప్తి విషయమున త్వర గలవాడై, నన్ను - విచిత్రానన్త భోగ్య భోక్తృవర్గ భోగోపకరణ భోగస్థాన పరిపూర్ణ నిఖిల జగ దుదయ విభవ లయ లీలుని, అస్పృష్టాశేష దోషానవధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజః ప్రభృ త్యసంఖ్యేయ కల్యాణ గుణగణనిధి అయినవానిని, స్వాభిమతానురూపైక రూపాచిన్త్య దివ్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌన్దర్య సౌగన్ధ్య సౌకుమార్య లావణ్య యౌవనా ద్యనంత గుణనిధి దివ్యరూపుని, వాఙ్మనసాఽపరిచ్ఛేద్య స్వరూప స్వభావుని, అపార కారుణ్యసౌశీల్య వాత్సల్యౌదార్య మహోదధియైనవానిని, అనాలోచిత విశేషాశేషలోక శరణ్యుని, ప్రణతార్తిహరుని, ఆశ్రిత వాత్సల్యైక జలధియైనవానిని, అఖిల మనుజ నయన విషయత్వము నొందిన వానిని, అజహ త్స్వభావుని, వసుదేవ గృహమునం దవతరించినవానిని, అనవధికాతిశయ తేజముచే నిఖిల జగత్తును వెలిగించుచున్నవానిని, ఆత్మకాంతిచే సమస్తమును ఆప్యాయితము చేయుచున్నవానిని అగు నన్ను భజించుచున్నాడో- (ఉపా

సించుచున్నాడో - సేవించుచున్నాడో) వాడు అందరికంటె శ్రేష్ఠుడని తలచుచున్నాను." - (గీతా భాష్యము. 6-47)

శ్రీ భాష్యకారులు విశదీకరించిన ఈ భగవత్కల్యాణ గుణములలో - 'విచిత్రానంత' మొదలుకొని, 'స్వరూప స్వభావుడు' వరకు గలవి భగవత్పరత్వమున కుపయుక్తములైన విశేషము లని, తక్కినవి భగవత్సౌలభ్యమున కుపయుక్తములైన విశేషము లని పెద్దలు తెలియజేసి యున్నారు. 'విచిత్రానన్త లీలుడు' అనుట ద్వారా జగత్కారణత్వమును, తన్మూలమున - లీలా విభూతియు, 'అస్పృష్టాశేష...నిధియైన వాడు' అని చెప్పుటచేత భగవంతుని దోష లేశ రాహిత్యము కల్యాణ గుణైక స్వరూపత్వమును, 'స్వాభిమత...రూపుడు' అని వివరించుటచేత భగవంతుని అప్రాకృత విగ్రహమును, తన్మూలమున దివ్యాభరణాయుధ మహిషీ పరిజనాదుల ప్రదర్శించు నిత్యవిభూతి యోగమును, 'వాఙ్మనస స్వభావుడు' అని వర్ణించుటచేత, భగవంతుడు ఉపాసనకంద రానివాడని సూచించిరని తెలియజేయబడినది. అంతే కాక, 'అపార... మహోదధి' అని భగవదవతార సౌలభ్యమునకు హేతువులైన విశేషములను విస్తరించిరని, భగవంతుని ఆశ్రిత విరోధి నిరసనత్వమును తెలియజేయుటకు ప్రణతార్తిహరుడని ప్రయోగించిరని, 'ఆశ్రిత వాత్సల్యైకజలధి' అను పదముద్వారా సాపరాధులు తనను చూచి భయపడకుండుటకు జ్ఞానాది రహితులై యున్నప్పుడు తానే రక్షకుడై యుండుటను తెలుపుటకును, భగవంతునియెడ వైముఖ్యమును తొలగించుటకును వివరించిరని స్పష్టీకరింపబడినది. కారుణ్యాది గుణముల ద్వారా ప్రకృతావతారము తక్కిన అవతారములకంటె విలక్షణమైనదని 'అఖిల...వాడు' అను ప్రయోగముద్వారా సూచించిరని, అవతార దశయందు పరత్వ సౌలభ్యములను సూచించునట్టి తేజస్సు - 'క్షాంతి' అను గుణ విశేషములను 'అనవధిక...వాడు' అను వాక్యము ద్వారా తెలియజేయబడునట్లు స్పష్టీకరించియున్నారు

మహా విభూతిమంతు డగు పరమాత్ముడు సమస్త చిదచిద్వస్తు సమూహమునకంటె వేరై యుండుటను గూర్చి ఈ విధముగా విస్తరించి చెప్పబడినది :-

"నేను నీ కొఱకు నా స్వరూప విషయమైన, వివిక్తాకారమునుగూర్చిన జ్ఞానమును సంపూర్ణముగ చెప్పుచున్నాను వివిక్తాకార విషయ జ్ఞానమే విజ్ఞానము. ఏ జ్ఞానముచేత నేను నిఖిలహేయ ప్రత్యనీకుడ నగుటచేతను, నానావిధములై, అనవధికాతిశయములై, అసంఖ్యేయములై యొప్పు కల్యాణగుణగణములును అనంతమగు మహావిభూతిగలవాడ నగుటచేతను, మద్వ్యతిరిక్తములైన సమస్త చిదచిద్వస్తు సమూహమునకంటె వేరైన వాడనై యుండునో, చిదచిద్వస్తువులకంటె వేరై యుండు అట్టి నా వివిక్తతను పేర్కొనిన జ్ఞానముతో నా స్వరూపమును గుఱించిన జ్ఞానమును గూడ నీకు జెప్పెదను పెక్కేల? ఆ జ్ఞానమును దెలిసికొనిన పిమ్మట నన్నుగూర్చి తెలిసికొనవలసినది ఇతర మేదియు మిగిలి యుండదు."

— (గీతాభాష్యము : 7-2)

శుద్ధ జీవుడు ప్రాప్యు డని, వానికంటె నధికముగా ప్రాప్యుడై నందున భగవంతుడు పరమ ప్రాప్యు డని చెప్పబడినది. పరమాత్ముడు పరమ ప్రాప్యు డగుటకు ముఖ్య కారణము పరబ్రహ్మత్వాది లక్షణములు కలిగియుండు టని తెలియజేయబడినది. భగవంతుడు తన వాస్తవ స్వరూపమును తెలియజేయుచు మొట్టమొదట కార్య కారణ రూపముగ నున్నట్టి ప్రకృతికి తాను శేషి యని, దానికంటె తాను వేరైన విశేషమును ఈవిధముగా తెలియజేయుటను శ్రీభాష్యకారులు విస్తరించి చెప్పియున్నారు.

"విచిత్రానన్త భోగ్య భోగోపకరణ భోగస్థాన రూపమున నున్న యీ జగత్తునకు మూలమై, గంధ రస రూప స్పర్శ శబ్ద గుణ సహితము లగు పృథివ్యప్తేజోవాయ్వాకాశాదుల రూపమున మనస్సు మొదలయిన ఇంద్రి

యముల రూపముననుం, మహ దహంకార రూపముననుం, ఎనిమిది విధము లుగా భిన్నమై యున్న యీ ప్రకృతి నా దనియే తెలిసికొనుము. ఇది నా అప్రధానమైన (అనుత్కృష్టమైన) ప్రకృతి ఈ ప్రకృతి అచేతనమై, చేతనమునకు భోగ్యభూతమైనందున, యీ ప్రకృతికంటె విసజాతీయా కారమై, దానికి భోక్తయైనందున, ప్రధానభూతమైన చేతనరూపమున నున్న నా ప్రకృతి మరొకటి కలదని తెలిసికొనుము. జీవరూపమైన యీ చేతన ప్రకృతిచేత అచేతనమగు యీ జగత్తంతయు ధరింపబడుచున్నది.''

– (గీతా భాష్యము. 7-4,5)

ఈ విధముగా భగవంతుడు పృథివ్యాది ఆకారముగ పరిణమించి యున్న ప్రకృతినిగూర్చి వివరించి, ఆయన దానికన్న విలక్షణుడై, దానికి శేషియై, నియంతయై యుండుటయే కాక, అది ఆయనదే యని విప్పి చెప్పియున్నాడు. అంతే కాక, ఈ అచేతన ప్రకృతికంటె విలక్షణ మైన జీవరూప ప్రకృతి మరొకటి కలదని, అచేతన ప్రకృతి చేతన ప్రకృతికి భోగ్యభూతమై యున్నందున నికృష్టమైనదని, అచేతన ప్రకృతికి భోక్తయై ప్రధానభూతమైన జీవరూపచే తన ప్రకృతిచేత ఈ అచేతన జగత్తంతయు ధరింపబడుచున్నదనియు విశదీకరించి యున్నారు అందువలన, అచేతన రూపముగను, చేతన రూపముగా నుండునట్టి ప్రకృతి సమస్తము భగవదధీనమైనట్టిదని విదితమగు చున్నది.

ప్రకృతి పురుషరూపమున నున్న సమష్టి దశనుగూర్చి వివరించి చెప్పిన పిమ్మట, భగవంతుడు వ్యష్టి దశనుగూర్చి విశదీకరించి యున్నాడు. శ్రీభాష్యకారులు లా విశేషము నీ క్రింది విధముగ తెలియ జెప్పియున్నారు :-

“బ్రహ్మాది స్తంబ పర్యంతము ఎక్కువ తక్కువలుగా నున్నవి, రెండవి ద్వయ మిశ్రమములై, మదీయములైనవియునైన సమస్త భూతములు

చేతనాచేతన సమష్టి రూపమని యీ నా ప్రకృతి ద్వయమువలననే పుట్టిన వని తెలిసికొనుము. ఈ రెండు ప్రకృతులు నావలన బుట్టినవిగాన, అవి నాయవియే అయి యున్నవి ఆ విధముగా నా రెండు ప్రకృతులచేతనే సమస్తమైన జగత్తు పుట్టుటచేతను, నావలన బుట్టిన ఆ రెండు ప్రకృతులు నా వగుటచేత, సమస్తమైన జగత్తునకు నేనే ఉత్పత్తి కారణమును, లయ కారణమును, శేషియునై యున్నానని తెలిసికొనుము. చిదచిత్సమష్టి భూతమైన ప్రకృతి పురుషులకును, పరమపురుషుడే కారణ మగుట శ్రుతి స్మృతి సిద్ధము."

1 మహత్తు అవ్యక్తమునందును, అవ్యక్తము అక్షరమునందును, అక్షరము తమస్సునందును, తమస్సు (మూల ప్రకృతి) పరమేశ్వరుని యందు లీన మగుచున్నది. (ప్రకృతి పురుషులు రెండును పరమాత్మ యందు లీన మగుచున్నవని భావము) (సుబాల · 2-40) ఇత్యాదులు శ్రుతులు

2 విష్ణువుయొక్క స్వరూపమునుండి తర్వాత పుట్టిన రెండు రూపములు ప్రకృతి పురుషుడును. (వి . పు : 1-2.24)

3 వ్యక్తస్వరూపమును గలిగియున్నట్టియు, అవ్యక్త స్వరూపమును గలిగియున్నట్టియు ప్రకృతిపురుషులు రెండును పరమాత్మయందు లీన మగుచున్నవి సర్వ నియంత యగు ఆ సర్వేశ్వరుడే అన్నిటికిని ఆధారభూతుడు ఆయన పేరు మహావిష్ణువు. వేద వేదాంతములం దీ విషయము తెలియజేయబడినది (వి పు॰ 6-4-39-40) ఇత్యాదులు స్మృతులు — *(గీతా భాష్యము . 7–6)*

ప్రకృతియును, జీవుడును పరమాత్మస్వరూపమునుండి పుట్టిన రెండు రూపములని తెలియుజేయబడినది. మరియును, వ్యక్తస్వరూపమును, అవ్యక్తస్వరూపమును గలిగియున్న ప్రకృతి పురుషులు పరమాత్మ

యంతు లీన మగుచున్నవని, అందువలన, సర్వనియంత యగు సర్వేశ్వరుడు సమస్తమునకు ఆధారభూతుడని విదిత మొనర్పబడి యున్నది. ఈ అంశమును భగవంతుడు మరింత స్పష్టముగ వ్యాకుచ్చియున్నాడు. దానిని శ్రీభాష్యకారులు ఈ విధముగ సాయించియున్నారు :-

" సర్వమునకు ప్రకృతి ద్వయము కారణమైనను, దానికి నేనే కారణమై యున్నాను. సమస్తములైన అచేతనములకు చేతనము శేషి యైనను, అట్టి దానికిని సర్వకారణుడను, సర్వశేషినైన కారణమున నేనే పరతరుడను. ఆ విధముగా జ్ఞాన శక్తి బలాది గుణ యోగముచేతను నేనే అన్నిటికంటె పరతరుడను. నాకంటె ఇతరమైనది, నాకు వ్యతిరేకమైనది, జ్ఞాన బలాది గుణాంతరములు గలిగి, నా కంటె పరతరమైన దేదియు లేదు సమస్తమైన యీ చిదచి ద్వస్తుజాతము, కార్యావస్థయందును, కారణావస్థ యందును నాకు శరీరభూతమై, సూత్రమున గ్రుచ్చబడిన మణుల సమూహము వలె, ఆత్మయై వెలసియున్న నాయందు గ్రుచ్చబడి యున్నవి అనగా - నన్నాశ్రయించి యున్నవి.

1 యస్య పృథివీ శరీరమ్ - (బృహ-5-7-3)

2. యస్యాత్మా శరీరమ్ - (బృహ - 5-7-22)

3 ఏష సర్వభూతాన్తరాత్మా । అహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః — (సుబాలోపనిషత్తు-71)

అని అంతర్యామి బ్రాహ్మణాదులందు సిద్ధము. —(గీతాభాష్యము-7-7)

ఇచ్చట, ఒక సూత్రమే తా నొక్కటియై అన్ని మణులకును ఆధారభూతమై, వానిలో ప్రవేశించి, తన స్థితి వానివలన కలుగక, వాని ఉనికియే తనవలన కలిగి యుండునో, అదే విధముగ పరమాత్ముడు తా

నొక్కడే సమస్త చిదచిత్తుల కాధారభూతుడై, వానియందు ప్రవేశించి యుండి, తన వలననే ప్రకృత్యాదుల స్థితి కలుగుటయే కాని. ప్రకృత్యాదుల వలన తన స్థితి కలుగనివాడై యుండునని వివరింపబడినది. అందువలన, సమస్త చిదచిద్వస్తుజాతమునకు పరమాత్ముడు అంతరాత్మయై తనరారుచున్నాడని తెలియుచున్నది.

ఈ విధముగా సమస్తమునకు పరమ పురుషుడు శరీర మగుటచేత, వాని కన్నిటికి ఆత్మ యగు ఆ పరమ పురుషునికి అవి యన్నియు ప్రకారము లగుచున్నవి. సర్వమును పరమ పురుషుని ప్రకారము లగుటచేత సర్వ ప్రకారుడైన ఆ పరమ పురుషుడే ఆ ప్రకార వాచకము లగు శబ్దములచే చెప్పబడుచున్నాడు.

"ఉదకములందు రుచి గుణమును, సూర్యచంద్రులందు కాంతియు, సకల వేదములయందు ఓంకారమును, ఆకాశమున శబ్ద గుణమును, పురుషుల యందు పౌరుషము (జీవులందు కర్తృత్వ శక్తి), భూమియందు సుగంధమును, అగ్నియందు తేజస్సును, సర్వ భూతములయందు జీవనమును, తాపసులందు తపస్సును నేనే. సమస్త చరాచర భూతములకు అనాది మూలమైన ప్రకృతి తత్త్వమును నేనే. బుద్ధిమంతుల బుద్ధిశక్తియు, ప్రతాపవంతుల శౌర్యమును నేనే బలవంతులయందు కామ, రాగ విరహితమైన స్వధర్మానుష్ఠాన సామర్థ్యమును నేనే ప్రాణులందు ధర్మవిరుద్ధము కాని కామమును నేనే." — (శ్రీమద్భగవద్గీత 7–8, 9, 10)

ఈ విశేషమును విశదీకరించుచు శ్రీభాష్యకారులు —

ఈ విలక్షణ వస్తువు లన్నియు నావలననే జనించినవి అవి నాకే శేషభూతమై యున్నవి అవి నా శరీరమై యున్నందున నాయందే యున్నవి అందువలన, నాకు ప్రకారములైయున్న వానియందు నేనే యున్నాను. విశేషించి చెప్ప నేల ? ప్రపంచమున దేహములుగను

కాని ఇంద్రియములుగను, భోగ్య వస్తువులుగను వానికి హేతువులుగ నెలకొని, సాత్త్వికములు, రాజసములు, తామసములు నగు ఏ యే పదార్థము లున్నవో - అవి యన్నియు నా వలననే పుట్టుచున్నవని తెలిసి కొనుము. అవి నా శరీర మగుటచే నాయందే నెలకొని యున్నవి నేను వానియందు లేను ఒక్కొక్కప్పుడు నా స్థితి వానివలన కలుగునది కాదు శరీరమునకు స్థితి ఆత్మవలననే కలుగుచున్నను, ఆత్మస్థితికి శరీరము తోడ్పడుట కలదు. నాకు ఆ రెండును శరీముగా నుండియు, నావలన వానికి స్థితియే కాని, వానిచే నా స్థితికి అటువంటి తోడ్పా టేదియు లేదు. ఇట్లా రెంటివలన నెట్టి యుపకారము లేనప్పుడు, వానిని శరీరముగా దాల్చుట వలన ప్రయోజనము కేవలము లీలయే" అని చెప్పి యున్నారు — (గీతా భాష్యము - 7-11, 12)

**చేతనాచేతనాత్మకమైన ఈ జగత్తంతయు త్రిగుణాత్మకమైన పదార్థములచేత మోహము జెంది, సర్వోత్కృష్టుడు, సర్వప్రకారుడు, సర్వ శరీరుడు, సర్వాత్మకుడు, సర్వేశ్వరుడు నైన తనను తెలియజాల కున్నదని భగవంతుడు చెప్పిన అంశమును శ్రీభాష్యకారు లీ ప్రకారముగ సెలవిచ్చియున్నారు :-**

" కాబట్టి యిట్లు చేతనాచేతలాత్మకమైన జగత్తంతయు ఆ యా కాలము లందు నావలననే పుట్టుచు, నాయందే లీన మగుచు, నాయందే నెలకొని యుండి, నాకు శరీరమై, నన్ను ఆత్మగా గలిగి యున్నది. కావున, కార్యావస్థయందును కారణావస్థయందును సర్వము నా శరీరమే అయి యున్నది. ఈ విధముగ సర్వశరీరుడ నగుటచేత, సర్వప్రకారుడ నగు నేనే ఉన్నవాడ నగుచున్నాను ఇట్లు సర్వకారణత్వముచేత, సర్వశేషిత్వముచేతను, జ్ఞానాద్యసంఖ్యేయ కల్యాణ గుణగణములచేతను, సర్వ విధముల నేనే శ్రేష్ఠుడను. ఏ కల్యాణ గుణగణములచేతను నా కంటె గొప్పనైనది ఏ ఒక్కటియును లేదు. ఇట్టివాడనైన నేను, నా కసాధారణమైయున్న కల్యాణ గుణగణములచేత, భోగ్యుడనై యుండు నా యా

ప్రకారములచేతను, సాత్త్విక రాజస తామస గుణమయపంలైన మూడు భావములకంటెను (పదార్థములకంటెను) ఉత్కృష్టతముడను, ఎల్లప్పుడాకే రూపమున నుండువాడ నైనను, గుణమయములై, నిహీనతరములై, క్షణభంగురములై యుండు ఆ మూడు పదార్థములె దేవ తిర్య ఙ్మనుష్య స్థావరాత్మకముగ నున్న ఈ జగమునకు దాని దాని పూర్వకర్మాను గుణముగ దేహములుగాను, ఇంద్రియములుగాను, భోగ్య వస్తువులుగను ఏర్పడి, జగత్తును మోహింపచేయగా, ఆ మోహమువలన అది నన్ను గుర్తింపవలె ననుకున్నది." — (గీతా భాష్యము . 7-13)

**సత్త్వ రజ స్తమోగుణమయమైన ఈ ప్రకృతిని నియమించువాడు శ్రియఃపతియే కావున, సమస్తము ఆయన అధీనము. ఆయన లీల నుండి ఎవ్వడును తప్పించుకొనజాలడు. కాని, భగవంతుని శరణు వేడు పుణ్యాత్ములు ఆ మాయను సులభముగా దాటగలరని తెలియ చేయబడినది.**

"సత్త్వ రజ స్తమో మయమైన ఈ నా మాయ, క్రీడా ప్రవృత్తుడనైన నా చేతనే నిర్మింపబడి యున్నందున, అందరికిని దాటరానిది," 'మాయా' శబ్దమునకు అసుర రాక్షసాస్త్రములు మొదలగువానివలె సత్యములే యై యుండి, విచిత్ర కార్యములు చేయుట చేతనే అగును. మఱియును, 'తతో భగవతా తస్య రక్షార్థం చక్ర ముత్తమమ్, అజగామ సమాజ్ఞప్తం జ్వాలామాలి సుదర్శనమ్। తేన మాయా సహస్రం త చ్ఛమ్బర స్యాశు గామినా। బాలస్య రక్షతా దేహ మేకైక శ్యేనసూదితమ్. (వి పు. 1-19-19-20) ఇత్యాదులందును ఇట్లే. ఇట మాయా శబ్దము మిథ్యార్థ వాచి కాదు. శంబరుని మాయా సహస్రము మిథ్యలైన యెడల, అవి చక్రముచే హత మొనర్చబడుట సంభవింపదు ఐంద్రజాలికులు మొదలైనవారు కూడ ఏవో మంత్రౌషధాదులచే మిథ్యార్థ విషయమైన బుద్ధిని పుట్టించుటచేతనే మాయావు లనబడుచున్నారు. ఆ విధముగా ఆ ఇంద్రజాలాదులందు మంత్రౌషధాదులే విచిత్ర కార్యకరము లగుటచే, 'మాయ

అగునుగాని మిథ్యార్థము కాదు. ఒక శబ్దమునకు సర్వప్రయోగము లందును అనుసరించి వచ్చునట్టి ఒక అర్థమే దాని అర్థ మగును. 'మంచాః క్రోశన్తి' 'మంచెలు అరచుచున్నవి' అన్నప్పుడు మంచెలు గాక, మంచె లకు సంబంధించిన మనుష్యులని అర్థ మగునట్లు మిథ్యార్థములందు 'మాయా' శబ్దము ప్రయోగించుట మిథ్యలను గుఱించినది కాక, ఆ మిథ్య లకు సంబంధించినదై, మాయవలన కలుగు బుద్ధిని గురించిన దగుటచే, ఔపచారిక మగును. ఈ గుణమయమును, పారమార్థికమునైన ఈ భగవ న్మాయయే 'మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరమ్" ఇత్యాదులందు చెప్పబడుచున్నది. సత్యసంకల్పుడను, పరమకారుణికు డను, అనాలోచిత విశేషాశేషలోకశరణ్యుడను అగు నన్నే ఎవరు శరణు కోరుచున్నారో (నా ఎడల ఎవరు ప్రపత్తి చేయుచున్నారో) వారు గుణమయమైన నా ఈ మాయను దాటుదురు వారు నా మాయను విడచి, నన్నే ఉపాసింతు రని అర్థము."

— (గీతా భాష్యము. 7-14)

**ఈ విధముగా 'మాయ' సత్యమైన వస్తువులను గుఱించినదే కాని, మిథ్యను గుఱించి కాదని, ఈ 'మాయ' - భగవత్స్వరూపమును మఱుగు పరచి, స్వస్వరూపమే భోగ్యమైన దను బుద్ధిని కలిగించునట్టి దని, అందువలన, ఈ జగ మంతయు భగవంతుని మాయచే మోహి తమై, ఆ భగవంతుని నిరవధికాతిశయానంద స్వరూపమును గ్రహింప లేకున్న దని వివరింపబడినది. ఇట్టి మాయా మోహిత జగమున ఎవరు సత్యమైన సంకల్పము కలవాడును, అపారవారమైన దయ గల వాడును, జాతి, గుణము, వృత్తి మొదలగు వానిని పరిగణింపక, సమస్త లోకములకును శరణాగుడును అగు భగవంతుని శరణు వేడుచు న్నారో, వారు - భగవంతుని మాయను గడచి, ఆ పరమాత్మునే ఉపాసింతు రని తెలియజేయబడినది.**

సర్వ తత్త్వాత్మకుడు, ఆది దేవుడు, పురాణ పురుషుడు, నిఖిల లోకైక శరణ్యుడైన పరమాత్ముడు ఈ జగత్తునకెల్ల ఆత్మరూపమున పరమాధారభూతుడై యున్నాడని, గీతాశాస్త్రమంత దెచ్చట పరికించినను భగవత్స్వరూప విశేషము చక్కగ ప్రతిపాదితమై, ఈశ్వరుని పరతత్త్వమును, సర్వవ్యాపకత్వమును, సర్వనియామకత్వమును సవిస్తారముగా దెలియజేయబడియున్నదని శ్రీభాష్యకారులు సాయించి యున్నారు. భగవంతుడు శ్లోక చోదితమును గూర్చి సంగ్రహముగా జెప్పిన ఈ పంక్తులు గమనింపదగియున్నవి :-

"కార్యావస్థయందుగాని, కారణావస్థయందుగాని, స్థూలముగా గాని, సూక్ష్మముగా గాని చిదచిదాత్మకమై యుండు ఈ జగత్తు నంతయు స్వరూప సద్భావము నందును, స్థితి యందును, ప్రవృత్తి భేదములందును నా సంకల్పము నతిక్రమింపకుండునట్లు నా మహిమ యందలి పెక్కు వేల భాగములలో నొక్క భాగమున నిలువబెట్టుకొని నే నున్నాను"

— (గీతా భాష్యము - 10-42)

## 6. గీతా భాష్యము - ఆత్మ స్వరూపము

అస్థాన బంధు స్నేహ కారుణ్యములచేత ధర్మాధర్మ భయము వలన వ్యాకులుడై, యుద్ధ విముఖుడై భగవంతునికి శరణాగతుడై యున్న అర్జునునికి, అతని భ్రమను, మోహమును బోగొట్టుటకై, ఆత్మ దేహముకంటె వేరై నిత్యమై యుండుటయు, శాస్త్రవిహిత ధర్మము లగు యుద్ధాది కర్మలను ఫలాపేక్ష రహితముగ చేయుటయే ఆత్మస్వరూప ప్రాప్తికి సాధన మగుటయు బోధింపబడినది.

గీతా శాస్త్రమునందు ఆత్మ దేహము కంటె వేరైన దని, నిత్యమైన దని భగవంతుడు ప్రబోధించి యున్నాడు. ఆత్మ నిత్యమనెడి జ్ఞానమునకు సాంఖ్య బుద్ధి యని పెద్దలు సాయించి యున్నారు

భగవంతుడు జ్ఞానాధికులైనవారు నిత్యములైన ఆత్మలను గుఱించి గాని, అనిత్యములైన శరీరములను గుఱించిగాని దుఃఖింపరను విశేషమును వివరించి, అర్జునునకు జీవాత్మ తత్త్వము నుపదేశించి యున్నాడు. అశేష శేముషీ వైభవోపేతులగు శ్రీ భాష్యకారులు దానిని విపులీకరించి సాధించి యున్నారు.

భగవానుడు ఆత్మల పారమార్థిక నిత్యత్వమును ఉపదేశింప బూనిన తరుణమున, 'నేను' 'నీవు' 'ఇవి' 'అన్నియు' 'మనము' అని తనను, మిగిలినవారిని గూర్చి విడిగా చెప్పెను. అందువలన, తనకు - ఆత్మలకును, ఆత్మలలో ఒకటికి ఇంకొకటికిని భేదము పారమార్థికమైనదని భగవంతుడే చెప్పియున్నాడు దానిని శ్రీ భాష్యకారులు ఈ విధముగ వివరించియున్నారు

"సర్వేశ్వరుడనైన నేను ఇంతకు పూర్వము అనాదిగా నున్న కాలమున నెప్పుడును లేకున్నవాడను గాను. నాకు యీశితవ్యులైన క్షేత్రజ్ఞులలో నొకడవైన నీవును, మిగిలిన యీ రాజులందరు, పూర్వమెప్పుడును లేకున్నవారు కారు నేనును, మీరును, మన మందరమును ఇకపై లేకుండుటయును లేనే లేదు. మన మందరమును తప్పక ఉండగలము. పరమాత్ముడను సర్వేశ్వరుడ నగు నేను నిత్యుడ ననుటలో ఏవిధముగ సందేహము లేదో, అదే విధముగ క్షేత్రజ్ఞులైన ఆత్మలు మీరును నిత్యులే అని తలపవలయును" — (గీతా భాష్యము : 2-12)

శ్రీ భాష్యకారుల దృష్టియందు ప్రపంచములోని భేదములన్నియు సత్యములే. ఏదియును మిథ్య కాదు. బ్రహ్మము వేరు. జీవులు వేరు. జీవులు అసంఖ్యాకములై, పరస్పరము వేరైనవి. అందుచేతనే భగవంతుడు 'నీవు' 'నేను' అని నిర్దేశించి యున్నాడని చెప్పబడినది. జీవాత్మలు నిత్యమైనవగుటచే, వానిని గూర్చి శోకింపరాదని శ్రీ భాష్యకారులచే ఈ విధముగా వివరింపబడినది :-

"బుద్ధిమంతుడు ఒక దేహమునకు కౌమారావస్థ పోయి, యౌవనా ద్యవస్థలు కలుగినపుడు, ఆ శరీరమందలి ఆత్మ స్థిరమైన దను బుద్ధితో అది నశించిన దని దుఃఖింపక యె ట్లుండునో, అట్లే, ఆ దేహము పోయి, మరొక దేహము కలుగునపుడు ఆ ఆత్మ నశింపకయే యున్న దని తలచి దుఃఖింపడు మరి చేయవలసిన దేమి యన - నిత్యములే అయిన ఆత్మలు అనాదికర్మ వశ్యతచేత, ఆ యా కర్మల కనుగుణ్యములైన దేహములను బొందుచు, ఆ యా దేహముల వలన ఆత్మకు గలిగిన బంధమును నివర్తించుట కొరకు ఆ దేహముల చేతనే శాస్త్రీయములైన, స్వవర్ణోచితములైనవి యగు యుద్ధాది కర్మలను ఫలాపేక్ష రహితముగ నాచరించుచుండవలయును ఆ సందర్భమున ఇంద్రియములు వాని వాని విషయములలో సంబంధించి యుండుట కారణముగ శీతోష్ణాదుల వలన సుఖ దుఃఖములు కలుగును. అయినను, ప్రారంభింపబడిన కర్మలు సమాప్తి నొందు వరకు వానిని ఓర్చుకొని యుండవలయును."

—(గీతా భాష్యము . 2-13)

**దేహమునుబట్టి ఆత్మకు బాల్యా ద్యవస్థలు సంభవించునట్లు, దేహమునుబట్టియే ఆత్మకు జనన మరణములు సంభవించుచున్న వని తెలియజేయబడినది. నిత్యమైన ఆత్మనుగూర్చి దుఃఖింపరా దనియు, కర్మ వశ్యముచేత దేహము వలన ఆత్మకు కలిగిన బంధమును తొలగించుటకు, ఆ దేహము యొక్క సహకారముచేతనే స్వకులోచితమైన శాస్త్రవిహిత కర్మలను ఫలాపేక్ష లేక చేయుచుండవలయు నని చెప్పబడినది. అనాది కర్మవశ్యములైన ఆత్మలు, ఆ యా కర్మముల వలన సంక్రమించిన శరీర సంబంధము చేత విషయానుభవము కలుగునపుడు సుఖ దుఃఖములు కలుగక మానవని, అందువలన వానిని తప్పక సహించుకొనవలయు నని తెలియజేయబడినది. నశ్వరమైన దేహమునకు నిత్యత్వము లేదని, స్థిరమైన దైన ఆత్మకు అనిత్యత్వము లేదని, అచిద్వస్తు వగు దేహమునకు అస త్త్వమే రూపమని, చేతనమైన**

ఆత్మకు సత్త్వాత్మ స్వరూపమును తత్త్వ దర్శనులయినవారు ప్రత్యక్షముగా జూచినట్లు తెలిసి నిశ్చయించినారని విశదీకరింపబడినది.

" వినాశము నొందు స్వభావమే అసత్త్వము; అవినాశ స్వభావమును సత్త్వము. భగవంతు లగు పరాశరులును ఇట్లే చెప్పియున్నారు."

1. వస్తు సమూహమున విజ్ఞానమైన ఆత్మ తప్ప, తక్కిన ఏదిగాని, ఎచ్చటగాని, ఎప్పుడుగాని సత్తు లేదు. నీకు నే నిట్లు 'జ్ఞానము' ఆత్మ సత్య మనియు, తక్కిన వెల్ల అసత్య మనియు చెప్పితిని. (వి. పు. 2-12-45).

2. 'అనాశియైనది పరమార్థము - అనగా సత్యము అని' ప్రాజ్ఞు లంగీకరింతురు. నశించు ద్రవ్యములతో నైనది నశించునది. సందేహము లేదు. (వి. పు. 2-14-24)

3. కాలాంతరమునను వికారాదులచే మ రొక పేరు నొందనిది వస్తువు రాజా అది ఏది ? (వి. పు. 2-13-100)

— (గీతా భాష్యము : 2-16)

ఇచ్చట ఆత్మ సత్యమనియు. దేహము అసత్యమనియు తెలియజేయబడినది 'సత్యము' 'అసత్యము' అనుటకు 'పరమార్థము' 'అపరమార్థము' అని అర్థము లగును గాని, అవి 'అనాశి' 'వినాశి' అని అర్థము లెట్లు? అను విశేషమునకు 'అనాశి' అగుటయే పరమార్థ మనుటకును, 'వినాశి' యగుటయే 'అపరమార్థ' మనుటకును హేతువను భావము విశదీకరింపబడినది. 'సత్యము'_ 'అసత్యము' అను వానికి అర్థములుగా చెప్పబడిన 'అవినాశి' _ 'వినాశి' అనగా నేమి ? అను సందేహమును నివారించుటకు వికారము అను వానిచే వేరు పేర్లను బొందునది 'అవస్తువని', అట్టిది కానిది 'వస్తు' వని చెప్పబడినది. అందువలన,

'వినాశి' యనగా-వికారమును బొందునది. అవినాశి యనగా-'వికారమును బొందనిది' అని అర్థమును వివరించిరి. కావున, దేహమునకు వికారత్వ మూలమైన వినాశిత్వమును బట్టి అసత్త్వ మని, ఆత్మకు అవికారిత్వ రూపమైన అనాశిత్వమును బట్టి సత్త్వ మని చెప్పబడినవిగా గ్రహింపవలయు నని తెలియజేయబడినది.

సమస్త ప్రపంచమును వ్యాపించియున్న ఆత్మతత్త్వము నాశనము లేనిదని, దానిని ఏదియును నశింపజేయజాలదని భగవంతుడు జానతిచ్చియున్నాడు. శ్రీభాష్యకారు లా విశేషము నిట్లు వివరించి యున్నారు :—

" చేతన మగు ఏ ఆత్మతత్త్వము యీ అచేతన ప్రపంచమునం దంతటను వ్యాపించి యున్నదో, అట్టిదానికి నాశనము లే దని తెలిసికొనుము. నాశనము లేని యీ ఆత్మను నాశన మొందింప నెట్టి పదార్థమునకు సాధ్యము కాదు. నాశకమైన శస్త్రము, జలము, అగ్ని, వాయ్వాదికములు నశింప జేయబడు వస్తువులందు వ్యాపించి, శిథిల మొనరించుచున్నవి. సమ్మెట మొదలయినవాని వేగవత్సంయోగముచేత, వాయువు నుత్పాదించి, తద్వారా నాశనము గలిగించుచున్నవి. కావున, ఆత్మ తత్త్వము అవినాశి." —(గీతా భాష్యము. 2-17)

నాశనము లేని దగు ఈ ఆత్మ, తన పురాకృత కర్మఫలము ననుభవించుటకొరకే పంచభూత సంఘాత రూపమైన దేహములతో సంబంధమును పొందు నని శాస్త్రములలో చెప్పబడినట్లు వివరింపబడినది. అంతే కాక, దేహములు కర్మవశమున పుట్టునవని, అందువలన ఆ కర్మము ముగియగనే అవి నశించునని తెలియజేయబడినవి.

" దిహ ఉపచయే - అను విశేషము ననుసరించి యీ దేహములు ఉపచయ రూపము లైనట్టివి. అనగా, పెరుగునట్టివి. (అవయవములు గలవి) మీదు

మిక్కిలి యీ దేహములు అంతవంతములు - అనగా - వినాశ స్వభావము గలవి. ఎట్లనగా - ఉపచయాత్మకములైన (సావయవములైన) ఘటాదులు అంతవంతములుగా (వినాశ స్వభావము గలవిగా) కనుపించుచున్నవి. నిత్యుడైన శరీరికి (ఆత్మకు) యీ శరీరములు కర్మఫలభోగార్థమునకై భూతముల సంఘాత రూపమున నేర్పడినవి. ఇవి 'పుణ్యః పుణ్యేన' ఇత్యాది శాస్త్రములచే చెప్పబడినవి. కర్మావసానమున నశించునట్టివి. ఆత్మ యనినచో, అది అవినాశి. అప్రమేయమైనది. ప్రమేయముగా కనబడదు. ప్రమాతగా కనబడుచున్నది. ఆ విధముగనే (ఎవడు యీ దేహమును తెలిసికొనుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని ఆత్మతత్త్వజ్ఞులు చెప్పుచున్నారు (13-1) అని చెప్పబడినది. ఆత్మ ఇతరమునకు ఒక్క రూపుననే ప్రమాతగ కనుపట్టుచున్నట్లు, దేహమునందు అంతటికి 'దీనిని నేను ఎరుగుచున్నాను' అని ఒక్క రూపున ప్రమాతగ కనుపించుచున్నాడు. అనేకములైన అవయవములతో నైనట్లు కనుపింపడు. దేహాదులకువలె వేరు వేరు చోట్ల ప్రమాతకు వేరు వేరు ఆకారములు కానరావు. అందువలన, ఒక్కటే రూపమున నిరవయవముగా నుండుటవలన, ప్రమాత యగుటవలన, వ్యాపకత్వము వలనను ఆత్మ నిత్యమైనది. దేహమో, అవయవాత్మక మగుటవలన, శరీరికి (ఆత్మకు) కర్మఫలభోగము కొరకగుటవలన, ఏకరూపమున నుండుటవలన, వ్యాపక మగుటవలన వినాశియైనది. కావున, దేహముయొక్క వినాశ స్వభావమునుబట్టి, ఆత్మయొక్క నిత్యస్వభావమునుబట్టియు, రెండును శోక స్థానములు గావు. దీనిని తెలిసికొని, శస్త్రపాతము మొదలగు అనివార్యములైన పరుష స్పర్శములు తనకు గలిగినను, ఇతరులకు గలిగినను, వానిని ధైర్యముతో సహించి, మోక్షప్రాప్తికై ఫలమును ఉద్దేశింపక యుద్ధ మను కర్మము నాచరింపుము." — (*గీతా భాష్యము : 2-18*)

**ఆత్మ నశించు స్వభావము కలది కాకపోవుటచేత, అది నశించు నని తలచుట అవివేక మని, ఆత్మ ఎట్టి సాధనములచేత నశింపజేయబడ**

జాలకని తెలియజేయబడినది. పుట్టుట, పెరుగుట, తరుగుట, విరుగుట మొదలగు దేహ ధర్మములును ఆత్మకు లేవనియు చెప్పబడినది.

> "ఎవడు పూర్వోక్త స్వభావమైన ఆత్మను చంపుటకు దేనినైన సాధనముగా తలచునో, ఎవడు ఏదైన ఒక హేతువుచే ఆత్మ చంపబడెనని తలచునో, వా రిరువురు ఆత్మ నెరుగనివారు. ఉక్త హేతువులచేత ఆత్మ నిత్యమైన దగుటచే, చంపుటకు హేతువు కాదు. కావున, చంపబడదు. సమస్త దేహములందును, అందరికి అనుభూయమానములైన జనన మరణములు ఒకప్పుడును ఆత్మను అంటవు. ప్రజాపతి మొదలగువారి దేహములందలి ఆత్మలు కల్పాదియందు జనించి, కల్పాంతమున నశించుటయును లేదు. కనుక, సర్వదేహగతమైన ఆత్మ జన్మరహితుడు. కనుకనే, నిత్యుడు. పరిణామ శూన్యుడు. పురాతను డయ్యును, క్రొత్తగానే యుండును. కావున, తాను పొందిన దేహము వధింపబడినను నాశనము నొందదు."
>
> — (గీతా భాష్యము : 2-19,20)

ఈ ఆత్మ ఉత్పత్తి లేనివాడని, వినాశము లేనివాడని, స్థిరమైనవాడని, నిత్యుడని ఎవడు తెలిసికొనునో, అతడు దేవ మనుష్య తిర్యక్ స్థావర శరీరములందు గల ఆత్మలలో ఏ ఆత్మను ఎవరిద్వారా చంపింపగలడు? ఏ ఆత్మను ఎట్లు తాను చంపగలడు? అనగా – ఈ ఆత్మలను 'చంపుచున్నాను', 'చంపించుచున్నాను' అని శోకించుటకు కారణము ఆత్మ స్వరూపము యొక్క యాథార్థ్య స్థితిని తెలిసికొనకపోవుటయే అని విశదీకరింపబడినది. మానవుడు జీర్ణములైన వస్త్రములను పరిత్యజించి, నూతన వస్త్రములను గ్రహించునట్లుగ, జీవుడు శిథిలములైన దేహములను వదలి, నవీనములగు ఇతర శరీరములను పొందునని తెలియజేయబడినది. ధర్మ యుద్ధమునందు శరీరమును విడిచినవారికి, విడువబడిన శరీరముకంటె రమణీయములైన శరీరములు లభించునని శాస్త్రము వలన తెలియుచున్నది. కావున, ఈ జీవాత్మ అన్నిటికంటె సూక్ష్మ

మైన దగుటచేత, అంతటను వ్యాపించి యుండుటచేతను, నాశకములైన శస్త్రాదులు దీనిని నశింపజేయజాలవని యు, అట్లు నశింపదగిన యోగ్యత లేనందున, అది (జీవాత్మ) దేనిచేతను నశింపచేయబడదని స్పష్ట మొనర్చబడినది.

"సమస్త తత్త్వములయందు జీవాత్మ వ్యాపించు స్వభావము గలదిగాన, అన్నిటికంటె సూక్ష్మమైన దగుటచేత దీనిని ఆయుధములు ఖండింప జాలవు. ఉదకములు తడుపజాలవు. అగ్ని దహింపజాలదు. వాయువు శోషింపజేయజాలదు, ఇతడు (ఈ జీవాత్మ) నిత్యుడు, సర్వవ్యాపి, స్థిర స్వభావము కలవాడు, చలింపనివాడు, పురాతనుడు కాన, ఈ ఆత్మను ఛేదించుటకును, దహించుటకును, తడుపుటకును, ఎండించుటకును శక్యము కాదు." —(గీతా భాష్యము : 2-23-24)

ఈ విధముగా ఈ ఆత్మ (జీవాత్మ) ఇతర వస్తువులవలె జ్ఞానేంద్రియము లకు గోచరుడు కాడని, మనస్సు చేతను గూడ తెలప శక్యుడు కా డనియు, కర్మేంద్రియములచేత ఏ వికారమును బొందింప రానివాడ నియు వివరింపబడినది.

శరీరముకంటె భిన్నమైనది, ఆశ్చర్యస్వరూపమై యొప్పునట్టి ఆత్మను చూచినవాడుగాని, చూచి చెప్పినవాడగాని, చెప్పగా వినిన వాడుగాని, విని తెలిసికొనినవాడుగాని ఒక్కడును లేడని తెలియజెప్ప బడినది.

"ఇట్టి స్వభావముగల జీవుడు తనకంటె వేరైన సమస్త వస్తువులకు సజా తీయుడు, విజాతీయుడు కాకుండుటచేత ఆశ్చర్యమువలె (అద్భుత వస్తువు వలె) నున్నాడు. ఇట్టి జీవుని పాపములు క్షీణించి, పుణ్యము వృద్ధి నొందిన ఒకానొకడు కనుగొనుచున్నాడు. అట్టి ఒకానొకడు వే రొకనికి చెప్పుచున్నాడు. అట్లు ఎవడో ఒకడు వినుచున్నాడు అట్లు

విన్నను దానిని ఉన్న రూపమున తెలిసికొనువాఁడొకడును లేడు. ఇట్లు చూచినవారిలోను, చెప్పినవారిలోను, వినినవారిలోను, ఎవడును దానిని ఉన్న దున్నట్లుగ చూచుట, చెప్పుట, వినుట దుర్లభము. దేవతలు మొదలగు సమస్త జంతువుల దేహములు చంపబడుచున్నను, ఆ దేహములలో విడివిడిగా నున్న ఆత్మ ఎప్పుడును చంపబడదని తలపవలయును దేవతలు మొదలుకొని, స్థావరములవరకు గల సర్వ భూతములును,ఆకారములందు వేరు వేరుగా నున్నను, అందలి ఆత్మ లన్నియు స్వరూప స్వభావములందు సమానములుగాను, నిత్యములుగాను ఉన్నవి విషయములుగాను, అనిత్యములుగా నుండునవి దేహములే" - (గీతా భాష్యము 2.29 30)

శ్రీభాష్యకారులు భగవానుడానతిచ్చియుంచిన ఆత్మయొక్క స్వాభావిక స్వరూపములను కూర్చి ఈ విధముగ విపులీకరించియున్నారు -

"కర్మపరతంత్రుడుగాక, స్వాభావికమగు స్వరూపముతోనుండు ఆత్మ - దేవ తిర్య ఙ్మనుష్య స్థావరాది రూపముగా ప్రకృతి సంసర్గము కలిగి వర్తించెడి యీ లోకమునకు, ఇందలి దేవ మనుష్య స్థావరాదులకు గల ఆ యా కర్తృత్వమునుగాని, ఆ యా కర్మములనుగాని, ఆ యా కర్మల వలన గలిగెడి దేవాది ఫలసంబంధములను గాని కలుగజేయుటలేదు. అయినను మ రెవడు కలుగజేయు ననిన, ప్రకృతివాసనయే యీ కర్తృత్వాదికము నంతయు కలిగించుచున్నది అనాదికాల ప్రవృత్త మగునట్టి పూర్వ పూర్వ కర్మమువలన ఆత్మకు దేవా ద్యాకారమై, ప్రకృతితో సంసర్గము కలుగుచున్నది ప్రకృతి సంసర్గమువలన ఆత్మయు ప్రకృతిగానే గ్రహింపబడుచున్నది అనగా - ప్రకృతి పరిణామములగు దేవాది దేహములే ఆత్మ యనెడు భ్రమ కలుగుచున్నది. యీ విధముగ దేహాకారమైన ప్రకృతియే ఆత్మ అనెడి అభిమానము కలుగుచుండగా, దాని వలన జనించు వాసనచేత ప్రకృతి కార్యములైన ఇట్టి కర్తృత్వాదులు అన్నియు ఆత్మవిగా తోచుచున్నవిగాని, ఆత్మకు స్వరూప సిద్ధముగా కాదని అర్థము."

— (గీతా భాష్యము-5-14)

ఆత్మకు అనుకూల ప్రతికూలాదులు లేవని, ఈ సంబంధిత్వ ప్రతికూలత్వాదు లన్నియు వాసన వలన కలుగుచున్నవని ఇట్టి ఆత్మకు ఈ విధమైన విపరీత వాసన కలుగుటకు ప్రసక్తారము కలుగుటకు జ్ఞాన విరోధమైన పూర్వ పూర్వ కర్మలు, ఆత్మను తమ ఫలములను అనుభవించుటకు తగిన వానిగా జేయుటకు, ఆత్మయొక్క జ్ఞానమును సంకోచింపజేయుచున్నవని, అందువలన ఆ ఆత్మలు జంతువు లగుటయేకాక, ఆత్మాభిమాన రూపమైన మోహము గూడ చెందుచున్నవని వివరింపబడినది

"ఆ యా కర్మముల కనుగుణ్యముగ సమస్త దేహములందు ప్రవేశించుటకు యోగ్యత గల ఆత్మ ఒకచోట నుండువాడు కాడు దేవాది దేహములు వానిదే యగు చోటు గాదు. అందువలన, అతడు ఎవరికి సంబంధుడుగాని, ప్రతికూలుడుగాని కాడు. తనకు సంబంధించిన పుత్రుడు మొదలగు ప్రియమైనవాని దగు నెవనిదైన దుఃఖమును తొలగించడు. తనకు ప్రతికూలుడైనవాని నెవని సుఖమును పోగొట్టడు. ఈ సంబంధిత్వ ప్రతికూలాదు లన్నియు, వాసనచేత కల్పింపబడినవి. ఇట్టి స్వభావము కల ఆత్మకు యీ విపరీత వాసన కలుగుటకు కారణ మేమి ? జ్ఞాన విరోధులగు పూర్వ పూర్వ కర్మములు తమ ఫలములను అనుభవించుటకు తగినవానినిగా జేయుటకై, వీనియొక్క జ్ఞానమును సంకోచింపజేయు చున్నవి. ఆ జ్ఞానావరణరూపమైన కర్మముచేత, దేవాది దేహములతో గూడిన ప్రాణులకు ఆ యా దేహములందు ఆత్మాభిమాన రూపమైన మోహముగూడ కలుగుచున్నది అందువలన, అట్టి ఆత్మాభిమాన వాసనయు, దానికి తగిన కర్మవాసనయును కలుగుచున్నది ఈ ద్వివిధమైన వాసన వలన విపరీతమగు ఆత్మాభిమానమును కర్మముల నారంభించుటయు కలుగుచున్నది"

— (గీతా భాష్యము 5-15)

భగవంతుడు శుద్ధాత్మ స్వరూపమును గూర్చి వేరొక సందర్భమున విమర్శించి చెప్పియున్నాడు. శ్రీ భాష్యకారులు లా విశేషమును

శరామర్శించి వ్యాఖ్యానించి చెప్పిన తీరుతెన్నులు హృద్యాశవద్యములై యున్నవి :-

" అమానిత్వాది సాధనములచేత పొందదగిన ప్రత్యగాత్మ స్వరూపమును జెప్పెదను దానిని తెలిసికొని, ప్రాకృతములైన జన్మ జరా మరణాది రహితమైన, ఆత్మస్వరూపమును బొందుదువు. అది లేనట్టిది. అనాది. యీ ప్రత్యగాత్మకు ఉత్పత్తి ఉండదు. కావున, అంతమును ఉండదు. ఇందులకు - 'స జాయతే మ్రియతే వా విపశ్చిత్' (కఠ. 2-18) అని శ్రుతియును. అది మత్పరము. అనగా - నేను దానికి పరుడను (శేషిని). అది నాకు శేషభూతము. - 'ఇత స్త్వంన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం జీవ భూతామ్' (7-5) అనికదా చెప్పబడినది. ఆత్మస్వరూపము భగవంతునికి శరీర మగుటచే, భగవచ్ఛేషత్రైకరసముగదా ! ఆ విధముగానే శ్రుతి - "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరోయమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి' (బృ. 5-7-22) అనియు, అట్లే, 'స కారణం కరుణాధిపాధిపో న చాన్య కశ్చి జ్జనితా నచాధిపః' (శ్వే. 6-19) 'ప్రధాన క్షేత్రజ్ఞ పతి ర్గుణేశః' (శ్వే. 6-16) అనియును ఇత్యాది శ్రుతులు. అది బ్రహ్మము - బృహత్త్వ గుణములో గూడినది - శరీరముకంటె వేరైన పదార్థము అనగా, శరీరాదులచే పరిమితి లేకుండునట్టి క్షేత్రజ్ఞ తత్త్వ మని అర్థము. 'సచానన్త్యాయ కల్పతే' (శ్వే. 5-9) అని శ్రుతియు చెప్పునుగదా ! శరీరముచే పరిచ్ఛిన్నమై యుండుట దీనికి కర్మమువలన గలిగినది. కర్మబంధమునుండి విడివడిన పిదప, అనంత్యము (పరిచ్ఛేదము లేకుండుట) కలుగుచున్నది. ఆత్మ యను అర్థమునందును బ్రహ్మ శబ్దము 'స గుణాన్ సమతీ త్యైతాన్ బ్రహ్మ భూయాయ కల్పతే' (భ. గీ. 14-29) 'బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృత స్యావ్యయస్య చ' (భ గీ. 14-27) 'బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి' (భ. గీ. 18-54) 'సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్' (భ. గీ 18-54) అని ప్రయోగింపబడి

యున్నప్పు కార్య కారణము లనెడి రెం డవస్థలు లేకుండుటచే ఆత్మ
స్వరూపము 'సత్' 'అసత్' అను శబ్దములచే చెప్పబడదు. ఎందుచేత
ననగా - కార్యావస్థయందు దేవాది నామరూపములను బొందుటచేత 'సత్'
అని చెప్పబడినది అందులకు అనర్హ మగుటచే, కారణావస్థయందు 'అసత్'
అని చెప్పబడుచున్నది ఈ విధముగా అస ద్వా ఇద మగ్రఆసీత్' తతో
వై సదజాయత. (అ-7-1) 'త ద్ధేదం తర్హ్యావ్యాకృత మాసీత్, త న్నామ
రూపాభ్యాం వ్యాక్రియతే' (బృ. 3-4-7) ఇత్యాది శ్రుతులు. చెప్పు
చున్నవి. ఆత్మకు కార్య కారణావస్థలు రెండును కర్మరూపమైన అవిద్య
చుట్టుకొనుటచే కలిగినదికాని, స్వరూపముచేత కాదు. కావున, సదసచ్ఛబ్ద
ములచే ఆత్మస్వరూపము చెప్పబడదు. అయినప్పటికిని, 'అసద్వా ఇద
మగ్ర ఆసీత్' అని, కారణావస్థయందు యగు పరబ్రహ్మము చెప్పబడు
చున్నను, నామరూప విభాగమునకు దగని సూక్ష్మ చిదచిద్వస్తు శరీరము
గల పరబ్రహ్మ కారణావస్థమైనది కావున, కారవస్థయందు క్షేత్రక్షేత్రజ్ఞ
స్వరూపముగూడ అసచ్ఛబ్దముచేత చెప్పదగియున్నది. క్షేత్రజ్ఞున కా
అవస్థ కర్మకృతము కావున, వాని పరిశుద్ధ స్వరూపము 'సత్' 'అసత్'
శబ్దములచే నిర్దేశింపదగదు." — (గీతా భాష్యము - 13 - 12)

ఇచ్చట ఆత్మనుగూర్చి 'అనాది' అను పదమునకు 'ఉత్పత్తి లేనిది'
అని చెప్పుటద్వారా 'అంతమును లేనిది' అని గ్రహింపవలయు నని,
'మత్పరమ్' అనగా 'భగవంతుడే ముఖ్యునిగా' గలది - భగవంతు
నికే శేషమైనది - భగవంతుడే దానికి శేషి - అని వివరించుచు, భగ
వంతుని శరీరమై యొప్పుచున్నందున, భగవచ్ఛేషతైకరసమని విశదీక
రింపబడినది ఆత్మ బ్రహ్మము - అనునప్పుడు అది బృహత్త్వ గుణ
ముతో గూడినది - వృద్ధి బొందునది. శరీరమునకంటె వేరైన పదా
ర్థమైనందున, శరీర పరిమితి దీని పరిమితి కా దని, ఇది జ్ఞానము ధర్మ
ముగా గల దని వివరింపబడినది. కొంచెమైన దీపమునుండి వెలువడిన
కాంతి అంతట వ్యాపించునట్లు, ఆత్మ అణువైనను, కాంతివంటిదైన

జ్ఞానము ద్వారా సర్వవ్యాప్తి గలదని, అందువలన, స్వరూపముచే కాకపోయినను, ధర్మభూత జ్ఞానముచే బృహత్త్వగుణయుక్తమై, బ్రహ్మ మనబడిన దని స్పష్టీకరింపబడినది. 'సత్' అనగా - ఉండున దని, 'అసత్' అనగా - లేని దని అర్థము చెప్పి, కార్యావస్థయందు నామ రూపముల నొంది గోచరముగ వర్తించుటచే అది 'సత్' అనబడు చున్న దని, కారణావస్థయందు నామరూపములు లేక, ఉండియు లేని దానివలె వర్తించుటచే 'అసత్' అనబడుచున్న దని చెప్పి చెప్పబడినది. అందువలన, ఆత్మకు కర్మ మను అవిద్య చుట్టుకొనుటచేత, ఈ కార్య కారణావస్థలు రెండింటితో సంబంధము కలుగుచున్నది కాని, స్వరూ పమువలన కాదని, స్వరూపమున దానికీ రెండవస్థలు లేకపోవుటచేత, శుద్ధాత్మ స్వరూపమునకు 'సత్' 'అసత్' అను శబ్దములు ప్రయో గింపరాదని తెలియజేయబడినది. ఇట్టి శుద్ధాత్మ స్వరూపము పృథి వ్యాది భూతముల సంబంధమును వదలి, అశరీరమై (ఆ భూతములచే నైన శరీరము లేనిదై) భూతముల వెలుపల వర్తించునని చెప్పబడినది. 'జక్షత్ క్రీడన్ రమమాణః స్త్రీభి ర్యానైర్వా' (ఛా. 8-12-3) మొదలగు శ్రుతుల ననుసరించి స్వచ్ఛందముగా జక్షణాదులు చేయ గోరినపుడు, ఆ యా భూతములలోపల వర్తించుననియు, స్వాభావిక ముగా అది పాణి పాదములు లేని దగుటచేత, చరింపకుండునని, దేహి యైనప్పుడు చరించున దగునని వివరింపబడినది.

ఇట్లు సర్వశక్తియుతము, సర్వజ్ఞమునైన ఆత్మతత్త్వము ఈ శరీరము నందు వర్తించుచున్నను, అది మిక్కిలి సూక్ష్మ మగుటచేత, దేహముకంటె విలక్షణమైయుండునట్టిదిగా సంసారులకు తెలియరానట్టి దనియును వివరింపబడినది. దేవ మనుష్యాది సమస్త భూతములందు ఆత్మ ఏకరీతిగా నున్న దే కాని, వివిధాకారములతో నుండునట్టిది కాదని యును విశదీకరింపబడి యున్నది.

## గీతా భాష్యము - జ్ఞాన యోగము

చేతనుడు ఆత్మస్వరూపమును పరిపూర్ణముగ దెలిసికొని, వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి వేదములలో నిర్దేశించి చెప్పబడిన నిత్యనైమిత్తికాది కర్మలను, ఫలాపేక్ష రహితముగ, తనను కేవలము నిమిత్తమాత్రుడుగ దలచి, నిశ్చల మనస్సుతో, పరమేశ్వరారాధన బుద్ధితో ఆచరించుట కర్మయోగమని చెప్పబడినది. ఈ కర్మయోగము 'కర్మాంశము' - 'జ్ఞానాంశము' అని రెండు విభాగములలో కూడియుండినందున, ఇందును కర్మ భాగమునకంటె జ్ఞానభాగము ముఖ్యమైన దగుటచేత, పరమాత్ముడా విశేషమునుగూర్చి విస్తరించి చెప్పియున్నాడు.

ఆత్మ ప్రకృతికంటె వేరైనది; నిత్యమైనది. ఆనందరూపమైనది; అట్టి ఆత్మకు సాంసారిక కర్మలయందు ప్రవృత్తి, పూర్వకర్మ వలన గలిగిన శరీర సంబంధముచే సంక్రమించినదేగాని, సహజమైనట్టిది కాదు. అయిన నది తొలగింపరానిదైనందున ఆత్మ, తానాచరించు వేదోక్తములైన వర్ణాశ్రమ ధర్మములు, భగవదారాధన కొఱకే తప్ప, తన కొరకై ఫలము నొందించుకొనుట కాచరింపబడినట్టివి కావని, భగవదారాధన రూపమున తన కవి తప్పక ఆచరింపదగిన వను జ్ఞానములో చేయు కర్మలు. తనకు బంధహేతువులు కాక, నిరతిశయ పురుషార్థమునకు కుపకరణము లగు నని తెలియజేయబడినది. భగవంతుడు ప్రబోధించిన అట్టి జ్ఞానాకార కర్మవిశేషాంశములను శ్రీభాష్యకారులు తమ గీతా భాష్యమున విశదపరచి సాయించి యున్నారు.

భగవంతుడు తనకు భక్తుడును, సఖుడును, తనయెడ ప్రపన్నుడునునైన అర్జునునకు, తన అవతారముల స్వభావమునుగూర్చి ప్రత్యేకముగ దేవ మనుష్యాదులు కర్మవశమున నెత్తు జన్మల వంటివి జన్మలు

తా నెత్తుట ఇంద్రజాలమా ? మిథ్యయా ? లేక సత్యమా ? సత్యమే యైన యెడల జన్మించెడి ప్రకార మెట్టిది ? జనించు దేహము దేని మయము ? జన్మించుటకు కారణ మేమి ? ఎప్పు డెప్పుడు జన్మించును ? అను విషయములను వివరించియున్నాడు.

"అర్జునా! నీకు వలెనే నాకు అనేక జన్మలు గడిచిపోయినవి సర్వజ్ఞుడ నైన నేను మన ఇద్దరి జన్మల నన్నింటిని ఎఱుగుదును. కర్మవశమున జ్ఞానసంకోచము నీవు ఎఱుగవు.'

అని చెప్పియుండుటచేత, భగవంతుడు తన జన్మలు సత్యములే యని, మిథ్యలు కావని తెలియజేసినట్లైనది. మఱియును, అజత్వము, అవ్యయత్వము, సర్వేశ్వరత్వము మొదలగు తన పరమేశ్వరత్వ విశేషణము లన్నిటిని వదలక, తనదైన ప్రకృతిని అధిష్ఠించి, తన మాయ చేతనే పుట్టుచున్నానని విశదీకరించుటచేత, కర్మకృతమైన జనన మరణములు లేనివాడై, సమస్త భూతముల నియమించువాడై, తన పరమేశ్వర స్వభావమును వదలక, తన దివ్య సంకల్పముతో, తన దివ్య స్వభావముతో, దేవాది రూపములతో జన్మించుచున్నట్లును తెలియజేసి యున్నందున, భగవదవతార ప్రకారము, దేహ యాథాత్మ్యము, జన్మహేతువును జెప్పబడినవి.

"ప్రకృతి అనగా స్వభావము. నా స్వభావమునే యధిష్ఠించి - అనగా, నా రూపముచేతనే (స్వేచ్ఛగా) నా ఇచ్ఛానుసారముగా జన్మించుచున్నానని అర్థము. తన స్వరూపము 'ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్' (పు) 'క్షయన్త మస్య రజసః పరాకే (తై. సం 2-2-12-5) య ఏషోऽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః (ఛా.1-6-6) తస్మిన్నయం పురుషో మనోమయః అమృతో హిరణ్మయః, (శీక్షా.. 6-1) సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి' (నా. 6-1-8) భారూప స్సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామ స్సర్వగన్ధ స్సర్వరసః (ఛాం. 3-14-2) మహా

రజనం వాసః (వృ 4-3-6) ఇత్యాది శ్రుతులవలన సిద్ధము. 'ఆత్మ మాయయా' అనగా - ఆత్మీయమైన మాయచేత, (ఇచట మాయా శబ్దము 'మాయా వయునం జ్ఞానమ్' అని జ్ఞానార్థకము ) ఇట్లే, అభియుక్త ప్రయోగములును, 'మాయయా సతతం వేత్తి ప్రాణినాం చ శుభాశుభమ్' అని మాయా శబ్దము జ్ఞాన మను నర్థమున బ్రయోగింపబడి యున్నందున, తన జ్ఞానముచేత - సంకల్పము చేత నని అర్థము కావున, అపహత పాప్మత్వాది సమస్త కల్యాణగుణాత్మకమైన, ఈశ్వర సంబంధి యగు సమస్తమైన స్వభావమును విడువక, నా రూపమునే, ఆ యా దేవ మనుష్యాది జాతులకు సజాతీయమైన సంస్థానమును గావించుకొనుచు, నా సంకల్పముతో దేవాది రూపములలో సంభవించు చున్నానని అర్థము. దీనినె 'అజాయమానో బహుధా విజాయతే' (ఉ.నా) అని శ్రుతి చెప్పుచున్నది. అనగా, ఇతరులకు సాధారణముగా కర్మముచేత కలుగు జన్మము నొందక, తన సంకల్పముచేత దేవాది రూపములతో పూర్వోక్త ప్రకారముగా బుట్టుచున్నానని అర్థము " — (గీతాభాష్యము : 4-6)

పరస్వరూపమునకే కాక, అవతారములందును భగవంతుని విగ్రహము పంచభూతములచేనైనది కాదని, త్రిగుణాత్మకమైన ప్రకృతిచే గలిగినపదియును గాదని, అందువలన నిట 'ప్రకృతి' యనగా, అవతారమున కుపయుక్తమైన వేరొక ప్రకృతి యని, ఆ 'ప్రకృతి' అను పదమునకు స్వభావ మని, స్వభావ మనగా, నిట స్వభావమువలె అసాధారణ విశేషమమై యుండు విగ్రహమే గ్రాహ్య మని - అందువలననే, 'నా రూపముచేతనే' అని తన విగ్రహము చెప్ప బడె నని తెలియజేయబడినది. అంతేకాక, సంభవా మ్యాత్మ మాయయా' అను వాక్యమునకు 'ఆత్మీయమైన మాయచేత – నా జ్ఞానముచేత – 'నా' సంకల్పముచేత జనించుచున్నాను.' అను అర్థము వివరింపబడినది. 'ప్రకృతి' శబ్దముచే అవతారమునకైన దివ్య విగ్రహమే గ్రహింపబడవలసినదని దని చెప్పుటకు ప్రోద్బలకముగా శ్రీ భాష్యకారులు తమస్సునకు (ప్రకృతికి) అవతల, సూర్యవర్ణము గలవాడు, రజస్సునకంటె (రజోగుణమైన మూలప్రకృతికంటె) అవతల, సూర్యవర్ణ

మండలమునకు లోపల వర్తించువాడు, బంగారు వర్ణము గలవాడగు
పురుషుడు కనబడుచున్నాడు. అదు (హృదయమునందు) శుద్ధమైన
మనస్సుచేత గ్రహింపదగినవాడును, మృత్యువు లేనివాడును, హిర
ణ్మయుడగు నీ పురుషుడు, అనిమేషులగు దేవతలందరును (నిమేషు
లగు మనుష్యాది జీవులందరు) మెఱుపువన్నె గల పురుషుని నుండి
జనించిరి. భాస్వర రూపుడు (అప్రాకృత నిరతిశయ కల్యాణ రూపుడు),
సత్య సంకల్పుడు (అప్రతిహత సంకల్పము గలవాడు) సమస్తమునకు,
కారణభూతమగు ఆకాశమునకు ఆత్మభూతమైనవాడు, సమస్త కర్మ
లును తనవియైనవాడు, పరిశుద్ధములగు సర్వవిధ భోగ్య భోగోప
కరణాది కాంక్షిత పదార్థములు గలవాడు, అప్రాకృతములు, తనకు
భోగ్యములైన సర్వవిధ గంధ రసములు గలవాడు, 'అతని వస్త్రము
కుసుంభ రాగము గలది' ఇత్యాది శ్రుతివాక్యములచేత పరమపురు
షుని విలక్షణ స్థానమును, వర్ణ విశేషమును, పురుషశబ్ద వాచ్యత్వ
మును విశదీకరించి యున్నారు.

ఎప్పుడెప్పుడు వేదోక్తమగు వర్ణాశ్రమ వ్యవస్థా రూపము
గను, కర్తవ్యముగను నుండునట్టి ధర్మమునకు హానియు, అధర్మమునకు
వృద్ధియు కలుగునో, అప్పుడప్పుడు భగవంతుడు తన సంకల్పముచేత
తానే అవతారమెత్తుచుండునని, అట్లు అవతారమెత్తుటకు ప్రయో
జనము శిష్టరక్షణ - దుష్టశిక్షణ అని తెలియజేయబడినది. వేదోక్త
మైనట్టియు, వర్ణాశ్రమ వ్యవస్థారూపమైనట్టియు, ధర్మానుష్ఠానశీలు
రగు వైష్ణవోత్తములు, భగవంతునాశ్రయింపబూనిన సాధువులు
భగవన్నామ కర్మ స్వరూపములు, తపో జ్ఞానములందు అంద
నివిగా నుండ, భగవద్దర్శనముచే తప్ప, వేరు మార్గముల తమ ధారణ
పోషణాదులను నిర్వహింపలేక, భగవంతుని క్షణమాత్రకాలపు ఎడ
బాటును కల్పసహస్రముగా దలచి, దుఃఖముచేత శిథిలమైన శరీరములు
గలవారగుదురని యెంచి, భగవంతుడు అట్టివారికి తన స్వరూప



చేష్టితావళులతో నాలాపాదుల నొనర్చి రక్షించుటకు, అట్టివారు కాని దుష్టులకు శిక్షించుచును, తన ఆరాధన రూపమైన వైదిక ధర్మము క్షీణింపగా, ఆరాధింపదగిన తన స్వరూపమును జూపుటచే తిరిగి ఆ ధర్మమును చక్కగ స్థాపించుటకై, దేవ మనుష్యాది రూపములతో నే యుగమందైనను అవతరించుచుండును అని తెలియజెప్పబడినది.

భగవదవతార విషయ పరిజ్ఞానమువలన నెట్టి ఫలితము గలుగునో ఇట్లు చెప్పబడినది. దానిని శ్రీభాష్యకారు లిట్లు వివరించి యున్నారు:—

> "కర్మమూలమై, హేయమై, త్రిగుణాత్మకమై యుండు ప్రకృతిజన్మరహితుడనైన నా సర్వేశత్వ, సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వాది సమస్త కల్యాణ గుణోపేతుడనైన నాకు సాధు రక్షణయు, వారు నన్నాశ్రయించుటయే ప్రయోజనము అప్రాకృతమైన, అసాధారణమైన, జన్మచేష్టితములను సంశయ, విపర్యయ రహితముగ నెవ్వ డెరుగుచున్నాడో, వాడు వర్తించుచున్న దేహమును పరిత్యజించి, పునర్జన్మ నొందడు. నన్నే పొందును" — (గీతా భాష్యము . 4-9)

ఈ విధమైన భగవంతుని దివ్య జన్మ చేష్టితముల నెఱుగుట అసాధారణ విశేషము. జీవుడు వర్తమాన దేహమును త్యజించి, మరల జన్మ నొందకుండుటకు కారణభూతమైన దివ్య జన్మ చేష్టితముల యాథాత్మ్య జ్ఞాన మవసరము, ఆ యాథాత్మ్య జ్ఞానముచే భగవంతు నాశ్రయించుటకు విరోధులైన సమస్త పాపముల పోగొట్టుకొనుట, భగవత్ప్రీతికరమైనవి, భక్తిరూపాపన్నములైన ధ్యానోపాసనల ద్వారా మాత్రమే సాధ్యమగునని స్పష్టముగ తెలియజేయుచున్నది.

> "నాదైన దివ్య జన్మ చేష్టితముల యాథాత్మ్య విజ్ఞానముచేత, నన్నాశ్రయించుటకు విరోధులైన సమస్త పాపములను, ఈ జన్మముననే పోగొట్టుకొని, నేను పూర్వము చెప్పిన ప్రకారముగ నన్నాశ్రయించి, నన్నే ప్రియునిగా గలిగి, నాయందే మనస్సు నుంచి, నన్నే పొందుచున్నాడు."
>
> (గీతా భాష్యము . 4-9)

భగవంతుడు తనను ఆశ్రయించుటకు విరోధులగు సాధనములను పోగొట్టు కొనవలయునని చెప్పియుండుటచేత, జీవుడు మొదట తనకు కలుగు అనురాగము, భయము, క్రోధములను పోగొట్టుకొనవలయునని విదిత మొనర్పబడినది. విషయాంతరములందు ప్రీతి అనురాగమని, అట్టి అనురాగమునకు వ్యాఘాతము కలిగించువారిని నిరసింపవలయునను కోరిక క్రోధమని, రాబోవు ఇష్టమునకు విరోధినిగాని అనిష్టముయొక్క రాకను ఉత్ప్రేక్షించుట భయమని చెప్పబడినది. ఇవన్నియు భగవ ద్భక్తులగువారికి కలుగవని, వారు విషయాంతరములందు ప్రీతిని వదలి, భయము మాని, ప్రీతికి విరోధవర్తనులైనవారియందు క్రోధము లేక, భగవంతునాశ్రయించి భగవంతునిదే తమ చిత్తమును నిలిపి భగవంతుని స్వభావమైన అపహతపాప్మత్వాదుల బొందుదురని, వివ రింపబడినది. భగవంతుడు దేవ మనుష్యాది రూపములలో అవతరిం, చియే తన నాశ్రయింపగోరినవారిని రక్షించుననుట నియమము లేదని వారు తమ తమ కోరికల ననుసరించి పతి, పితృ, పుత్ర, మిత్ర, భృత్యాది రూపముగా గాని, ఆలయ, గృహ, కుటీర, కుటుంబము లందు వేంచేసియుండు మరియే అర్చావతార రూపమున గాని, ఏ విధముగా సంకల్పించుకొని ఆశ్రయింతురో, వారి వారికి ఆయా రూపములలోనే తాను దర్శన మొసగుదునని తెలియజేసియున్నాడు. అంతే కాక, తన విగ్రహ చేష్టా సౌశీల్యాది స్వభావ మంతయు యోగుల వాఙ్మనస్సులకును గోచరించునది కానప్పటికిని, తన నను వర్తించుటయే కోరికగా గల మనుష్యుల దరును సామాన్యములైన తమ చక్షురాదీంద్రియముల చేతనే, అనగా, తాము కోరినట్లు అలంకరించియో, ఊరేగించియో, ఉత్సవములు గావించియో, సేవిం చియో దాని ననుభవించువారై వర్తింతురని వివరింపబడినది.

భగవంతుడు కర్మయోగము జ్ఞానాకారమును బొందు విధమును చెప్పఁదలచి, జ్ఞానరూపమగు కర్మయోగమున కధికారి దుర్లభ మని చెప్పియున్నాడు.

"ఈ లోకమునందలి పురుషు లందరును అనాది కాలముగా ప్రవర్తించు చుండు తమ అనంత పాప సంచయము నశించకుండుటచేత అవివేకులై, శీఘ్ర ఫలమును గోరుచు, పుత్ర పశ్వన్నాదుల కొఱకు, స్వర్గాది ఫలము కొఱకును, యాగ దాన హోమాది సమస్త కర్మలను ఇంద్రాది దేవతలకు మాత్రమే ఆరాధనములుగా చేయుదురుగాని, ఒక్కడైనను సంసారము నందు ఉద్విగ్న హృదయము గలిగి, మోక్షార్థియై, పూర్వోక్త లక్షణము గల కర్మయోగమున న న్నారాధింపడు"

— (గీతా భాష్యము 4-12

ఈ మనుష్య లోకమునందు కర్మఫలము శీఘ్రముగా సిద్ధించునది కావున, మనుష్యులు పుత్రాదుల గోరి, యాగ దాన హోమాది కర్మలచే ఇంద్రాది దేవతల నారాధింతురే తప్ప, సంసారము నసహ్యించు కొని మోక్షాపేక్షతో కర్మల నాచరింపరు. అనగా, ఫలసంగరహిత బుద్ధితో సమస్త కర్మలను ఆ దేవతల కంతరాత్మయై విలసిల్లు భగవంతుని ఆరాధించుట నసుష్ఠింపరని విదిత మొనర్పబడినది. చాతుర్వర్ణ్య ప్రముఖమైనట్టిది, బ్రహ్మాది స్తంభ పర్యంతమైన సమస్త జగత్తు సత్త్వాది గుణ విభాగముచేత, తదనుగుణమైన శమదమాది వ్యాపారముల విభాగము ననుసరించియు, భగవంతునిచే సృజింపబడుచున్న దనియు, సంహరింపబడుచున్నదనియు, ఆ విచిత్రసృష్టి మొదలగు వానికి భగవంతుడే కర్త యైనను, తనను కర్త గానివానిగా గ్రహింప భగవంతుడు నిర్దేశించియున్నాడు. శ్రీభాష్యకారు లీ విశేషమును విశదీకరించుచు —

"ఈ విచిత్ర సృష్ట్యాది కర్మలు నన్ను బంధింపవు. దేవ మనుష్యాది రూపమైన సృష్టి వైచిత్ర్యము వారి వారి పుణ్య పాప రూప కర్మ విశేషములను బట్టి వచ్చినది. కాని, నావలన వచ్చినది కాదు. కావున, ప్రాప్తాప్రాప్త వివేకము చేయగ, ఈ విచిత్ర సృష్ట్యాదులకు నేను కర్తను గాను మరియును, సృష్టికి పూర్వము జీవులు కరణ కళేబరములు (దేహేంద్రియములు) లేకపోవుటచేత, దేనిని భోగించు (అనుభవించు) శక్తి లేనివారై యుండగ, సృష్టివలన కరణ కళేబరములును, దానివలన భోగించు శక్తియు, (భోక్తృత్వము) భోగ్య (భోగింప దగిన) వస్తువులు కలిగెను. ఈ విధముగ భోక్తలైన జీవులు వాని ననుభవింతురు. వారిట్లనుభవించుట ఫలసంగాదులకు హేతువులైన వారి వారి కర్మల ననుసరించియేకాని, కేవలము నా సంకల్పము ననుసరించి కాదు కావున, సృష్ట్యాది కర్మల ఫలమందును, పుణ్యపాప కర్మఫలములందును వారికే రక్తిగాని, నాకు రక్తి లేదు. ఇట్లే, సూత్రకారులును-'వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్' (2-1-34) అనుటవలన, అందరిని సమానముగా సృజింపక, దేవత లనియు, మనుష్య లనియు, విషమముగ సృజించుటవలన ఈశ్వరునికి పక్షపాత దోషమును, దానిచే దయ లేకుండుట యను దోషము కలుగగా, ఈశ్వరుడు వారి వారి పుణ్యపాప కర్మల నపేక్షించి, దాని సహాయముచేతనే విషమ సృష్ట్యాదులను జేయునుగాని, తనంతట జేయదని, అందువలన ఆయన కా దోషములు కలుగవని చెప్పియున్నారు. ఇట్లే, భగవంతుడగు పరాశరులును, 'నిమిత్తమాత్ర మేవాయం సృజానాం సర్గ కర్మణి। ప్రధాన కారణీ భూతా యతో వై సృజ్య శక్తయః॥ నిమిత్త మాత్రం ముక్త్వేదం నాన్య త్కించి దపేక్షతే। నీయతే తపతాం శ్రేష్ఠ స్వశక్త్యా వస్తు వస్తుతామ్॥ (వి.పు. 1-4-51,52) అనగా, సృజ్యు లయిన దేవాది క్షేత్రజ్ఞుల సృష్టికి ఈ పరమ పురుషుడు కారణము మాత్రమే అగును దేవాది వైచిత్ర్యమునకో, సృజ్యభూతులైన క్షేత్రజ్ఞుల (జీవుల) ప్రాచీన కర్మశక్తులే ప్రధాన కారణ మగును కావున, సృష్టి కర్త యగు పరమ పురుషుని విడిచి, ఈ దేవాది క్షేత్రజ్ఞ వస్తువు, దేవాది విచిత్ర

భావము కొఱకు వేరొక విశేష కారణమును అపేక్షింపడు. స్వగతమైన ప్రాచీన కర్మశక్తి చేతనే దేవాది వస్తు భావమును, ఆ యా రూపమును పొందింపబడుచున్నదని అర్థము ఈ చెప్పబడిన విధముగా, సృష్ట్యాదు లకు కర్తనయ్యును, కర్తకాని వానినిగను, సృష్ట్యాది కర్మఫలసంగము లేనివానినిగాను, ఎవడు నన్నెఱుగుచున్నాడో, వాడు కర్మయోగారంభ మునకు విరోధులును, ఫలసంగాదులకు హేతువులు నగు ప్రాచీన కర్మల నుండి విడివడును."
— (గీతా భాష్యము. 4-14)

సృష్ట్యాది కర్మలు తనకు సంబంధించవని చెప్పిన పరమాత్ముడు, భోక్తలైన జీవులు భోగ్యవస్తువుల ననుభవించుటకు, ఫలసంగాదులకు హేతువులగు వారి వారి కర్మల ననుసరించియే కాని, తాను సృష్టికర్తయైనను, దేవాది విచిత్ర సృష్ట్యాది కర్మలును, వాని భేదములును తన వలన కలుగునవి కానందున తాను కర్త గానని వివరించి యున్నాడని వ్రాయించిరి. ఇక్కడ హేతువు సామాన్యమని - విశేషమని రెండు విధములుగ తెలియజేయబడినది. నానావిధములైన మొలకలకు భూమి, జలము 'సామాన్య హేతువు' లనియు, వాని బీజములు 'విశేష హేతువు' లనియు. ఆ విధముగనే సృష్ట్యాదులకు ఈశ్వరుడు సామాన్య హేతువని, ఆ సృష్ట్యాది వైచిత్ర్యములకు వారి వారి పుణ్యపాప కర్మమే విశేష హేతువనియు విప్పి చెప్పబడినది. సృష్ట్యాదులకు ఈశ్వరుడు సామాన్య హేతువగుటవలన కర్త అయినప్పటికిని, ఆయన విశేష హేతువు కానందున, కర్త కాకయున్నాడని, అందువలన 'కర్తనయ్యు కర్తను కానని' చెప్పియున్నాడని విపులీకరించబడినది.

మోక్షసాధనభూతమగు కర్మస్వరూపమును గూర్చి, దానియందంతర్గతమగు ఆత్మయాథాత్మ్య జ్ఞానమును గూర్చి విద్వాంసులే భ్రమను జెందుచున్నారని, ముముక్షువు అనుష్ఠింపవలసిన కర్మయొక్క ప్రకారము నెఱుగుట కష్టమని తెలిపి, భగవంతుడు కర్మ, అకర్మ, వికర్మల

స్వరూపమునుగూర్చి వివరించియున్నాడు. 'కర్మ' యనగా, మోక్ష సాధనమగు కర్మయోగమని, 'అకర్మ' యనగా - ఆ కర్మయోగమందు అంతర్భూతమై, ప్రధానాంశమైయుండు ఆత్మజ్ఞానమని, 'వికర్మ' యనగా - నిత్యములనియు, నైమిత్తికములనియు, కామ్యములనియు - వానికి సాధనభూతమగు ద్రవ్యార్జన యనియు ఈ విధముగ పెక్కు గీతలందుండు కర్మయని తెలియజేయబడినది. ఈ నిత్య నైమిత్తిక కామ్య ద్రవ్యార్జనాది కర్మలు ఫలభేదమునుబట్టి పెక్కు విధములుగా నున్నను, అవి యన్నియు మోక్షమే ఫలముగా కలిగియుండుటచేత, మోక్షసాధనములే యగునట్టివని, ఒకే అనుసంధానము కలిగియుండ వలయునని వివరింపబడినది. కర్మను, అకర్మను గూర్చి భగవంతు డొసగిన విశేషమును శ్రీభాష్యకారు లిట్లు సాధించియున్నారు :-

> "కర్మము చేయుచుండగానే దానియందు ఆత్మజ్ఞానమును, ఆత్మజ్ఞానము వర్తించుచుండగనే దానియందు కర్మమును ఎవడు చేయుచున్నాడో, (కర్మమును చేయుచున్నప్పుడే అందు ఆత్మయాథాత్మ్యమును అనుసంధించుటచేత దానిని జ్ఞానాకారముగాను, ఆ జ్ఞానము కర్మయోగమందు అంతర్గత మగుటవలన దానిని కర్మాకారముగాను ఎవడు చూచునో) వాడే మనుష్యులందు సర్వశాస్త్రముల నెఱిగినవాడు వాడే మోక్షార్హుడు వాడే సకల శాస్త్రోక్త కర్మల నాచరించువాడు" — (*గీతా భాష్యము 4-18*)

కర్మ కరచరణాదులచే అనుష్ఠింపబడున దని, జ్ఞానము మనస్సుచే అనుసంధింపబడున దని, రెండును ఒకదానితో నొకటి అన్వయింపనందున, వేరు వేరు విధములైన రెండింటిని ఏకకాలమున చూచుట శక్యమా ? అను సంశయమునకు సమాధానముగ - చేయుచున్న కర్మయందు జ్ఞానమును చూచుట అనగా, అకర్మమును చేయుచున్నప్పుడే అందు ఆత్మయాథాత్మ్యమును అనుసంధించుటచేత దానిని జ్ఞానాకారమైన దానినిగా చూచుట అని, అనుసంధింపబడుచున్న జ్ఞానమునందు కర్మను చూచుట అనగా, ఆ జ్ఞానమును వర్తించుచుండునపుడు అది

కర్మయోగమునం దంతర్గతమై యుండుటవలన దానిని కర్మాకార ముగా చూచుట' అని తెలియజేయబడినది. అందువలన, రెండిటిని ఏక కాలమున పొనగుచున్నవి. కేవల కర్మ గాక, ఆత్మజ్ఞానముతో గూడిన కర్మయే ఉపాయముగ విధింపబడి యుండుటవలన, ఒకటికి మరొకటి అపేక్షిత మగుటవలన, ఒకటి అనుష్ఠించినపుడు మరొకటి అపేక్షితము కాకపోదని తెలియజేయబడినది. దీనివలన ఒకదానితో మరొకటి అన్వయించియే యుండునని, ఒక్కడే పోవుట, చూచుట, పలుకుట మొదలగు కర్మ లన్నియును ఏక కాలమున చేయుట కలదు కావున ఒకటి అనుష్ఠించుచుండగా మరొక్కటి చూచుట దుష్కరము కాదని తెలియజెప్పబడినది. అందువలన, కర్మను చేయుచుండగనే దాని కర్త యగు ఆత్మయొక్క స్వరూపమును అనుసంధించుటచే కర్మజ్ఞానములు రెండును సుసంపన్నము లగుచున్నవని వివరింప బడినది.

ప్రత్యక్షముగ చేయబడున్న కర్మలు జ్ఞానాకారము నెట్లు పొందుచున్నవో భగవానుడు విశదీకరించుచు, ఎవడు ఫలసంగ దేహాత్మభ్రమ రహితుడై కర్మలను చేయుచున్నాడో వాడు జ్ఞానాగ్ని కలవాడని చెప్పుటవలన, అట్టి ఫలసంగాది రహిత కర్మమే జ్ఞానాగ్ని కల దగుచున్నదని తెలియుచున్నది. అందువలన, వాడు కర్మాంతర్గతమైన ఆత్మజ్ఞాన మనెడి అగ్నిచే, మోక్షవిరోధులైన ప్రాచీన కర్మలను దహించినవాడని స్పష్టీకరింపబడినది.

> "కర్మఫలసంగమును వదలి, నిత్యుడగు తన ఆత్మయందే తృప్తుడై, అస్థిరప్రకృతియందు ఆశ్రయబుద్ధిరహితుడై, ఎవడు కర్మలను చేయునో, వాడు కర్మలయం దాభిముఖ్యముతో ప్రవర్తించినను ఒక్క కర్మను చేయనివాడే అగును. కర్మానుష్ఠాన వ్యాజముతో జ్ఞానాభ్యాసమునే చేయు వాడని అర్థము."
>
> — (గీతా భాష్యము · 4-20)

"ఫలాభిసంధి లేనివాడై, చిత్తమును - మనస్సును నిగ్రహించినవాడై, ఆత్మయే తనకు ప్రయోజనముగా గలిగి, భోగ్యోపకరణము లగు సమస్త ప్రకృతి ప్రాకృత వస్తువులందు మమత లేనివాడై, యావజ్జీవము శరీర సంబంధమగు కర్మమాత్రము చేయుచుండువాడై, సంసార బంధరూప మగు పాపమును బొందడు. జ్ఞానయోగ సాహాయ్య మవసరము లేక, కేవలము కర్మయోగముచేతనే ఆత్మరూపము నుదర్శించుచున్నాడని అర్థము."
(గీతా భాష్యము. 4-2-1)

"శరీర ధారణమునకు సాధనముగా యత్నము లేక తనంతట లభించిన, వస్తువు ఏ కొంచమైనను వానితో తృప్తిబొందినవాడై, సాధన సమాప్తి వరకు ప్రాసిపచ్చరాని శీతోష్ణ ద్వంద్వములను సహించుచు, తనకు అనిష్టములు గలుగుటకు తన కర్మమే హేతువని తలచుటద్వారా పరుల యందు మాత్సర్యము లేక, యుద్ధాదికర్మలందు జయాదులు సిద్ధించినను, సిద్ధించకున్నను సమ చిత్తత్వము గలిగియుండువాడు కర్మమునే ఆచరించి యున్నను, జ్ఞాననిష్ఠ లేకున్నను సంసారమున బంధింపబడడు."
— (గీతా భాష్యము : 4-21)

ఆత్మజ్ఞానము నెలకొన్న మనస్సుగలవానికి, ఆత్మేతర వస్తువులందాసక్తి లేక, నిఖిల పరిగ్రహములనుండి విడివడి, ఇదివరకు చెప్పబడిన యజ్ఞయాగాది కర్మలనెఱవేర్చుటకు ప్రవర్తించువాడగు పురుషునికి బంధహేతువులగు ప్రాచీనకర్మ లన్నియు నిశ్శేషముగా క్షీణించునని విప్పిచెప్పబడినది.

భగవంతుడు సాక్షాత్కార రూపమైన ఆత్మయాథాత్మ్యసిషయా జ్ఞానముయొక్క లక్షణమును వివరించియున్నాడు. శ్రీభాష్యకారులు దాని నిట్లు స్పష్టీకరించియున్నారు -

"ఆ జ్ఞానమును దెలిసికొని మరల నిట్లు దేవ మనుష్యాది శరీరములు మొదలగు వానినే ఆత్మలుగా భ్రమించునట్టియు, దానివలన మమత మొదలగు వానికి ఆస్పదమైన అజ్ఞానమును నీవు పొందవు దానివలన దేవ మనుష్యా

ద్యాకారములతో అనుసంధింపబడిన సమస్త భూతములను నీయందే చూడ గలవు. అనగా, ప్రకృతిబంధమును వీడి, జ్ఞానైక స్వరూపుడవగు నిన్ను కనుగొనిన పిదప, స్థాలీపులాక న్యాయమున నీవలెనే తక్కిన ఆత్మ లన్నియు జ్ఞానైకాకారములై నను-సమానములై యుండుట కనుగొందువు ప్రకృతి బంధ దోషమువలన ఆత్మ లన్నియు దేవతలని, మనుష్యులని నానాభేదములుగ నున్నాను. అవన్నియు జ్ఞానమే స్వరూపముగా గలిగి యున్నందున ప్రకృతిబంధదోషము తొలగినంతనే అన్నియు జ్ఞానైకాకా రములై యుండును. ప్రకృతి సంసర్గ దోషము వీడిన ఆత్మల రూపము లన్నియును సమానముగానే యుండునని 'నిర్దోషం హి సమం బ్రహ్మ, తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః' (5-11) అని చెప్పబడినది. దేవ మనుష్యా ద్యాకారములతో అనుసంధింపబడు భూతముల నన్నింటిని నాయందే చూచెదవు. పరిశుద్ధములగు ఆత్మ వస్తువు లన్నియు నా స్వరూపమువంటి స్వరూపమునే కలిగియుండును. అందువలన, నన్ను చూడగా తక్కిన ఆత్మస్వరూపము లన్నియును నావలెనే యుండుట కనుగొందువు. ఈ విశేషమే 'ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః' (14-2) అని చెప్పబడుచున్నది. ఈవిధముగనే 'తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్య ముపైతి' (ము.3 - 1 - 31) ఇత్యాదులందు నామరూపములు విడిన ఆత్మవస్తువునకు పరస్వరూపముతో సామ్య ముండుట తెలియుచున్నది కావున, ప్రకృతి వినిర్ముక్తములైన పరిశు ద్ధాత్మ వస్తువులెల్ల పరస్పరము సమానముగాను, సర్వేశ్వరునితోను సమానముగా నుండును" — (గీతా భాష్యము : 4-35)

అందువలన [illegible] నాశనము చేయు ఆత్మజ్ఞానముతో సమానమగు వస్తువు ఈ లోకమున లేదని చెప్పి, గురూపదేశమున జ్ఞానమును పొందినవాడై, ఆ జ్ఞానమును వృద్ధి పొందించుకొనుట యందు శ్రద్ధ గలవాడును, దానియందే నియతమానసుడై తదితర విష యముల నుండి ఇంద్రియములను మరలించుకొన్నవాడై, పూర్వోక్త లక్షణములచేత పరిపక్వ దశను పొందిన పురుషుడు శీఘ్రముగ

జ్ఞానము ను బడయుచున్నాడని తెలియజేయబడినది. అంతే కాక, అట్టి జ్ఞాని శీఘ్రకాలమున పరనిర్వాణమును బొందుచున్నాడని వివరింప బడినది.

## 8. ముగింపు

భాష్యము సిద్ధింపజేయు ప్రయోజన మేమిా ఒక సంస్కృత శ్లోకమున చెప్పబడినది :-

"సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యై స్సూత్రానుకారిభిః ।
స్వపదాని చ వర్ణ్యన్తే భాష్యం భాష్యవిదో విదుః ॥

ఈ నిర్వచనము సూత్ర వ్యాఖ్యానముల కిన వర్తించునదైనను, శ్లోక వ్యాఖ్యానములకును అనువర్తించును భాష్యము మూల విషయము ముఖ్యార్థమును మూలానుసరణమైన పదసంయుతమగు వాక్యవివరణ లతో కలసిల్లుచుండును. అక్కడక్కడ అవసరమగుచోట్ల సందర్భాను గుణ్యమగు పదప్రయోగము వలన విషయ వివరణ భాసించుచుండు నని తాత్పర్యము. శ్రీమద్రామానుజ యతిచంద్రుల భాష్యము - ఈ ఉద్దేశ్యములను సర్వవిధముల నెఱవేర్చుచున్నందున, మిక్కిలి శ్లాఘ్య మైనది. గీతాభాష్యమును పరిశీలించినవారికి ప్రతి శ్లోకములోని ప్రతి పదమును ప్రయోగాత్మకముగా వివరింపబడుటయేకాక, సందర్భము ననుసరించి శ్లోకారము విశేషముగా వివరింపబడినట్లు విదిత మగును. ఈ విధముగా గీతాభాష్యము విశదమై, విఖ్యాతమై, సుసంగతమై, నిరుత్తరమై, పాండిత్య గలదియై విరాజిల్లుచున్నది. అంతే కాక, ఈ గ్రంథము శ్రీమద్రామానుజ యతీంద్రుల ప్రతిభా పాటవమున కొక దృష్టాంతమై యుండి, వారి అశేషజ్ఞాన విశేషమునకు, భగవద్భక్తి పారమ్యతకు, పరిపక్వ ధ్యాన చింతనకు ప్రధాన దర్పణమై, సార్వ కాలికమైన ఉత్తమ ప్రబోధ మొసర్చి సాధకుని సన్మార్గ గామిగా చేయు ఉత్తమ గ్రంథ రాజమై అలరారుచున్నది.

'రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్'

# గీతా రహస్యము

## ( శరణాగతి )

'కవి రత్న – కవి శేఖర – సుధీమణి'

శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

—✿—

ఈ కడ నాలోచింపఁగ
సకలోపాయంబు లందు శరణాగతియే
సుకరము భగవ దనుగ్రహ
సుకృతము నందింప మూల సూత్రం బిదియే.

అరయఁగ సిద్ధోపాయము
శరణాగతి న్యాస మనియు, శరణ వరణమున్,
మరియు – న మస్సన, యావ
ద్భర నిక్షేపంబు నాఁ బ్రపత్తికిఁ జెల్లున్.

దీనికి కాల నిర్ణయము, దేశ విచారము, శుద్ధ్యశుద్ధి, రే
ఖా నియమంబు లే దనియు, గా కిక – యం దధికారి నిర్ణయ
జ్ఞానముకూడ లేదనియు గప్పడుచున్నది – భక్తి కన్న ని
ద్దానికి వేయి రెట్లుగ ప్రధానముగా వచియింతు రుత్తముల్.

ఏ నిమిషంబునందు భవ మెల్ల నిసీ యని గానిపించునో
దా నపు డీ ప్రపత్తికి ప్రధానుడు, శ్రీ భగవత్ప్రవృత్తి కిం
తేని విరోధిగా దన, ప్రవృత్తి నివృత్తిని జేయకున్న ని
ద్దాని ప్రపత్తి యందురు తథా విధ తత్త్వ రహస్య పారగుల్.

ఫలము సమానమైనను ప్రవృత్తికి, భక్తికి, వేయిరెట్లుగా
వలయు శ్రమంబు – భక్తికి ప్రపత్తియొ, శ్రీ భగవత్కృపాప్తిచే
గలుగుట నశ్రమంబును, సుఖంకరమున్ సకృదేవ కల్పితాం
జలి సులభంబు సర్వ కలుష ప్రవినాశన హేతు భూతమున్.

'పతల గతౌ' సుధాతు వన పత్తి యగు న్నుపసర్గ గాక, యా
గతి యన స్థాన వాచకము గావున, పత్తికి జ్ఞాన మర్థ మీా
క్షితిని ప్రపత్తి కర్థము ప్రకృష్టపు జ్ఞానము పిండితార్థమం
దతని సమాశ్రయించుటయె యాత్మకు ముఖ్యముగా గనంబడున్.

భావ మనేక రీతులుగ వ్యాకుల మందగ సర్జునుండు నే
త్రోవ శరణ్యమో యనుచు దోచక దిక్కులు చూచుచుండ - 'మా
మేవ'యు, 'మన్మనా భవ'యు 'మా శుచ' యున్, 'వహ మ్యహం'
బీ విధి నిర్వచించి రచియించెను శౌరి ప్రపత్తి యోగమున్.

ఉండిన దీ ప్రపత్తియె శరోపనిషత్తున - 'నాయమాత్మ' గా
ముండకమందు నీ విషయ మున్నది - శ్రీ భగవత్కృపాబలం
బండగ నిల్చియున్న మన యామున ముఖ్య మహాత్ము లెల్ల రిం
దుండి తరించినా రితర యోగము లెల్ల శ్రమైక సాధ్యముల్.

ఏ నపరాధ జాలముల కెంతయు నాలయ మాటచేత నుం
తైన ద్వదాప్తి సాధన ధనంబును జెందనివాడ నొట నీ
వే ననుc జూడకున్న గతి యే నుని చింతిలువాడ నొట నే
మైన నుపాయ మీావె యను యాశునయే సుమి న్యాస మన్నచో

కాన, ప్రపత్తి యోగమును గాంచినవాడు దివానిశంబు స్వా
ధీనత నుండగా, మనసు దేహ మరోగత నుండగా హరిన్
ధ్యానము సేయునేని, స్మృతి తప్పిన వేళ నతండు కామ పా
షాణము రీతిగా బడిన సంస్మృతి సేయు వరాహమూర్తియే.

'స్వపురుష' మటన్న పద్యము ప్రపన్నుల పాలిటి పారిజాతమే
విప నుదయుంబు లేక, యరవింద దళాక్షుడు కంటి రెప్పనా
నెవుడు నవీాక్షసేయు - మరణించిన పిమ్మట, నర్చిరాది ది
వ్య పథము బట్టి వానిని స్వయంబుగ వోడ్కొనిపోవు స్వామియే.

మున్ను గజేంద్రుఁడున్ మొసలి పోరుకు తాళక, స్వాత్మ రక్షణా
సక్తసన్నప్రయత్నుండై తుదకు స్థైర్యము వీడి, సగంబు చచ్చి, లో
విన్నదనంబు దోఁప విలపించుచు, దాను ప్రపత్తి సేయ శ్రీ
మన్నళినాయతేక్షణుఁ డమాంతముగా గనుపట్టె ముంగిటన్.

స్నానము లేదు, శుద్ధ వసనంబు ధరింపను లేదు, ద్రౌపదీ
మానిని స్వాత్మ రక్షణను మాని, సభాస్థలి నట్టె నిల్చి, 'కృ
ష్ణా! న నుపేక్ష సేయ దగునా?' యని పిల్చె; విభీషణుండు తా
నా సభముందు నిల్చి శరణాగతి చేసి కనెన్ గృతార్థతన్.

పరమ దయార్ద్రుఁడైన భగవంతుఁ డహర్నిశ మెంతమాత్ర మే
మరక మదీయ సంస్మృతిని మానవు లెవ్వరు సేయజాలరం
చరసి శ్రమంబు లేని శరణాగతియోగ మనుగ్రహించె, దు
స్తర భవ లావణాంబునిధి దాట దలంచిన నావ యిద్దియే.

తాను సమస్త భారము గదాధరు మీఁదన నిల్పి, యోగమం
దైనను, క్షేమమం దయిన ఆర్తి వహింపక స్వాశ్రమార్హ ని
ష్ఠా నియమాళిమాత్రమునె సల్పుచు తత్ఫల మందు తృష్ణ సుం
తైనను లేక యుండు నిట తల్లి యొడిన్ గల చంటిబిడ్డనా.

ఇతరుఁడు తీర్పలేఁడు మ దభీష్ట మటం చెద నిశ్చయించి, తా
నతులిత ప్రత్యయంబున శ్రియఃపతి నొక్కని రక్షకంబుగా
మతి దలపోసి - 'నీవె యిక మాకు శరణ్యుడ' వంచు యాచనా
వతి గని గోరుచున్న 'శరణా గతి' యందురు దీని నుత్తముల్.

భగవ దనుగ్రహాప్తికి ప్రపత్తియె ముఖ్యము - జీవు లెందరే
నగతి కృశించుచుండ శరణాగతిగద్య వచించె, దీనిచే
సుగమముగా యతీంద్రుఁ, డరిసూదనుఁడున్ తుది నీ ప్రభావమే
స్వగదిత గీతయందు నుపపాదన చేసెను సర్వ ధర్మగా.

కాక, మ రొక్క చిత్ర మట గన్పడుచున్నది, 'మాంహిపార్థ!' యన్
శ్లోకము జూడగా నికను శూద్రులు, స్త్రీలును, పాపయోనులా
గాక, సమస్త జంతువులు గట్టిగ వాని వరించెనేని, గీ
తా కథితానుసారముగ తప్పక గాచుగదా దయాబ్ధియై

ప్రాణము బోవువేళ భగవంతుని సంస్మరణంబు భక్తుఁడా
వానికి లెన్న గావలె ప్రపన్నున కీ విషయంబునందు నే
మీ నియమంబు లేదని వచింతురు, కానని యజ్ఞమూర్తి భూ
మానిని కిట్లు చెప్పె చరమంబును పూర్వ 'మహం స్మరామి'గా.
దోసము లెన్ని యుండినను తోటి సుహృన్మణు లొప్పుకున్న నే
మోసము చేసితో, నను సమూలముగా హతి మార్చునున్న నా
భాసపు మైత్రితో నయిన వచ్చినచో నటువంటివాఁడె నా
దాసుఁడు 'న త్యజేయము కదాచన' రాఘవ సూక్తి వింటిరే!
'అరయ తవాస్మి' యంచు నెవఁడైననుగాని న నొక్క సారియే
శరణము వేడెనేని యదె చాలును - నే నభయంబు గూర్తు, ఈ
ధరణి సమస్త భూత సముదాయమునుండి వ్రతంబు నాకు నీ
వర కది తప్పలే దటుల వాకొన నెవ్వ డికేమి కావలెన్!

మానవజన్మ మెత్తు టొకమాత్రము సాధ్యము కాదు-యెన్నియో
హీనములైన యోనుల జనించి జనించియు చచ్చి చచ్చి, నా
నా నరకానుభూతిని పునర్జననీ జఠర ప్రవేశ ఘో
రానల బాధ నొందుచు వసంత వసంతము లేగుచుండగా.

ఎనుబది నాల్గు లక్షలను చెంతురు యోనుల గాని, యెన్నియో
కనబడకుండ నున్న వొక కల్పము దాక జనించుచున్న తీ
రనివి సహస్ర రీతులుగ ప్రాణి పునర్భవమున్ బునర్మృతిన్
గని రథచక్ర మట్లు తిరుగాడుచునుండు నిదే విధంబుగన్.

ఈ విధి హీనయోనితతి నెన్నియొ మారులు పుట్టి గిట్టి, తా
బోవుచు నేకరించు శుభ పుంజము కొంచె మెఱుంగకుండ ప
ద్మావిభుఁ డంతమాత్రమున, తా నది హేతువుగా గ్రహించి,యీ
జీవుని జన్మవేళ వికసింపఁగఁజేయు ననుగ్రహేక్షణాన్.

తాదృగనుగ్రహంబున గతంబును సర్వము పారజూచి ని
ర్వేదముతోడ నిట్లు విలపింప దొడంగును జీవుఁ డక్కటా!
మేదిని నెన్ని యోనుల నమేధ్యములోఁ బడి కొట్టుకొంటినో!
నాది శరీర మెన్ని దహనంబుల బూడిద రాసు లయ్యెనో!

ఎందఱి కేను బుట్టితినొ! యెందఱు తండ్రులొ తల్లు లెందఱో
యెందఱు భార్య లైరొ! కడుపెందరు గాల్చిరొ! యెంతమంది కే
నిందు కృశించినాఁడనొ! నిహీనపు జన్మము లెన్ని యెత్తి నే
మ్రందితినోగదా; తుదకు మర్త్యుఁడనై ఫల మేమి గాంచితిన్?

ఏ చనుబాలు ద్రావి తను వృద్ధిని గంటినొ! దానితోడ దో
బూచుల నాడుచుంటి నెట పుట్టితినో! యట నీచ దృష్టితో
చూచుచునుంటి నీ విషయ శోధనతో బడియుండు నా కిఁకన్
గోచర మాట చూడ యమ కూటముగాక మరొక్కటుండునే?

పెట్టిన పెండ్లిగా దలచి, పెట్టకపోయిన దిట్టిపోయు దో
బుట్టువు, లాలు బిడ్డలును, బోయెడు వేళను గాని, కాటిలో
కట్టెల గాల్చునప్పుడును గాని, త దాపద మాన్ప లేర నా
కిట్టి మమత్వ మేల యని యెంచితి, నే నర జన్మ మెత్తియున్.

జానెడు పొట్టకోసమయి చేసిన సేవయు నింత లంత సం
తానము చూచుకొన్న మమతా స్థితియున్, బరివార వృద్ధియున్,
ప్రాణసతీ కుచోరు పరిరంభణమున్ సుఖమంచు నెంచితిన్
గాని, శుగాకరంబు లవి కర్మ సమృద్ధికి మూల సూత్రముల్.

వైతరణీ నదీ తరణ బాధలతో నసిపత్ర కాననా
స్థిత గతాగత శ్రమలచేతను తాపిత శూల ముద్గరా
ఘాతముచేత ఘోర నరకంబున నే విధి నేడ్చుచుందునో
యాతన రూప మెత్తి, యపురా! యమకింకరు లేమి సేతురో?

బాల్యము పోవు నూరకయె, ప్రాయములో విషయానుభూతి చా
పల్యము హద్దు మీరు నిఁక, వార్ధకమో బహు శామయార్తి ని
ర్మాల్యము రీతిగా బనికిమాలినదై కనిపించు - జన్మ సా
ఫల్యము గాంచు టెట్లు? భగవంతునిఁ జేరుట యెట్లు మానపుల్ ?

ఇంత దురీషణార్తి దపియించెడు న న్నెవ రేగు దెంచి ర
క్షింతురు? కాలదూత లగుపించిన నేడ్చెడు నన్ను నేరు తె
ప్పింతురు? నర్వ మిప్పు డరవింద దళాక్షుఁ డెఱుంగఁ జెప్ప, నా
స్వాంతము త్రిప్పకొందు హరిపై నని కర్మలు సేయు సంతతన్.

కాని, ఫలాభిలాష యయి, కర్మలు సేయ నుపక్రమించి స్వ
ర్గానకు బోయి, యందున సుఖస్థితి నందుచునుండు నంతలో
క్షీణత జెందు పుణ్యములు - జేతను దా మరలన్ ప్రపంచ మీ
గానుగ నిట్లు దా నలిగి కర్మ ఫలంబులపై విరక్తుఁడౌ.

అప్పుడు కర్మలన్ భగవ దర్పణబుద్ధి ఫలాభిలాషతో
నొప్పక సేయుచుంతును - త దుత్తమ కర్మ కనేక జన్మలన్
గుప్పలుఁ కూడియున్న దొసగుల్ పరిపూర్తిగ బోయి చిత్తమం
దప్పతిలున్ బ్రశాంత మగు నున్నతమౌ పరిశుద్ధ సత్వమున్.

అ పరిశుద్ధి గల్గు హృదయంబున దేహ వియుక్తమైన చి
ద్రూపము యోగశక్తి నవలోకన సేయుచు హృత్సరోరుహా
వ్యాపృత భార్గవీ రమణు భావన సేయ నుపక్రమించి, చిం
తా పరిణామ సంతతి వసంత విరాగము నొందు నెంతయున్.

ఆ విధి జ్ఞాన యోగమున నబ్ధిసుతా హృదయేశు తైలధా
రావ దఖండ సంస్మృతి పరంపరతోడ దివానిశంబు సం
భావన చేయుచున్న, నదె భక్తి యనంబడుకాని, వానికిన్
బ్రోవయు కష్టసాధ్య మయి తోచ, విచారణ చేయు నెంతయున్

ముందు స్వధర్మ నిర్వహణమున్ జరిపించిన జ్ఞానయోగి కా
నందము గల్గు, దాని మనంబున గల్గు విరాగ భావ, మి
ట్లొందినగాని భక్తి యను యోగము కల్గదు - యంత దాక నీ
బొందిన ప్రాణ ముండెడినో, పోయెడినో యెవఁడే నెఱుంగునే!

కావున, భక్తియోగ మతి కష్టము గాన, తదాప్తి నుండి నా
భావముపూర్తిగా మలపి, పాంథుఁడ నయ్యెద న్యాస యోగమన్
ద్రోవను - యామునాగి సుహృదుల్ నడయాడుట కాలి బాటయై
పోవుట కెంతయేని శ్రమమున్ గలిగింపక పోయి గూర్చదే!

ఆ నళినేక్షణుండె శరణాగతి కర్తృఁడు - వాఁడు సర్వ క
ల్యాణ గుణాకరుండును, శ్రియఃపతియున్, జగదీశ్వరుండు - నీ
ప్రాణికి సహాయ మౌచు ప్రతిబంధములన్ తొలగించి, మోక్షల
క్ష్మి నిధి గూర్చువాఁడు చిదచిన్మయ దేహుఁడ శేష శేషియున్.

కొడుకును హింస బెట్టు జనకున్ సహజన్ముని బట్టి, పెద్దగా
నిడుములు బెట్టు భ్రాతను వధించి, మహాపదలయందు వచ్చి, తో
డ్పడెడు నతండె సర్వ విధ బంధువుగాని, సుతాదు లేడ, యె
క్కడి తలి దండ్రు లేటి సహకారము లంతయు జూడకుంటిమే!

ఆతఁడె తండ్రి, రక్షకుఁడు, నాతఁడె శేషియుకూడ, వాఁడె నా
కాతఁడె భర్త, జ్ఞేయుఁడును స్వామియు వాఁడె, ధారకుం
డాతఁడె, యాత్మ సైత, మత డాతఁడె భోక్తయు గాన, వానినే
ప్రాతగ నమ్మెదన్ నవ విధంబుల నీ విధి బంధ ముండుటన్.

ఏ ననుకూల రీతి జరియింతు నికన్ బ్రతికూలభావ మిం
తైనను లేక వీడెదను నమ్మెద రక్షణ సేయు నంచు నన్
ద్రాణము సేయఁగోరెద భరంబు సమస్తము నస్మదీయమం
దే నియమించి స్వామి కడ దీనత నూపెద నాత్మ శుద్ధితో.

శ్రుతులు స్మృతుల్ తదాజ్ఞలయి శోభిలుచుంట నలంఘనీయముల్
క్షితి సకలాశ్రమస్థులకు జేయక మానితిమేని, వాని శ్రీ
పతికడ దోషమున్ నలువు పాపుల మౌదుము - న్యాసయోగ సం
స్థితునకుగూడ నిత్యములు సేయక తప్పదు వీనమేనియున్.

యోగములందు న్యాసము మహోత్తమమైనను, గర్మలన్ ఫల
త్యాగ మొనర్చి చేయవలె నంతియగాని యిఁక స్వరూపత
స్త్యాగము సేయరా దటుల నల్పిన తప్పదు ప్రత్యవాయ మీ
యోగికి ప్రొద్దు ప్రోవ ద్వయ ముండిన జాలును సార్థకంబుగా.

జనము గూర్చి గాని, మృతిసంగతి గూర్చియు గాని, లోన వే
దన బడరాదు - జన్మ మృతి తంత్ర మవార్యము - జన్మతోడ జీ
వనము నొసంగినాఁడు భగవంతుఁడు - పూర్వము పెట్టకుండ లే
దని యిపు డేడ్వరాదు - శరణాగతుఁ డీ విధి నెంచగావలెన్.

అరయఁగ దేహ భిన్నముగ ఆత్మ యొకా నొక టున్నదద్దియే
నిరవయవం బచింత్యమును నిత్యము శేషము నిర్వికార మీ
శ్వరుని నియామ్య వస్తువును జ్ఞానమయం, బజడంబు, నింద్రియే
తరము, మనో విలక్షణము, ధార్యము, బుద్ధికి గూడ భిన్నమై.

ఇరువదినాల్గు తత్త్వముల నేకత చెందిన దీ శరీర మ
స్థిరము, అనంతము దుఃఖముల సృష్టికి మూలమిఁకన్ బునః పునః
పరిణతి హేతువున్ విషయ దర్శకమున్ విపరీత బుద్ధి కా
కారకమని న్యాసయోగమును గాంచవలెన్ చిదచిత్స్వరూపమున్.

ఆ తరువాత బంధుజను లండఱు దేహము పట్టి వచ్చుటన్
పాతకు లౌదు రంచు భగవద్విషయంబున నెంతమాత్రమున్
ప్రీతిని జూపనీయ రని వీరిని దగ్గర జేరనీక, యుం
డే తొలిగింపగావలె నివే శరణాగతి భావ్య సూత్రముల్.

భగవదనుగ్రహంబునకు పాత్రులు గాక, త దర్చనావిధిన్
బగ గలవార లీ ప్రకృతి బద్ధులు - తాదృశు లంత దూర మం
దగుపడి మూరు మొగమై చనగావలె న్యాసయోగి కే
పగిది తదీయ బంధము సవాసనగా విడనాడి పోవలెన్.

వాని భజింపకున్న నొక పక్షములో బరికింప మంచిదే
గాని, తదన్యదేవుల నొకప్పుడు భావన సేయరాద యీ
న్యాసము కల్గినప్డె శరణాగతి కర్హుడు దేవతాంతరా
ధీనుఁ డొకప్పుడేని కడతేరగ లేఁడు యథార్థ మింతియే.

విష్ణుపదాబ్జ గంధ సురభీకృత మానస వీథు లౌట శ్రీ
వైష్ణవు లెల్ల వేళ భగవద్విషయంబున బ్రీతినుందు రే
తృష్ణయు లేక, కావున - తదేక శరణ్యత నొంది, సత్కథా
జిష్ణుత గాలయాపనము సేయ దొడంగు ప్రపన్నుఁ డెంతయున్.

అక్షయమా కటాక్షమున నాశ్రయ మిచ్చి, స్వరూప సంప్రదా
యాక్షర తత్త్వమున్ దెలిపి, యాజగదీశ్వర పాదపద్మ సే
వేక్షు రసానుభూతి కలిగించెడు దేశికు నెన్నుచుండు ప్ర
త్యక్ష హరి స్వరూపుఁ డని తత్పరుఁడై శరణాగతుం డెదన్.

మన యపరాధ జాలముల మానస మందున జొపనీక, చ
క్కని కృప వత్సలత్వమును గాంతునిలో బ్రసరింపఁ జేసి, ర
క్షణ మొనరించు నా పురుషకార శరీరిణి దుర్భవాబ్ధి తా
రిణి యగు శ్రీ పిరాట్టి పయి బ్రీతిగ జూపు ప్రపన్ను డెప్పుడున్.

అరయఁగ సృష్టి కాలమున నాత్మ నియంతగ దాను నిల్చి, యీ
కరణ కళేబరాదులను గల్పన సేసి యొసంగి, దేశికా
దరణ మహత్వ మిచ్చి, క్రమత స్స్వగుణ స్ఫూర్తి గల్గఁజేయు శ్రీ
హరి నెడ నమ్మియుంట శరణాగతి పర్యవసాన మింతకున్.

కాని, మరొక్క విన్నపము-కర్మము, జ్ఞానము, భక్తియున్ రమా
జాని పదంబు నందుటకు సాధనమై గనిపించు, న్యాస ని
ష్ఠా నిధి కెంతమాత్ర మిది సాధన వస్తువు గాక, మోక్షమం
దైనను హృష్టుఁ డౌచు రచితాంజలియై నమయించు వాకొనన్.

కనుక, ప్రపత్తి యోగమును గాంచిన వానికి - తప్త చక్ర ధా
రణమును, దాస్య నామము, నిరంతర పుండ్ర సమర్పణంబు, పా
వన నళినాక్షమాలయు, అవశ్యము గ్రాహ్యము మూలమంత్రమున్
మను మణి, గీతలోని చరమంబును, భాగవతాభిమానమున్.

దానవవైరి కేను పరతంత్రుఁడ నౌట, స్వరూపధర్మమా
గాన, మదర్హ కృత్యమును గట్టిగ సేయుచు నింక న్యాసమే
నే నని, నేనె న్యాస మని యీశ్వరుఁడే వచియించె, 'కిం బహూ
క్తేన' మహాత్ములార! యిదె తేలిన తత్త్వము న్యాసవిద్యకున్.

అరయ భక్తిచేత పరమాత్మను సాధన సేతు నంచు - త
ద్భావము మీఁదబెట్టుకొను భక్తుఁడు నీడనట్టి భార మే
ధారణ సేయఁజాల, పరతంత్రుఁడ నింక అకించనుండ, ఏ
తీరుననైన జేయు మని దీనత జూపును స్వామి సన్నిధిన్.

శోధన సేయ మర్కట కిశోరము వంటిది భక్తియోగమున్
సాధన జేయువాని స్థితి సర్వ భరార్పణ పూర్వకంబుగా
శ్రీధరునే యుపాయముగ జెందినవాఁడు బిడాలపోత మి
ట్లే ధర నుండు సౌఖ్యముగ ఇర్వురకున్ గల భేద మిద్దియే.

—0—

# విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము

'కవిశాబ్దిక కేసరి - ఉభయ వేదాంత విద్వాన్'

**శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు,**

బి.ఓ. యల్.



## వేదాంత శాస్త్రము

శాసించునది శాస్త్రము. వేదాంత శాస్త్రము సమగ్ర బ్రహ్మ తత్త్వనిరూపకము, ఉత్తమ పురుషార్థ ప్రాపకము అయినందున, సర్వ శాస్త్రాతిశాయి యైనది.

## విశిష్టాద్వైత తత్త్వము

భగవద్రామానుజులచేత తమ శ్రీభాష్యమునందు ప్రపంచిత మైనది విశిష్టాద్వైత తత్త్వము. ద్వైత మనగా భేదము. తదభావము అద్వైతము. బ్రహ్మ తత్త్వము ఏకమే పరమార్థ మని, తద్భిన్నము అపరమార్థ మనియు తెలుపుచున్నది అద్వైత మతము. భిన్నస్వరూప స్వభావములుగల అచిత్-చిత్-ఈశ్వర తత్త్వములు మూడు అనియు, అందు చిదచిత్తత్త్వములు ఈశ్వరునకు శరీరభూతములై, పరతంత్ర ములై, అతనితో సర్వదా అవినాభావ సంబంధము కలిగియుండు ననియు, స్వాంశభూతములగువానితో విశిష్ట మగు బ్రహ్మతత్త్వము ఏకము అనియు విశిష్టాద్వైతము నిరూపించుచున్నది. జగత్సృష్టి కొరకు 'బహుస్యాం ప్రజాయేయ' (నేను విస్తృత రూపముగ జనింతును) అని సంకల్పించుచున్న పరబ్రహ్మము స్థూల సూక్ష్మ దశ లలో తనను జగదభిన్నముగ భావించుచున్నది. ఈ జగద్రూప పరి

ణామము నిర్వికార మగు బ్రహ్మస్వరూపమునకు సంభవింపదు. కావున, సూక్ష్మ రూపమున అతనికి శరీరముగ లీనప్రాయమైయుండు చిదచిత్పదార్థములకే పరిణామము మనుస్మృతి ఒకటవ అధ్యాయము లోని 'సోభిధ్యాయ శరీరాత్ స్వాత్, సిస్సృక్షు ర్వివిధాః ప్రజాః' అను శ్లోకమున స్పష్టము. పరమాత్మ సృష్టికి సంకల్పించి, తన శరీరము నుండి వివిధ ప్రజలను, ప్రపంచమును సృష్టించుచున్నాడని దాని యర్థము. ఇట్లు స్థూల సూక్ష్మ దశలలో బ్రహ్మము చిదచి ద్విశిష్ట మనియు, జగ దభిన్నముగ తనను భావించుచున్నదనియు స్పష్టము.

ఈ సిద్ధాంతమునకు అతి ప్రధాన హేతువు చిదచిద్రూప ప్రపం చమునకును, ఈశ్వరునకును శరీర శరీరి భావము నంగీకరించుట. బృహ దారణ్యకమునందును, సుబాలోపనిషత్తునందును, స్మృతి పురాణాదు లందును సుస్పష్టముగ పలు విధము లగు అచిత్పదార్థములను, జీవాత్మ లను, ఈశ్వరునికి శరీరముగ నిరూపించు ప్రమాణములు కలవు. అవి ఇవి :—

"యః పృథివ్యాం తిష్ఠన్, పృథివ్యా అంతరః. యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం, యః పృథివీ మంతరో యమయతి సత ఆత్మా అంతర్యా మ్యమృతః"

ఇది బృహదారణ్యకము. ఈ వాక్యమునకు తరువాత గూడ, పలు విధము లగు ప్రత్యేక వాక్యములు కలవు. ఇట్లే ఈ ఘట్టమునందే —

"య ఆత్మని తిష్ఠన్ ... యస్య ఆత్మా శరీరం."

ఇత్యాది వాక్యము జీవునకు బ్రహ్మనియామ్యత్వమును, శరీరభూత త్వమును స్పష్టముగ తెలుపుచున్నది. ఇక సుబాలోపనిషత్తునందలి—

"యస్య పృథివీ శరీరం, యః పృథివీ మంతరే సంచరన్, యం పృథివీ న వేద, యస్య ఆప శ్శరీరం, యస్య తేజ శ్శరీరం, ఏష సర్వభూతాంత రాత్మా, అపహత పాప్మా – దివ్యో దేవ ఏకో నారాయణః."

ఇత్యాదిచే ఈ విషయము స్పష్టము చేయుబడినది. ఇట్లే కొన్ని స్మృతి వాక్యములు —

"జగ త్సర్వం శరీరం తే"
"యదంబు వైష్ణవః కాయః."
"త త్సర్వం వై హరే స్తనుః"
"తాని సర్వాణి త ద్వపుః"

ఇత్యాదులు. ఇట్లు బహు శ్రుతి స్మృతి సిద్ధ మగు జగచ్ఛరీరత్వ మును ఆధారముగా గొని, సర్వ శరీరు డగు పరమాత్మ ఒకడే యనియు, ఈదృశ బ్రహ్మాతిరిక్త తత్త్వాంతరము లేనందున, విశిష్టాద్వైతము సిద్ధ మనియు శ్రీరామానుజుల సిద్ధాంతము. ఇచట నొక యాక్షేపము. పరమాత్మకు జగత్తు శరీర మగుట అనుపపన్నము.

"అప్రాణోహ్య మనాః," "అచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం"

ఇత్యాది శ్రుతులు — బ్రహ్మము అశరీరమని చెప్పుచున్నవి కదా! మరియు, పృథివ్యాదులు అతనికి శరీర మనుటకూడ అసమంజసమే. శాస్త్రములయందు — 'కర్మఫలభూత సుఖదుఃఖానుభవ సాధనము ఇంద్రియాశ్రయము, పాంచభౌతికము శరీరము' అని శరీర లక్షణము చెప్పబడినది. ఇం దే లక్షణముకూడ ప్రత్యేకముగా పృథివ్యాద్యచి త్పదార్థములకుగాని జీవాత్మలకుగాని అన్వయించనందున, వారు పరమాత్మకు శరీరభూతు లనుట చెల్లదు. జీవులుగాని, అచిత్ పదార్థములు గాని పరమాత్మకు కర్మఫలభోగ సాధనములు కావు. మరియు, ఆయన పుణ్యపాపక్రియల కతీతుడు. జగద్బ్రహ్మలకు కూడ శరీర శరీరి భావ హేతుక మగు విశిష్టైక్యమును చెప్పుట అయుక్తమే' అని. ఇందులకు సమాధాన మిది :—

పరమాత్మకు సర్వ పదార్థములు శరీరములే యని చెప్పు బహు శ్రుతి స్మృతి వాక్యములను కాదనలేము. మరి

"అశరీరం అపాణిపాదం"

ఇత్యాదిశ్రుతులకు, కర్మసంబంధమగు శరీర మతనికి లేదనియే అర్థము. ఆ విషయమును –

"న భూత సంఘసంస్థానో, దేహోఽస్య పరమాత్మనః."
"న సా కర్మ నిమిత్తజా"

ఇత్యాది ప్రమాణములనుబట్టి తెలిసికొనవచ్చును. అస్మదాది శరీరములవలె కర్మనిమిత్తములును, భౌతికములును గాక, భగవచ్ఛరీరాలు స్వేచ్ఛా పరిగృహీతములై, అప్రాకృతములైనవని పై ప్రమాణముల భావము. ఇట్టి వ్యవస్థను అంగీకరింపనిచో, పరమాత్మకు శరీరమును బోధించువానికిని, అశరీరత్వమును బోధించువానికిని పరస్పర విరోధము కలుగును. మరియు – ఈశ్వరునికే గాక, ముక్తాత్మలుకూడ –

"స ఏకధా భవతి, త్రిధా భవతి, పంచధా."

ఇత్యాది శ్రుతులు స్వేచ్ఛా పరిగృహీతాప్రాకృతానేక శరీర పరిగ్రహ సద్భావమును తెలుపుచున్నవి కనుక, శరీర మన నేమో లక్షణము చెప్పవలసివచ్చినపుడు, కేవలము అస్మదాది భౌతిక శరీరములకు మాత్రము వర్తించు లక్షణమును గాక, వేదాది ప్రమాణ సిద్ధములగు అప్రాకృత భగవదాది శరీరములకుగూడ వర్తించు ఉభయానుగత లక్షణమునే నిర్వచింపవలెను. పూర్వపక్షిచే చూపబడిన లక్షణము ఈశ్వర – ముక్తాత్మ శరీరములలో అవ్యాప్తము శాపగ్రస్తలగు అహల్యాదులయొక్క శిలా కాష్ఠాది రూప శరీరములయందు శాప ఫల భోగ సాధనత్వ మున్నను, ఇంద్రియాశ్రయత్వము లేదు.

ఏకాకారత్వరూప మగు జాతిని బట్టి, శరీర లక్షణమును నిర్వచింత మన్నచో, అది అసాధ్యము. ఘట పటాదులలో కనబడు ఏకవిధాకారము — మానవ, పశు, పక్షి శరీరములలో కనబడుట లేదుకదా!

ఇట్లుండ, ఈశ్వర ముక్తాత్మలకు శరీరము కలదని చెప్పు శ్రుతి వాక్యములకు కొందరు గౌణార్థకత్వమును కల్పించిరి. ప్రకృతిలోనుండు ప్రతి వస్తువు - పేరెత్తి, 'ఇది పరమాత్మ శరీరము' అని చెప్పు అసంఖ్యాకము లగు వైదిక వాక్యములకు గౌణార్థత్వమును కల్పించుట అసమంజసము. ఈ స్థలమున శ్రీరామానుజులచేత సర్వానుగతముగా నిర్వచింపబడిన శరీర లక్షణ మిట్లున్నది :—

"యస్య చేతనస్య యద్ద్రవ్యం సర్వాత్మనా స్వార్థే నియంతుం, ధార యింతుం చ శక్యం తచ్ఛేషతైక స్వరూపం చ. తత్తస్య శరీరమ్."

ఏ చేతనునికి - ఏ పదార్థము సర్వవిధములుగను స్వార్థమునకు వినియోగించుటకు వీలగుచు, అతనిచేతనే పోషింపబడుచు, అతనికే పరతంత్రమై యుండునో, అది యతని శరీర మనబడును. ఈ లక్షణము ప్రకారము ఈశ్వరునికి సర్వ చిదచిత్పదార్థములు విధేయములై, నియామ్యములై, పోష్యములై యున్నందున, అవి యన్నియు అతనికి శరీరము అనుటలో - ఆక్షేపము లేదు. రోగాదులచేత నియమన శక్తి ప్రతిబద్ధమైనందున, యథేష్టముగ శరీర ప్రవృత్త్యాదులు కలుగక పోవచ్చును. అంతమాత్రముచేత నియామ్యత్వము శరీర లక్షణము. చంద్రకాంతాది మణి సన్నిధానమున అగ్నికి సహజ మగు దాహకత్వ శక్తి ప్రతిబంధింపబడి, తాత్కాలికముగా అగ్ని శీతలముగ తోచినను, దానికి ఉష్ణ స్పర్శము సహజ గుణము కాదనలేము కదా! కావున, ఇట్టి శరీర లక్షణము పరమాత్మతో అపృథగ్భూతమై తదేక నియామ్యమై, పరతంత్ర మగు చిదచిన్మిశ్ర సర్వ ప్రపంచమునకు

సంభవించుటచేత, తద్విశిష్టుడగు పరమాత్మకు చెప్పబడు ఏకత్వమే విశిష్టాద్వైతము.

## పరబ్రహ్మము సగుణము

ఉపనిషత్తులు కొన్ని చిత్ - అచిత్ - ఈశ్వర తత్త్వములకు స్వరూప స్వభావములనుబట్టి భేద మున్నట్లు చెప్పుచున్నవి.

"ప్రధాన క్షేత్రజ్ఞపతి ర్గుణేశః"

"క్షరం ప్రధానం, అమృతాక్షరం హరిః క్షరాత్మనా నీశతే దేవ ఏకః"

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే"

"జ్ఞాజ్ఞౌ ద్వా వజావీశ నీశౌ" "అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం.

అజో హ్యేకో జుషమాణో ऽను శేతే, జహాత్యేనాం భుక్తభోగామజోऽన్యః"

ఇత్యాది శ్రుతివాక్యములు స్వరూప భేదమును బోధించునవి. ఇక - 'తత్త్వమసి' 'అయ మాత్మా బ్రహ్మ' 'ఐతదాత్మ్య మిదం సర్వం', 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ' 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' ఇత్యాదులు జీవ ప్రపంచములతో ఈశ్వరునికి అభేదమును చెప్పుచున్నవి. ఈ అభేదమును సమర్థించుటకై, 'నేహ నానాస్తి కించన' 'ఏకమేవాద్వితీయం' ఇత్యాదులు భేదమును నిషేధించుచున్నవి. ఇట్లు పరస్పర విరుద్ధములుగ తోచు భేదాభేద శ్రుతులకు సమన్వయము కుదురదని యెంచి, అద్వైత సిద్ధాంతకారులు అజ్ఞాతార్థ బోధకములైనందున, భేద శ్రుతులు అయథార్థములనియు వ్యవస్థను చూపిరి. ఈ పద్ధతిని శ్రీరామానుజు లంగీకరింపలేదు వారు ఆపాత ప్రతిభాసిత మగు భేదాభేద శ్రుతి విరోధమును ఘటక శ్రుతుల సమన్వయముతో విడదీసి పరిహరించిరి. శరీర శరీరి భావ బోధక శ్రుతులే ఆ ఘటక శ్రుతులు. ప్రత్యేకముగ తత్త్వత్రయమునకు స్వరూప స్వభావ భేదమును భేదశ్రుతులు చెప్పుననియు, సృష్టిప్రళయములయందు స్థూల సూక్ష్మరూపమున నున్న చిదచిత్తులను తనకు శరీరముగా

కలిగి, సర్వదా తద్విశిష్టుడై యుండు పరమాత్మ ఒకడే అయినందునను, విశిష్ట బ్రహ్మాతిరిక్త పదార్థము లేదు. లేనందునను, అద్వైత శ్రుతులకు సార్థక్య మనియు వీరి సమన్వయము. శ్రుతులలో ఎలుగెత్తి చెప్పబడిన బహు విధములగు అనంత కల్యాణ గుణములను పరమాత్మకు వాస్తవములు కావనుట అనుచిత మని భావించిన శ్రీ రామానుజులు - బ్రహ్మము సగుణమే యనియు, నిర్గుణ శ్రుతులు అతనికి హేయము లగు ప్రాకృత గుణములు లేవని చెప్పుచున్నవనియు, నిర్గుణ శ్రుతులకు వ్యవస్థను చూపిరి. ఇట్టి తమ వాదమునకు ప్రమాణముగా -

"అపహత పాప్మా విజరో విమృత్యుర్విశోకో
విజిఘత్సోఽపిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః"

అను శ్రుతిని ఉదాహరించిరి.

## నారాయణుడే పరబ్రహ్మము

సగుణ మగు ఈ పరబ్రహ్మము శివుడా? నారాయణుడా? దేవతాంతరమా? అను మతభేదము శ్రుతి వైవిధ్యముచేత కలిగి నపుడు ___

"పూర్వపదా త్సంజ్ఞాయామగః."

అను ణత్వ విధాయక వ్యాకరణ సూత్రప్రకారము ఇతర దేవతలకు సమన్వయింపరాని నారాయణ పద శబ్దము - సుబాలోపనిషత్తు, మహోపనిషత్తు, నారాయణానువాకము మొదలగు ఉపనిషత్తులలో ప్రయుక్తమైనందునను, పురుషసూక్తమున చెప్పబడిన 'హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ' ఇత్యాది వాక్యప్రతిపాదిత లక్ష్మీపతిత్వాది లక్షణముల వలనను-'అగ్ని రవమో దేవతానాం విష్ణుః పరమః' ఇత్యాది

తైత్తిరీయ సంహితాగత వాక్యముల వలనను - శ్రీమన్నారాయణ పరత్వమునే శ్రీరామానుజులు నిర్ధారణ మొనర్చిరి. 'అంగా న్యన్యా దేవతాః' అను శ్రుతి ప్రకారము దేవతాంతరములు జగచ్ఛరీరు డగు నారాయణునకు అంగభూతములని తెలిపిరి.

## సాధన పథము

ప్రకృతి మండలమున తాపత్రయాభిహతుడగు జీవునకు విముక్తి కొరకు కర్మజ్ఞాన యోగాంగిక భక్తియోగము సాధన మనియు, పరమ వ్యోమ శబ్దవాచ్యము, అప్రాకృతము నగు శ్రీవైకుంఠమును జేరి, అచట సర్వజ్ఞత్వ సత్య సంకల్పత్వాది సహజ గుణావిర్భావము కలిగి, భగవత్సేవ గావించుచు, పునరావృత్తి రహితముగ శాశ్వతానం దము నందుటయే ముక్తియనియు బ్రహ్మసూత్ర భాష్యమున శ్రీరా మానుజులు స్పష్టీకరించిరి.

## ఆచార వ్యవహారములు

శ్రీ రామానుజులచేత పరిపోషితమైన విశిష్టాద్వైత సిద్ధాంత మును అవలంబించిన శ్రీవైష్ణవులు తమ ఆచార వ్యవహారాది సంప్ర దాయములలో - పాంచరాత్రాగమ ప్రామాణ్యము నంగీకరించిరి. ఆ యాగమోక్త క్రమమున భగవదారాధన విధానమును, ఆత్మకును - దేహమునకును విధింపబడిన పంచ సంస్కారములను పాటించిరి. బ్రహ్మసూత్ర వ్యాఖ్యానమును చేయుచు శ్రీరామానుజాచార్యులు పాంచరాత్రమునకు సర్వాత్మనా ప్రామాణ్యమును నిరూపించిరి. భగవద్గీత వలె, పాంచరాత్రాగమ మంతయు సాక్షాత్ భగవన్ముఖావిర్భూతమైనదని -

"పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణ స్స్వయమ్."

అను ప్రమాణమునుబట్టి తెలియుచున్నది. మరియు, విఖనస ప్రోక్తమగు వైఖానసాగమమునుగూడ ప్రమాణముగా గ్రహించి, తదను సారముగా భగవదారాధనమును, ఆచారాదులను పాటించువారు గూడ శ్రీవైష్ణవులలో ఒక శాఖగా నున్నారు.

సర్వ మానవ సముద్ధరణమునకు దీక్ష వహించి ఉద్యమించిన శ్రీరామానుజులు - పాంచరాత్రాగమోక్త విధానములను అట్టి వారికి గూడ వర్తింపజేసి, తద్వారా మోక్షాధికారమును కలిగించిరి. వైదిక మంత్రానుష్ఠాన పూర్వకముగా భగవ దర్చనావకాశము వారికి లేకుండుట, అందరకు ప్రత్యామ్నాయముగా పరమ ప్రపన్నులగు దివ్య సూరుల చేత (ఆళ్వారులచేత) రచింపబడి, వేద సమ ప్రామాణ్యము కలిగి, అప్పటికే బహుళ ప్రచారములో నుండిన ద్రవిడ గీతములను (పాశురములను) కొన్నింటిని అనుసంధేయములుగా నేర్పరచి, ఆరాధన విధానమును నిర్వచించిరి. ఆ యా వేద భాగములతో పాటు ఈ ద్రవిడ ప్రబంధములను గూడ భగవదాలయములలో నిత్యానుసంధేయములుగా నియమించిరి. పాంచరాత్ర విహిత పంచ సంస్కారములు లేనిచో, వేదాధ్యేత యగు బ్రాహ్మణునికిగూడ శ్రీవైష్ణవత్వము, పరమ వైదికత్వ సిద్ధియు లేదని నిర్ణయించిరి. ఈ సంస్కారములను వైదికావైదిక విభాగము లేకుండ, సర్వ సాధారణములు గావించి, వేదచోదిత కర్మజ్ఞాన సహకృతోపాసనమునకు (భక్తి మార్గమునకు) పాత్రకత్వమును గల్గించిరి

## విధి నిషేధములు

శ్రీవైష్ణవులు దేవతాంతర సేవ గావింపరు. ఇతర దేవతల సేవ పరిమిత ఫలప్రద మనియు, మోక్ష పురుషార్థ ప్రధాన శక్తి - సర్వ

కారణభూతుడుగ సిద్ధాంతీకరింపబడిన శ్రీ మన్నారాయణుని యందే -

"మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్"

ఇత్యాది ప్రమాణోక్త విధముగా కల దనియు - అంగీకరించి, శ్రీమన్నారాయణునే ఆరాధింతురు. తాము నిత్య నైమిత్తికాది కర్మలలో - తత్త ద్దేవతలనుగూర్చి హోమమును చేయుచున్నప్పుడు -

"అహింసా సర్వ యజ్ఞానాం - భోక్తా చ ప్రభు రేవ చ."

ఇత్యాది గీతా ప్రమాణము ననుసరించి - తత్త ద్దేవతలకు అంతర్యామిగా వర్తించు పరమాత్మకే ఈ హోమాదులు చెందునని భావింతురు. మరియు -

"యేఽప్యన్య దేవతా భక్తాః యజంతే శ్రద్ధయాన్వితాః
తేఽపి మా మేవ కౌంతేయ ! యజం త్యవిధిపూర్వకమ్"

అని గీతలో స్పష్టముగా విధిపూర్వకము కాదని నిషేధింపబడినందున, అన్య దేవతా భజనము వీరికి అంగీకారము కాదు.

## పంచ సంస్కారములు

శ్రీ రామానుజులకు పూర్వముగూడ పంచ సంస్కారాది విధానము శ్రీవైష్ణవ సంప్రదాయమున గలదు.

పంచ సంస్కార స్వరూప వివరణము :—

(1) తాపము :—

అగ్నితప్తములగు సుదర్శన పాంచజన్యములచేత ఆచార్యుని వద్ద భుజ ద్వయముపై ముద్రల నొందుట.

(2) పుండ్రము :—

ముఖాది ద్వాదశ స్థానములయందు భగవత్పాద దయాకృతి యగు తిలకమును శ్వేత మృత్తికతోను, నడుమ - హరిద్రా చూర్ణము తోను, సచ్ఛిద్రముగను — ఊర్ధ్వాకృతిగను ఆచార్య నిర్దేశ ప్రకారము ధరించుట.

(3) నామము :—

భగవ ద్భాగవత దాస్యము తన స్వరూపమునకు సూచక ముగా, 'రామానుజ దాసుడు - శఠకోప దాసుడు - వేంకట దాసుడు' ఇత్యాది రూపములలో ఆచార్య నిర్దిష్ట మగు ఏదో ఒక పేరును ధరించుట.

(4) మంత్రము :—

(౧) అష్టాక్షరి (౨) ద్వయము (౩) చరమ శ్లోకము అను భగవ చ్ఛరణాగతి బోధకము లగు మూడు మహా మంత్రములను అవ ట్కార్ణముగా ఆచార్యోపదేశమువలన పొంది, గురుపరంపరా పూర్వ కముగ నిత్యము వాని ననుసంధించుకొనుట.

(5) యాగము :—

అనుగ్రహ పూర్వకముగ ఆచార్యులచే ప్రసాదింపబడిన సాల గ్రామమును, తామ్రాది మయ మగు భగవ న్మూర్తులను నిత్యము త్రికాలములయందు షోడశోపచారములచే ఆరాధించుట.

ఈ శంఖ చక్రాంకన - ఊర్ధ్వపుండ్ర ధారణాదులు శూద్రులకు మాత్రమే విహితము లనియు, వేద విహితములు కావనియు, పైగా - నిషిద్ధము లనియు ఆక్షేపములు మతాంతరస్థులచేత ఉద్ఘాటితము

తైనవి. కాని, ఇవి బ్రాహ్మణాదులకుగూడ విహితము లనుటకు శ్రుతి పురాణాదులలో ప్రమాణము లనేకములు కలవు.

"పవిత్ర మి త్యగ్నిః, అగ్నిర్వై సహస్రారః - సహస్రారో నేమిః
నేమినా తప్త తనుః బ్రహ్మణ స్సాయుజ్యం సాలోక్య మాప్నోతి "
— (సామ వేదము)

"చక్రం బిభర్తివపుషాభితప్తం - చక్ర మాదాయాగ్నౌ ప్రతాప్య,
బ్రాహ్మణస్య దక్షిణే బాహౌ ధారయేత్ "

" పాంచజన్య మాదా యాగ్నౌ ప్రతాప్య,
బ్రాహ్మణ బాహా స్యోత్తర ధారయేత్ " — (అధర్వ వేదము)

"అగ్నినా వైత స్తం ద్విభుజే ధారయ న్నూర్ధ్వపుండ్ర మారభేత్.
తస్మా ద్విరేఖం భవతి " — (శతపథ బ్రాహ్మణము)

"ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ విష్ణుం పరం ధ్యాయతి యో మహాత్మా."
— (కఠవల్లి)

"య ద్విష్ణ క్షేత్రం, తత్ర మృత్స్నాం శ్వేతాం ఉద్ధృతాసీ త్యుద్ధరేత్. అమృత మేవ శ్వేతమృత్స్నా భవతి. తాం శుద్ధ జలేన ప్రణవే ఘర్షయేత్ తయా నిత్య మూర్ధ్వపుండ్రం బిభృయాత్ నాసాది కేశాన్త మూర్ధ్వపుండ్రం విష్ణోః స్థితస్య చరణద్వయాకృతి, సా శ్రీః ప్రతిష్ఠాయై శ్రీ ర్హరిద్రాయతో హరిం ద్రావయతి త జ్జలేన శ్రీ బీజే సంయుజ్య త త్సూక్ష్మరేఖాం ధారయేత్.. .ఏవం విదిత్వా యో ధారయతి, స వైదికో భవతి స సర్వకర్మార్హో భవతి "

— (అధర్వ వేదము)

ఇట్లే స్మృతి పురాణాదులలోగూడ గల పలు ప్రమాణములను చూపి, 'సుదర్శన సుర ద్రుమము' మున్నగు గ్రంథములలో శాస్త్రజ్ఞు

లగు ప్రాచీన శ్రీవైష్ణవులు ఈ పంచ సంస్కార ప్రామాణికతను స్థాపించియున్నారు.

## భక్తి ప్రపత్తులు

**భక్తి :-**

కర్మయోగముచేత పరిశుద్ధ మనస్కుడై, జ్ఞానయోగముచేత నిత్యాత్మ స్వరూపము నెరిగినవాడు ప్రకృతిబంధ విచ్ఛేదకముగా భగవత్సాయుజ్య లాభమునకై చేయవలసిన భగవ దుపాసనము అవిచ్ఛిన్నమై, దర్శన సమానాకారమై, యావజ్జీవ మనుష్ఠేయమై యుండును. ఇట్టి ఉపాసనమే భక్తియోగము. ఇది -

"తల్లబ్ధిః వివేక - అభ్యాస - క్రియా - కల్యాణ - అనవసాద - అనుద్ధర్షేభ్యః."

అను బోధాయన వృత్తి వాక్యానుసారముగా - సాధన సప్తకము చేత సాధింపబడునని శ్రీరామానుజులు బ్రహ్మసూత్ర భాష్యమున స్థాపించిరి. ఉపదేశ పరంపరా ప్రాప్తమగు ఈ భక్తియోగము యామునాచార్యుల కాలమునకే లుప్తమైన దందురు. వారికి పితామహులును, ఇంచుమించు శ్రీ శంకరాచార్యులకు సమకాలికులు నైన శ్రీనాథమునులు ఈ భక్తియోగ సిద్ధులై యుండిరి. వారు తమ పౌత్రులగు యామునాచార్యులకు ఈ యోగమును ఉపదేశింపుడని తమ శిష్యులగు పుండరీకాక్షాచార్యులను ఆదేశించిరి. వారట్లుపదేశించకయే దేహమును చాలించినందున, అది యామునాచార్యులకు దుర్లభమైనది. అంతటితో భక్తియోగ సంప్రదాయ మంతరించినది.

**ప్రపత్తి :-**

శరణాగతి యని చెప్పబడు ప్రపత్తి - భగవత్ప్రాప్తికి సర్వాధికారక మగు ఉత్తమోపాయము. ఇదియు - శ్రుతి స్మృతి పురాణాది

చోదితమే. ఈ ప్రపత్తి - భక్త్యాది సాధనములకంటె అతిరిక్త మగు మహోపాయముగా నిరూపింపబడినది. ఇక రామాయణ - భారత - భాగవతాదులలో, గజేంద్ర ప్రపత్తి, ద్రౌపదీ ప్రపత్తి, విభీషణ ప్రపత్తి మొదలగునవి ఆచరణ రూపమున మనకు కనబడుచున్నవి. తన అకించనత్వమును పురస్కరించుకొని, భగవంతునిపై మహా విశ్వాస ముంచి, 'నీవే రక్షకుడవు' అని అతని పాదముల నాశ్రయించి ఆత్మార్పణము చేయుట - 'ప్రపత్తి' యనబడును.

"భగవ త్ప్రవృత్తి విరోధి స్వప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః."

అని పెద్దలు దీనిని నిర్వచించిరి. భగవ ద్రక్షకత్వమున సంపూర్ణ విశ్వాస ముంచుటయే ఇందు ముఖ్యోద్దేశము.

ఒక విశేషము :- 'స్వశక్తితో తన కార్యమును సాధింపగలవా డయ్యును, ఈ ప్రపత్తి ననుష్ఠించినచో, అతని కిది ఫలప్రదము కాదు. అశక్తునిచేత అనుష్ఠితమైనపుడే ఫలప్రద మగును' - అను విషయము సుస్పష్టమే. దేశ కాలాది నియమ వ్యవస్థగూడ ఈ ప్రపత్తికి లేదు

"యద హరేవ విరజేత్ - తద హరేవ ప్రవ్రజేత్."

అన్నట్లు - భగవంతునిపై విశ్వాసము, ఆర్తియు తనకు గల్గిన ఉత్తర క్షణముననే అనుష్ఠింపవచ్చును. ప్రపన్నుడు లక్ష్మీపూర్వక ముగా స్వామి నాశ్రయింపవలెను ఇట్లు ఆ దివ్యదంపతులే ఆశ్రయ ణీయులు గాని, ఏక నారాయణోపాసనమును శ్రీవైష్ణవు లొనరింపరు. ఈ విధమగు ప్రపత్తి - వైదిక కర్మాద్యంగకము కానందున, బ్రాహ్మణ - స్త్రీ - శూద్రాది సర్వాధికారముగా పరిగణితమైనది.

శ్రీమన్నారాయణుడే పరతత్త్వ మని యెంచి, విశిష్టాద్వైత మును తమ ద్రవిడ ప్రబంధములలో చాటిన ఆళ్వారులును, శ్రీ గోదా

దేవియును ఈ ప్రపత్తి మార్గమునే అవలంబించినట్లు, వారి ప్రబంధములలో స్పష్టము.

## శ్రీరామానుజులు - పంచాచార్యులు

శ్రీ యామునాచార్యుల శిష్యులలో ప్రధానులు (1) పెరియ నంబి (2) తిరుమలై నంబి (3) తిరుక్కోట్టియూర్ నంబి (4) మారనేర్ నంబి (5) తిరుక్కచ్చినంబి - అని ఐదుగురు కలరు. శ్రీ రామానుజాచార్యులవారికి - 'పంచాచార్య పదాశ్రయః' అని ప్రసిద్ధి కలదు. పైన పేర్కొనబడినవారే ఈ పంచాచార్యులు. వారిలో నొకరివద్ద చక్రాంకనమును, ఇంకొకరివద్ద అష్టాక్షరీ మంత్రార్థమును, మరొకరివద్ద ద్వయ చరమ శ్లోకార్థములను, వేరొకరివద్ద శ్రీరామాయణార్థమును, ఇంకొకరివద్ద ద్రవిడప్రబంధార్థములను శ్రీరామానుజులు గ్రహించిరట

## మత ప్రచారము

ఆసేతు శీతాచలము శిష్యవర్గముతో పర్యటించిన శ్రీ రామానుజాచార్యులు విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రబోధించుచు, అనేక వైష్ణవ దేవాలయములయందు - పాంచరాత్రాగమోక్తమగు అర్చనా విధానమును, సంస్కృత వేదముతో పాటు, ద్రవిడ ప్రబంధాధ్యయనమును గూడ ఏర్పరచుచు, సర్వసాధారణ మగు ప్రపత్తి మార్గమును ఉపదేశించి, శ్రీవైష్ణవ మత ప్రచారము గావించిరి. వారి తరువాత ఆచార్య పరంపరలో — వేదాంత దేశికుల వరకు ఏకముఖముగ లబ్ధ ప్రచారమైన శ్రీవైష్ణవ మతము —'వడగలై, తెంగలై' అను రెండు శాఖలుగా చీలినది. ఇందు - 'వడగలై' సంప్రదాయమునకు మూల పురుషులు వేదాంత దేశికులు. పిళ్ళలోకాచార్యులవారు, వారి ప్రశిష్యులగు మణవాళమునులు - 'తెంగలై' సంప్రదాయ ప్రవర్తకులలో ముఖ్యులు. శ్రీరామానుజులు శ్రీ వైష్ణవ మత ప్రచారమునకై తమ శిష్యులను పలుపురిని పీఠాధిపతులుగా నియమించిరి. నేటికిని ఆ యా పీఠాధిపతి వంశమువారు దేశమున నలుమూలలందు విశిష్టాద్వైత ప్రచారకులై వెలయుచున్నారు.

# శ్రీ రామానుజ ప్రశస్తి

'భక్త కవి శేఖర'

## శ్రీ మొవ్వా వేంకట దాసు

❋

శ్రీ మనోవల్లభ శ్రీపాద సరసిజ
ద్వంద్వ మరంద మద ద్విరేఫ !
వేద విరుద్ధావివేక సిద్ధాంతావ
లంబక జను తుషారాంబుజాప్త !
స్వాశ్రిత మానవాసాదితానంత భ
యంకరాంహ స్సంచయాద్రి శంబ !
గరుడ ఖేచర యక్ష గంధర్వ నిలిం
పాతీత భూరి దివ్య ప్రభావ !
పావనాకార ! ధీర ! శేషావతార !
సత్త్వమయమూర్తి ! వైష్ణవ చక్రవర్తి !
భూతపురవాస ! కోవిదాద్భుత విలాస !
మానితైశ్వర్య ధుర్య ! రామానుజార్య !

వారాశి జల మొక్క చేర మేరఁగ జేసి
చెలఁగి త్రావిన కలశీభవుండు
స్రష్ట సృష్టికి మాఱు సృష్టించి వస్తు సం
ఘము భూమిపై నుంచు కౌశికుండు
తన కోపమును సముద్రమునందు బడబాహ్వ
యాగ్నిగా నుంచు మహోర్వమౌని
శ్రుతి గన్న బోధ సంతతి నెన్నియో వర్ష
ములకుఁ జూపిన వ్యాస ముని వరుండు

బద్ధ జీవులయం దొక్క ప్రాణికైన
పరమ పద మీయరైరి నీ పగిది దేవ !
భూతపురవాస ! కోవిదాద్భుత విలాస !
మానితైశ్వర్య ! ధుర్య ! రామానుజార్య !

నెలయు డెబ్బది రెండు నారకములం
దల్లాడు కష్టంబు లడఁగ జేసి
క్షణ భంగురంబులై సంసార వారిని
దుర్గమంబులైన జన్మములు వాసి
బహుళాబ్దములకైన పతనంబు గల దంచు
ఘోషించు స్వర్గాభిలాష లడఁచి
పాషాణముల రీతిఁ బడియుండు కైవల్య
వాసంబు వల దంచు నిరసించి

బద్ధ జీవాళువుల నెల్ల నుద్ధరించి
పరమపద మిచ్చితివి నీ ప్రభావ మేమొ!
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య! ధుర్య! రామానుజార్య!

వాసమై సర్వజీవ వ్రాతములఁ బ్రోచి
దీపింపఁగా వాసుదేవుఁ డయ్యె
తాల్మి దేహులకు ఆధారుఁడై నందున
నారాయణుం డని పేరు గాంచె
అఖిల భూతాళీంద్రియములకు ప్రభు వౌట
చే హృకేశ ప్రసిద్ధుఁ డయ్యె
నిరతంబు వ్యాపించి నిఖిల శరీరుల
వృద్ధి గోరుటఁ జేసి విష్ణు వయ్యె

కనుక, రక్షకుఁ డాతఁడు మన కటంచు
దెలిపి, జీవుల మోక్ష మందించినావు
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య! ధుర్య! రామానుజార్య!

సుందరీమణుల నానందింపఁ జేసిరి
 కొఱలేని ధన మిచ్చి కొంత మంది
కావ్య కన్యకు అలంకారం బొనర్చిరి
 గురు శబ్దములచేత కొంత మంది
భూకాంత మీఁద ప్రభుత్వంబు జేసిరి
 వింతగా కొన్నాళ్ళు కొంత మంది
కీర్తి కామిని వశీకృతమై వెలయుచుండ
 చింత లేకుండిరి కొంత మంది

కాని, నీ చందమున ముక్తి కాంత నేలఁ
జాలరైరి గదా యెట్టి చతురులైన
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య! ధుర్య! రామానుజార్య!

కామధేనువు - కల్పకంబు - చింతామణి
 కీర్తికి దూరమై యార్తిఁ జెందె
ఊర్వశీ - రంభా - తిలోత్తమా ముఖ వధూ
 వారముల్ భోగ విదూరులైరి
నందనారామంబు నానావిధానూన
 వైభవాస్పద మయ్యు వాసిఁ బాసె
వర నిలింప ప్రాభవము వ్యోఘ మయ్యె, అతి
 థిగులు కారని సుకాథిపుఁడు వగచె

పుణ్యములు కేశవార్పణంబుగ నొనర్చి
జీవులను నీవు ముక్తికిఁ జేర్చు నపుడు
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య ధుర్య! రామానుజార్య!

గోస్తనీ మకరంద గుడ సితాదులతో ని
రూపింపఁ దగు మంచి తీపి గలిగి
రంగ దుత్తుంగ తరంగ సంఘాత్య వా
రాశి సన్నిభ గభీరత వహించి
మేరు మందర వింధ్య పారియాత్రాది వి
శాలాద్రు లట్లు నైశ్చల్య మొంది
స్ఫటికాద్రి సురనదీ సంకాశమై, సదా
తనరారు పావనత్వము వహించి

భూతములఁ బ్రోచు నీ దయాపూర్తి సెన్నఁ
గా వశం బౌనె యెంతటి ఘనులకైన!
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య! ధుర్య! రామానుజార్య!

ఆంజనేయుఁడు రాక్షసానీకముల ద్రుంచి
తామరచూలి పదము గడించె
ఫల్గునుండు విరోధి బలములఁ దునుమాడి
గత రాజ్యలక్ష్మి నగ్రజున కిచ్చె
లలి పక్షిపతి నిలింపులఁ గొట్టి దాస్యంబు
దొలఁచి తల్లికి మహా తుష్టిఁ గూర్చె
నీవు తురుష్క భూనేత నోడించి, సె
ల్వపిళ్ళఁ దెచ్చి పేర్వడసినావు

విష్టత్రయమందు శ్రీవిష్ణుపాద
భక్తులే గద జయలక్ష్మిఁ బడయువారు
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య! ధుర్య! రామానుజార్య

పాణయోగీంద్రుని భగవదాలయమునఁ
జేర్చి యాళ్వారుగా జేసినావు
మారనేరి వ్రణంబు మాన్పి, యానాడె
జేర్చి వైకుంఠ మొందించినావు
పంచమజాతి సంభవుల న య్యాదవా
చలమున హరి మహోత్సవము వేళ
అచ్యుత దర్శనం బంది భజింపుఁడీ
యని, వరం బిచ్చి యూరార్చినావు

కాన, మహనీయులైరిపో హీనజాతి
మానవులు మున్ను నీ దయా మహిమ చేత
భూతపురవాస ! కోవిదాద్భుత విలాస !
మానితైశ్వర్య ! ధుర్య ! రామానుజార్య !

రంభాది కామినీ రతిఁ గోరి యాగముల్
సలుపు యజ్వల యందు నిలువలేక
బహువిధ మహిమ సంపాదింపఁగోరి, యా
గము లొనర్చెడువారిఁ గదియలేక
పర వాదులను నిరంతరము గెల్వఁ దలంచు
పండిత చ్ఛటలలో నుండలేక
క్షుద్ర దేవతల భాసుర నిష్ఠ సేవించు
వారి తలపులందు వాలలేక

రక్కొనుచు వచ్చి భూరి వైరాగ్యలక్ష్మి
నీ హృదంభోజమునఁ జేరి నిలిచియుండె
భూతపురవాస ! కోవిదాద్భుత విలాస !
మానితైశ్వర్య ! ధుర్య ! రామానుజార్య !

సరవి మాయావాది జనముల నోడించి
చార్వాకు లగు వారి గర్వ మడంచి
జైన మతస్థుల చాకచక్యము మాన్పి
బౌద్ధ సిద్ధాంతులం బాఱద్రోలి
పాషండు లగు వారి శోషింపంగా జేసి
పరగ వామాచారపరుల నోడ్చి
నాస్తికాధములకు శాస్తి జేసియు ధాత్రి
శాక్తేయులను నిరుత్సాహ పరచి

ఆపనిషత్తుల కర్థంబు లున్న రీతి
తథ్యముం దెల్పినావుగదా మహాత్మ !
భూతపురవాస ! కోవిదాద్భుత విలాస !
మానితైశ్వర్యధుర్య ! రామానుజార్య !

బ్రహ్మసూత్రములకు భాష్యంబు రచియించి
వ్యాస మతమును వృద్ధిం జేసినావు
రామాయణార్థ సారము వెల్లడించి నా
కూద్భ్యాతునకు కీర్తి నొసంగినావు
విష్ణుపురాణంబు వెన ప్రమాణంబుగాం
గొని పరాశరు కీర్తి బెనంచినావు
తాలిమి మీఱ గీతాభాష్య మొనరించి
వేదాంత వృద్ధిం గావించినావు

పృథివిలో సంతటన్ శ్రీహరి ప్రభావ
మీవు వివరింపకుండిన నెవ్వం డెఱుంగు ?
భూతపురవాస ! కోవిదాద్భుత విలాస !
మానితైశ్వర్య ! ధుర్య ! రామానుజార్య !

కుల గౌరవంబుఁ గైకొనె ఫలం బని కుతూ
హలము ప్రాపించె బ్రాహ్మణ జనంబు
తమ గృహస్థాశ్రమ ధర్మ మీనాఁడె చూడఁగా
ఫలియించె ననిరి నీ తలియుఁ దండ్రి
తన పేరు విఖ్యాతిఁ గాంచె గదా యంచు
బూధూరు పుర లక్ష్మి పొదలఁ దొడఁగె
ఏ తపోమహిమచే నిది లభించె నటంచు
జోద్యంబుఁ జెంది రాసూరివారు

చెలఁగి భూతంబులకు మేలు సేయఁగోరి
నీవు హరి శాసనముచే జనించునాఁడు
భూతపురవాస ! కోవిదాద్భుతవిలాస !
మానిత్రైశ్వర్య ధుర్య ! రామానుజార్య !

వేదాంత శాస్త్రంబు వివరింప నీ కంటె
ఘనులు లేరని వాణి గౌరవించె
బదరికాశ్రమ మందు పారికాంక్షులు భవ
చ్ఛాస్త్రార్థములు మెచ్చిసంత సనిరి
వివిధ మతస్థులై వెలయు పండితుఁ ని
న్వాదింప వచ్చి, తా మోడి చనిరి
తత్త్వవేత్తల మంచు దాసివాద మొనర్చ
శిష్టు లెందరో నీకు శిష్యులైరి

వరఁగ నీకు గురుఁడైన పెరియనంబి
నిను జగద్గురుం డని మెచ్చి వినతిఁ జేసె
భూతపురవాసి ! కోవిదాద్భుత విలాస !
మానిత్రైశ్వర్య ! ధుర్య ! రామానుజార్య !

అతి పురాతనమైన నీ యజ్ఞోపవీతంబు
కాలపాశము భంగి కానఁబడియె
వాసిగైకొన్న భవత్త్రిదండము యమ
దండంబు రీతి నుద్దండ మయ్యె
పొలుపారు భవదూర్ధ్వ పుండ్రంబు ప్రాగ్భార
భీతిఁ గూరుచు ధూమకేతు వయ్యె
పావక కంధరప్రంబులౌ తులసీ స
రంబు లాదిత్య కరంబు లయ్యె

వేద బాహ్యమతస్థులై వెలయు పాప
కారి జనులకు తత్క్రూరతాంహస్సు వాఁన
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య ధుర్య! రామానుజార్య!

వసుధలో పదియారు వర్షముల్ జరిగిన
ప్రాయ మందున నీవు భార్య విడచి
యతి ధర్మమున నుండి శతముపై నిర్వది
సంవత్సరము లుర్విఁ సంచరించి
క్షుత్పిపాసల కోర్చి, సుఖ నిద్రలను మాని
జను లుండుకడ కేగి సంతతంబు
బోధించి సిద్ధాంతమునఁ జేర్చి పాపముల్
పాపి, కేశవ పాదభక్తి నేర్పి

మొనసి నిర్వాణ పదమున కనిపినావు
నీ దయాగుణ మెవఁడు వర్ణింప నేర్చు?
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య! ధుర్య! రామానుజార్య!

శ్రీభాష్యకారాఖ్యఁ జెందనేరరు గాని
భాష్యముల్ నేయు నేర్పరులు లేరె?
బ్రాహ్మిచే సన్నుతి బడయ యోగ్యులు గారు
గాని, కోవిద జనాగ్రణులు లేరె?
యతిరాజ విఖ్యాతి నందఁజాలరు గాని,
సంస్తుతి విడుచు సజ్జనులు లేరె?
ఘన జగద్గురు కీర్తి గాంచనేరరు గాని,
ధరణి వేదాంత బోధకులు లేరె?

ఇన్ని బిరుదంబు లొందు నీ కెన్నరాని
విష్ణుసేవా ఫలంబెకా విబుధవర్య!
భూతపురవాస! కోవిదాద్భుత విలాస
మాన్యతైశ్వర్య ధుర్య! రామానుజార్య!

ఆశ్రిత దోషంబు లధిక భోగ్యములుగా
చవిఁజూచు నీదు వాత్సల్య గుణము
మాంద్య శాఖిల నీచ మానవులను ప్రవే
శించి లాలించు సౌశీల్య గుణము
నూతన పాతకాన్వితులౌ దాసుల
మన్నించి ప్రోచు క్షమా గుణంబు
చెంతఁ జేరిన మర్త్య చింత పామరులైన
దయ మాని విడని మార్దవ గుణంబు

సేరియున్నవి నీ హృదంభోరుహమున
ఎందరో శిష్యులైరి నీ కందువలన
భూతపురవాస! కోవిదాద్భుత విలాస
మాన్యతైశ్వర్య ధుర్య! రామానుజార్య!

## శ్రీ రామానుజ ప్రశస్తి

కాళింది దేవాపగలు ఖగరాజు
రహిని నిధానము లేలు రాజరాజు
సౌందర్య నిధియై యశముఁ గన్న వలరాజు
వివిధ భోగము లందు దివిజరాజు
వేద శరీరుఁడై వెలుగొందు దినరాజు
దక్షిణ దిశ నేలు ధర్మరాజు
వక్తలపై ప్రాభవముఁ గన్న వాగ్రాజు
పశ్చిమాశ భరించు వారిరాజు

రాజులై యుండియును యతిరాజ! నీకు
సములు నగుదురె వారు సంసారు లౌట?
భూతపురవాస! కోవిదాద్భుత విలాస!
మానితైశ్వర్య! ధుర్య! రామానుజార్య!



# శ్రీవైష్ణవ మతము

# శ్రీ పాంచరాత్ర వాఙ్మయ ప్రభావము

'విద్యా భూషణ - కవితా విశారద'

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

*శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు*

## అంజలి

"నమ స్సకల కల్యాణ దాయినే చక్రపాణయే
విషయార్ణవ మగ్నానాం సముద్ధరణ హేతవే."

— (*జయాఖ్య సంహిత*)

## ఆరంభ వాక్యము

శ్రీ వైష్ణవ మతమునకు – భాగవత మత మనియు, పాంచరాత్ర మత మనియు ప్రాచీన నామములు. షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన కారణముచే విష్ణువు భగవచ్ఛబ్దముచే వ్యవహరింపఁబడు చున్నాఁడు.[1] అట్టి భగవంతునియందు భక్తి గలవారు 'భాగవతులు' అని చెప్పఁబడుచున్నారు. విష్ణు భక్తులచే ఉపాసింపఁబడు మత మగుటచే, ఈ మతము – 'వైష్ణవ మత' మను పేర విఖ్యాతి గాంచినది. ఈ మతమునకు పాంచరాత్ర వాఙ్మయము మూలాధార మైనందున, ఇయ్యది – 'పాంచరాత్ర మత' మని వ్యవహరింపఁబడుచున్నది.

## పాంచరాత్ర ఉదయ కాలము

పాంచరాత్ర మత వైశిష్ట్యము మహాభారత శాంతి పర్వము నందలి నారాయణీయోపాఖ్యానమున (౩౩౫ అధ్యాయము మొదలు

---

1· విష్ణు పురాణము : 6 – 5 – 74 శ్లో ॥ మొదలు 79 శ్లోకము వఱకు·

351 అధ్యాయముల వఱకు) నిరూపింపఁబడినది. దీనిని పరిశీలించినచో - నారద మహర్షి పాంచరాత్ర శాస్త్ర రహస్యములను తెలిసికొనఁ దలచి, భారత దేశమునకు ఉత్తరమునఁ గల శ్వేత ద్వీపమునకుఁ బోగా, అచట నివసించు శ్వేత వర్ణీయులు దివ్య ప్రభలతో ప్రకాశించుచు - నారాయణుని ఆరాధించుచుండి రనియు, నారదుని ప్రార్థనను మన్నించి, నారాయణుఁడు ఈ మత రహస్యములను నారదున కుపదేశించె ననియు, అనంతరము నారదుడు ఈ భక్తి విశేషములను భారతదేశమున వెల్లడించె ననియు తెలియుచున్నది.

## సాత్త్వతుల పరిచయము

పాంచరాత్రమునకు - 'సాత్త్వత' మను నామాంతరము కలదు. ఇయ్యది చరిత్ర ప్రసిద్ధి కలిగి, విశిష్ట స్థాన మాక్రమించి యున్నది. విష్ణు సహస్రనామములకు ఒక భాష్యకారుఁడు సాత్త్వత పదమునకు - 'భాగవత మతానుయాయులు' అను సామాన్య మగు అరమునే వ్యుత్పత్తిచే వెలువరించెను. కాని, మాన్యులైన చరిత్ర పరిశోధకుల దృష్టిలో - ఉత్తర భారతమున శూరసేన మండలమున నివసించు క్షత్రియ జాతియే 'సాత్త్వత' మను పేర వ్యవహరింపఁబడు చున్న దనియు, ఈ సాత్త్వత క్షత్రియ వంశమునకు అత్యంతిము ప్రాముఖ్యము గల దనియు, ఈ వంశమున వైష్ణవ మతము విశేషముగ ప్రచారము జరిగె ననియు, ఈ కారణము వల్లనే ఈ మతము - 'సాత్త్వత మత' మను పేర వ్యవహరింపఁబడుచుండెననియు, సాత్త్వత ప్రజలు, శ్రీకృష్ణు డవతరించిన యాదవ కుల సంజాతులు నగు క్షత్రియులు - ఈ మతమును విశేషముగ ప్రచారము గావించి రనియు విశద మగు చున్నది.[2]

2 'Satvatas' By Dr S K Aiyangar (Proceedings of the Second Oriantal Confarance, Calcutta – 1923, P 353)

మగధ రాజగు జరాసంధుని నాయకత్వమున ప్రాచీన ప్రభువులు సాత్త్వతులపై దండెత్తిన కారణముచే, ఈ సాత్త్వతులు తమ్ము రక్షించుకొనుటకై శూరసేన దేశమును విడచి, భారత దేశమందలి పశ్చిమ తీరమునకుఁ జేరిరి. ఇచటి నుండియే వీరు - విదర్భ, మైసూరు మొదలగు సుదూరముగాఁ గల దక్షిణ భారతమున కేతెంచి నివసింప సాగిరి. ఈ రీతిగా సాత్త్వతుల రాక వలన, దక్షిణ భారతమున పాంచరాత్ర సంప్రదాయము ప్రచార మయ్యెను. దక్షిణ భారతమున రాజు లనేకులు - తమ సాత్త్వత వంశజుఁ డగు శ్రీకృష్ణుని చరిత్రతో తమ వంశ చరిత్రను మేళవించి, తమ ఘనతను ఉగ్గడింపసాగిరి. దానికి ఉదాహరణముగ - పూర్వోక్త మగు మైసూరు రాజ్యమును పాలించు 'ఇరున్ గోవెడ్' అను తమిళ ప్రభువు - తాను ద్వారక యందలి కృష్ణుని 49 - వ వీర మని చెప్పినట! ఇట్టి ప్రమాణములనుఁ బట్టి, సాత్త్వత వంశీయు లగు క్షత్రియుల వల్లనే ద్రవిడ దేశమున వైష్ణవ మతము విశేషముగ వ్యాపించినట్లు తెలియవచ్చుచున్నది.*

పాంచరాత్ర మతము ఉత్తర భారతమున నుదయించినను, ఈ సాత్త్వతుల ప్రయత్న విశేషము వలనను, ప్రభావ విశేషము వలనను దక్షిణ భారతమున పరివ్యాప్త మయ్యెను. ఈ సిద్ధాంతము మిక్కిలి మహత్త్వ మైనది. ఇయ్యది పాశ్చాత్య పండితుల ప్రశంసలకు సైతము పాత్ర మయ్యెను.

సాత్త్వతులను గుఱించిన ఈ వివేచనము వలన, పాంచరాత్రము యొక్క ప్రాచీనత వ్యక్త మగుచున్నది గదా! అదియునుఁ గాక, ఐతరేయ - శతపథాది ప్రాచీన తమ బ్రాహ్మణములలో సాత్త్వతుల నామము ఉల్లేఖింపఁబడుటనుఁ బట్టియు - దీని ప్రాముఖ్య

---

Dr S K Aiyangar's 'Parama Samhita' Introduction 15-17 Pages (G.O. S.No. 86-1940)

మును గ్రహింపవచ్చును. ఇంద్ర మహాభిషేక ప్రస్తావమున, ఇంద్రుఁడు 'భోజుఁ' డను పేర అభిషిక్తుఁ డయ్యెనని చెప్పఁబడినది. ఐతరేయ బ్రాహ్మణమున - సాత్వతులు దక్షిణ భారతమున నివసించినట్లు తెలుపఁబడినది.

చరిత్ర కాలమున - 'భోజ', 'మహా భోజ' శబ్దములు విదర్భ నుండి మైసూరు వఱకు గల ప్రాంతము లందలి అధిపతుల నుద్దేశించి ప్రయోగింపఁబడినవి. ఇందువలన, ఈ సాత్వతుల నివాస స్థానము మార్పుఁ జెందినట్లు తెలియుచున్నది.

## పాంచరాత్రము - భాగవతము

ప్రాచీన వైష్ణవ సంప్రదాయమునకు - భాగవత మతము పాంచరాత్ర మతము అను రెండు పేర్లు కానవచ్చును. ఈ పాంచ రాత్ర మతము నేఁటికిని భారత దేశమం దంతటను పరివ్యాప్తమై యలరారుచున్నది. ఈ సంప్రదాయమున ముఖ్యమగు ఆరాధ్య దైవము వాసుదేవుఁడు. ఈ వాసుదేవ శబ్దమునకు - జగము లన్నియు తన యందుఁ గల దేవుఁ డనియు, జగమునం దంతట వ్యాపించియుండు దేవుఁ డనియు అర్థములు. అట్టి వాసుదేవుఁడే జ్ఞాన శక్త్యాది షడ్గుణ సంపన్నుఁ డైనందున భగవ చ్ఛబ్దముచే వ్యవహరింపఁబడుచున్నాఁడు, అట్లే, ఈ మతానుయాయులు - 'భాగవతులు' అను పేర వ్యవహ రింపఁబడుచున్నారు. 'భగవతి భక్తాః భాగవతాః' అను వ్యుత్పత్తిచే, భగవంతునియందు భక్తి కలవారు 'భాగవతు' లని స్పష్టమగు చున్నది. వైష్ణవ మతమునకు పాంచరాత్ర మత మనియు పేరు వచ్చి నందున, పాంచరాత్రాగమ శాస్త్రములలో - 'భాగవతులు' అను శబ్దముకూడ పలు తావులలో ప్రయోగింపఁబడినది.

## వైష్ణవాచార్యులు - పాంచరాత్రము

శ్రీవైష్ణవ మతమునకుఁ జెందిన ఆచార్య వర్యులు పాంచ రాత్రమును వేదానుగుణ మైనదానినిగా నిరూపించుటలో - విశేష

పరిశ్రమ గావించిరి. శ్రీమద్రామానుజులు తమ బ్రహ్మసూత్ర భాష్యమునందలి ఉత్పత్త్యసంభవాధికరణమున (2-2-42) పాంచరాత్రమును బహు భంగుల ప్రస్తుతించి యున్నారు. అదియునుఁ గాక, సాత్త్వత - పరమ - పౌష్కరాది సంహితలను ప్రమాణ గ్రంథములుగా గైకొని, తమ శ్రీభాష్య రచనను కొనసాగించిరి. శ్రీ రామానుజుల కంటెను పూర్వమే వారి పరమాచార్యులగు శ్రీ యామునాచార్యులు - శ్రీ పాంచరాత్ర శాస్త్ర ప్రాశస్త్యమును, ప్రామాణికతను, తాము రచియించిన 'ఆగమ ప్రామాణ్య' మను గ్రంథమున నుగ్గడించుచు, అందు - ఈశ్వర, పరమ, శాండిల్య, సనత్కుమార, పద్మోద్భవాది సంహితలను ప్రమాణ గ్రంథములుగా పేర్కొని యున్నారు. శ్రీ రామానుజుల యనంతరము శ్రీ వేదాంత దేశికులు - జయాఖ్య, పారమేశ్వర, పౌష్కర, నారదీయ, సాత్త్వత, అహిర్బుధ్న్య, భార్గవ, విహగేంద్ర, హయగ్రీవాది సంహితలను ప్రమాణ గ్రంథములుగా గైకొని, 'పాంచరాత్ర రక్ష' అను పేర నొక గ్రంథమును రచించుచు, అందు - పాంచరాత్ర మత వైశిష్ట్యమును బహుభంగుల ప్రశంసించి యున్నారు.

## పాంచరాత్ర వాఙ్మయము

శ్రీ పాంచరాత్ర వాఙ్మయ మంతయు సంహితలుగా విభజింపఁ బడి, భగవచ్ఛాస్త్రముగా విఖ్యాతి గాంచి యున్నది. ఈ సంహితలు అష్టోత్తర శత (108) సంఖ్యలో నున్నట్లును, అవి సాక్షాత్తుగా భగవన్ముఖోద్గతము లగుటచే, మిక్కిలి ప్రాముఖ్యమును పొందియున్నట్లును శాస్త్ర పరిశోధకులు స్పష్టీకరించి యున్నారు. 'ఆటో ష్రాడర్' అను ప్రముఖ పాశ్చాత్య పండితుఁడు రచించిన 'Introduction of the Pancharatra' (పాంచరాత్ర పరిచయము) అను గ్రంథమున, 6 - వ పుట నుండి 12 - వ పుట వఱకు - ప్రముఖము లగు అష్టోత్తర శత

సంహితల నామములే గాక, మొత్తము 215 సంహితల పేర్లు పేర్కొనబడినవి. కాని, వానిలో నేడు కొన్ని సంహితలు మాత్రమే లభించుచున్నవి. లభ్యమగుచున్న సంహితలలో - శ్రీ భగవద్రామానుజులు తమ శ్రీభాష్య రచనలో ప్రమాణములుగా గైకొన్న సాత్త్వత, పరమ, పౌష్కర సంహితలలోని విశేషములను ఇట మున్ముందు గ్రహించి, అనంతరము మఱి కొన్ని ప్రముఖ సంహితలను పరిశీలింతము.

సాత్త్వత సంహిత :-

ఈ సంహిత విశేష ప్రాముఖ్యము గలదగుటచే, మహాభారతమునందును, మఱి కొన్ని సంహితాదులయందును దీని వైశిష్ట్యము గ్గడింపబడినది. 25 అధ్యాయములు గల యీ సాత్త్వత సంహితలో - శ్రీమన్నారాయణుని చతుర్వ్యూహములు, ఆ వ్యూహముల స్వరూపములు, ఆ స్వరూపములు గల అర్చామూర్తులు, ప్రతిష్ఠా విధులు, పూజా విధానములు మున్నగునవి వివరింపబడినవి.

ఈ సాత్త్వత సంహితలో - నారద మహర్షి వృత్తాంత మొకింత వ్యక్తీకరింపబడినది. దీనినిఁ బట్టి, ఆ మహర్షి మలయాచలముపై ఒకానొకపుడు పరశురామునితోఁ గలిసికొనుట తటస్థించె ననియు పరశురాముఁ డపుడు - విష్ణు లోకమునఁ గల మహర్షులకు భగవచ్ఛాస్త్ర రహస్యముల నుపదేశింపవలసిన దని నారద మహర్షిని కోరె ననియు, త దనుసారము నారదుఁడు ఆ మహర్షుల కడ కేఁగి, తనకు పరంపరగా లభించిన రహస్యామ్నాయ మగు ఈ పాంచరాత్ర శాస్త్రమును వారికి ఉపదేశించుచు - 'శ్రీమన్నారాయణుఁడే పరమ దైవ' మని నిరూపించి చెప్పె ననియు తెలియుచున్నది. అదియునఁ గాక,

ఈ సంహితలో అష్టాంగ యోగములు వివరింపఁబడినవి. వేద మార్గమున కనుసరించు భక్తప్రపన్నులకు చతుర్వ్యూహములఁ బూజించు నధికారము గల దని తెలుపఁబడినది. నిగూఢము లగు పూజా విధానము లనేకములు మంత్రముల మూలమున విశదీకరింపఁబడినవి. ఇట్టి విశిష్ట విషయములతోఁ గూడిన దగుట వలననే ఈ సాత్త్వత సంహిత — శ్రీ పాంచరాత్ర వాఙ్మయమున ప్రముఖ స్థాన మాక్రమింపఁ గల్గు చున్నది. ఈ శ్రేణికిఁ జెందిన మఱి కొన్ని సంహితలు — ఈ పాంచ రాత్ర వాఙ్మయ ప్రపంచమున ధ్రువతారల వలె ప్రకాశించు చున్నవి.

పరమ సంహిత :—

ఈ సంహితలో 39 అధ్యాయము లున్నవి. వీనిలో — సృష్టి క్రమము, దీక్షా విధి, అర్చనా విధానము మున్నగు విషయములు విపులముగాఁ దెలుపఁబడినవి 10 - వ అధ్యాయమున ప్రత్యేకముగా - యోగముల వైశిష్ట్య ముగ్గడింపఁబడినది. ఇందు - కర్మ యోగము కంటెను జ్ఞాన యోగము శ్రేష్ఠ మైన దనియు, ఈ రెండు యోగ ములును సాధకునకు ఆవశ్యకములే యనియు తెలుపఁబడినది. జ్ఞాన యోగమున ఇంద్రియ నిగ్రహము, ప్రాణాయామ - ప్రత్యాహార - ధ్యాన - ధారణ - సమాధు లావశ్యకము లని బోధింపఁబడినది. యోగముచే సాధకుఁడు సంసార బంధముల నుండి విడివడగా, అవు డతఁడు తన చిత్తవృత్తిని భగవ దాయత్తము చేయును. పాంచ రాత్రుల కర్మయోగము కేవలము విగ్రహారాధన మందే పరిమితమై యున్నది.

పౌష్కర సంహిత :—

ప్రాచీన సంహితలలో ఇది యొకటిగా ప్రసిద్ధము. ఇందు 43 అధ్యాయము లున్నవి. విగ్రహారాధనము, యజ్ఞము, అంత్యేష్టి

మున్నగు విషయము లిందు వివరింపఁబడినవి ఇందలి 'తత్త్వ సంఖ్యాన' మను విభాగమున, దార్శనిక విషయము లనేకములు వివరింపఁబడినవి.

ఈశ్వర సంహిత :—

ఇందు 24 అధ్యాయము లున్నవి. వీనిలో 16 అధ్యాయములు కేవలము అర్చనావిధానమును బోధించుచున్నవి మిగిలిన అధ్యాయము లందు - అర్చా మూర్తులలోఁ గల భేదములు, దీక్ష ధ్యానము, మంత్రము, ప్రాయశ్చిత్తము మొదలగు విషయములు ప్రస్తావింపఁ బడినవి. ఇందలి సారాంశ మిది :—

ఏకాయనమున వేద సార మంతయు ఇమిడి యున్నది ఇయ్యది వాసుదేవునిచే నుత్పన్నమై, సృష్ట్యాది నుండియు లోకమున ప్రచలిత మగు చున్నది. ఇది సకల వేదములకును మూలము. ఇట్టి ఏకాయన వేద విజ్ఞానమును జగన్నాథుఁ డగు శ్రీమన్నారాయణుఁడు - సనక, సనందన, సనత్సుజాతుల వంటి కతిపయ పరమైకాంతులకు ప్రసా దించెను. అటు పిమ్మట - అత్రి, అంగిరస, పులస్త్య, పులహ, క్రతు, వసిష్ఠ, స్వాయంభువు లను మహర్షులు - ఈ ఏకాయన వేద విజ్ఞాన మును శ్రీమన్నారాయణుని నుండియే పొందిరి. ఈ ఏకాయన వేదము ననుసరించి - ఒకవంక పాంచరాత్ర సంహితలు, మఱియొక వంక మన్వాది ధర్మ శాస్త్రములు రచింపఁబడినవి. ద్వాపరాంతమునను, కలియుగారంభమునను శాండిల్య మహర్షి చిర కాలము ఘోర తప మాచరించి, సంకర్షణుని నుండి ఈ ఏకాయన వేద తత్త్వమును పరి పూర్ణముగ గ్రహించినవాఁడై, సుమంతు, జైమిని - భృగు - ఔప గాయన - మౌంజ్యాయను లను మహర్షులకు ఈ తత్త్వము నుపదే శించెను. శాండిల్య - ఔపగాయన - మౌంజ్యాయన - కౌశిక - భర ద్వాజ మహర్షు లైదుగురును విష్ణు భగవానుని పంచాయుధముల యంశలు గలవారు. వారికి శ్రీమన్నారాయణుఁడు అయిదు అహో

రాత్రములు ఏకాయన వేదమును ఉపదేశించెను. ఇయ్యదియే పాంచరాత్ర మను పేర లోకమున సువిఖ్యాత మయ్యెను.

శ్రీమన్నారాయణునిచే ఉపదేశింపఁబడిన ఈ ఏకాయన వేదము సాత్త్విక శాస్త్రముగా సుప్రసిద్ధము. మహర్షులచే రచింపఁబడిన శాస్త్రములు రాజసము లనియు, సాధారణ మానవులచే రచింపఁబడిన శాస్త్రములు తామసము లనియు చెప్పఁబడుచున్నవి.

"చతుర్థా భేద భిన్నోఽయం పాంచరాత్రాఖ్య ఆగమః
పూర్వ మాగమ సిద్ధాంతం, ద్వితీయం మంత్ర సంజ్ఞికమ్
తృతీయం తంత్ర మిత్యుక్తం అన్యత్ తంత్రాంతరం భవేత్."

ఆగమము, మంత్రము, తంత్రము, తంత్రాంతరము అను నాలుగు పేర్లతో - శ్రీపాంచరాత్ర వాఙ్మయము నాలుగు విధము లుగా విభజింపఁబడినది. ఈ వాఙ్మయము - దివ్య మనియు, ముని భాషిత మనియు ద్వివిధము. సాక్షాత్తుగా భగవన్ముఖోద్గతమైన వాఙ్మయము దివ్యము. మహర్షుల వాఙ్మయము ముని భాషితము. ఇట్టి విశేషాంశములతోఁ గూడిన ఈ ఈశ్వర సంహిత - విశిష్ట విషయ సమన్వితమై, విజ్ఞాన దాయకమై విలసిల్లుచున్నది.

**శ్రీమన్నారాయణ సంహిత -**

శ్రీ పాంచరాత్ర సంహితలలో ఇది అత్యంతము ప్రముఖ మైనదిగను, ప్రధానమైనదిగను సంభావింపఁబడుచున్నది. ఇయ్యది - శ్రీమదష్టాక్షర విధాన జప వైభవ కాండ మనియు, శ్రీ మదష్టాక్షర యజ్ఞ వైభవ కాండ మనియు, శ్రీమదష్టాక్షర విధాన ఇష్టి వైభవ కాండ మనియు మూడు విభాగములుగాఁ గలదు. ఒక్కొక్క కాండ మున 12 అధ్యాయముల చొప్పున, మూడు కాండలలో మొత్తము 36 అధ్యాయము లున్నవి.

ఈ నారాయణ సంహితలో ముఖ్యముగా - అష్టాక్షర మహా మంత్రము సర్వార్థములను సిద్ధింపఁజేయు ననియు, సర్వారిష్టములను నివారించు ననియు, ధర్మార్థ కామ మోక్షము లనఁబడు చతుర్విధ పురుషార్థములకు సాధన మనియు, ఈ మహా మంత్రమును జపముగఁ గాని, హావనముగఁ గాని అనుసంధింపవలె ననియు తెలుపఁబడినది. అదియునుఁ గాక - విష్ణు, శ్రీమహావిష్ణు, నారాయణ, శ్రీ మహా నారాయణ, శ్రీ లక్ష్మీనారాయణ యజ్ఞము (సహస్ర హోమ కుండ మహా క్రతువు) అనఁబడు పంచ విధ యజ్ఞ నిర్వహణ విధానములు, యజ్ఞ ఫలములు విపులముగాఁ దెలుపఁబడినవి. అదియునుఁ గాక, కోటి తులసీ పత్రాది పూజా విధియు, లక్ష కుంకుమార్చనా విధియు ఇందు వివరింపఁబడినవి.

**హయశీర్ష సంహిత :-**

ఇందు నాలుగు భాగము లున్నవి. మొదటి భాగము ప్రతిష్ఠా కాండము. ఇందు 40 అధ్యాయములు కలవు. రెండవది సంకర్షణము. ఇందు 37 అధ్యాయము లున్నవి. మూఁడవది లింగము ఇందు 20 అధ్యాయములు కలవు. కడపటి నాల్గవ భాగ మగు సౌర కాండమున 45 అధ్యాయము లున్నవి. విగ్రహ ప్రతిష్ఠా విధులు, వాని నిర్మాణ విధానములు ఈ సంహితలో విపులముగాఁ దెలుపఁబడినవి.

**పారమేశ్వర సంహిత :-**

ఇందు మొదటి అధ్యాయమున -

> " ద్వాపరస్య యుగస్యాంతే ఆదౌ కలియుగస్య చ
> సాక్షాత్ సంకర్షణాత్ భక్తాత్ ప్రాప్త ఏష మహత్తరః
> ఏష ఏకాయనో వేదః ప్రఖ్యాత స్సాత్త్వతో విధిః "

అను శ్లోక వాక్యము లుండుటనుబట్టి, ద్వాపరాంతమునను, కలియుగ ప్రారంభమునను సంకర్షణుని నుండి ఏకాయన వేద మనఁబడు సాత్త్వత విధి లోకమున ప్రచురమై నట్లు తెలియవచ్చుచున్నది.

విష్ణు తత్త్వ సంహిత -

ఇందు 39 అధ్యాయములు లున్నవి. వీనిలో - విగ్రహారాధనము, వైష్ణవ దీక్ష, తప్తచక్రాంకనము, పవిత్రీకరణము మొదలగు విధి విధానములు బోధింపఁబడినవి.

పరాశర సంహిత

ఇందు భగవన్నామ ప్రభావము, మంత్ర జప విధి మొదలగు విషయములు విపులీకరింపఁబడినవి. ఇట్లే, పాద్మ - పారమేశ్వర సంహితలు కూడ, మంత్ర జప వైశిష్ట్యమును బోధించునవియై యున్నవి.

బృహద్బ్రహ్మ సంహిత :-

ఇందు విష్ణు భగవానుని లీలా విశేషములు విపులముగా అభివర్ణింపఁబడినవి. విష్ణువునకు, ఆతని లీలకును భేద మేమాత్రము లేదనియు, రాధయు లీలా రూపిణియే యనియు, గోలోకమున ఈ లీల - నిత్యము, నిరంతరము సూక్ష్మ రూపమున ప్రవర్తిత మగుచున్న దనియు ఇందు తెలుపఁబడినది. ఈ సంహితలో - తృతీయ పాదము నందలి ద్వితీయాధ్యాయమున గోపికా గణములు వర్ణింపఁబడినవి

జయాఖ్య సంహిత :-

ఈ సంహితలో మొదటి పటలమున - పాంచరాత్ర శాస్త్ర ప్రస్తావన ఇట్లు చేయఁబడినది :-

"పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణ స్స్వయం
సాత్త్వతం పౌష్కరం చైవ జయాఖ్యం తంత్ర ముత్తమమ్
రత్న త్రయ మితి ఖ్యాతం త ద్విశేష మిహోచ్యతే
సారం సాత్త్వత శాస్త్రస్య రహస్యం ప్రాజ్ఞ సమ్మతమ్
రత్న త్రయ మిదం సాక్షాత్ భగవ ద్వక్త్రి నిస్సృతమ్."

ఈ శ్లోకములలో - సాత్త్వత, పౌష్కర, జయాఖ్య సంహితలు రత్న త్రయముగా చెప్పఁబడుచు, ఇవి మూఁడును సాక్షాత్తుగా భగవన్ముఖోద్గతము లైనవని తెలుపఁబడినది. ఈసంహితలు మూఁడును దివ్యాగమము లని ఈశ్వర సంహితయందును ప్రశంసింపఁబడినవి.

తప స్స్వాధ్యాయ యజ్ఞ దాన తత్పరుల కైనను పరతత్త్వ జ్ఞానము లేనిచో ముక్తి దుర్లభ మనియు, అట్టి జ్ఞాన తేజమే పరమ పద ప్రాప్తికి మార్గ దర్శకము కాఁగల దనియు, అట్టి జ్ఞానము గల వారి హృదయమునందే ఆ భగవానుఁడు అధివసించుచుండు ననియు ఈ జయాఖ్య సంహితలో చెప్పఁబడినది.

మహర్షులు కొందఱు గంధమాదన పర్వతముపై, పరమ తత్త్వ జ్ఞానమును పొందుటకు శాండిల్య మహర్షి కడ కేఁగి రఁట. అవుడు శాండిల్యుఁడు వారి కిట్లు బోధించెను :- "ఈ విద్య గుహ్య మైనది ; ప్రాచీనమైనది. గురువునందు పరిపూర్ణమైన విశ్వాసము, భక్తి శ్రద్ధలు గల వారికి ఈ విద్య బోధింపఁదగినది." విష్ణువు మొట్ట మొదట దీనిని నారదున కుపదేశించెను. ఈ విష్ణు భగవానుఁడే మన కెల్లరకును రక్షకుఁడు. శాస్త్ర జ్ఞానము వల్లనే మనము ఆ దేవదేవుని తెలియఁగలము. అట్టి శాస్త్ర విజ్ఞానము గురువు ద్వారా, పొందవలసి యున్నది. కావున, సాధకునకు గురువే మార్గ దర్శకుఁ డనియు, ఆతఁడు భగవ త్సాయుజ్య ప్రాప్తికి ఆవశ్యక మగు శాస్త్ర జ్ఞానమును ప్రసాదింపఁ గలఁ డనియు తెలియ నగు' నని ఉపదేశించి నట్లు ఈ సంహిత వలన స్పష్ట మగుచున్నది.

ఈ సంహితలో - బ్రహ్మ సర్గ, ప్రకృతి సర్గ, శుద్ధ సర్గ అని సృష్టి మూఁడు విధములుగా నున్నట్లు తెలుపఁబడినది. విష్ణువు నుండి బ్రహ్మ ఉద్భవించెను. ఆతఁడు అహంకార తత్త్వము నుండి సృష్టి

రచన చేసెను. ఆతని రెండు స్వేద బిందువుల నుండి - మధు కైటభు లను దానవు లిరువురు ఉద్భవించిరి ఆ రాక్షసులు వేదముల నపహ రించిరి ఇందుచే, లోకమాతయు అపుడు క్షోభించెను. జగద్రక్షకుం డైన విష్ణువు - ఆ మధు కైటభులతో యుద్ధ మొనరించి, వారిని సంహరించి, వేదములను సంరక్షించెను.

ప్రకృతి సర్గలో - సాంఖ్య దర్శనము ననుసరించి, విశ్వము త్రిగుణాత్మకత్వ ప్రధానమైనదిగ భావించె నని చెప్పబడినది. నూనె, వత్తి, నిప్పు - అను మూడు వస్తువులు కలిసి దీప మనబడుచున్నది. ఇవి భిన్న భిన్నము లయ్యును - ఏకాత్మ లక్షణములు. ఇట్లే, సత్త్వ రజ స్తమోగుణములు మూడును భిన్నము లయ్యును, వాని కల యికే 'ప్రకృతి' అని చెప్పబడుచున్నది. సృష్టి రచనకు పూర్వము ఇవి వేర్వేరుగా నుండును. ఇవి మూడును ఏకమైనపుడే సృష్టి రచన జరుగును. ఈ గుణ త్రయము నుండి మొట్ట మొదట బుద్ధి ఆవిర్భవించును. బుద్ధి నుండి అహంకార ముత్పన్న మగును. అది - ప్రకాశాత్మ, వికృతాత్మ, భూతాత్మ అని మూడు విధములుగా రూపొందును. ప్రకాశాత్మ అనబడు సాత్త్వికాహంకారమునుండి మనస్సు, పంచ జ్ఞానేంద్రియములును, వికృతాత్మ అనబడు రాజ సాహంకారము నుండి పంచ కర్మేంద్రియములును, భూతాత్మ అనఁ బడు తామసాహంకారమునుండి పంచ తన్మాత్రలు ఏర్పడును. వాని నుండి మహా భూతము లుద్భవించును. ఇట్టి త్రిగుణాత్మిక ప్రకృతి - చేతనము, అచేతనము అని రెండు విధములుగా రూపొందుచుండును.

శుద్ధ సర్గలో - వాసుదేవుని నుండి అచ్యుత, సత్య, పురుషు లను వారు మువ్వు రుద్భవించినట్లు తెలుపఁబడినది. అతఁడు అచ్యు

తుఁడు [4] కావున, ఆ వాసుదేవుని చేతనులు ఆరాధించి, తరింపవలె నని ఇందు బోధింపఁబడినది.

ఈ జయాఖ్య సంహితలో - సత్త్వాఖ్య, క్రియాఖ్య అను రెండు విధము లగు జ్ఞానములు, అష్టాంగ యోగములు వర్ణింపఁబడినవి. భక్తుఁడు యోగ సాధన ద్వారా బ్రహ్మరంధ్రమునుండి బయలు దేరి, వాసుదేవునితోఁ గలిసి ఏకమైపోవు నని ఇందు చెప్పఁబడినది ఇందువలన, భక్తుఁ డగువాఁడు యోగ సాధన చేయుట ఆవశ్యక మని స్పష్ట మగుచున్నది. పరమ సంహితలోఁ గూడ యోగ ప్రభావము బహు భంగులుగా వర్ణింపఁబడినది. యోగ మనఁగా - జీవునకు పరమాత్మతోఁ గల్గు సంయోగమే. "సంయోగో యోగ ఇత్యుక్తో, జీవాత్మ పరమాత్మనోః" అని, అహిర్బుధ్న్య సంహిత ఈ యంశమును ధ్రువపఱచుచున్నది. మనస్సు ప్రశాంత స్థితిని, నిశ్చలతను పొందినచో - అట్టి స్థితిని యోగ మని నిర్వచింప నగును. మనస్సు కర్మపై కేంద్రీకృత మైనపుడు కర్మయోగముగను, జ్ఞానముపై కేంద్రీకృత మైనపుడు జ్ఞానయోగముగను చెప్పఁబడును. కర్మయోగమున - యమము, నియమము, వ్రతము, దానము, ఆత్మసంయమము మొదలగునవి ముఖ్యముగా నుండఁదగినవి. జ్ఞాన యోగమున - స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అనునవి నియమమునకు అంతరతముగా నుండవలెను. ఈశ్వర ప్రణిధాన మనఁగా - భక్తి యోగమే. అట్టి భక్తి యోగమువలన సాధకుఁడు భగవదనుగ్రహ పాత్రుఁడు కాఁగలఁడు.

---

4 అచ్యుతుఁ డనగా - నాశ రహితుఁడు, సత్య జ్ఞానానంద మయుఁడు, పురుషుఁడు అను విశేషణ విశిష్టుఁ డని తాత్పర్యము.

ఈ సంహితలో - పదునైదవ పటలమున - కుండ నిర్మాణము, అగ్ని ప్రతిష్ఠాపనము మున్నగు విషయములు నవి సరళముగా వివరింపఁబడినవి. ఇరువదవ పటలమున - ఆలయ నిర్మాణము, విగ్రహ ప్రతిష్ఠ, ధ్యానము మొదలగునవి తెలుపఁబడినవి.

**అహిర్బుధ్న్య సంహిత :-**

అహిర్బుధ్న్యుఁడు చిర కాలము ఘోర తప మాచరించి, సంకర్షణునినుండి సుదర్శనుని సత్య జ్ఞానమును పొందెనని ఈ సంహితనుఁబట్టి స్పష్ట మగుచున్నది. ఈ సంకర్షణుఁడు ప్రకృతిలోఁ గల సకల చేతనాచేతనములకును ఆధార భూతుఁడు అనంతుఁడు, శాశ్వతుఁడు నగు ఆతని సంకల్పము వలననే ప్రకృతి ఉదయించెను. సత్య జ్ఞానముచే జీవుని పాప పుణ్యములు సమాప్తము లైనపుడు, వాసనలు హరించినపుడు భగవ త్కటాక్షము లభించును. పరబ్రహ్మ హేయ గుణ రహితుఁడు, షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అనునవియే షడ్గుణములు ఇవి యాతను సంపూర్ణముగాఁ గలవాఁడు గనుకనే, ఆతఁడు భగవానుఁడుగా కీర్తింపఁబడుచున్నాఁడు. అతఁడు సహజముగా జ్ఞానమయుఁడు కావున, మిగిలిన ఐదు గుణములును ఆ పరమాత్మకు విశేషణములుగా నొప్పుచున్నవి. ఇత్యాది విషయములు ఈ సంహితలో వివరింపఁబడినవి

భగవంతుని శక్తి - చంద్రుని వెన్నెల వలె ఆతనిని అనవరతము వెన్నంటియే యుండును. ఈ శక్తి ఆనందమయమైనది. దీనికి - లక్ష్మి, శ్రీ, పద్మ, కమల, కుండలిని, గాయత్రి, ప్రకృతి, మాత, నారాయణి అను నామము లనేకములున్నవి. ఈ శక్తినుండి, భౌతిక - ఆధ్యాత్మిక వంప త్తులు సముత్పన్నము లగును. ఈ మొదలగు విశేషాంశములు ఈ సంహితలో మూఁడవ అధ్యాయమున వివరింపఁబడినవి.

నాల్గవ అధ్యాయమున - తాత్త్వికి విషయములు కొన్ని తెలుపఁబడినవి. అట్టి వానిలో - ఈ క్రింది యంశములు అవశ్య గ్రహణీయములై యున్నవి :-

మొట్టమొదట వృక్షము వాయువుతో శుష్కింపఁబడి, అగ్నితో దగ్ధమై, భూమిలోఁ గలిసిపోవును. ఆ భూమి జలములో, జలము తేజములో, తేజము వాయువులో, వాయువు ఆకాశములో, ఆకాశము అహంకారములో, అహంకారము బుద్ధిలో, బుద్ధి తమస్సులో, తమస్సు రజస్సులో, రజస్సు సత్త్వములో, సత్త్వము కాలములో, కాలము నియతిలో, నియతి శక్తిలో, శక్తి కూటస్థ పురుషునిలో, కూటస్థ పురుషుఁడు అనిరుద్ధునితో, అనిరుద్ధుడు ప్రద్యుమ్నునిలో, ప్రద్యుమ్నుఁడు సంకర్షణునిలో, సంకర్షణుఁడు వాసుదేవునిలో లయమగును. ఈ క్రమము నందలి చతుర్వ్యూహముల నామములు - ఇతరములగు తావులలో వర్ణింపఁబడు క్రమముతో కలియఁజాలవు.

షడ్గుణములలోని జ్ఞాన బలముతో సంకర్షణుఁడు, ఐశ్వర్య వీర్యములతో ప్రద్యుమ్నుఁడు, శక్తి తేజములతో అనిరుద్ధుఁడు ఉద్భవించిరి. ఇవి మూఁడును ఆధ్యాత్మిక వ్యూహములుగా చెప్పఁబడుచున్నవి. ఏల నన, ఇయ్యవి గుణ యుగ్మములకు పరిణామములై యున్నవి. ఇవి విష్ణువును అభివ్యక్తము చేయునవి యగుటచే, షడ్గుణములతోఁ గూడియున్నవి.

చతుర్వ్యూహములనుండి ప్రత్యేకముగా మఱి కొన్ని వ్యూహములు ఆవిష్కృతములైనవి. ఎట్లనఁగా :- వాసుదేవుని నుండి - కేశవ, నారాయణ, మాధవ, సంకర్షణుని నుండి - గోవింద, విష్ణు, మధుసూదన, ప్రద్యుమ్నుని నుండి - త్రివిక్రమ, వామన, శ్రీధర, అనిరుద్ధుని నుండి - హృషీకేశ, పద్మనాభ, దామోదర - ఈ క్రమ

మున్నగు ప్రత్యేక వ్యూహములు పండ్రెండును. పండ్రెండు మాసములకు క్రమానుసారము అధిదేవతలుగా వ్యవహరించు చుండును. ఈ పన్నిద్దఱును పండ్రెండు రాసులలో నిరంతరము సంచరించు చుందురు. ఈ వ్యూహ పరంపరయే గాక, ఇంకను 39 విభవావతార ములు గలవు ఇయ్యవి - సాధు పరిత్రాణము, దుష్ట వినాశము, ధర్మ సంస్థాపనము నిమిత్తమేర్పడినట్టివి. భగవానుఁడు అంతర్యామిగా ప్రతి అణువు నందును విలసిల్లుచున్నాఁడు. మృత్తిక చేతను, శిల చేతను, లేక - ధాతువుల చేతను నిర్మింపఁబడి, విధిపూర్వకముగా ప్రతిష్ఠింపఁబడిన విగ్రహములలో - తన విశిష్ట శక్తులతో విరాజిల్లు భగవానుని రూపము అర్చావతార మని చెప్పఁబడును. ఇట్లు - పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా రూపములతో భగవానుఁడు అయిదు విధములుగా ప్రకాశించుచున్నాఁడు. పర రూపమున నున్న తరుణమున భగవానుఁడు తన శక్తి యగు లక్ష్మితోఁ గూడి యుండును. ఇతర రూపములలో నున్నపుడు ఆ భగవానుఁడు శ్రీ భూ నీళా దేవు లను మువ్వురు దేవేరులతోఁ గూడియుండును. ఇట్టి విశేషాంశము లేగాక, ఈ అహిర్బుధ్న్య సంహితలో - ప్రపత్తి తత్త్వము మున్నగు విషయము లనేకములు వర్ణింపఁబడి యున్నవి.

**విష్ణు తిలకము :-**

ఇయ్యది ఖగేశ్వర సంహిత యందలి అంతర్భాగము. ఇందు - భగవత్సృష్టి, భగవత్స్వరూపము, దేవాలయ నిర్మాణము, అర్చా మూర్తుల ప్రతిష్ఠా విధులు, అనంత గరుడ విష్వక్సేనాది భక్త ప్రతిష్ఠా విధి, పంచ సంస్కార విధి మున్నగు విషయము లనేకములు విపులీకరింపఁబడినవి.

రత్న ద్వీపమున కల్పతరువునందు నివసించి, దివ్యామృతమును ధరించినట్టియు, పద్మాసన సమాసీన యైనట్టియు, స్వర్ణమయమైన నాభి

ప్రవేశము గల్గినట్టియు, పద్మగంధి యైనట్టియు, మఱి రెండు హస్తము లలో రెండు పద్మములను ధరించినట్టియు, నిరుపమాన సౌందర్య విరాజితయైనట్టియు, సర్వాభరణ భూషితయు నగు లక్ష్మీదేవిని శ్రీమంత్రముతో అయిదు లక్షల పర్యాయములు ధ్యానించి, జపించి, అందు దశాంశము హోమ తర్పణములు గావించినచో - లక్ష్మీదేవి యొక్క కృపా కటాక్షముచే, సాధకుఁడు విశేషమైన ఐశ్వర్యమును పొందఁ గలఁడు' అని ఈ విష్ణు తిలకములో - చతుర్థాధ్యాయమున 'శ్రీమంత్ర మహిమ' ఉద్ఘాటింపఁబడినది.

**పురుషోత్తమ సంహిత :-**

భగవద్భక్తియే భక్తులకు ముక్తికారణ మనియు, అట్టి భక్తి ప్రబోధకమైనది శ్రీ పాంచరాత్రాగమ శాస్త్ర మనియు - ఇందు నొక్కి వక్కాణింపఁబడినది. అదియునుఁ గాక, శాస్త్రావతార విధి, ఆలయ లక్షణము శిలా సంగ్రహణ విధి, దారు సంగ్రహణ విధి, ప్రతిమా మృత్సంగ్రహణ విధి, ధ్రువబేరాది విగ్రహ లక్షణము, రథాదియాన లక్షణ విధి, ప్రతిష్ఠా ముహూర్త నిర్ణయ విధి - ఇత్యాది విషయములును ఇందు విపులముగాఁ దెలుపఁబడినవి.

**పరిశిష్టము :-**

ప్రకాశ సంహితలో రెండు భాగము లున్నవి. ఇందలి మొదటి భాగమునకు పరమ తత్త్వ నిర్ణయ మని పేరు. ఇందు 15 అధ్యాయము లున్నవి, రెండవ భాగమునకు పరతత్త్వ ప్రకాశ మని పేరు. ఇందు 12 అధ్యాయము లున్నవి. ఇందు తాత్త్విక రహస్యము లనేకములు వివరింపబడినవి. మహా సనత్కుమార సంహితలో నాల్గు అధ్యాయము లున్నవి, పలుబడి పరిచ్ఛేదములతోఁ గూడిన ఈ సంహితలో - అర్చనా విధానములు సవిస్తరముగాఁ గలవు. అనిరుద్ధ సంహిత, మహోపనిషత్తు, సుదర్శన సంహిత, అగస్త్య సంహిత,

వశిష్ఠ సంహిత, విశ్వామిత్ర సంహిత, విష్ణు సంహిత మొదలగు కొన్ని సంహితలలోఁ గల యంశములు దాదాపు ఒకే రీతిగా కానవచ్చును. విష్ణు సంహితపై మాత్రము సాంఖ్య యోగ ప్రభావము కొలఁదిగాఁ గల దని భావింపఁబడుచున్నది. విష్వక్సేన సంహితను భగవద్రామానుజులు, మణవాళ మహామునులు మొదలగు పూర్వాచార్యులు పరమ ప్రమాణములుగా భావించుటనుఁ బట్టి, దీని ప్రాముఖ్యము సుస్పష్టము. నారద పాంచరాత్రాంతర్గత మగు జ్ఞానామృత సార మను సంహితలో-హారముగా కృష్ణలీలలు వర్ణింపఁబడినవి. మఱియు, మధుర భక్తి-మనో అభివర్ణింపఁబడినది.

## విశేషాంశములు

**చతుర్విధ క్రియలు :-**

శ్రీ పాంచరాత్ర సంహితలలో ముఖ్యముగా - జ్ఞానము, యోగము, క్రియ, చర్య అను నాల్గు విషయములు విశేషముగ ప్రస్తావింపఁబడినవి.

1) జ్ఞాన మనగా — దేవుఁడు, జీవుఁడు, జగత్తు — అనఁబడు తత్త్వ త్రయమును తెలిసికొనుట.

2) యోగ మనఁగా - ముక్తికి సాధన భూత మగు ఉపాయము.

3) క్రియ యనఁగా - వైష్ణవాలయ నిర్మాణ విధానములు, అర్చామూర్తులకు సంబంధించిన ఆకార వివరములు.

4) చర్య యనఁగా - శ్రీవైష్ణవులకు నిర్దేశింపఁబడిన ఆహ్నిక క్రియలు, అర్చా మూర్తుల ననుసరించి - మంత్రజప విధులు, పూజావిధానములు, ఉత్సవ విశేషములు, పరిచర్యా క్రమము.

**పంచ విధ క్రియలు :-**

శ్రీ పాంచరాత్ర శాస్త్రమున — 1) అభిగమనము 2) ఉపాదానము 3) ఇజ్య 4) స్వాధ్యాయము 5) యోగము - అను అయిదు విధము లగు క్రియలు - భగవత్కటాక్ష ప్రాప్తికి అత్యంతము ఉపయుక్తములు కాఁగల వని వ్యక్తము చేయఁబడినది

1) అభిగమన మనఁగా - మనో వాక్కాయము లనఁబడు త్రికరణములను స్వాధీనములో నుంచుకొని, దేవాలయమున కేఁగుట.

2) ఉపాదాన మనగా - పూజా ద్రవ్యములను సంపాదించుట

3) ఇజ్య యనఁగా — భగవదారాధనము.

4) స్వాధ్యాయ మనఁగా — అష్టాక్షరాది మహా మంత్ర జపము, సంప్రదాయ గ్రంథ పఠనము.

5) యోగ మనఁగా - ధ్యానము.

ఈ పంచ విధ క్రియలను నియమ యుక్తముగా, భక్తి ప్రపత్తులతో సమాచరించు సాధకునకు — సాత్త్వతాం పతి యగు వాసుదేవ భగవానుని యనుగ్రహము తప్పక లభింపఁగల దని శ్రీ పాంచరాత్ర శాస్త్రము నొక్కి వక్కాణించుచున్నది.

**దివ్య సందేశము :-**

భగవానుఁడు భక్తవత్సల బిరుదాలంకృతుఁడు. ఆతని యనుగ్రహ బలము వలననే చేతనులు ఈ భవ సాగరమునుండి తరింపవలసి యున్నది. అట్టి భగవదనుగ్రహ బలమును సంపాదింపవలె నన్న, భక్తియే ఉత్తమమైన మార్గము. అట్టి భక్తి మార్గము కంటెను ప్రపత్తి మార్గము అతి విలక్షణమై, మహా ఫలప్రదమై విలసిల్లు చున్నది. కావున, అట్టి భక్తి ప్రపత్తులతో చేతనులు భగవదాజ్ఞా

ధన మాచరించి కడతేరుట శ్రేయస్కర మని - ఈ పాంచరాత్ర శాస్త్ర మొక్క దివ్య సందేశ మొసంగుచున్నది.

## ఉపసంహారము

భగవచ్ఛాస్త్రముగా ప్రసిద్ధి గాంచిన శ్రీ పాంచరాత్ర వాఙ్మయము భగవన్ముఖోద్గతమైనది. పంచమ వేద మని ప్రసిద్ధి గాంచిన మహాభారత శాంతి పర్వాంతర్గత మగు మోక్ష ధర్మ పర్వమున - ఈ పాంచరాత్ర శాస్త్ర వైశిష్ట్యము - సవిస్తరముగా నిరూపింపఁబడినది. శాండిల్యాది మహర్షులు - ఈ పాంచరాత్ర శాస్త్రమును ప్రచారములోనికిఁ దెచ్చిరి. ముముక్షువులకు ఇయ్యదియే మార్గదర్శకమై యున్నది. శఠకోపాది సూరి వరేణ్యులు ఈ శాస్త్ర విశేషములను తమ తమ దివ్య ప్రబంధములలో ప్రవచించి, ప్రసిద్ధి గాంచిరి. నాథ, యామున, రామానుజ, వేదాంత దేశిక, మణవాళమహాముని ప్రభృతి ఆచార్య వర్యులు ఈ పాంచరాత్ర ఆగమ శాస్త్రమును ప్రమాణముగా గైకొని, వైష్ణవ మత ప్రబోధకములైన గ్రంథములను రచించుచు, ఈ మతమును సుప్రతిష్ఠితము గావించిరి. ఇట్టి యీ పాంచరాత్ర వాఙ్మయము పరిమాణమున అతి విస్తృతమైనది. విశ్వకల్యాణ దాయక మగుట చేతను, విజ్ఞాన దాయక మగుట చేతను, విష్ణు సాయుజ్య ప్రాప్తికి మార్గదర్శకమై యొప్పుచుండుట చేతను ఇయ్యది విశాల యశమును సంపాదించుకొని, చిరకాలము నుండియు లోకమున ప్రచలిత మగుచున్నది. ఇట్టి యీ పాంచరాత్ర వాఙ్మయమే శ్రీవైష్ణవ మతమునకు మూలమని - ఈ వివరణము వలన విశద మగుచున్నది.

"జయతు జయతు విష్ణుః పాంచరాత్రస్య వక్తా
జయతు జయతు భక్తిః శ్రీశ పాదానుషక్తా
జయతు జయతు రక్షా పంచ సంస్కార దీక్షా
జయతు జయతు తత్త్వ జ్ఞానినాం ముక్త్యపేక్షా"

* * *

# శ్రీ పాంచరాత్ర ప్రాశస్త్యము

'ఆగమాచార్య'

## శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీ నరసింహాచార్యులు

— ❦ —

### ప్రాంజలి

"శ్రీపాంచరాత్ర ప్రవక్తారం నారాయణ మహం శ్రియమ్
చమూపతిం చతుర్వక్త్రిం కౌశికాది గురూన్ భజే"

### పాంచరాత్ర ప్రవక్త

"పాంచరాత్రాభిదం శాస్త్రం మయా పూర్వం కృతం కిల."

'పాంచరాత్ర' మను పేరు గల ఆగమ శాస్త్రము నాచేత పూర్వము (సృష్ట్యాది యందు) చెప్పబడినది కదా !' అని, శ్రీమన్నారాయణుడు నారదునితో జెప్పినట్లు, పాద్మసంహిత యందలి జ్ఞానపాద ప్రథమాధ్యాయములో 58-వ శ్లోకము వలన తెలియవచ్చుచున్నది. ఇచ్చట 'పూర్వం' అను శబ్ద ప్రయోగ కారణము గమనార్హము. ఇపుడు శ్వేత వరాహ కల్పము నడచుచున్నది. దీనికి పూర్వము బ్రహ్మకల్పము బ్రహ్మ పుట్టుటకు ముందు పద్మకల్పము. దాని ప్రారంభమున శ్రీమన్నారాయణుడు శ్రీ లక్ష్మీదేవికి - దివ్యమైన, సత్త్వగుణ సంపన్నమైన, మోక్షప్రదమైన పాంచరాత్రాగమమును 'ఏకాయనము' అను పేర ఉపదేశించియున్నాడు. ఏకాయన మనగా - తనను (విష్ణువును) చేరుటకు ఇది ఒకటే మార్గము.

"పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణ స్స్వయమ్."

పాంచరాత్ర దివ్యాగమ ద్రష్ట, బోధకుడు - శ్రీమన్నారాయణుడే' యని జయాఖ్య సంహితయు పై యంశమును ధ్రువపరచుచున్నది.

## పాంచరాత్ర ప్రాచీనత

"అనాది వైష్ణవో విష్ణుః ఆది శ్రీ పాంచరాత్రకః."

మొట్టమొదటి వైష్ణవుడును, మొదటి పాంచరాత్రకుడును శ్రీమన్నారాయణుడే యని తెలియనగును

## పాంచరాత్ర ప్రశస్తి

"వేదేన పాంచరాత్రేణ భక్త్యా యజ్ఞేన చ ద్విజ !
ప్రాప్యోఽహం నాన్యథా ప్రాప్యో వర్ష లక్ష శతైరపి."

వేదము వలన గాని, పాంచరాత్ర విధానమునగాని, అర్చించియు గాని, భక్తి వలన గాని, యజ్ఞము వలన గాని నన్ను పొందగలరు' అని భగవానుడు కూర్మ పురాణమున న్వయముగా వక్కాణించియున్నాడు.

"ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః
నారాయణ పదధ్యాన ముశన్తి బ్రహ్మవాదినః
బ్రాహ్మణ స్సర్వ వర్ణేషు యతి శ్చాశ్రమిణా త్తమః
యద్వ ద్గంగా చ తీర్థేషు దైవతేష్వపి చాచ్యుతః
తద్వత్ సర్వేషు శాస్త్రేషు పాంచరాత్రం ప్రశస్యతే
పాంచరాత్రోక్త విధినా య స్సమారాధయే ద్ధరిం
అక్షయ్యం ఫల మాప్నోతి స పుమాన్ నాత్ర సంశయః."

— (పార్శ్వ సంహిత : జ్ఞాన పాదము – 62, 63, 64, 65 శ్లో.)

బ్రహ్మవాదులైన మహర్షులు సర్వ శాస్త్రములను అనేక పర్యాయములు అవలోకించి, సర్వ వర్ణములలో బ్రాహ్మణుడు, ఆశ్రమ

ములలో సన్యాసము, తీర్థములలో గంగ, దేవతలలో నారాయణుడు ఏ విధముగా శ్రేష్ఠములో - అదియే తీరున, భగవంతుని చేరుటకు - తగిన శాస్త్రములలో పాంచరాత్రము శ్రేష్ఠతమమైనది అని తెలిసి కొన్నారు. ఎవరు పాంచరాత్రోక్త విధితో శ్రీహరిని అర్చింతురో, వారు అక్షయ పుణ్య ఫలమును పొంది, స్వామి సన్నిధిలో ఆనంద మును పొందుచుందురు.

## పాంచరాత్రము - వివిధ నామములు

1. నారాయణీయము 2. ఏకాయనము 3. సాత్త్వతము 4. భగవ న్మతము 5. తంత్రము 6. భగవ చ్ఛాస్త్రము 7. ఆగమము 8. మూల వేదము 9. ప్రకృతి వేదము 10. మోక్ష శాస్త్రము 11. విష్ణ్వాగమము 12. మహోపనిషత్తు మున్నగు నామాంతరములతో పాంచరాత్రము విలసిల్లుచున్నది.

## పాంచరాత్ర ప్రవర్తకులు

1 శ్రీమన్నారాయణుడు 2. శ్రీ లక్ష్మీదేవి 3. బ్రహ్మ 4. అనం తుడు 5. గరుడుడు 6. విష్వక్సేనుడు 7, 8, 9, 10. సనక - సనందన, సనత్కుమార - సనత్సుజాతులు 11. శివుడు 12. ఇంద్రుడు 13. నార దుడు 14. కపిలుడు 15. వశిష్ఠుడు 16. కౌశికుడు 17. శక్తి 18 పరా శరుడు 19 శుకుడు 20 కణ్వుడు 21. పద్ముడు (నాగరాజు) 22. సంవర్తకుడు 23. ఔపగాయనుడు 24. శాండిల్యుడు 25. మౌంజా యనుడు 26. భరద్వాజుడు 27. మైత్రేయుడు 28 కపింజలుడు మున్నగువారు పాంచరాత్ర ప్రవర్తకులుగా సుప్రసిద్ధులు.

## శ్రుతి మూలము పాంచరాత్రము

"తత్ పాంచరాత్రం శ్రుతిమూలభూతం
స్మృత్యర్థ విస్తార సుబోధ కందమ్

అపౌరుషేయం హరిభక్తిబీజం
పరంపద ప్రాప్తి సుపైక రక్షమ్."

ఈ పాంచరాత్ర శాస్త్రము వేదమూలకమైనది; స్మృతుల యందలి రహస్యములను తెలియజెప్పునది; అపౌరుషేయమైనది; (సాక్షాత్ శ్రీమన్నారాయణుని ముఖోద్గతమైనది.) హరిభక్తి యను వృక్షమునకు బీజము వంటిది; పరమ పద ప్రాప్తికి ఉపయుక్తమైనది.

## శ్రుతులలో పాంచరాత్రము

(1) త మేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా అయనాయ
విద్యదే....నాన్యః పంథా విద్యతేఽయనాయ."

అను ఋగ్వేదాంతర్గత మగు పురుషసూక్త వాక్యములు - ఏకాయన మును బోధించుచున్నవి. ఏకాయన మనగా — పాంచరాత్రమే.

(2) "వాకో వాక్య మేకాయనం
వేదవిద్యాం బ్రహ్మ విద్యామ్." —(ఛాందోగ్యము)

శ్రీమన్నారాయణ చరణ సేవా పరాయణుడైన సనత్కుమారుని వద్దకు ఒకానొకపుడు నారదుడేతెంచి, 'భగవన్! నాకు తర్క విద్యను, ఏకాయన విద్యను, దేవ విద్యను, బ్రహ్మ విద్య మున్నగునవి తెలియును' అని పలికెను, ఏకాయన విద్యను మఱల నారదమహర్షి సనత్కుమారుని వద్ద సంశయ రహిత మగునట్లు తెలిసికొని, దానిని — అనగా, పాంచ రాత్రమును లోకమున ప్రవర్తింపజేసెను. ఈ నారద మహర్షి రచించిన వైష్ణవతత్త్వ గ్రంథమే పాంచరాత్రము.

పాంచరాత్ర ప్రవర్తకు లగు నారద - శాండిల్య మహర్షులే మార్గదర్శకములైన భక్తి సూత్రములను రచించుటయు, అట్టి సూత్ర ములకు లోకమున అత్యంత ప్రాముఖ్య మేర్పడుటయు గమనార్హ

ములు నారద భక్తి సూత్రములు, శాండిల్య భక్తి సూత్రములు ముముక్షువులకు సుపరిచితములు.

(3) శతపథ బ్రాహ్మణమునందును [13_6_1] పాంచరాత్ర ప్రశంస కలదు.

## పురాణేతిహాసములలో పాంచరాత్రము

(1) వేద ప్రకారకము, వాల్మీకి విరచితము, ఆది కావ్యము అగు శ్రీమద్రామాయణమునందలి ఉత్తర కాండలో - సప్తమ సర్గ యందు - రావణుడు అడుగగా, సనత్కుమారుడిట్లు చెప్పుచున్నాడు :-

"రావణా! వినుము. ఎవరీ బ్రహ్మాండము నంతయు భరించుచుండెనో, ఎవ్వని పుట్టుక తెలియరాదో, దేవతలు ఎవని నాశ్రయించి యుద్ధమున రాక్షసులను జయించుచున్నారో, అతడు శ్రీమన్నారాయణుడు. అతని నాభిపద్మమునుండి చతుర్ముఖుడు జన్మించెను. స్థావర జంగమాత్మక మగు ఈ సర్వమును అతడు సృజించెను. విబుధులు శ్రియఃపతిని విధిగా యజ్ఞములందు పూజింతురు. మఱియు-వారు అమృతము ద్రావుదురు యోగులు పురాణములచేతను, పాంచరాత్రాగమముల చేతను ధ్యానించుచు, యజ్ఞములచే అతని బూజింతురు."

ఇందలి 'పాంచరాత్రాగమము' గమనార్హము.

పంచమ వేద మనబడు మహాభారతమునందును పాంచరాత్ర ప్రశంస కలదు.

(2) "సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
జ్ఞానా న్యేతాని రాజర్షే! విద్ధి నానా మతాని వై"
—(శాంతి పర్వము 349-64)

దీనికి తిక్కన యనువాద మిది :—

"వేదములు సాంఖ్యమును, యోగ విధియు, పాశు
పతము, పాంచరాత్రంబు నా బహువిధముల
నెల్లు బోధ సాధనముల కెల్ల నిష్ఠ...."

**వేదములు, సాంఖ్యము, యోగము, పాశుపతము, పాంచ రాత్రము - ఇవి తెలియదగినవి.**

"వేదంబులకు ప్రవర్తకుండు నారాయణ నందనుం డపాంతరతముం డను పేర ప్రసిద్ధుడైన వేదవ్యాసుండు, సాంఖ్యంబునకు గపిలుండును, యోగంబునకు హిరణ్యగర్భుండును, పాశుపతంబునకు శివుండును, పాంచరాత్రంబునకు విష్ణుం డును ప్రవర్తకులు. పాంచరాత్రంబు వైష్ణవం బన బరగు"

– (శాంతి పర్వము)

**వేదములు నారాయణాంశ సంభూతు డగు వేదవ్యాసుని చేతను, సాంఖ్యము కపిలునిచేతను, యోగము హిరణ్యగర్భునిచేతను పాశుపతము శివునిచేతను, పాంచరాత్రము విష్ణువుచేతను ప్రవర్తింప చేయబడినవి. అట్టి పాంచరాత్రము - 'వైష్ణవము' అను పేర వ్యవహ రింపబడుచున్నది.**

(3) "ఏవ మేకం సాంఖ్యయోగం వేదారణ్యక మేవ చ
పరస్పరాంగా న్యేతాని పాంచరాత్రం తు కథ్యతే."

– (శాంతి పర్వము : 349 82)

**సాంఖ్యము, యోగము, వేదము, వేదాంతములు (ఉపని షత్తులు), ఆరణ్యకములు - ఇవి యన్నియు ఒకే తత్త్వమును - అనగా, విష్ణు పారమ్యమును ప్రతిపాదించుచు, వానిలో పరస్పర సహాయ మును అపేక్షించుచున్నవి. కాని, ఈ శాస్త్రము లన్నియు అంగము లుగా నుండి పరిపూర్ణత కలిగిన శాస్త్రము పాంచరాత్రము.**

(4) "ఇదం మహోపనిషదం చతుర్వేద సమన్వితమ్."

– (శాంతి పర్వము : 111)

ఈ పాంచరాత్రము చతుర్వేద సమన్విత మగు మహోపనిషత్తు. జనమేజయునకు వైశంపాయనుడు 'ఏకాంతిక ధర్మం వివరించుట' యను ఘట్టమున –

(5) "నిర్మల మగు నేకాంతిక
ధర్మము నారాయణోదితంబై క్రియలం...."

నిర్మలమైన ఈ ఏకాంత ధర్మమును నారాయణుడు బ్రహ్మకు, ఆతడు దక్షునకు, ఆతడు సూర్యునకు, ఆతడు మనువునకు, ఆతడు ఇక్ష్వాకునకు, ఆతని వలన పరంపరగా అనేకులు అనుష్ఠించిరి. నారాయణుని వలన నారదుడు విని, లోకముల కెఱింగించెను. ఇందలి 'ఏకాంతిక ధర్మ' శబ్దమునకు – పాంచరాత్ర మని యర్థము. ఇది మోక్ష శాస్త్రముగా ప్రసిద్ధమై, సృష్ట్యాదియందు లోకోద్ధరణార్థమై శ్రీమన్నారాయణునిచే ఆవిష్కరింపబడినది.

మహాభారతమునందలి నారాయణీయ ఖండమున యుధిష్ఠిరుని ప్రశ్నకు భీష్ముడు చెప్పిన వాక్యములు :– 'ఉపరిచర వసువు' అను రాజు సాత్వతము (పాంచరాత్రము) లో చెప్పబడిన ప్రకారము నిత్యము భగవానుని అర్చించువాడు. ఈతడు ఇంద్రునిచే సైతము సన్మానింపబడెను. సత్యవాది, పరమ పవిత్రుడు, కీర్తివంతుడు నగు అట్టి మహోన్నత ప్రభువు – పాంచరాత్రమునందు సర్వశ్రేష్ఠులైన విద్వాంసులను భోజనాదికములలో అగ్రాసనాసీనులను గావించి, గౌరవించుచుండెడివాడు.

(6) "ఇదం శత సహస్రార్థ భారతాఖ్యాన విస్తరాత్
ఆవిద్య మతి మంథానం దధ్నో ఘృత మివోద్ధృతమ్."

నూటయిరువేల శ్లోకములతో నొప్పారు భారత గ్రంథము అను దధి నుండి, బుద్ధి యను కవ్వముతో మధించి, తీయబడిన సారవంత మగు ఘృతము వంటిది పాంచరాత్రము.

(7) "పాంచరాత్ర విదో యే తు యథాక్రమ పరాన్నృప ।
ఏకాంత భావోపగతా స్తే హరిం ప్రవిశంతి వై."

పాంచరాత్రమును బాగుగా తెలిసికొని, క్రమక్రమముగా ఏకాంత భావమును పొందినవారు - శ్రీమన్నారాయణుని పరమ పదమును తప్పక పొందగలరని వ్యాస భగవానుడే భారతేతిహాసమున నొక్కి వక్కాణించియున్నాడు. భారతమునందలి నారాయణీయ ఖండమున బహు భంగులుగా కీర్తింపబడిన ఈ సనాతన ధర్మమే 'హరి గీత' యను నామాంతరము గల భగవద్గీత యందును సవిస్తరముగా వర్ణింప బడినది.

భక్తి ప్రబోధాత్మకమైన శ్రీమద్భాగవతమున శ్రీకృష్ణ ద్వైపాయన వ్యాసుడు తన ఆత్మశాంతి కొఱకు నారదమహర్షి ప్రబోధితుడై, కర్మనిర్మూలకంబును, మోక్షప్రదంబును, శ్రీమన్నారాయణ అవతార విశేషములను తనివిదీర అభివర్ణించుచు -

(8) "—సాత్వతులచేత భగవంతుం డనియును—."

- (శ్రీమద్భాగవతము - వావిళ్ళవారి ప్రతి 9-వ పేజీలో వచనము)

ఇందు సాత్త్వతులనగా - పాంచరాత్రులని తాత్పర్యము.

(9) "భాగవత సేవా విశేషంబున నిశ్చల భక్తి యుదయించు."

(పైదానిలోనే)

ఇచట 'భాగవతు' లనగా – 'పాంచరాత్రు' లని భావము.

(9) "మూడవ తోయంబున నారదుం డను దేవర్షి, కర్మ నిర్మోచకం బైన వైష్ణవ తంత్రంబు సెప్పె." — (పై ప్రతియందు 11 – వ పుట)

ఈ కావున 'వైష్ణవ తంత్ర' మనగా – పాంచరాత్రము. ఈ పాంచరాత్రమునకు భగవచ్ఛాస్త్ర మనియు పేరు. ఈ మతానుయాయులకు వాసుదేవుడే ఆరాధ్య దైవ మనియు, ఈ వాసుదేవోపాసకులు భాగవతు లనియు నిరిష్టమైనది.

(10) "అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుడైన శో
భన చరితుం డితం డనుచు భావమునం దలపోసి, భక్తిచే
ననితర యోగ్యతన్ భగవ దర్పణ బుద్ధి నొనర్చి, కర్మముల్
జనహితకారియై నెగడ సాత్వికయోగ మనంగ జొప్పడున్"

— (9 – వ స్కంధము - 955 – వ పద్యము)

ఈ పద్యములో నాల్గవ చరణము నందలి 'సాత్త్విక యోగ' మను పదమునకు - 'పాంచరాత్రాగమ' మని తాత్పర్యము.

(11) "నిష్కామ మయిన మదీయ భక్తులకు నట్టి యోగంబు సాలోక్య, సార్ష్టి, సామీప్య, సారూప్య, సాయుజ్యంబులకు సాధనంబె కావున, మహాత్ము లగువారు నిజ మనోరథ ఫలదాయకంబు లయినను, మదీయ సేవా రహితు లయిన ఇతర కర్మంబు లాచరింప నొల్లరు. దీని నాత్యంతిక భక్తియోగం బని చెప్పుదురు. సత్వ రజ స్తమో గుణ హీనుం డయిన జనుండు మ త్సమానాకారంబు బొందు నని చెప్పి మరియు నిట్లనియె."

"నిత్య నైమిత్తిక నిజ ధర్మమున గురు శ్రద్ధా గరిష్ఠత జతుర పాంచ రాత్రోక్త హరి సమారాధన క్రియలను నిష్కామనంబున నెతి మదీయ

విగ్రహ దర్శన వినుతి పూజా వందన ధ్యాన సంశ్రవణముల గర్మ సంగి గాకుండుట, సజ్జన ప్రకరాభిమానంబు నొందుట, హీనులందు జాల ననుకంప సేయుట, సముల యందు మైత్రి నెరపుట యను నియమ క్రియాదియైన యోగంబుచేత నాధ్యాత్మికాధిభౌతికాదుల దెలియుట, బలుకుటయును."

—(తృతీయ స్కంధము–958 నుండి 960 వరకు)

పాంచరాత్రాగమమందు చెప్పబడినరీతిగా శ్రీమన్నారాయణుని ఆరాధింప నగు నని ఈ పద్యమునందు చెప్పబడినది మరియు అక్రూర కృత శ్రీకృష్ణ స్తవమునందు –

(12) "పాంచరాత్రానుసారంబుగా ద్వన్మయత్వంబుతో గొంద ఱీ వాత్మ వంచున్, మఱిం గొందరా వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వు దాటింతు వంచున్..." — (దశమ స్కంధము – 1233)

ఈ రీతిగా భాగవతమున పాంచరాత్రము బహు భంగులుగా ప్రశంసింపబడినది.

ఇక ఎఱ్ఱన విరచిత మగు నృసింహ పురాణమును పరిశీలింతము :

(13) "దాస్య మొకండునుం బరమ ధర్మముగా గొని యన్య ధర్మ మా
శాస్యముగా గణింపక, యసంశయ నిశ్చల భక్తి సంతతో
పాస్యు నశేష భవ్య పురుషార్థ భవైక విధాయి నిన్ననా
లస్యత బాంచరాత్రులు దలంచి భజింతురు భక్తవత్సలా!"

— (తృతీయాశ్వాసము 27 - వ పద్యము)

స్వామి సేవయే పరమ ధర్మముగా భావించి, ఇతర ధర్మములను విడచి, పాంచరాత్రులు భగవంతుం డగు శ్రీ నృసింహస్వామిని నిశ్చల భక్తితో భజించుచుందురు.

(14) "...తామసాత్ముల సైరింప, ధర్మబుద్ధి
బొగడ గనిన సాత్త్విక తతి బ్రోతు కరుణ."

తామసులను సైరింపను. ధర్మబుద్ధి గల సత్త్వగుణ సంపన్ను లగు పాంచరాత్రులను కృపతో రక్షించెద' నని నృసింహస్వామి పలుకుట.

(15) "మీరు సాత్త్విక చిత్తులరు గావున, నాకు నవశ్య రక్షణీయులు."

మీరు సత్త్వగుణోపేతులు గాన, మిమ్మలను తప్పక రక్షింప గల నని నృసింహస్వామి పాంచరాత్రులకు అభయ మిచ్చి యున్నాడు

(16) "యతులును సాత్త్వికులును
సాత్త్వతులును చక్రాంక భాగవతులును
నిత్య వ్రతులు నహోబల తీర్థ
స్థితు, నరసింహాత్మ నను భజింపగ నర్హుల్."

—(పంచమాశ్వాసము - 176 - వ పద్యము)

సాత్త్వతు లనబడు పాంచరాత్రులే తనను అర్చించుటకు అర్హు లని అహోబల నృసింహస్వామి సెల విచ్చుచున్నాడు.

## కావ్యములలో పాంచరాత్రము

శృంగార నైషధము నందు శ్రీనాథ కవిసార్వభౌముడు —

"అనంతరంబ పరమ పురుషునిం బురుషోత్తము నారాధింప న ద్దేవుని సన్నిధికి వచ్చి ——

"కీలు కొప్పున బైదండి గేగి రేకులు గొనలుగా నంగరా గుదురుపరచి
కర్ణ పాశంబుల గలధౌతమయపాండు పుండరీక వతంసములు ధరించి
బాహు మధ్యంబున బవడంపు జివుకుల బచ్చల దోమాలె యచ్చుపఱిచి
చరణ పీఠంబులం గరుడాంక మణిఖంధ తులసీ దళంబులు నెలవు కొలిపి

పురుషసూక్త నిపాఠంబు పరిచయించి పావనాష్టాక్షరీమంత్ర పఠన దగిలి
పాంచరాత్రోదిత క్రియా పథమునందు నలిననాభు సమారాధనంబు సేసె "

నలచక్రవర్తి పాండవుల కంటెను ప్రాచీనుడు. అతడు భగవచ్ఛాస్త్రమైన పాంచరాత్ర ఆగమ విధానముగనే శ్రీమన్నారాయణుని అర్చించె నట! క్రీ.శ. 11 వ శతాబ్దమునకు చెందిన శ్రీహర్షుడు 'నైషధ' మను మహా కావ్యమును విద్వదౌషధముగా రచింప, శ్రీనాథ కవి సార్వభౌము డద్దానిని 12 - వ శతాబ్దాంతమున 'శృంగార నైషధ' మను పేర తెనిగించెను. శ్రీహర్ష శ్రీనాథు లిర్వురును శ్రీ పాంచరాత్ర దివ్యాగమ వైశిష్ట్యమును తమ తమ కావ్యములలో వర్ణించుట గమనార్హమైన యంశము.

## పాంచరాత్ర ప్రశంసలు

(1) ఈ పాంచరాత్ర దివ్యాగమ ప్రశస్తిని ఇక్ష్వు, విష్ణు - భాగవత - నారదీయ - గరుడ - పద్మ - వరాహాది పురాణాదు లనేకములు వేనోళ్ళ కొనియాడియున్నవి.

(2) వాశిష్ఠ - హారీత - పరాశర - వ్యాస - కాశ్యప - స్మృతు లనేకములు ఈ పాంచరాత్ర వైభవమును బహు భంగులుగా కీర్తించి యున్నవి.

(3) 'ప్రమాణ సంగ్రహ' మను గ్రంథమున పాంచరాత్ర వైశిష్ట్యము నుగ్గడించుచు - ఇతిహాస సముచ్చయము, హరి వంశము, శాండిల్య స్మృతి, బ్రహ్మాండ పురాణము మున్నగు ప్రాచీనము లగు ఆర్ష గ్రంథములనుండి ప్రమాణము లనేకములు ఉదాహరణములుగా పేర్కొనబడినవి.

(4) శ్రీ యామునాచార్యులవారు తమ 'ఆగమ ప్రామాణ్యము' నందు - శ్రీ పాంచరాత్ర వైశిష్ట్యమును విశదము గావించిరి.

(5) శ్రీ విశిష్టాద్వైత ప్రవర్తకులైన భగవద్రామానుజులు - శ్రీ పాంచరాత్ర భగవచ్ఛాస్త్రమును వారి శ్రీభాష్యాది గ్రంథములలో బహుధా ప్రశంసించుటే గాక, ఈ శాస్త్రమును ఆధారము గావించుకొని, విశిష్టాద్వైత సిద్ధాంతమును సుప్రతిష్ఠితము గావించిరి.

(6) శ్రీ వేదాంత దేశికులు తమ 'పాంచరాత్ర రక్ష' అను గ్రంథమున —

'శ్రుతి మూల మిదం తంత్రం, ప్రమాణం కల్పసూత్రవత్.'

'పాంచరాత్రము వేద మూలకము' అని నొక్కి వక్కాణించిరి.

## పాంచరాత్ర సాహిత్యము

"ద్విషట్ సహస్ర పర్యంతం సంహితాఖ్యం సదాగమమ్."

పాంచరాత్ర సంహితలు పన్నెండువేలు కల వని పౌష్కర సంహిత తెలుపుచున్నది.

కొన్ని సంహితలు - అష్టోత్తర శత (108) సంహితలు కల వని నుడువుచున్నవి.

జర్మన్ దేశస్థు డగు 'ఆటో ష్రేడర్' మహాశయుడు — పాంచరాత్ర శాస్త్రమును అధ్యయనము చేసి, అందలి విశేషములను గ్రహించి, పాంచరాత్ర సంహితలు 215 కల వని చెప్పుటే గాక, ఆ సంహితల నామములను కూడ వివరించియున్నాడు.

## చరిత్ర పుటలలో పాంచరాత్రము

### 1. పాణిని :-

క్రీ : పూ : 5 - వ శతాబ్దమునకు జెందిన పాణిని - సంస్కృతమున 'అష్టాధ్యాయి' అను నొక వ్యాకరణ గ్రంథమును రచించుచు, అందు - (4-3-985 సూ) వాసుదేవకులు అనగా - వాసుదేవుని భక్తులు అని రూఢి పరచినాడు. వాసుదేవకులనగా - పాంచరాత్రులు అని యర్థము. కావున, ఈ చరిత్రాంశమునుబట్టి, ఇప్పటికి 2,500 సంవత్సరములకు పూర్వమే ఈ పాంచరాత్రము బహుళ ప్రచారములో నున్నట్లు స్పష్ట మగుచున్నది.

### 2. ఘోసుండి ప్రాకార శాసనము :-

ఉత్తర భారత దేశములో ప్రసిద్ధ చారిత్ర స్థల మగు ఘోసుండి శిధిలములలో - నిలువుగా గల రాతిపై నారాయణ వాటమునుండి గజయానుడు, పారాశరి కుమారు డగు సర్వత్రాత అను వారలు - 'సంకర్షణ, వాసుదేవులు సర్వేశ్వరులు' అని ప్రస్తుతించి, చెక్కించిరి. ఈ శిలాశాసనము ఇప్పటికిని కానవచ్చును. దీనిని బట్టి, సంకర్షణ - వాసుదేవులను పూజించుట చిరకాలమునుండియు ఆచారముగ నున్నట్లు తెలియుచున్నట్లు తెలియుచున్నది. ఈ సంకర్షణ, వాసుదేవ నామములు - భాగవత (పాంచరాత్ర) సిద్ధాంతము నందలి చతుర్వ్యూహములు - వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ నామకములుగా సుప్రసిద్ధములు.

ఈ చతుర్వ్యూహములు కౌటిల్యుని అర్థ శాస్త్రమునందును, పతంజలి మహా భాష్యమునందును అభివర్ణింపబడి యున్నవి. మహాభాగవతము నందలి నారాయణీయములో - ఈ చతుర్వ్యూహ ప్రస్తావన కలదు.

3. బేసనగర గరుడ స్తంభము :-

క్రీ : పూ . 2 - వ శతాబ్దమునకు చెందిన గ్రీకు చక్రవర్తి అంటి యాలకిదాస్' రాజ్యపాలనము చేయు కాలమున, బేసనగ 'ములో - దేవదేవుడైన వాసుదేవుని ఆలయమునకు ముందు - యవన (గ్రీకు) రాయబారి యగు 'డయస్' అను వాని కుమారుడగు 'భాగవత హెలియోడోరు' అను వతడు గరుడధ్వజమును ప్రతిష్ఠించెను ఈ వృత్తాంతమును బట్టి, ఇతర దేశస్థులు సైతము - పాంచరాత్రి పదము నకు పర్యాయ పద మగు 'భాగవత' అను దానిని తమ నామధేయము నకు ముందుంచుకొనుట గౌరవముగా భావించెడివారనియు, ఈ భాగ వత నామధారణము వలన, శ్రీమన్నారాయణునియందు అట్టి భాగ వతుల భక్తిభావనము స్పష్ట మగు ననియు గ్రహింప నగును.

4. నానాఘాట్ శాసనము :-

క్రీస్తుకు పూర్వము 1 వ శతాబ్దము నాటిదయిన శాసనము 'నాగనిక'చే - 'నానాఘాట్' కొండ గుహయందు చెక్కించబడినది. దానియందు - భాగవత (పాంచరాత్ర) ధర్మమునుగూర్చి విస్తారముగా తెలుపబడుటేగాక, ఈ ధర్మము ఉత్తర భారతము నుండి దక్షిణ భారతమునకు విస్తరించి యున్నట్లును వ్యక్తము చేయబడినది.

5. గుప్తరాజుల వైష్ణవ భక్తి -

క్రీ : శ : 400 నుండి 434 వరకును పాలించిన రెండవ చంద్ర గుప్తుడు, కుమార గుప్తుడు, స్కంద గుప్తుడు మున్నగు రాజులు - 'పరమ భాగవతులు'గా ప్రకటించుకొని, దీనిని నాడు మహోన్నత ముగా భావించి, శిలాశాసనములలో కూడ చెక్కించుకొని యుండిరి.

6. చక్రపాలితునిచే విష్ణుమందిర నిర్మాణము :-

క్రీ : శ . 476 - లో స్కందగుప్తునిచే కధియవాడ ప్రాంత పాల కునిగా నియమింపబడిన పర్ణదత్త పుత్రుడగు 'చక్రపాలితుడు' అను వతడు - ఒక విష్ణు మందిరమును నిర్మాణము చేయించి, దానియందు

చెక్కించిన శిలాశాసనములో మొదట - వామనావతార ధారి యైన శ్రీమన్నారాయణునకు నమస్కరించినట్లు తెలుపుకొనియున్నాడు.

7 బుధ గుప్త కాలమున విష్ణ్వాలయములో ధ్వజ ప్రతిష్ఠ :-

క్రీ : శ : 483 లో - బుధగుప్త కాలము నాటి శిలా శాసనము మధ్యప్రదేశ్ లోని 'సాగర్' జిల్లాలో ఒకటి కలదు. దానిలో - మాతృవిష్ణు, వాని తమ్ముడు ధ్యానవిష్ణు అనువారు - జనార్దన భగవానుని ఆలయమునకు అభిముఖముగా ఒక ధ్వజస్తంభమును ప్రతిష్ఠించినట్లు వెల్లడించుకొనిరి

8. వరాహ మిహిరుని నిర్దేశము -

ప్రముఖ జ్యోతిశ్శాస్త్ర వేత్తగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన వరాహమిహిరుడు క్రీ.శ.ఆరవ శతాబ్దములో వ్రాసిన గ్రంథమునందు ఏ యే దేవతలకు ఎవరెవరు ప్రతిష్ఠా - పూజాదికములను నిర్వర్తించవలెనో వివరించుచు - విష్ణువునకు భాగవతులు (పాంచరాత్రులు) మాత్రమే పూజాదికములను నిర్వహించుచుండవలెనని నిర్దేశించెను.

పై పేర్కొనబడిన చారిత్రకాధారములనుబట్టి, భాగవత ధర్మమనబడు పాంచరాత్రము ప్రాచీనకాలము నుండియు భారతదేశమున ప్రచలిత మగుచున్నట్లు స్పష్ట మగుచున్నది.

"పరాశరం చ మైత్రేయం భారద్వాజం కపింజలమ్
వశిష్ఠాది మునీన్ వందే పాంచరాత్ర ప్రవర్తకాన్."



# వివిధ సంప్రదాయములు
# శ్రీ వైష్ణవ మత ప్రభావము

'శిరోమణి - విద్వాన్'

ఆంధ్ర విద్యా నాథ - బ్రాహ్మ భూషణ'

## శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

విష్ణువే పరదైవ మని విశ్వసించు మతము వైష్ణవ మతము. ప్రధానమైన ఈ విష్ణు పారమ్య భావము కలిగి, భారత దేశమున వ్యాపించిన సంప్రదాయములలో - రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, రామానంద, శ్రీకృష్ణ చైతన్యాదు లగు ఆచార్యులచే ప్రవర్తింపజేయబడి, ప్రసిద్ధములై యున్నవి.

### రామానుజ సంప్రదాయము

శ్రీ రామానుజులు క్రీ: శ: 1017 సంవత్సరమున శ్రీ పెరం బూదూరు అను పుణ్య స్థలమున ఉదయించిరి. వీరు ఆసూరి వంశజులు, హారీత గోత్రజులు. కాంతిమతీ కేశవాచార్యుల పుత్రులు. వీరు ఆది శేషుని అంశమున అవతరించిన విష్ణు మత స్థాపకు లని విశిష్టాద్వైత మతానుయాయుల విశ్వాసము. శ్రీ రామానుజులు ప్రతిపాదించిన విశిష్టాద్వైత మత సిద్ధాంత సంగ్రహ మిది :-

శ్రీ మహా విష్ణువే పరమాత్మ. జగ త్సృష్టి, స్థితి, లయములు ఆతని లీలా విశేషములు. చరాచరాత్మకమైన ఈ విశ్వ మంతటను ఆ సర్వేశ్వరుండే నిండియున్నాఁడు. వేదోపనిష త్పురాణ ప్రబంధ సూత్రా

దులు ఈతనివి - శ్రీమన్నారాయణ, వాసుదేవ ఆది నామములచే వ్యవహరించుచు - సత్య జ్ఞానానంద స్వరూపుడనియు, నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణ గుణ పరిపూర్ణుడనియు ప్రశంసించినవి. జీవాత్మ పరమాత్మ కన్న భిన్నుఁడు. ఈ జీవాత్మలు - నిత్య, ముక్త, బద్ధ రూపము న ముత్తెరఁగులై యుందురు. అనాది యగు కర్మవాసనను బట్టి దేవ, తిర్యక్, మనుష్య, స్థావర రూపములైన ఉపాధులను ధరింతురు. వేదాంత వాక్య శ్రవణాదులవలనను శ్రీమన్నారాయణుఁడే ఉపాస్యుఁడని తెలిసి, శ్రవణ మననాదిక మైన ఉపాసనచే ఆతని నుపాసించి, తదను గ్రహమున విముక్తులగుట జీవులకు కర్తవ్యము. అచిత్తు అని వ్యవహరింపబడు ప్రకృతి - జీవులకు భోగస్థాన మయినది. ఈశ్వరుఁడు (పరమాత్మ), చిత్తు (జీవాత్మ), అచిత్తు (ప్రకృతి) అను ఈ మూఁడును నిత్యములు ప్రళయ దశలో - చిదచిత్తులు ఈశ్వరునియందు సూక్ష్మ రూపమున చేరియుండును. వ్యష్టి సృష్టిలో చిదచిత్తులు స్థూల రూపమున విస్తరిల్లఁగా, తచ్ఛరీరుఁడై ఈశ్వరుఁడు వెలయుచుండును. ఈ పేరొన్న సూక్ష్మ చిదచిద్విశిష్టుఁడైన ఈశ్వరునకును, స్థూల చిదచిద్విశిష్టుఁడైన ఈశ్వరునకును భేదము లేదు. కాబట్టియే ఈ వైష్ణవ మత సంప్రదాయమునకు విశిష్టాద్వైత మనియు నామాంతరము కలిగినది.

జీవేశ్వరులు భిన్నులనుటకు ఈ క్రింది ఉపనిషద్వాక్యములను ఈ సిద్ధాంత ప్రవర్తకులు ఆలంబనముగా ప్రదర్శింతురు :—

"పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్టస్తత స్తే నామృతత్వ మేతి."

— (శ్వేతాశ్వతరోపనిషత్తు)

"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ, బ్రహ్మణా విపశ్చి తేతి."

— (తైత్తిరీయోపనిషత్తు)

"ఆత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్" — (మహానారాయణోపనిషత్తు)

"క్షరం ప్రధాన మమృతాక్షరం హరః, క్షరాత్మానా వీశతే దేవ ఏకః"

— (శ్వేతాశ్వతరోపనిషత్తు)

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వా ద్వ త్త్యనశ్నన్నో అభిచాకశీతి"

— (శ్వేతాశ్వతరోపనిషత్తు)

సర్వేశ్వరుడు కల్యాణగుణాశ్రయుడనుటకును

"య స్సర్వజ్ఞ స్సర్వవిత్" — (మాండూక్యోపనిషత్తు)

"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ."

— శ్వేతాశ్వతరోపనిషత్తు)

"ఏష ఆత్మా ఉపహత పాప్మా విజరో విమృత్యుః విశోకో
విజిఘత్సో ఉపిపాసః సత్యకామః సత్యసంకల్పః" — (ఛాం. ఉ.)

ఇత్యాది వాక్యములను ఉట్టంకింతురు వీరు - తిరుమణి (శ్వేత మృత్తిక) తిరు చూర్ణము (హరిద్రా చూర్ణము) లతో - కేశవ నామాదులతో, లలాటాది స్థానములందు ఊర్ధ్వ పుండ్రములను పన్నెండుచోట్ల ధరింతురు. తాపము, పుండ్రము, నామము, మంత్రము, యాగము అను పంచ సంస్కారములు వీరికి ముఖ్యములు. మంత్రములలో - అష్టాక్షరి, ద్వయము అనునవి ముఖ్యములు.

ఈ మతమునకు - ఏకాయన మనియు, భాగవత మార్గమనియు కూడ పేర్లు కలవు. వేదములవలెనే, శ్రీమన్నారాయణ ముఖోద్గత ముగా ప్రసిద్ధమైన పాంచరాత్రాగమము, విష్ణు పురాణము, భగవ

గీత, భారత - భాగవతములు, బ్రహ్మ సూత్రములు, ఆళ్వారులు రచించిన 'నాలాయిర' ద్రావిడ దివ్య ప్రబంధమును ఈ సిద్ధాంతమునకు ఆధారములు. శ్రీమన్నారాయణుడే దీని ప్రవర్తకాచార్యులలో మొదటివాడు. క్రమముగా - లక్ష్మీదేవి, విష్వక్సేనుడు, నమ్మాళ్వారులు, నాథమునులు, పుండరీకాక్షులు, రామమిశ్రులు, యామునులు, శ్రీరామానుజులు మొదలైనవారు ఈ సిద్ధాంతమును ప్రవర్తింపజేసినవారు. శ్రీ రామానుజులు తమ శిష్యులగు డెబ్బది నలుగురు వైష్ణవాచార్యులను ఈ శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రచారము కొరకు నియోగించిరి. వారి మూలమున - ఈ మతము భారత దేశమందంతటను విశేష వ్యాప్తి నొందినది. ఈ సిద్ధాంత ప్రతిపాదకములగు సంస్కృత గ్రంథములను రచియించినవారిలో - యామునాచార్యులు, రామానుజాచార్యులు, సుదర్శనాచార్యులు, వేదాంత దేశికులు మున్నగు పండిత ప్రకాండులు పేర్కొనదగినవారు. శ్రీ రామానుజులు బ్రహ్మ సూత్రములపై రచియించిన భాష్యమునకు - 'శ్రీభాష్య' మని ప్రసిద్ధి. గీతాభాష్యము, వేదార్థ సంగ్రహము, వేదాంత సారము, వేదాంత దీపము, గద్య త్రయము అనునవి శ్రీ భగవద్రామానుజుల ఇతర కృతులు.

## మాధ్వ సంప్రదాయము

దీనికి - ద్వైత సిద్ధాంతము, పూర్ణప్రజ్ఞ దర్శనము, తత్త్వవాదము అనియు పేర్లు. ఈ సంప్రదాయ వ్యవస్థాపకులలో ముఖ్యులు - శ్రీ మధ్వాచార్యులు, ఆనందతీర్థులు, పూర్ణప్రజ్ఞులు, మధ్వమందారులు మున్నగు పేర్లతోను వీరిని వ్యవహరింతురు. వీరి బోధనలు మధువు వలె ఆస్వాద్యములు, ఆనందదాయకములునగుటచే వీరిని మధ్వాచార్య

లనియు, సంపూర్ణజ్ఞాన వేదాంత ప్రజ్ఞ కలవారగుటచే పూర్ణప్రజ్ఞులనియు నామాంతరములు కలిగిన వందురు. శ్రీ మధ్వాచార్యులు వాయుదేవుని యంశముతో అవతరించిన వారని తన్మతానుయాయుల విశ్వాసము. వీరు కన్నడ దేశమునందలి ఉడిపి తాలూకాలోని 'కల్లియన్ పురము' అను పుణ్యస్థలమున, క్రీ: శ: 1238 సంవత్సరమున జన్మించిరి. ఈ కల్లియన్ పురమునే - 'రజత పీఠ' మను పేర, 'మధ్వ విజయ'కారుడు పేర్కొనెను. పాజక క్షేత్ర మనియు దీనికి వ్యవహారము కలదు వీరి తల్లి - వేదవతి; తండ్రి - మధ్యగేహ భట్టాచార్యుడు. శ్రీ మధ్వాచార్యునకు 'వాసుదేవు' డని తొలుత పేరు పెట్టిరట! శ్రీ మధ్వాచార్యులు న్యాయ వేదాంతాది బహు శాస్త్రములలో మహా పండితులై యుండిరి. వీరి గురువు అచ్యుత ప్రకాశాచార్యులు. శ్రీ మధ్వాచార్యులు ఛాందోగ్యాదులగు ఉపనిషత్తులపైనను, వేదాంత సూత్రములపైనను ద్వైత మత సిద్ధాంత ప్రతిష్ఠాపకము లగు భాష్యములు సంతరించిరి. భాగవత తాత్పర్య నిర్ణయము, అణు భాష్యము, మహాభారత తాత్పర్య నిర్ణయము న్యాయ వివరణము మున్నగు శాస్త్రీయ గ్రంథములే గాక, యమక భారతము వంటి పద్యకావ్యము, కొన్ని స్తోత్రములు పేర్కొనదగినవి. వీరి కృతులు మొత్తము ముప్పదియేడు వరకును గలవు.

శ్రీ మధ్వాచార్యుల శిష్యులలో - పద్మనాభ తీర్థులు, నరహరి తీర్థులు, మాధవ తీర్థులు, అక్షోభ్య తీర్థులు అనువారు ముఖ్యులు.

శ్రీ రామానుజాచార్యుల వలెనే మధ్వాచార్యులును - శంకరాచార్యులు ప్రతిపాదించిన జగన్మిథ్యావాదమును, జీవేశ్వరుల అద్వైత వాదమును నిశితముగా ఖండించిరి.

"జ్ఞా జ్ఞౌ ద్వావజా వీశ నీశౌ" — (శ్వేతాశ్వతరోపనిషత్తు)

"య ఆత్మని తిష్ఠన్ నాత్మనోన్తరో య మాత్మా న వేద యస్యాత్మా శరీరమ్, య ఆత్మానమంతరోయమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః."
— (అంతర్యామి బ్రాహ్మణము)

"స కారణం కరణాధిపాధిపః నచాస్య కశ్చి జ్జనితానచాధిపః." (శ్వే. ఉ.)

"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా,
సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్." (శ్వే. ఉ.)

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నో అభిచాకశీతి" (శ్వే. ఉ.)

ఇత్యాది ప్రమాణములను శ్రీ రామానుజాచార్యుల వలెనే వీరును తమ ద్వైత సిద్ధాంతమునకు ఉపష్టంభకముగా స్వీకరించిరి.

శ్రీ రామానుజుల జీవేశ్వర ప్రకృతులకు ప్రకార ప్రకారి భావము సంగీకరించి విశిష్టాద్వైతమును సాధింపగా, శ్రీ మధ్వాచార్యులు ఆ ప్రకార ప్రకారి వైశిష్ట్యమునుగూడ అంగీకరింపక, సర్వాత్మనా భేదమునే ప్రతిష్ఠాపించిరి ఈ భేదములు –

"సత్యంభిదా, సత్యంభిదా, సత్యంభిదా
జీవేశయో ర్భిదా చైవ జీవభేదః పరస్పరమ్
జడేశయో ర్జడానాం చ జడజీవభిదా తథా
పంచ భేదా ఇమే నిత్యాః సర్వావస్థాసు నిత్యశః"

అను ప్రసిద్ధ కారికను బట్టి, ఐదు విధము లగుచున్నవి. అవి ఇవి :

(1) జీవేశ్వరులకు భేదము ; (2) జీవులలో జీవులకు భేదము ; (3) ప్రకృతికి ఈశ్వరునకు భేదము ; (4) ప్రకృతికి భేదము ; (5) ప్రకృతికి జీవులకు భేదము.

ఈ భేదములు సంసారావస్థల యందును, ముక్తావస్థ యందును అన్నింటియందును, అన్ని దశలలోను నిత్యముగా అనుగతమై యుండును. ద్వైత మతములో ముక్తి యనగా - అవిద్యా బంధ నివృత్తి పూర్వకమైన స్వరూపానందావిర్భావమే. ముక్తి సాధనములలో ఈ ద్వైత మతమున అత్యంతము ముఖ్యమైనది శ్రీ విష్ణు దేవునియందలి అనన్యమైన భక్తియే. శ్రీ రామానుజ మతమునందు వలెనే ఇందును శ్రీ మహా విష్ణుదేవుని అవతారములయు, తదర్చావతారులయు ఆరాధనము విహితమై యున్నది. విష్ణు పారమ్యమును బోధించు వైదిక వాఙ్మయము, పురాణాదులు, భగవద్గీత, బ్రహ్మ సూత్రాదులు ఈ మతస్థులకు ప్రామాణిక గ్రంథములు. వీరు గోపీ చందనముతో ఊర్ధ్వ రేఖలును, అక్షతలను శంఖ చక్రాది ముద్రలను ధరింతురు. శ్రీ మధ్వాచార్యులు ఉడిపిలో ఎనిమిది మఠములను స్వయముగా నెలకొల్పియుండిరి. ఉత్తరాది మఠము మున్నగు పెక్కు మఠముల నధిష్ఠించిన ద్వైత యతిశేఖరులు మాధ్వ సిద్ధాంతమును భారత దేశమున పలు ప్రాంతములలో వ్యాపింపజేసిరి.

శ్రీ మధ్వాచార్యులే తమ శిష్యులలో నొకరగు నరహరి తీర్థులకు ద్వైత మత ప్రచారమునకు ఓఢ్ర (ఒరియా) దేశమునకు పంపినట్లు చారిత్రక నిదర్శనములు కలవు. మధ్వాచార్యులు స్వయముగా భారత దేశమున పలు ప్రాంతములలో విజయ యాత్రలు సాగించిరి. ఈ మాధ్వ వైష్ణవులు కన్నడ దేశములో విశేషముగాను, మహారాష్ట్రమునను, తమిళ - ఆంధ్ర దేశములలోను సముచిత సంఖ్యలో కలరు.

శ్రీ మధ్వాచార్యులు క్రి : శ : 1318 లో పరమ పదము నొందిరి

## నింబార్క సంప్రదాయము

తన పూర్వులగు శ్రీరామానుజ - మధ్వాచార్యుల మార్గము నసే జగన్మిథ్యావాదమును ఖండించుటలోను ఉత్సహించి, ప్రసిద్ధి నొందిన మరియొక సిద్ధాంత ప్రవర్తకుడు శ్రీ నింబార్కస్వామి. ఈ ఆచార్యుడు తన సంప్రదాయ ప్రచారమునకు ఉత్తర భారతమును ప్రధాన రంగముగా చేసికొన్నవాడైనను, ఈతడుదయించినది మాత్రము దక్షిణ భారత ప్రాంతమే. అందునను ఈతడుదయించి నది మాత్రము ఆంధ్ర దేశమున నింబగ్రామము (వేములపల్లియై ఉండు నేమో) ఈతని జన్మస్థలమందురు. బళ్ళారి ప్రాంతమందలి తెలుగు పల్లె యని కొందరు తలంచిరి. ఈయన వైదిక బ్రాహ్మణ కుటుంబమున క్రీ.శ. 13 - వ శతాబ్దమున, సరస్వతీ జగన్నాథ భట్టారక దంపతులకు జన్మించెను. పత స్మార్తానుయాయులు ఈ నింబార్కస్వామిని శ్రీహరి సుదర్శన చక్రాయుధాంశ సంభూతునిగా భావింతురు. నింబార్కాచార్యుడు వేద వేదాంగ పారంగతుడైన విద్వాంసుడే కాక, కవియు, మహాభక్తుడునై యుండెను. అతడు, తనకు పూర్వము దేశమున విస్తరిల్లియున్న శ్రీమద్రామానుజాచార్యుల మత సిద్ధాంతమునే తన సంప్రదాయమునకు ఒజ్జబంతిగా పెట్టుకొనెను. శ్రీరామానుజ, మధ్వాచార్యుల వలెనే తానును బ్రహ్మసూత్రములపై, 'వేదాంత పారిజాత సౌరభ' మను పేర ఒక భాష్యమును రచించెను. మరియొక కృతి 'సిద్ధాంత రత్నము'. అందీతని సిద్ధాంత సారము పది శ్లోకము లలో సంగృహీతమైనది. శ్లోక సంఖ్యను బట్టి దీనికి 'దశశ్లోకి' అనియు పాదుక 'సవిశేష, నిర్విశేష శ్రీకృష్ణ స్తవరాజ' మనునది, ఈతడు నెలయించిన యొక స్తుతి రచన.

చిదచిదీశ్వరుల స్వరూప నిరూపణాదు లగు విషయములలో - నింబార్కస్వామికి యతిరాజుల (రామానుజ) సిద్ధాంతమే ఆదర్శమైనను, అతడు సాధనసామగ్రిలో ఉపాసనకు ప్రాముఖ్యమీయలేదు; భక్తి ప్రపత్తులకే ప్రాధాన్య మిచ్చెను. ఇతడు చిదచిదీశ్వరులకు భేదమును స్థాపించుచునే, కార్య కారణములకు అభేదము అను హేతువున అభేదమునుగూడ సాధించును. ఉపాస్య విషయమున - పర వ్యూహాదికమైన పరమాత్మ మూర్తులలో ఈ యాచార్యుడు విభవ మూర్తికి విశేష ప్రాముఖ్య మిచ్చెను. అందునను శ్రీ కృష్ణుడే పర బ్రహ్మముగా ఉపాస్యు డనెను. ఈ సంప్రదాయములో - రాధాకృష్ణార్చనము ముఖ్యము. శ్రీకృష్ణానుగ్రహమే మోక్ష హేతువు. శ్రీకృష్ణ లీలా విహార రంగమైన మధురా బృందావనాది ప్రాంతమునే శ్రీ నింబార్కాచార్యుడు తన సంప్రదాయ ప్రచార భూమిగా ఎన్నుకొని, అచటనే పీఠమును నెలకొల్పెను. ఈతని భక్తి మార్గము అచిర కాలముననే ఆ ప్రాంతీయులలో విశేష వ్యాప్తి గాంచెను. ఉత్తర భారతముననే కాక, క్రమముగా ఈ వైష్ణవ సంప్రదాయము వంగ దేశమునకు కూడ ప్రాకెను. నింబార్కుని పిమ్మట ఈ సంప్రదాయమును ఆతని శిష్య ప్రశిష్యాది పరంపర క్రమముగా అందిపుచ్చుకొని ప్రచారము గావించెను. వీరిలో కొందరాచార్యులు నింబార్కుని వలెనే బ్రహ్మసూత్రములపై స్వతంత్ర వ్యాఖ్యలు రచించిరి. అట్టి వారిలో - దేవాచార్యులు, కాశ్మీరి పేర్కొనదగినవారు.

## వల్లభ సంప్రదాయము (పుష్టి మార్గము)

శ్రీ రాధాకృష్ణ భక్తి ప్రధానమైన వైష్ణవ మత సంప్రదాయమును ప్రవర్తింపజేసినవారిలో అతి ప్రసిద్ధుడు శ్రీ వల్లభాచార్యుడు.

ఇతడు ఆంధ్రదేశమున క్రీ. శ. 1479 లో ఉదయించెను. కృష్ణయజు ర్వేద శాఖీయుడైన లక్ష్మణభట్టు అనువాడు తండ్రి; తల్లి ఎల్లమ. విద్వాంసుడైన వల్లభస్వామి కృష్ణభక్తి ప్రేరితుడై, శ్రీకృష్ణ దివ్య జన్మ వాస సంచార కేళీ విలాసములకు రంగస్థలములైన మధురా, బృందావన, యమునాతీర భూములను సందర్శింపగోరి, ఉత్తర భారత మున కేగెను. ఆ ప్రాంతములలో తా నుండ, ఒకనాటి రేయి శ్రీకృష్ణస్వామి ఆ భక్తునకు స్వప్నమున దర్శన మిచ్చి, తాను గోవర్ధన గిరిపై దేవదమన నామమున అర్చా మూర్తియై వెలసి యున్నాడ ననియు, వచ్చి సేవించి, ఆలయ గోపుర ప్రాకారాదులను నిర్మింపజేయవలసిన దనియు, 'నీచే బోధింపబడు సంప్రదాయము గోలోకమున నిన్ను జేరు సాధన మగు' ననియు ఆనతిచ్చెను. భగవ దాదేశము చొప్పున వల్లభాచార్యుడు గోవర్ధన గిరికి నరిగినవాడై పోయి వెదుకగా, శ్రీకృష్ణస్వామి విగ్రహము లభించెను. పరమానంద భరితుడై, శ్రీకృష్ణ దేవునకు కోవెల కట్టించి, నిత్యపూజా విధాన మునకు తగిన కట్టడి చేయించెను. ఈ దేవదమనస్వామియే 'శ్రీనాథజీ' అని పిమ్మట వ్యవహార ప్రసిద్ధి నొందెను.

నాభాజీ రచించిన 'భక్తమాల' గ్రంథమునుబట్టి, మహారాష్ట్ర దేశమున ప్రసిద్ధులైన భక్తులు - శ్రీజ్ఞానదేవ, నామదేవ, త్రిలోచనులు క్రమముగా విష్ణుస్వామి యను వైష్ణవాచార్యుని శిష్యులై, ఆ రీతి మునకు చెందినవా రనియు, వారి పిమ్మట ఆ విష్ణుస్వామి సంప్రదాయ మునకు ఆచార్యత్వమును వల్లభాచార్యుడు వహించె ననియు తెల్ల మగు చున్నది.

పారిభాషికముగా ఈ వల్లభాచార్యుని సిద్ధాంతమునకు 'శుద్ధాద్వైత' మని పేరు. అందు - జీవ, బ్రహ్మలకు - అంశ, అంశి రూపమున ఏకత్వము ప్రతిపాదితము. బ్రహ్మమునకు రూపా

సంబంధము లేదు; అది శుద్ధమైన బ్రహ్మము. అగ్ని - దానినుండి పుట్టిన స్ఫులింగములకు గల సంబంధ మెట్టిదో, అట్టిదే జీవ బ్రహ్మలకు గల సంబంధము. కార్య రూపమున వేరై తోచినను, కారణ రూపమున రెండును ఒకటియే కావున, ఇది శుద్ధాద్వైత మనబడినది. ఉపాస్య దైవ మిందు శ్రీకృష్ణుడే. ఊర్ధ్వలోకము లన్నిటికిని పైన గోలోక మున్నది. అందు పరబ్రహ్మ యైన శ్రీకృష్ణు డుండును. సర్గ, స్థితి, లయము లతని లీలలు. త ల్లోక ప్రాప్తి - ముక్తి. అది యా శ్రీకృష్ణుని అనుగ్రహాధీనము సదాచారము, వినయము, తత్పర భక్తి మున్నగువాటిచే, ఆ భగవ దనుగ్రహము కల్గును. శ్రీకృష్ణానుగ్రహ జనితమైన విశేష భక్తికి 'పుష్టి భక్తి' యని సంకేతము. ప్రవాహ పుష్టి భక్తి, మర్యాదా పుష్టిభక్తి, పుష్టి - పుష్టి భక్తి, శుద్ధ పుష్టిభక్తి అని యీ పుష్టిభక్తి భేదములుండును.

"మర్త్యానాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే."

అనునట్లు, క్షీణపాపులైనవారికిని —

"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః"

అనునట్లు, వాసుదేవుడే (శ్రీకృష్ణుడే) సర్వ మని భావించు మహాత్ముడు సుదుర్లభు డగునట్లును, శ్రీకృష్ణభక్తి సంపన్నుడు భవ బంధ విముక్తుడై, గోలోకమును చేరి, శ్రీకృష్ణసాయుజ్యమును పొందును.

శ్రీ వల్లభాచార్యుడు బ్రహ్మసూత్రములపై 'అణు భాష్యము' అను నొక వివరణమును వ్రాసిరి. వల్లభాచార్యుని పుత్రుడు విఠలేశ్వరుడు. ఈ తండ్రి కొడుకు లిరువురును ఈ సంప్రదాయమున క్రమముగా పూజ్యభావమున - ఆచార్య, గోస్వామి పదములచే

వ్యవహరింపబడుదురు. విఠలనాథ, వ్రజనాథ, పురుషోత్తమాదు లగు ఆచార్యులును తమ ఆచార్యుని భావములను వివరించు గ్రంథములను వ్రాసిరి. 'శుద్ధాద్వైత మార్తాండము' శ్రీ గిరిధరాచార్యకృతము; 'ప్రమేయ రత్నార్ణవము' శ్రీ బాలకృష్ణభట్ట రచితము - మున్నగునవి ఈ శుద్ధాద్వైత సిద్ధాంత స్వరూప నిరూపకము లగు గ్రంథములు.

శ్రీ వల్లభుల ఈ పుష్టిమార్గ వైష్ణవము - ఉత్తర దేశమునను, గుజరాతు, మధ్యప్రదేశములలోను వ్యాపించినది.

## రామానంద సంప్రదాయము

ఉత్తర భారతమున వినరిల్లిన వైష్ణవ శాఖలలో పేర్కొనదగిన మరియొకటి శ్రీ రామానందస్వామి నెలకొల్పిన శ్రీ రామభక్తి సంప్రదాయము. ఈ రామానందుడు క్రీ. శ. 14 - వ శతాబ్ది ప్రారంభమున, ఉత్తర భారతమున పుణ్యక్షేత్రమైన ప్రయాగలో ఉదయించెను. ఈ స్వామి కన్నడ దేశమందలి మేల్కోటలో (తిరునారాయణ పురములో) జన్మించెనని కొందరందురు. ఇతని తండ్రి కాన్యకుబ్జ బ్రాహ్మణ శాఖకు చెందిన పుణ్యసదను డను పండితుడు; తల్లి సుశీల. శ్రీ రామానందుడు కాశీ క్షేత్రమున తొలుత విద్యాభ్యాసంగము గావించెను. ఆధ్యాత్మిక విద్యకొరకతడు రాఘవానందు డను విశిష్టాద్వైతి యగు ఆచార్యు నాశ్రయించెను. ఈ రాఘవానందుడు భగవద్రామానుజాచార్యులకు ప్రశిష్యులలో ఒకడు. శ్రీ రామానుజాచార్యులచే నియమింపబడి, ఉత్తర దేశమున విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రచారము గావించుచు ప్రసిద్ధుడై యుండిన శ్రీ దేవాచార్యులవారికి రాఘవానందాచార్యుడు శిష్యుడు. శ్రీ రాఘవానందు నాశ్రయించి, విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వమును ఆక

లింపు చేసికొనిన రామానందునకు మూల సిద్ధాంతములోని సూత్రములకును, ఆచార్యుల యనుష్ఠానమునందలి యంశములకును సంపూర్ణ సమన్వయము గోచరించలేదు. జాత్యాదుల విచారముతో పనిలేదు. పరమ భక్తులందరును సమానులే యను సిద్ధాంతము విధిగా వర్ణాశ్రమ తారతమ్యములను పాటించు ఆచార్యుల యనుష్ఠానమున సమన్వయించుటలేదని రామానందుడు తన మత సారమైన ప్రబోధము కొరకు తానే యొక సత్సంప్రదాయమును బయలుదేరదీసెను.

## రామ భక్తి - రామానంద సంప్రదాయము

నింబార్కస్వామి శ్రీకృష్ణభక్తికిచ్చిన స్థానమును రామానందస్వామి శ్రీరామభక్తి కొసగెను. ఒక రామ నామము సహస్ర భగవన్నామములకు సమాన మన్నట్లు, రామనామ మహిమ అసాధారణమైనది. అది సర్వ పాప హరము. తారక మంత్రమునకు మించిన మంత్రము లేదు. రామభక్తుడు పరమ పవిత్రుడు. రామభక్తుడు ఏ జాతివాడైనను పూజ్యుడే. భాగవతము నింబార్కాదుల కాదర్శ గ్రంథమైనట్లే, శ్రీమద్రామాయణము రామానందాదులకు ప్రామాణిక మూల గ్రంథము. ఆళ్వారులలో బ్రాహ్మణులు కానివారు కలరు. స్త్రీ కూడ కలదు. కాని, భాగవతులకు వారెల్లరు శిరోధార్యులే. శ్రీమద్రామానుజులు భక్తి నిష్ఠను బట్టి కాంచీపూర్ణులను తమ ఆచార్యులలో నొకనిగా ఆశ్రయించలేదా! ఉడయవరులే తిరుమంత్రము పంచమకును ఉపదేశించిరిగదా! మేలుకోటలో శ్రీ ఆచార్యులవారే శ్రీ పెరుమాళ్ళ దర్శనము చేయించి, కడజాతివారిని కరుణించరా! అట్లు వారు చూపినదే రాచబాట - అని శ్రీ రామానందస్వామి ప్రచారము గావించెను. రామానందుని శిష్యులలో ముఖ్యులైనవారు పేరు :-

1. అనంతానందుడు, 2. సురసదానందుడు, 3. సుఖానందుడు, 4. నరహరీయానందుడు, 5. యోగానందుడు, 6. పీపుడు, 7. కబీరు, 8 భావానందుడు, 9. సేనుడు, 10 ధన్నుడు, 11. గాలవానందుడు, 12. రామదాసు, 13. పద్మావతి. వీరిలో - పీపుడు రాజపుత్రుడు. కబీరు, శూద్రుడు; మహమ్మదీయు డనియు వాదుక. సేనుడు మంగలి; ధన్నుడు; జాటుజాతీయుడు. పద్మావతి ఆడుది. దీనినిబట్టి చూడ, రామానందస్వామి అన్ని జాతుల నుండియు, స్త్రీల నుండియు భక్తులను శిష్యులనుగా స్వీకరించె నని తెల్ల మగుచున్నది. ఈ స్వామి తన శిష్యవర్గముతో దేశమం దెల్లెడల పర్యటించుచు, తీర్థయాత్రలు చేయుచు, అందందు పండిత గోష్ఠులలో అద్వైత మను మాయావాదమును, నాస్తికములైన జైన బౌద్ధాదులను ఖండించుచు, వైష్ణవ మత ప్రచారము చేసెను. ఈ ఆచార్యుడు తన పరమాచార్యుడైన రామానుజాచార్యునివలెనే శతాధిక వర్ష జీవియై, తన నూట పదునొకండవ యేట - క్రీ: శ: 1467 సంవత్సరమున పరమపదించెను. ఈ రామానందస్వామి ప్రచారము గావించిన శ్రీ రామభక్తి సంప్రదాయము ఉత్తర భారతమున, అటు పిమ్మట వెలసిన తులసీదాసాది రామభక్త కవులకు ఉద్బోధక మయ్యెను.

## కబీరు దాసు – రామ భక్తి

రామానందస్వామి శిష్యులలో విశేష ఖ్యాతి గాంచినవాడు కబీరుదాసు. ఇతడు క్రీ: శ: 1455 సంవత్సరమున కాశీపట్టణము నందు జన్మించెను. ఒక బ్రాహ్మణ వితంతువు తన శిశువును గంగా తీరమున విడిచిపోగా, ఆ ప్రాంతముననే నడచివెళ్ళుచున్న మహమ్మదీయ దంపతు లా శిశువును జూచి జాలి గొని, భగవ త్ప్రసాదితమైన

కుమార రత్నమని యెత్తికొని యింటికి గొంపోయి, కబీరని పేరు పెట్టు
కొని పెంచుకొనిరట. పెరిగి పెద్దయైన కబీరు, తండ్రి వృత్తియైన నేత
పనినే చేపట్టెను కాని, కబీరునకు నేతపై చిత్తము నిలువకుండెను. అత
డా క్షేత్రములో పురాణ కాలక్షేపములు జరుగుచుండు తావులకు
తరచుగా పోవుచుండెను; వారి కథలు వినుచుండెను. క్రమముగా
అతని హృదయమున రాముని యందు భక్తి యంకురించెను. ఆనాడు
శ్రీరామానందస్వామి ప్రబోధామృత చంద్రికలు దేశమం దెల్లెడల
చల్లగ మలయుచుండుటచే, తానును ఆ స్వామి పాదముల నాశ్ర
యించి, మంత్రోపదేశము నొంది, ధన్యత గాంచవలె నని కబీరుని
డెందము ఉత్కంఠితము కాజొచ్చెను కాని, తాను మహమ్మదీయు
డగుటచే, ఆ మహాత్ముడు శిష్యునిగా తనను చేరనిచ్చునా? ఎట్లైన
ఆ స్వామి పాదము లాశ్రయింపవలె నను సంకల్పము తీవ్ర మగుటచే,
అత డొక నాడు శ్రీ రామానందస్వామి స్నానార్థ మేతెంచు గంగా
నది రేవులో మెట్లమీద బోర్ల పడియుండెను. మసక చీకటిలో
స్నాన మాడ విచ్చేసిన శ్రీ స్వామి పాదము కబీరు శరీరమును
తాకెను. ఎవరినో పాదము! చూడక త్రొక్కితినే! యని స్వామి -
'రామ రామ' అనెను. 'ధన్యుడను గురుదేవా! ధన్యుడను! రామ
మంత్ర ముపదేశించి, శిష్యు నను గ్రహించితిరి' అని మ్రొక్కి - కబీరు
వినమ్రుడై, స్వామి యెదుర నిలచెను. స్వామి సంగతి గ్రహించి,
మందహాసము చేసెను. మహాభక్తుడైన కబీరుదాసు తన ఆచార్యుని
వలెనే ప్రజలలో శ్రీరామ భక్తిని ప్రబోధించెను. ప్రజలకు అర్థ
మగునట్టి అచటి దేశభాషయగు హిందీలో - సులభ శైలి యందు
గేయములు రచియించి యీ దాసకవి - వేదాంత సారమును వాడ
వాడల కందించెను. సర్వమత సామరస్య సంధాయకమును, సర్వ
మానవ సౌభ్రాత్ర సంపాదనమును, సకల లోక కల్యాణ సంపత్కరము

నగు ఈ కబీరు దాసుని సంప్రదాయము — 'కబీరు పంథా' — అను పేర జనావళిలో నేటి ప్రభావమును చూపెను.

## ములూక్ దాస, రాయ్ దాసాదులు

రామానంద సంప్రదాయ వైష్ణవ ప్రచారకులలో — ఎన్న దగిన కొందరిలో — శ్రీ ములూక్ దాసొకడు. ఈతడు పదునారవ శతాబ్దికి చెందినవాడు. నవ భక్తికి ప్రాధాన్య మిచ్చిన యీతడు శ్రీరామ మంత్ర జపమే సర్వాభీష్టప్రద మని ప్రచారము గావించెను.

శ్రీరాయ్‌దాసు మరియొక భక్తుడు. ఈతడును రామానంద శిష్యకోటిలోనివాడే. ఈ రామభక్తాగ్రేసరుడు స్వకులాచార ధర్మాధర్మము లెరుగక, విద్యాగంధము లేక, దారిద్ర్యమున దోగులాడు క్రింది తరగతుల వారి యెడల ప్రత్యేకముగా శ్రద్ధ వహించి, వారికి బాహ్యాభ్యంతర శౌచ ధర్మాదులు తెలిపి, రామ భక్తిని బోధించి యుద్ధరించెను.

## గోస్వామి తులసీదాసు

శ్రీరామభక్తుల ప్రస్తావమున పుణ్యమూర్తి తులసీదాసు పేర్కొనదగినవాడు. వైష్ణవ మత ప్రచారము గావించిన ఆచార్యుడుగా గాక, గోస్వామి తులసీదాసు హిందీ పాఠక లోకమునకు శ్రీరామభక్తి సుధా కలశము నందించిన మహా కవిగా విఖ్యాతుడు. తులసీదాసునిపై పూర్వులైన శ్రీరామానందాదుల ప్రబోధ ప్రభావము లెస్సగా పడెను. ఈతడు సరయూ పారీణ శాఖకు చెందిన బ్రాహ్మణ వంశమున క్రీ: శ: 1532 లో జన్మించెను. తండ్రి ఆత్మారామ్ శుక్లదూబె; తల్లి హులసీ. భార్య రత్నావళి; కుమారుడు తారకుడు. మహా భక్తుడైన తులసీ దాసుని 'రామ చరిత మానస' మనెడి రామాయణము మిక్కిలి ప్రసిద్ధి గాంచిన గ్రంథరాజము.

# శ్రీకృష్ణ చైతన్యస్వామి - గౌడీయ వైష్ణవ సంప్రదాయము

క్రీ శ: 1485 సంవత్సరమున వంగ దేశమున జన్మించిన శ్రీకృష్ణ చైతన్యస్వామి ప్రచారము కావించిన శ్రీకృష్ణభక్తి సంప్రదాయమునకు సిద్ధాంత సరణిని బట్టి, అచింత్య భేదాభేద వాద మని వ్యవహారము కలదు. జీవ, ప్రకృతి, పరమాత్మలకు భేదాభేద సంబంధము దీప - ప్రభల సంబంధమువలె వేరుగా కనబడుచు కూడ వేరు కానిది. దీని సంబంధము సాధారణ బుద్ధికి అందనిది. కావున, అచింత్యము. పర్యవసానముగా అది అచింత్య - భేదాభేద సిద్ధాంత మని పేరు పొందినది. పరమాత్మ సర్వ శక్తి; సత్య సంకల్పుడు. తాను జగద్రూపమున పరిణమించియు వికారము నొందడు అదియే అతని అచింత్య శక్తి. అతనికి మాయ అంటదు. మాయ వలన జీవునకు జ్ఞాన సంకోచము కలుగును. పరమ కారుణికు డగు సర్వేశ్వరుడు జీవుల నుద్ధరింప - వేదాదుల ననుగ్రహించెను. వ్యాస రూపమున అవతరించి, అతడే తద్భావమును పురాణాది రూపమునను, బ్రహ్మసూత్రముల రూపమునను తెల్లము చేసెను. గీతాచార్యుడై ధర్మము నుపదేశించెను. శ్రీకృష్ణుడే పరమాత్మ యని సంపూర్ణ విశ్వాసముతో, అనన్యమైన భక్తితో ఆ స్వామిని భజించుట జీవుని కర్తవ్యము.

ఇది చాలవరకు విశిష్టాద్వైత సిద్ధాంతము. భాగవత సంప్రదాయముల అడుగు జాడలలో సాగిన భక్తిశాఖయే. ఈ ఆచార్యుని తొలి పేరు విశ్వంభర మిశ్రుడు; ఈతని తండ్రి జగన్నాథ మిశ్రుడు, తల్లి శచీదేవి; అన్న విశ్వరూపుడు. ఈ వంగీయ బ్రాహ్మణ కుటుంబము వారు - మొదట తూర్పు బెంగాలులోని 'సిల్హటు' వాస్తవ్యులై

యుండిరి. పిమ్మట వారు నవద్వీపమునకు వచ్చి స్థిరపడిరి. శ్రీకృష్ణుడే యీ విశ్వంభర మిశ్రుడుగా తిరిగి అవతరించెనని తత్సంప్రదాయుల విశ్వాసము. కావుననే, యీ స్వామిని వారు శ్రీకృష్ణ చైతన్యస్వామి యని పిలుచుకొనుచుండిరి. గౌరాంగస్వామి, గౌరాంగచంద్ర మున్నగు నవియు ఈ చైతన్య స్వామికే పర్యాయములై, వాడుకలోనికి వచ్చినవి. ఈ స్వామికి అగ్ర సోదరుడైన విశ్వరూపుడు బలరామదేవుని యవతారమనియు వారి నమ్మిక. ఈ విశ్వంభరుడు సన్యసించి, తన సోదరునితోపాటు శ్రీకృష్ణభక్తి సంప్రదాయ ప్రచారమున పాల్గొనెను. శ్రీ చైతన్యస్వామి సాధకుని యందలి భక్తినే ముఖ్యముగా ఎంచి, తన్నాశ్రయించిన అన్ని కులములవారిని శిష్యులనుగా తీసికొని, వారి నుద్ధరించెను. ఈ చైతన్య సంప్రదాయము వంగదేశమునను, అస్సాం ప్రాంతమునను, ఓఢ్ర దేశమునను విస్తరిల్లెను. జయదేవుని గీతగోవిందాదులును, శ్రీ చైతన్యస్వామి గీతావళులును, తదనుయాయులగు రూపగోస్వామి, సనాతనగోస్వామి మొదలైనవారి రచనలును ఈ మధురభక్తి మార్గ వ్యాప్తికి మిక్కిలి తోడ్పడినవి.

మహారాష్ట్ర దేశములో వ్యాప్తి చెందిన వైష్ణవమునకు ముఖ్యరంగము పాండురంగ క్షేత్రము. భీమనదీ తీరమున వెలసియున్న విఠల (విష్ణు)స్వామి, విఠోబాస్వామి శ్రీకృష్ణభగవానుని యర్చామూర్తియే. భక్తుడగు పుండరీ(లీ)కు ననుగ్రహింప విచ్చేసి, ఆతడిడిన యిటుక మీద శ్రీకృష్ణస్వామి నిలబడెనట! రుక్మిణియే రుక్మాబాయి. రుక్మాబాయితో కూడిన విఠోబాను భక్తితో సేవించి, తన్నామ జపముచేసి తరించుటయే యీ విఠలభక్తి సంప్రదాయమువారి ధ్యేయము. ఈ సంప్రదాయమునకు మూలాచార్యుడు మహాభక్తుడైన పుండరీకుడే యందురు. శ్రీ రామానందస్వామి శిష్యవర్గములో చేరిన విఠల్

మారెను. తన పాప జీవితముపై రోత పుట్టెను. వెంటనే అతడు
గురువు నాశ్రయించి, విరోబా భక్తుడాయెను. భగవదనుగ్రహమున
నామదేవునకు సంపూర్ణమైన బుద్ధియోగము లభించెను. నాటి జ్ఞాన
యోగులలో మిన్నయైన జ్ఞానదేవునితో చేరి, నామదేవుడు తీర్థ
యాత్రలు గావించెను. పెక్కురు భక్తులతో సహవాసము చేసెను;
అఖండ భగవన్నామ జపము సలిపెను. అన్నింటను విరోబా దర్శనము
చేయగలిగెను. జ్ఞాన సుధా తరంగములైన అభంగములను అసంఖ్యా
కములుగా రచియించి, తన బోధనల సారాంశమును దేశీయుల కందిం
చెను. నామదేవుని శిష్యురాండ్రలో - జనాబాయి మహాభక్తురా
లుగా ఖ్యాతి గాంచెను.

## తుకారాము

ఇతడు క్రీ: శ: 1598 లో జన్మించెను. అతని పెద్దభార్య
రఘుమాబాయి; చిన్నభార్య జిజియాబాయి, కొడుకు సంతు. వంశ
పారంపర్యముగా సేద్యము, వర్తకము వారి వృత్తి. ఆ నాటి యొక
దుర్భిక్షమున తిండి లేక - అతని పెద్ద భార్య, కొడుకు - ఇరువురు చని
పోయిరి. వ్యాపారమున పెద్ద నష్టము వచ్చెను. పంట పాడయ్యెను.
తుకారాము మానసిక క్షేత్రములో వైరాగ్య బీజములు పడెను.
కేశవ చైతన్యుడను నామాంతరము గల బాబాజీ యనుగ్రహముతో
అతనిని చేరదీసి, జ్ఞానదేవుని 'జ్ఞానేశ్వరి' (మరాఠీ భాషలో భగవద్గీతపై
వ్యాఖ్య), నామదేవుని కీర్తనావళి, కబీరుదాసుని కీర్తనలు (హిందీ)
అను గ్రంథములు, కీర్తనలు, తుకారాము హృదయమునకు హత్తు
కొన్న విజ్ఞాన చంద్రికలు. తుకారాము గురువైన బాబాజీ - జ్ఞానదేవుని
శిష్యపరంపరలోనివాడు. ఏండ్ల తరబడిగా చేసిన నామజపముచే,
తుకారాము భగవదనుగ్రహమునకు విశేషముగా పాత్రుడైనాడు.

విశ్వేశ్వరుడు విశ్వములో అణు వణువునను విఠోబా రూపములో ఆ భక్తమణికి గోచరుడు కాజొచ్చెను. ఆ యోగివర్యుని హృదయగిరి నుండి భక్తి నిర్ఝరి కవితా రూపమున దూకసాగెను. అసంఖ్యాకములైన అభంగములు వెలువడినవి. సంతాజీ, గంగారామ్, రామేశ్వర భట్టు, మహాదాజీపంత్, నిళోబా, బహిణాబాయి మొదలైన భక్తులెందరో ఆ మహాత్ముని శిష్యులు. ఛత్రపతి శివాజీ తుకారామ స్వామికి అమూల్యమైన మణిహారాదులను పంపెను. కాని, ఆ నమ లోష్ట కాంచను డైన ఆ స్వామి - ఆ కానుకలను త్రిప్పివైచి, సమర్థ రామదా సనెడి యోగివర్యు నాశ్రయించి, మేలు గాంచు మని యుద్బోధించెను. జ్ఞానదేవ, నామదేవాదులు సాగి వచ్చిన విఠోబా భక్తిమార్గమున వేయి దివ్వెల వెలయించి, తుకారామస్వామి చరితార్థు డాయెను.

## సమర్థ రామదాసు

మహారాష్ట్రములో శ్రీరామ భక్తి మార్గమును ప్రబోధించిన యోగివర్యుడు సమర్థ రామదాసు. ఇతడు క్రీ.శ. 1530 లో - శ్రీరామ నవమి పావన తిథినాడు జనియించెను. రామదాసు పూర్వ జన్మమున ప్రారంభించిన యోగము పూర్తి గాక, దానిని పూర్తి చేసికొనుటకు జన్మ మెత్తిన పుణ్యమూర్తి. బాల్యముననే ఆతనికి వైరాగ్యము కలిగినది. పెండ్లి పీటమీదినుండియే ఆతడు లేచిపోయెను, నాసిక క్షేత్రమునకు సమీపమున, గోదావరీ తీరమున పండ్రెండేండ్లు రామ మంత్రము నుపాసించెను. శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమై, స్వయముగా ఆచార్యత్వము వహించి, సన్యాసాశ్రమము ననుగ్రహించెనని ఆ భక్తవర్యుడే దాసబోధ గ్రంథములో తెలిపినాడు. రామదాస

కంతు, అతని వృత్తులైన జ్ఞానదేవాదులును, ఏకనాథస్వామి మున్నగు వారును మహారాష్ట్రమున ఆధ్యాత్మిక భావ ప్రచారము చేసినవారిలో పేరెన్నిక గన్నవారు. అటుపిమ్మట విఠలభక్తి మార్గమును ప్రవర్తింపజేసిన మహనీయులలో అధిక సంఖ్యాకులు వేదాది విజ్ఞానము గాని, శాస్త్ర పాండిత్యాదులుగాని లేని సాధారణ వ్యక్తులు. కులమునుబట్టి క్రింది తరగతులకు చెందినవారైనను, వీరు జన్మాంతర సంస్కార విశేషమువలన సంసారమందు వైరాగ్యము, శ్రీ విఠోబా యందు నిశ్చలమైన భక్తియు గలిగి, జీవితములను భగవదర్పితము చేసిన ధన్యులు. తమ యనుభవ జ్ఞానమునుబట్టి తమ మాతృభాష యగు మరాటిలో గేయములు కూర్చి, భక్తి ధర్మములను తోడి వారిలో ప్రచారము కావించినారు.

వినోబా ఖేచరు, నామదేవు, గోరా కుంబారు, సంవతు నరహరి సోనారు, జనాబాయి, సేన, కన్హోపాత్రా, తుకారామ్ మొదలైన ధన్యాత్ములు విఠలభక్తి రసామృతమును కుత్తుకబంటిగా గ్రోలినవారు. అభంగము లనబడు మరాటి గేయములలో అమూల్యములయిన ఉపదేశ రత్నములను పొదిగి, వాడ వాడలను తిరిగి తిరిగి, ఆ పాటలను పాడి పాడి, ప్రజలలో సదాచారమును, భక్తిని ప్రచారము గావించినారు. ఈ వినోబా నామదేవాదులు క్రీ: శ: 13 వ శతాబ్ది మధ్య భాగమునకు చెందినవారు. వినోబాకు జ్ఞానభిక్ష పెట్టిన యోగి - జ్ఞానదేవ స్వామి. ప్రసిద్ధుడైన నామదేవునకు గురు వగు భాగ్యము వినోబాకు కలిగినది.

"ఈశావాస్య మిదం సర్వం యత్కించిత్ జగత్యాం జగత్."

జగత్తంతయు ఈశ్వరునిచే నిండియున్నది. అతడు లేని చోటు లేదు.' అను ఈ యుపనిషదర్థము ఈ యోగివలననే నామదేవునకు కన్నా

లకు కట్టిన ట్లయినదట! ఒకనాడు నామదేవు వినోబాజీని చూడ బోగా, అత డొక దేవతా విగ్రహముమీద కాలుపెట్టియుండె నట! 'ఇదేమి స్వామీ! అపరాధము కాదా?' అనిన నామదేవునకు - 'పోనీ, ఇంకొక చోట పెట్టెదనులే' అని వినోబా కాలు తీసి మరి యొక చోట పెట్టి చూడగా, అచ్చటను దేవతా విగ్రహమే కనబడిన దట! 'నన్నేమిచేయుమందువు, అంతటను అతడే యున్నాడు కదా?' అని వినోబా పక్కున నవ్వెనట! ఆ దృశ్యము నామదేవు హృదయమున చెరగని ముద్ర వేసిన దట!

కుమ్మరియైన గోరా - తాను చేసిన ఒక్కొక్క కుండలోను విఠల దేవునే చూచువాడట. ఒకసారి పెక్కుమంది భక్తులలో నామదేవుని చూచి, 'ఈ కుండ గట్టిది; తక్కినవి ఓటివిలే!' అన్నాడట. అట్టిది ఆ మహనీయుని లోతు చూపు.

అరంగామ వాసియైన సంవతయోగి యొక్క తోటమాలి - వినోబాభక్తిని పండించుకొన్న సుకృతి. తన తోటలోని ప్రతి పుష్పములోను, ప్రతి పత్రములోను వినోబాయే దర్శన మిచ్చుచుండె నట! ఇట్లే, ఆ నాడు స్వర్ణకారుడైన నరహరి, చర్మకారుడైన ఛోకా మున్నైన భక్తశ్రేష్ఠులు విఠల్ భక్తిమార్గమున జ్యోతులై వెలిగిరి.

విఠల్ భక్తమణిమాలలో నాయకమణి యనదగిన నామదేవ స్వామి క్రీ: శ: 1270 లో జన్మించెను. అతి సామాన్యుడైన - ఒక దర్జీ వాని కొడుకైన ఇతడు చాల తుంటరి. దారిదోపిడిగాడై, పెక్కు హత్యలు కావించుచుండెను. వీనికి తనచే హత్య కావింపబడిన ఒకని ఆలు బిడ్డల గోడు గాంచిన ఒక సంఘటనమువలన జ్ఞానోదయ

స్వామి యిటుపిమ్మట పండ్రెండేండ్లు తీర్థయాత్రలతో గడపెను. ఆ సంద ర్భములోనే స్వామి పండరి పురమునకు విచ్చేసి దర్శనము చేసి, తన యిష్టదైవమగు శ్రీరాముడే యీ పండరినాథుడైన విఠోబా యని యెలుగెత్తి బోధించెను. వృద్ధుడై యున్న తుకారాముని రామదాసు ఆ పుణ్యక్షేత్రముననే దర్శించెనని యందురు.

రామదాస స్వామియెడ శివాజీకి అమితమైన గురుభక్తి. ఒకప్పుడు శివాజీ తన సామ్రాజ్యము నంతటిని గురుదక్షిణగా రామదాసు కర్పించెను. నిరీహుడైన రామదాసు - శివాజీని ఆశీర్వదించి, రామరాజ్యముగా ప్రజలను పాలించి కీర్తిగాంచుమని, ఆ సామ్రాజ్యమును ఆతనికే యొసగెనట! శీల సంపన్నుడైన ఛత్రపతి - గురువాజ్ఞను కాదనలేక, తన గురువు చిహ్నమైన కాషాయ పతాకను తన సామ్రాజ్య పతాకముగా ప్రకటించి, గురుదేవుని యానతి చొప్పున ధర్మపరిపాలనకు దీక్ష వహించెను.

ఇట్లు మహారాష్ట్ర దేశమున వైష్ణవ సంప్రదాయము ప్రజల జీవితములను చక్కదిద్దుచు, చిరకాలముగా వర్ధిల్లసాగినది.

పై పంక్తులనుబట్టి శ్రీవైష్ణవ మత ప్రభావము సుస్పష్టము. ఈ మతము నేటికిని - యావద్భారతమునందును, వివిధ రూపములతో, వివిధ నామములతో విలసిల్లుచున్నది. ఇట్టి యీ మత వ్యాప్తికి మహనీయు లనేకులు తమ తమ జీవితములను వెచ్చించి ధన్యత గాంచిరి.

" ...ఎందరో మహానుభావులు, అందరకు వందనములు ... "



# శుభాకాంక్ష



ఓంకార రూపుఁడై యున్నట్టి దేవుఁడు
జగముల సృష్టించి సంతసముగ
నయమార జనులకు నయ విద్య కలుగంగ
వేదాదులనుఁ జాల వెలయఁ జేయ
మోటు తనంబున మూర్ఖులు కొందఱు
సన్మార్గమును వీడి సంచరింప
నారాయణుం డంత నర రూప శిష్యుని
జేరంగఁ దీసియు చెన్ను మీర
రాజితంబైన సన్మంత్ర రాజ మిల ని
యమము కలుగంగ బోధించె నట్టి సుకరు
ణాలవాలుండు పూజ్యుండు నగుచుఁ దనరు
యచ్యుతుం డెప్డు రక్షించు నఖిల జనుల.

—❀—

# కవి పండిత పరిచయము

## శ్రీమాన్ ఆసూరి మరింగంటి పురుషోత్తమాచార్యులు



జననము – శ్రీ ధాతనామ సంవత్సర చైత్ర బహుళ చవితి (14-7-1936). జన్మ స్థానము - నల్లగొండ జిల్లా - సూర్యాపేట జననీ జనకులు - అండాళమ్మ, వేంకట నరసింహాచార్యులు గారలు విద్యార్హతలు - ఎమ్.ఏ, బి ఇడి. ఉన్నత విద్య - ఉన్నత పాఠశాల — సూర్యాపేట ఇంటర్, బి ఏ., ఎమ్ ఏ. ప్రైవేటుగా సంస్కృత కోవిద - హిందీ భూషణ. వృత్తి - సూర్యాపేట-శ్రీ వేంకటేశ్వర డిగ్రీ కళాశాలలో 1973 నుండి తెలుగు ఉపన్యాసకులు. అధ్యాపకులుగా 1958 నుండి 1973 వఱకు. వ్యాసంగము - విద్యార్థి దశనుండి కవితా రచన. కృతులు - (ముద్రితములు) (1) శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహ ప్రభు శతకము (2) శ్రీ వేంకటేశ్వర శతకము (అముద్రితములు) (3) గోదాదేవి (కావ్యము – ముద్రణలో) (4) ఖండ కావ్యము (వివిధ కవితా సంకలనము) వంశము - ప్రసిద్ధమైన-కనగంటి మరింగంటి కవి - పండిత వంశము. కృతులతో పరిచితమైన మూల కర్త - సింగరాచార్యులు దశరథ నందన చరిత్ర (నిరోష్ఠ్యము) కృతికర్త. తండ్రిగారు 13 వ సంవత్సరముననే కావ్య రచన సుమారు 40 కృతులు (ప్రబంధములు, కావ్యములు, నాటకములు, శతకములు, స్తోత్ర తారావళి ఇత్యాది ప్రక్రియలు). అభిరుచులు - ఆంగ్ల సారస్వతము, సంగీతము

---

## డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు

జననము - 3-6-1959 జన్మ స్థానము .- కృష్ణా జిల్లా, చిన శ్రీరంగపురము. జననీ జనకులు - వెంకట నరసమ్మ, గోపాలకృష్ణమాచార్యులు

గారలు. విద్యాభ్యాసము :- కృష్ణాజిల్లా జగ్గయ్యపేట, జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలో పదియవ తరగతి వఱకు అనంతరము 1947 నుండి 1976 వఱకు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసము సాహిత్య విద్యా ప్రవీణలో ఉత్తీర్ణత. 1981 నుండి 1983 వఱకు ఆంధ్ర విశ్వ విద్యాలయమునందు - 'సర్వ దర్శన' విభాగమున అధ్యయనము, సంస్కృతములో ఎం. ఏ. డిగ్రీ స్వీకరణము పరిశోధన వ్యాస రచనము - (1) 1984 నుండి తిరుపతిలో - కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము నందు విశిష్టాద్వైత దర్శనమున పరిశోధ నము. తత్పీఠాధ్యక్షులు, చతుశ్శాస్త్ర పండితులు, 'తర్కవాచస్పతి' బిరుదాలం కృతులు, రాష్ట్రపతి పురస్కార గ్రహీతలు నగు శ్రీమాన్ N. S. రామానుజ తాతాచార్యుల వారి పర్యవేక్షణమున 'వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్య యనమ్' అను విషయముపై పరిశోధన వ్యాసమును రచించి, Ph D. డిగ్రీ నిమిత్తమై, రాష్ట్రీయ సంస్కృత సంస్థానమునందు 9-10-1986 తేదీన సమ ర్పించిరి. (2) ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు జైపూరునందు - 'ఆత్మ విచారము' అను పరిశోధక వ్యాసమును సమర్పించిరి (3) ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరులో — 'భక్తేః మోక్ష సాధనత్వే వివిధాభి ప్రాయాః' అను శీర్షికతో - పరిశోధన వ్యాసమును సమర్పించిరి

ప్రస్తుత పరిశోధనము :- 'విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగ దానమ్' (ఆంధ్రులు - విశిష్టాద్వైతము) అను విషయముపై పరిశోధన చేయుచున్నారు.

సంపాదకత్వము .- శ్రీమాన్ శిరిశినహళ్ కృష్ణమాచార్యులవారిచే ఆంధ్రీ కరింపబడిన వేదార్థ సంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని 'ఆంధ్ర వేదార్థ సంగ్రహ' మను పేర టి.టి.డి. వారి ఆర్థిక సహాయముతో 1986 లో వెలువరించిరి.

వ్యాఖ్యానము - శ్రీ యామునాచార్యులవారి 'గీతార్థ సంగ్రహము'నకు 'వివరణము' అను వ్యాఖ్యానమును రచించిరి.

అనువాదము :- (1) భక్తి సిద్ధాంతః (2) అష్టాక్షరీ మంత్ర మాహా త్మ్యమ్ (3) సవిశేషం బ్రహ్మ (4) లక్ష్మీ పురుషకార వైభవమ్ (5) విశిష్టా ద్వైతమ్ (6) తత్త్వత్రయమ్ అను సంస్కృత వ్యాసములు, వానికి ఆంధ్రాను వాదములు వీరిచే రచింపఁబడినవి.

అంగ్ల వ్యాసములు :- (1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డు, (2) గాడ్ అండు సోల్ (3) డాక్టరిన్ ఆఫ్ విశిష్టాద్వైత అనునవి వీరి ఆంగ్ల వ్యాసములు

ఉద్యోగము - రాష్ట్రీయ సంస్కృత సంస్థానము (న్యూఢిల్లీ వారిచే నిర్వహింపఁబడిన ఇంటర్వ్యూలో వీరు 'సెలక్టు' అయి, తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యా పీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7-1987 తేదీన ఉపన్యాసకులుగా నియుక్తులైరి. ఇపు డీ విద్యా సంస్థ – రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠ మను పేర వ్యవహరింపఁబడుచు, విశ్వవిద్యాలయ ప్రతిపత్తిని పొంది యున్నది.

---

## శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు



జననము :- విరోధి కార్తీక బహుళ చవితి (9–11–49) జన్మస్థానము - నెల్లూరుజిల్లా – గూడూరు. (మాతామహుల స్థానము) జననీ జనకులు - లక్ష్మీకాంత, నమ్మాళ్వార్ గారలు.

విజయరాఘవాచార్యులవారు ఆంధ్ర విశ్వవిద్యాలయములో– రాజనీతి శాస్త్రమున ఎం ఏ, ప్రభుత్వ పాలనా శాస్త్రమున ఎం. ఏ. పరీక్షలలో సర్వోత్తములుగా ఉత్తీర్ణులైరి సంస్కృతములో పోస్టుగ్రాడ్యుయేట్ డిప్లొమాను సంపాదించిరి.

1972 నుండి 1976 వఱకు విజయవాడలో గల శాతవాహన కళాశాలలో రాజనీతి శాస్త్రోపన్యాసకులుగా, మానవీయ శాస్త్ర విభాగాధిపతులుగా పని చేసిరి. 1976 నుండి, నాగార్జున సాగర్‌లో - ఆంధ్రప్రదేశ్ గురుకుల కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేయుచున్నారు తమ మామగా రగు 'కుల తిలక' శ్రీమాన్ దూపాటి రంగరామానుజాచార్యులవారి ఉత్సాహ ప్రోత్సాహములతో శ్రీవైష్ణవ సమాచార సంస్థను, 'కల్యాణ కల్పవల్లి'ని స్థాపించి, కార్యదర్శి పదవిని కడు సమర్థతతో నిర్వహించిరి.

వీరి రచన లనేకములు పత్రికలలో ప్రచురింపబడినవి. శాస్త్రీయ సంగీతము, నృత్యము, సాహిత్యము మున్నగు వానియందు వీరికి అభిరుచి మెండు భాగవతులతో సంబంధమును కలిగియుండుటలో వీరు ప్రత్యేకమైన ఆనందమును పొందుచుందురు, విశిష్టాద్వైతమునందు విశ్వాసము, ధార్మిక జీవనమునందు ఆసక్తి, అధ్యాపనమునందు తృప్తి, క్షేత్ర దర్శనమునందు సంతృప్తి వీరికి సహజ సిద్ధములు

---

## శ్రీమాన్ ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులు



జననము పరీధావి నామ సంవత్సర నిజ ఆషాఢము (27-7-1912). జన్మస్థానము:- సుబ్బమ్మపేట, టెక్కలి తాలూకా, శ్రీకాకుళము జిల్లా. జననీ జనకులు: చూడమ్మ, శరగోప రామానుజాచార్యులు గారలు ప్రస్తుత నివాసము: హైదరాబాదు

అభ్యసించిన భాషలు తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు, హిందీ, అరవము ఉపాధ్యాయ వృత్తి - చిట్టిగూడూరు, హైదరాబాదు, సికింద్రాబాదులలో. బిరుదులు సహజ కవి, విద్యా రత్న. ముద్రిత రచనలు - (1) పురుషోత్తముడు (1945 ఆంధ్ర విశ్వవిద్యాలయ పాఠ్యము), (2) రామాయణ కల్పవృక్ష విమర్శ (4957 జులై భారతి), (3) ఆంధ్ర ముకుందమాలా కులశేఖర చరిత్రలు (1964), (4) ఆచార్య - జగదీశ చంద్రబోసు (1971 సంవత్సరమున న్యూఢిల్లీలో- కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖవారి అవార్డు పొందినది). (5) భారత హృదయము (గీతా కావ్యము - ఆంధ్ర భగవద్గీతలు), అముద్రితములు . (1) ఆచార్య జగదీశ చంద్రబోసు (గద్యము), (2) కళాశాల (సికింద్రాబాదునందలి మహబూబ్ కాలేజీ చరిత్ర) సన్మానము :- మాజీ మంత్రివర్యులు-ఆంధ్ర విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు నగు శ్రీ యం ఆర్ అప్పారావుగారి అధ్యక్షతన, వివేకానంద పరిషత్తువారిచే ఘన సన్మానము

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు



జననము - 1-7-1930 జన్మ స్థానము - తిరుపతి జననీ జనకులు - జానకమ్మ, వేంకట నరసింహాచార్యులు గారలు విద్యాభ్యాసము - వేద సంస్కృత కళాశాలలో - నెల్లూరు ఉభయ వేదాంతాధ్యయనము:- తండ్రి గారి సన్నిధిలో డిగ్రీలు - (1) విద్యా ప్రవీణ (2) భాషా ప్రవీణ (3) ఎం ఏ (సంస్కృతము) వీ రిపుడు నెల్లూరులో - వేద సంస్కృత కళాశా లాధ్యక్షులుగా పని చేయుచున్నారు

రచనలు - (ముద్రితములు) (1) శుక సందేశమ్ (సంస్కృత కావ్యమ్) (2) సంస్కృత భాషా ప్రవేశిక (వ్యాకరణము) (3) వైకుంఠనాథ పంచాశత్ (స్తోత్రము) (4) శ్రీమన్మహాశైల గిరీశ్వర (పెంచెలకోన) సుప్రభాతము (5) స్వాగతమ్ (ఖండ కావ్యము) (6) హాహా హూహూ (విశ్వనాథ సత్య నారాయణ గారి నవలకు సంస్కృతానువాదము) (అముద్రితములు) (7) స్వప్నమాలా (డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారి వచన కవితకు సంస్కృత పద్యానువాదము) (8) శర్వాదీ (ఆకిలి శ్రీరామశర్మగారి ఆంధ్ర పద్యకావ్య మునకు సంస్కృత పద్యానువాదము) (9) బాదరాయణ హృదయము (బాదరాయణ, బోధాయన సంవాద రూపమున బ్రహ్మసూత్రార్థ వివరణము తెలుపుట (10) ఉపనిష చ్చంద్రికా (ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతిపదార్థ తాత్పర్యములు గలది ఛాందోగ్య - బృహదారణ్యకములు మినహా)

పై అముద్రిత గ్రంథములలో - 'బాదరాయణ హృదయము' అనఁబడు 'బ్రహ్మసూత్రార్థ వివరణము' - టి టి డి వారి ఆర్థిక సహాయముతో నిపుడు ముద్రణ భాగ్యమును పొందుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

## డాక్టర్ · చించాపట్టణం శ్రీరంగాచార్యులు




జననము - ధాతనామ సంవత్సర భాద్రపద బహుళచవితి(6-10-1935) జన్మస్థానము - సిరిపురము హుజూర్ నగర్ తాలూకా, నల్లగొండ జిల్లా జననీ జనకులు - తాయారమ్మ, వేంకటాచార్యులు గారలు.

విద్యా వ్యాసంగము :- ప్రాథమిక దశలో వీరు తమ తండ్రిగారివద్ద శ్రీ వైష్ణవ సంప్రదాయము నెఱింగిరి ఉన్నత విద్యాభ్యాసము :- సూర్యాపేట ప్రభుత్వోన్నత పాఠశాలలో 1955 సంవత్సరమున మెట్రిక్యులేషన్ (**H.S C**) పరీక్షలో ఉత్తీర్ణత. ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఇంటర్మీడియేట్ 1958 లో బి.ఏ 1961 లో. వరంగల్లులో గల ప్రభుత్వ శిక్షణాలయమున - బి యిడి 1963 లో. ఉస్మానియా విశ్వ విద్యాలయమున 1966 లో ఎం.ఏ అనంతరము ఉద్యోగ నిర్వహణ.

అధ్యాపక వృత్తిలో 16 సంవత్సరములు జూనియర్ లెక్చరర్‌గ 10 సంవత్సరములు. 1-1-81 నుండి 1986 మే వఱకు జడ్చర్లలో గల డాక్టర్: బూరుగుల రామకృష్ణారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాలయందు ఆంధ్రోపన్యాసకులుగా, 1987 జూన్ నుండి 1989 జూన్ వఱకు - మహబూబ్ నగరులో గల ప్రభుత్వ డిగ్రీ కళాశాలయందు ఆంధ్రోపన్యాసకులుగా పని చేసి, అటనుండి 1989 జులైలో - నిజామాబాదు జిల్లా, ఆర్మూరునందు గల ప్రభుత్వ ఆర్ట్సు మఱియు సైన్సు కళాశాలకు బదిలీ అయి, అందిపుడు ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు.

పరిశోధనము : — 'గుదిమెళ్ళ రామానుజాచార్యుల-ఖండ కావ్యములు-సమగ్ర పరిశీలనము' అను అంశముపై వీరు పిహెచ్.డి. పట్టమునకై పరిశోధన వ్యాసమును రచించి, 1985 ఆగష్టులో ఉస్మానియా విశ్వవిద్యాలయమున సమర్పించి, **24—3—**1985 తేదీన మౌఖిక పరీక్షానంతరము 'డాక్టరేటు' పట్టమును పొందిరి.

విశేషాంశములు :- ఆంధ్రభూమి, మూసి, జనధర్మ, ఉద్దీవన్, భక్తి నివేదన మున్నగు పత్రికలలో - వివిధాంశములపై వీరి కవితలు, వ్యాసములు కొన్ని ప్రచురితములైనవి. వివిధ విషయములపై వీరి ప్రసంగములు, స్వీయ కవితలు అనేకములు - హైదరాబాదు రేడియో కేంద్రమునుండి ప్రసారమైనవి. సంగీత సాహిత్యములందును, భగవ ద్భాగవత సంసేవనమునందును వీరికి ఆసక్తి మెండు

## శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు



జననము - ఆనందనామ సంవత్సర జ్యేష్ఠమానము (1915) జన్మస్థానము - గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా, ముక్తిపల్లి అగ్రహారము

వీరు - ఆచార్య సంపత్తిగల అగ్రహారికులు, హయగ్రీవోపాసకులు, ఆశుకవులు.

కొంత కాలమునకు జన్మస్థాన మగు ముక్తిపల్లిని వదలి, తెనాలి తాలూకా - నడిగడ్డపాలెము చేరి, అచట 'హయవదన సదనము'ను నిర్మించి, అందు నివసింపసాగిరి.

శ్రీ విశిష్టాద్వైత మత ప్రచారక సంఘ సంచాలకులుగా, భక్తి నివేదన పత్రికా సహాయ సంపాదకులుగా, బహుకావ్య నిర్మాతలుగా వీరు దేశమునకు సుపరిచితులు. వీరికి సన్మానము లనేకములు జరిగినవి. పెక్కు బిరుదము లొసంగబడినవి. అయినను, వీరు నిరాడంబరులై నిరహంకారులై మెలగు చుండెడివారు.

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారితో శ్రీరామ మహాక్రతు నిర్వహణార్థమై, ఆసేతు శీతాచలము దాదాపు ఒక పుష్కరకాలము పాటు పర్యటించిన సుకృతవంతులు వీరు.

వీరిచే రచింపఁబడిన కావ్యములు ఏఁబదింటికి మించి కలవు ఈ కావ్యము లన్నియు మదుర కవితాభిరామములే వీనిలో కొన్ని - సంప్రదాయ ప్రచారార్థమై రచింపఁబడిన కావ్యములు కొన్ని శ్రీరామభక్తి ప్రచారార్థమై రచింపఁబడిన కావ్యములు. మఱికొన్ని - తదితర రూపముగా రచింపఁబడిన కావ్యములు

సంప్రదాయ కావ్యములు - (1) భక్తియోగము (2) ప్రపత్తియోగము (3) ద్వయమంత్రార్థము (4) చరమార్థ దీపిక (5) పల్లాణ్డు వైభవము (6) మధుర సూక్తి (7) ఈడు ముత్తమ్ (8) బదరీనారాయణ సుప్రభాతము (9) శ్రీకూర్మనాధ సుప్రభాతము ఇత్యాదులు

శ్రీ రామాయణ కావ్యములు - (1) ప్రధమ సర్గ (2) మా నిషాద (3) అహం వేద్మి (4) మైధిలి (5) మాండవి (6) ఊర్మిళ (7) శ్రుత కీర్తి (8) సరమ (9) శబరి (10) ఋష్యమూకము (11) రామరాజ్యము (12) సంక్షేప రామాయణము (13) సిద్ధాశ్రమము (14) రామాయణ రహస్యము (15) శ్రీరామ క్రతువు మున్నగునవి

ఇతర కృతులు :— (1) ధనుర్దాసుఁడు (2) శరద్రాత్రి (3) గీతా సందేశము (4) విద్యా విలాసము (5) మురళీదర విలాసము (6) శ్రీకాకుళ స్వామి శతకము (7) రఘుకులేంద్ర స్తుతి (8) పండిత గోష్ఠి (9) ఆచార్య సంబావన (10) శ్రీదేవి (11) యతిరాజ విజయము (12) శ్రీభాష్యకారులు (13) సువర్ణ పూజ (14) సువర్ణ ధార మొదలగునవి

ఈ రామానుజ కవిశేఖరు లిపుడు చరిత్ర శేషులు.

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు



జననము .- 10-10-1928. జననీ జనకులు - శేషమ్మ, తాతాచార్యులు గారలు జన్మస్థానము - కృష్ణాజిల్లా - గుడివాడ సమీపమునఁ గల మోటూరు గ్రామము ప్రస్తుత నివాసము - వరంగల్.

వీరు సంస్కృతాంధ్రములలో గొప్ప పండితులు బి ఓ. యల్ పట్టమును ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి స్వీకరించిరి. ఈ పట్టము సంస్కృతములో ఎం. ఏ పట్టముతో సమానముగా గుర్తింపఁబడినది

ఉద్యోగములు - సింహాద్రిబాగ్, వరంగల్‌లలోఁ గల సంస్కృత పాఠశాలలలో 1946 నుండి 1966 వఱకు సంస్కృత పండితులుగా పనిచేసిరి వరంగల్‌లోఁ గల శ్రీ విశ్వేశ్వర సంస్కృత కళాశాలలో 1967 నుండి 1986 వఱకు సంస్కృతోపన్యాసకులుగా పని చేసిరి బహుమతులు .- సంస్కృతమున ఉత్తమ అధ్యాపకులుగా 1972 లో గుర్తింపఁబడి, భారత రాష్ట్రపతి నుండి - అత్యున్నతమైన జాతీయ బహుమానమును పొందఁగల్గిరి బిరుదము - కవిశాబ్దిక కేసరి

రచనలు - (1) మదిరేక్షణా పరిష్కారః (2) శతకోటి హి (3) దంభోళిహి (ఈ మూఁడును సంస్కృతమున గద్య రచనలు (4) కృతజ్ఞతా విష్కరణమ్ (సంస్కృత పద్య కావ్యము) (5) దివ్యసూరి సూక్తి సుధ (ద్రావిడ పాశురములకు సంస్కృత పద్యానువాదము - సంస్కృత వ్యాఖ్యానముతో) (6) ఈశావాస్యోపనిషత్ (7) మాండూక్యోపనిషత్ (8) కఠోపనిషత్ (ఈ ఉపనిషత్తులు మూఁడును ఆంధ్రానువాదములు - ఆంధ్ర వ్యాఖ్యా సహితములు) (9) శ్రీమద్రామాయణ రత్న మాలిక (10) గ్రామ సౌభాగ్యమ్ (సంస్కృత పద్య కావ్యము) (11) యుక్తిశాలి వణిక్ (సంస్కృత నాటకము) (12) గాంధీ తారావళి (13) శ్రీరామచంద్ర సుప్రభాతమ్ (14) లక్ష్మీ స్తుతి మంజరి (12, 13, 14 సంఖ్యలు గల ఈ మూఁడును సంస్కృత పద్య కావ్యములు)

**సంస్కృత** గ్రంథములకు సంపాదకత్వము:- (15) మద్రాసు రాష్ట్రమున విద్వత్కవిగా విఖ్యాతి గాంచిన కె యస్. కృష్ణమూర్తి శాస్త్రిగారిచే రచింపబడిన

'ప్రకృతి విలాసమ్' అను కావ్యమునకు సంపాదకత్వము (16) శ్రీమ న్నారాయణ సంహిత.

పరిశోధన - (17) జగన్నాథ పండితరాయల రసగంగాధరముపై పరి శోధన (18) ఆముక్తమాల్యదపై విమర్శనాత్మక వ్యాసము (1980 లో - కాకతీయ విశ్వ విద్యాలయమున తెలుఁగు శాఖలో సమర్పింపఁబడినది). (19) 'మహా భాగవతము- పోతన కవి' అను విషయముపై విమర్శనాత్మక వ్యాసము (తిరుమల తిరుపతి దేవస్థానములవారి 'భాగవత నీరాజనము' అను గ్రంథమున ప్రకటింపఁబడినది. (20) రామాయణము - సుందర కాండము (టి. టి. డి తిరుపతి వారి స్వర్ణోత్సవ సంచికలో ప్రకటింపఁబడినది.)

విశిష్ట సభ్యులు - సంస్కృత పరిశోధకులు - (1) శ్రీ భాష్యము (విమర్శనాత్మక ప్రచురణము) (2) విశిష్టాద్వైత పదకోశ ప్రణాళిక (3) ఉపనిష ద్భాష్యములు (విమర్శనాత్మక ప్రచురణ - సంస్కృత పరిశోధన అకాడమి - మేల్కోట, కర్నాటక రాష్ట్రము).

పదవులు - హోదాలు .- హనుమకొండలోఁ గల శ్రీ సీతారామచంద్ర స్వామి దేవాలయ పాలక వర్గమునకు 1975 నుండి 1985 వఱకు అధ్యక్షులుగా (2) వరంగల్ సంస్కృత విజ్ఞాన పరిషత్తుకు 1965 నుండి 1968 వఱకు కార్యదర్శిగా, (3) గీతాప్రచార పరిషత్తుకు 1970 నుండి 1988 వఱకు కార్య దర్శిగా, (4) ఉభయ వేదాంత పీఠము - వరంగల్ శాఖకు 1970 నుండి 1988 వఱకు అధ్యక్షులుగా - ఆ యా పదవులను అధిష్ఠించి, మిక్కిలి సమ ర్థతతో నిర్వహించిరి.

## శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు



జననము - అంగీరస నామ సంవత్సర ఫాల్గుణ బహుళ సప్తమీ శనివారము (14-3-1933) జన్మ స్థానము : తెనాలికి సమీపమునఁ గల శ్రీరంగ పురము. జననీ జనకులు :- తాయారమ్మ, యోగానందాచార్యులు గారలు.

వంశము :- తర తరములనుండి శ్రీ మన్నారాయణుని పాంచరాత్ర శాస్త్రానుసారముగ అర్చించు దీక్ష

కలిగినది. విద్యాభ్యాసము – ఆంధ్ర, సంస్కృత, ఆంగ్ల, హిందీ భాషలలో విద్వాంసులు. విద్యలు - ఆయుర్వేద, అలోపతీ, హోమియోపతీ వైద్య విద్యలలో నిపుణులు. అభిమాన విద్యలు:- గ్రంధ రచనము, కవితా వ్యాసంగము, వాస్తు - జ్యోతిషములు.

రచనలు .- పాంచరాత్రాగమమునందు - 'భగవదారాధనము' అను గ్రంధమును, హోమియోపతియందు - 'మెదడువాపు' అను గ్రంధమును రచించి, ప్రకటించిరి ఆంధ్ర పత్రిక, ప్రభ, జ్యోతి, చిత్రగుప్త మున్నగు పత్రికలలో బాల సాహిత్యము, విమర్శలు, శాస్త్రవిషయ చర్చలు, లేఖలు అనేకములు వీరివి ప్రకటింపఁబడినవి ప్రస్తుతము వీరు – గుంటూరు చౌత్రాలోఁ గల శ్రీ కోదండరామస్వామివారి దేవస్థానమున అర్చక కైంకర్యము చేయుచు, శ్రీ పాంచరాత్రాగమ శాస్త్ర పరిశోధన గావించుచున్నారు.

## శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు



జననము:- 1912. జన్మ స్థానము:- కృష్ణా జిల్లా — ఉంగుటూరు. జననీ జనకులు :- వేంకట నరసమ్మ, శేషాచార్యులు గారలు. విద్యా వ్యాసంగము:- వీరు మద్రాసు విశ్వ విద్యాలయమునకు సంబంధించిన 'వ్యాకరణ శిరోమణి' 'విద్వాన్' పట్టముల నలంకరించిరి. పదవులు :– ఉస్మానియా విశ్వ విద్యాలయమున తాళపత్ర గ్రంధ పరిశోధకులుగా ఓరుగల్లు నందలి ప్రభుత్వ కళాశాలలో సంస్కృతాంధ్రోపన్యాసకులుగా, మఱల - ఉస్మానియా విశ్వ విద్యాలయమున సంస్కృతాంధ్రోపన్యాసకులుగా, రీడరుగా ఉద్యోగములను మిక్కిలి సమర్థతతో నిర్వహించి, పదవీ విరమణ గావించిన యనంతరము- యు. జి. సి. వారిచే మఱల ఆ విశ్వ విద్యాయమునందే ప్రాచార్యులుగా నియుక్తులైరి.

రచనలు – (1) హాలికుడు (నాటకము) (2) ఆంధ్ర ప్రతాపరుద్ర యశో భూషణము (అలంకార శాస్త్రము) (5) అలంకార వసంతము (4) ఆంధ్ర ముకుందమాల (5) ఆదర్శ భారత కథావళి (6) ఆంధ్ర లక్ష్మీ వైభవోదాహరణము (7) ఆంధ్ర లక్షణ రత్నాకరము (8) కావ్యోద్యానము (9) కావ్య పుష్పాంజలి (10) ఆంధ్ర వీరులు (11) కాళిదాస కావ్యోద్యానము (12) ఆంధ్రౌచిత్య విచార చర్చ (13) సోమనాద్రి విజయము (14) వాల్మీకి (15) భక్తభూషణ చంపువు (సంస్కృతము) (16) వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథః (సంస్కృతము) (17) ఆంధ్ర శబ్దరత్నాకరము మున్నగునవి

విశేషాంశములు:– వివిధ విషయములపై హైదరాబాదు రేడియో కేంద్రము నుండి వీరు చేసిన ప్రసంగములు - శ్రోతల ప్రశంసలకు పాత్రములైనవి. హైదరాబాదు - సికింద్రాబాదులలో గల అనేక సాహిత్య - ఆధ్యాత్మిక సంస్థలందు వీరు సభ్యులుగా, ఉపాధ్యక్షులుగా, అధ్యక్షులుగా వివిధ పదవుల నధిష్ఠించి, ఆ యా సంస్థలను విశేషముగా విలసిల్లఁజేసిరి

సమ్మానము:– 1972 ఏప్రిల్ 14-వ తేదీన జంట నగరములలోని అనేక సాహితీ సంస్థలు, వీరి షష్ఠిపూర్తి సందర్భమున వీరిని ఘనముగా సమ్మానించినవి. అభిమానులు, బంధు మిత్రులు, కవి పండితులు, శిష్య ప్రశిష్యులు మున్నగు వా రనేకులు వీరిని మహోన్నత స్థాయిలో సమ్మానించిరి. వీ రిపుడు చరిత్ర శేషులు

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 10 | జొన్పుచున్ | జొన్పుచున్ |
| 7 | 20 | చెతను | చేతను |
| 14 | 19 | చెత | చేత |
| 20 | 3 | క్రమములొ | క్రమములో |
| 32 | 24 | స్రాణస్య స్రాణః | ప్రాణస్య ప్రాణః |
| 47 | 12 | సిద్దాంతమును | సిద్ధాంతమును |
| 48 | 25 | వివరణ, | వివరణ. |
| 70 | 22 | పరా శక్తిః | పరాశ్య శక్తిః |
| 85 | 11 | జ్ఞాది కరణము | జ్ఞాధికరణము |
| 97 | 6 | గుణవేశ | గుణలేశ |
| 101 | 21 | నమస్త | సమస్త |
| ,, | 22 | నకల | సకల |
| 106 | 6 | దాయత్తమెన | దాయత్తమైన |
| 108 | 20 | ఎనిమది | ఎనిమిది |
| 109 | 13 | చితము | చిత్తము |
| 111 | 4 | పూర్వ్వాశముగ | పూర్వ్వకముగ |
| ,, | 16 | వికర్మవలను | వికర్మలను |
| 117 | 8 | భోకృవర్గ | భోక్తృవర్గ |
| 118 | 7 | విగ్రహము కు | విగ్రహమునకు |
| 120 | 26 | దేవతారాధనా | దేవతారాధన |
| 122 | 2 | అందువలస | అందువలన |
| ,, | 11 | సమన్తమునకు | సమస్తమునకు |
| 126 | 2 | మహ | మహో |
| 127 | 14 | అచెతన | అచేతన |
| ,, | 16 | రూపచే | రూపముచే |
| 129 | 11 | వరతరమైన | పరతరమైన |
| 133 | 8 | జౌపచారిక | ఔపచారిక |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 134 | 20 | శాస్త్ర హిత | శాస్త్రవిహిత |
| 141 | 4 | నశి ప | నశింప |
| ,, | 7 | ఖడింప | ఖండింప |
| 143 | 4 | వాన | వాసన |
| ,, | ,, | స స్కారము | సంస్కారము |
| ,, | 7 | వ న | వలన |
| 145 | 14 | కార వస్థ | కారణావస్థ |
| ,, | 16 | కావుస, | కావున, |
| 151 | 24 | చేష్టితత | చేష్టిత |
| 152 | 22 | ల దరును | లందరుసు |
| 154 | 27 | సృష్టివ | సృష్టి |
| 159 | 6 | మనుత్ష్యులని | మనుష్యులసి |
| 166 | 16 | జేదును | జేరును |
| 167 | 11 | భూవము | భావము |
| 168 | 14 | జనము | జననము |
| 169 | 21 | త్రక్ష | తృక్ష |
| 170 | 19 | నీడనట్టి | పీడనట్టి |
| 175 | 12 | యింతుం | యితుం |
| 176 | 10 | నజాపీశ | వజాపీశ |
| ,, | ,, | ఆజో | అజో |
| 177 | 10 | విమృతుస్వత్ర ర్వ్యాశోకో | విమృత్యు ర్వ్యాశోకో |
| 182 | 10 | బాహాస్యోత్తర | స్యోత్తరబాహా |
| ,, | 15 | యద్విష్ట | యద్విష్ఠ |
| 185 | 25 | పదవరమునులు | పరవరమునులు |
| 186 | 24 | కోవితాద్భుత | కోవిదాద్భుత |
| 192 | 29 | న్నొడింప | న్నోడింప |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 197 | 1 | ప్రచారము | ప్రభావము |
| 199 | 1 | ప్రచారము | ప్రభావము |
| 201 | 1 | ప్రచారము | ప్రభావము |
| ,, | 2 | 2 5 | 215 |
| 208 | 1 | ప్రచారము | ప్రభావము |
| ,, | 7 | దీష | దీక్ష |
| ,, | 8 | మొద గు | మొదలగు |
| ,, | 9 | సారాంశ మిది ,- | సారాంశ మిది :- |
| ,, | 19 | రచి పఁబడినది. | రచింపఁబడినవి |
| 213 | 17 | రథా యాన | రథాదియాన |
| 214 | 9 | హరముగా | మనోహరముగా |
| ,, | ,, | శక్తి - మనో | శక్తి - |
| 215 | 24 | ప్ర | ప్రప |
| 220 | 9 | త మేవం | త మేపం |
| ,, | 24 | ప్రపతుల తో | ప్రపత్తులతో |
| 231 | 5 | దేవదేవుడెన | దేవదేవుడైన |
| ,, | 24 | చక | చక్ర |
| 232 | 17 | పాంరాచత్రము | పాంచరాత్రము |
| 238 | 24 | పకృతికి | ప్రకృతికి |
| 240 | 8, 9 | ఈతడుదయించినది మాత్రము | — |
| 243 | 9 | అనుగ్రహాధీనము | అనుగ్రహాధీనము |
| 244 | 10 | విసరిల్లిన | విస్తరిల్లిన |
| 253 | 10 | చేసివ | చేసిన |
| 256 | 3 | సృష్టి చి | సృష్టించి |

**సూచన** – 99 – వ పుట - 10, 11 పంక్తులలోని అర్థ పంచకమున, ఉపాయి స్వరూపమును చేర్చి చదువుకొనవలెను

## వదాన్య శేఖరులు

Professor Narender P Reddy, Ph. D Akron (U S A.) Dol's 300.

## మహారాజ పోషకులు

1. శ్రీమాన్ చిలకగాఋత్రి సత్యలక్ష్మణాచార్యులు, Retd I T O
గుంటూరు

2 డాక్టర్. కె సత్యనారాయణాచార్యులు, M S, M Ch
గుంటూరు

## రాజ పోషకులు

1. శ్రీమాన్ కందాడ శ్రీనివాస రాఘవన్, B.Com గుంటూరు

## పోషకులు

1 శ్రీమాన్ నందూరు సత్యనారాయణాచార్యులు, గుడివాడ
2 శ్రీమాన్ కిడాంబి వెంకట నరసింహాచార్యులు, పెంటపాడు
3 శ్రీ పుతుంబాక శ్రీరాములు (మాజీ శాసనసభ్యులు) పెదపాలెం
4 శ్రీమాన్ నందూరు బుచ్చి రామానుజాచార్యులు, గుంటూరు
5 ర్ : సి. రామదాసు, D M. & S.D M.R గుంటూరు
6 మాన్ చిత్రకవి ఆత్రేయ, M. A. విశాఖపట్టణము
7 శ్రీమాన్ కె. వి రాఘవాచార్యులు, M.A, B Ed హైదరాబాదు
8. Sreeman N. C Varadachari, B.A, I.R S, Madras
9 శ్రీమాన్ K. A కృష్ణమాచార్యులు, M.A, నాత్రేరు
10 శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు. M,A, B Ed. హనుమకొండ
11, శ్రీమాన్ టి కె వి. రాఘవన్, M A. హైదరాబాదు

## విరాళములు

1. శ్రీమాన్ దూపాటి రంగరామానుజాచార్యులు, పేరాల రూ 316
2. శ్రీమాన్ ఆసూరిమరింగంటి పురుషోత్తమాచార్యులు,
సూర్యాపేట - 200
3. శ్రీమాన్ కోమాండూరి రామానుజాచార్యులు, ఉలవపాడు 116
4 శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు, సిద్దిపేట - 116
5. శ్రీమాన్ ఏ. వి. దేశికాచార్యులు, మైసూరు - 116

—)o(—

# ఏకాదశి (II) కౌముదిలో రానున్న రచనలు

౧. శ్రీ వేంకటేశ స్తుతి

**శ్రీమతి - విక్రాల శ్రీదేవమ్మ**

౨. శ్రీమద్రామాయణము - వైష్ణవ తత్త్వము

**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A**

౩. భగవద్రామానుజులు - శ్రీభాష్యము

(తృతీయాధ్యాయ- పూర్వార్థము)

**శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు,**

౪ గోపుర సందేశము

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

౫. అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యము

**శ్రీమాన్ తెలికచర్ల కందాడ గోపాలాచార్యులు**

౬. పురుషకారము

**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**

౭. శ్రీమద్రామానుజులు - ఆస్తికత్వము

**డాక్టర్: సర్వేపల్లి రాధాకృష్ణన్**

౮. శ్రీ రామానుజ స్తవము

**శ్రీమాన్ గుడిమెళ్ళ రామానుజాచార్యులు**

౯. ఆంధ్రులు - విశిష్టాద్వైతము

**డాక్టర్: కట్టా విజయ రాఘవాచార్యులు,**

M. A. Ph D.